"దళిత ఉద్యమం కమ్యూనిస్టులకు ఎంత నేర్పిందో ఏం నేర్పిందో గానీ, రాజ్యాధికారం అన్ని సమస్యల పరిష్కారానికి నాంది అన్న అభిప్రాయాన్ని కమ్యూనిస్టుల నుండి తాను స్వీకరించి నష్టపోయింది. దళిత ఉద్యమకారులు ఈ అభిప్రాయాన్ని అంబేద్కర్‌కు ఆపాదిస్తున్నారు కానీ, ఆయన దళితులు రాజ్యాధికారం చలాయించాలని చెప్పినప్పటికీ అదే ఆయన ఆలోచనలకు కేంద్రం కాదు. అంబేద్కర్, పెరియార్, పూలే - ముగ్గురూ రాజకీయ మార్పుల కంటే సాంఘిక మార్పుకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. ఆ దిశగా ఆలోచనలను అభివృద్ధి చేసే బదులు రాజ్యాధికారం అన్న భావనకు పెద్దపీట వేసి దానికి అనుగుణమైన వ్యూహాల, ఎత్తుగడల వేటలో దళిత ఉద్యమం పడింది. దానివల్ల నిజంగా కొత్తవయిన పోరాట రూపాలను సహితం దళిత ఉద్యమం ఆవిష్కరించ లేకపోయింది."

**- కె. బాలగోపాల్**

**భా**రత సమాజంలో ఉన్న కుల వ్యవస్థలోని అణచివేతను, తాత్విక హింసను దళిత ఉద్యమాలు ప్రశ్నిస్తున్నాయి. ఈ కృషిలో అలుపెరుగని పోరాటం చేసిన వాడు బాలగోపాల్. తను చెప్పే విలువలని జీవిత ఆచరణలో ప్రతిఫలించాడు కాబట్టే బాలగోపాల్ దళితులకు, మైనార్టీలకు, ఇతర పీడితులకు పోరాటస్ఫూర్తి కాగలిగాడు. కులానికి, పౌరహక్కుల రంగానికి ఉన్న సంబంధాన్ని గుర్తించిన బాలగోపాల్ - దళిత ఉద్యమం నుంచి నేర్చుకోవాల్సింది చాలా ఉందనే అనుకున్నాడు. మార్క్స్‌తోపాటు - పెరియార్, పూలే, అంబేద్కర్ రచనల అధ్యయనం ఆయన పరిశీలనని, ఆచరణని మరింత పదునెక్కించింది. అందుకే ఆయన పాల్గొన్న ప్రతి ఉద్యమానికి ఎంత మద్దతు ఇచ్చాడో, అంతగా వాటిని విమర్శనాత్మకంగానూ పరిశీలించాడు. దళితులపై దాడిని ఎదుర్కోవటమొక్కటే పరిష్కారం కాదని, ఆ హింస వెనకున్న వ్యవస్థ, భావజాలం, నిర్మాణం నాశనం కానిదే కుల నిర్మూలన జరగదని బాలగోపాల్ భావించాడు.

బాలగోపాల్ ప్రారంభించిన పని ఇంకా చాలా మిగిలే ఉంది. బాలగోపాల్ వెలిగించిన ప్రజాస్వామిక చైతన్య జ్వాలని, విలువలని మరింత ముందుకు తీసుకువెళదాం. బాలగోపాల్ ఒక సర్వనామం కాదు....ఉద్యమం.

 **డి. నరసింహారెడ్డి**

*బాలగోపాల్ జననం - బళ్ళారి (కర్ణాటక)లో. తండ్రి కందాళ పార్థనాథశర్మ, తల్లి నాగమణి. జర్నలిస్ట్ వేమన వసంత జీవిత సహచరి. చదివింది ఎమ్.ఎస్.సి.(ఆర్.ఇ.సి-వరంగల్) గణితంలో డాక్టరేట్ - న్యాయవాద శాస్త్రం. కాకతీయ యూనివర్సిటిలో గణితశాస్త్ర ఉపాధ్యాయుడు (1981-1985). ఆం.ప్ర. పౌరహక్కుల సంఘంలోనూ (1981-1998), ఆ తర్వాత చివరివరకూ మానవహక్కుల వేదికలో పని చేశారు. లాయర్‌గా ప్రాక్టీస్ చేశారు. చాలాకాలం విరసం సభ్యుడు. ప్రజాబంధు అనే ముసుగు సంస్థ 1989లో కిడ్నాప్ చేసింది. అనేక స్వతంత్ర రచనలతో పాటు, చిన్న పత్రికలలో కూడా కాలమ్స్ రాశారు. ఇంగ్లిషులో ఈ.పి.డబ్ల్యు, ఇంకా ఇతర మాగజైన్లలోనూ, అనేక తెలుగు పత్రికల్లోనూ వ్యాసాలు రాశారు. బాలగోపాల్ పర్స్పెక్టివ్స్ సంస్థాపక సభ్యుడు.*

బాలగోపాల్ జననం: 10.6.1952.          మరణం : 08.10.2009

బాలగోపాల్ ఇంగ్లిష్ రచనల కోసం : www.balagopal.org



కవర్ ఆధారం :
సెంటర్ ఫర్ స్పానిష్ అండ్
లాటిన్ అమెరికన్ స్టడీస్
జామియా మిలియా ఇస్లామియ
వారి బ్రోచర్ (మార్చ్ 2007)
- సేకరణ : కె. సత్యనారాయణ

3వ పేజీ
ఇలస్ట్రేషన్ :
భాస్కరన్



---


ISBN-978-81-905756-8-3
ప్రచురణ సంఖ్య : **41**
అక్టోబరు 2011


**దళిత**
(వ్యాసాలు)
Essays on Dalit Identity & Oppression
**కె. బాలగోపాల్**


**సోల్ డిస్ట్రిబ్యూటర్స్**
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన్‌భవన్ - బ్యాంక్‌స్ట్రీట్
హైదరాబాద్ - 500 001
ఫోన్ నెం. 040-24744580

పబ్లిషర్స్
**ప ర్ స్పె క్టి వ్స్**
సామాజిక శాస్త్రం / సాహిత్యం
ఫ్లాట్ నెం. 305,
ఇ.నెం. 2-2-647/182/ఎ3,
హిమశివ అపార్ట్‌మెంట్స్,
బాగ్ అంబర్‌పేట్, హైద్రాబాద్ - 13.

**వెల : ₹ 120/-**

ప్రింట్ సపోర్ట్
**వేమన వసంత లక్ష్మి**
**మన్నం బ్రహ్మయ్య**

**బుక్ మేకింగ్**
**విశ్వేశ్వరరావు**
సెల్ : 94906 34849

**కవర్ అక్షరాలు**
**మోహన్**

**కవర్ డిజైన్**
**రమణజీవి**

**కంపోజింగ్**
**శ్రీశ్రీ గ్రాఫిక్స్**
హైదరాబాద్

**ముద్రణ**
**శ్రీశ్రీ ప్రింటర్స్**
28-10-26/1, మసీదు వీధి
అంబర్‌పేట, బెజవాడ - 2
0866-2433359

# దళిత సూచిక

ముందుమాట -
సత్యాన్వేషణ - కె. సత్యనారాయణ vii

1. కారంచేడు నుండి గుజరాత్ దాకా... 15
2. కుల సమస్య - రాజకీయ దృక్పథం 30
3. చుండూరు మారణకాండపై ప్రభుత్వ వైఖరి 42
4. చుండూరు మారణకాండ (జస్టిస్ గంగాధరరావు నివేదిక) 51
5. కులవ్యవస్థ - పౌరహక్కులు 61
6. సమానత్వం ఒక ప్రజాస్వామిక హక్కు 65
7. చలపతిరావును, విజయవర్ధనరావును ఉరితీయాల్సిందేనా? 70
8. మాలమాదిగ ఘర్షణల నివారణ కోసం కృషి చేద్దాం 80
9. లక్ష్మణ్‌పూర్-బాతె తర్వాత (రిపోర్టు) 86
10. వేంపెంట గురించి ఇంకొంచెం 101
11. బీహార్ రాజ్యం 'సేన'ల భోజ్యం... 105
12. సంఘ బహిష్కరణకు శిక్ష మాటేమిటి 110
13. ఒక అబ్రహాం కథ 115
14. సాంఘిక పోరాట విస్మరణలో దళితులు 119
15. దళితులపై దాడుల్లో ముద్దాయిలు ఎవరు? 124

16. పున్నయ్య కమిషన్‌కు సూచనలు 129
17. మెదడువాపుకు పందులు కారణమా? 137
18. ఐలయ్య 'మొత్తం' సమాజం గురించి ఎందుకు రాయాలి? 140
19. కులాల విషయంలో పత్రికలది కపట నాటకం 143
20. డర్బన్ సదస్సు - ఒక భిన్న కోణం 147
21. ఈ ఆధునిక అగ్రహారాలను చూడండి 151
22. పున్నయ్య కమిషన్ : కొంత సత్యం కొరవ భ్రమలు 154
23. విజ్ఞత బోధనాంశం మాత్రమేనా? 164
24. తోలాపిలో కుల నిర్మూలన 169
25. బందిపోటు దొంగలు - హక్కులు 172
26. ఆధిపత్య సంక్షేమ సంఘం 177
27. జడలు విప్పిన కులతత్వం 180
28. దేవాలయ భూములు దళితులకే దక్కాలి 185
29. అగ్రకుల దురహంకారాన్ని హైకోర్టు మన్నించడం లజ్జాకరం 189
30. అంబేద్కర్ దృష్టిలో ప్రజాస్వామ్యం 194
31. పాపం, బాబాసాహెబ్! 198
32. తెలుగు పత్రికారంగానికి ఆత్మపరిశీలన అవసరం 202
33. ఉద్యమంగా మారలేకపోయిన నందిగామ ఉదంతం 206

# సత్యాన్వేషణ

వివిధ సందర్భాల్లో బాలగోపాల్‌గారు కుల సమస్యపై తెలుగులో రాసిన వ్యాసాలు, రిపోర్టులు, వ్యాఖ్యానాలు ఒకచోట చేర్చి చదివితే ఆయన ఆలోచనాతీరుపై దళిత ఉద్యమం వేసిన బలమైన ప్రభావం మనకు కనిపిస్తుంది. దళిత ఉద్యమం లేవనెత్తిన ప్రశ్నలు, కొత్త ఆలోచనల వెలుగులో తెలుగు సమాజాన్ని ఒక కొత్త చూపుతో విశ్లేషించారాయన. దళిత దృక్కోణం నుంచి తెలుగు సమాజాన్ని విమర్శనాత్మకంగా విశ్లేషిస్తూనే...దళిత ఉద్యమ రాజకీయ అవగాహన, ఆచరణపై సునిశితమైన, అర్థవంతమైన విమర్శలు చేసారు. నా దృష్టిలో బాలగోపాల్‌గారి రచనలు దళిత ఉద్యమాన్ని సైద్ధాంతికంగా బలోపేతం చేయడానికి, ఒక విశాలమైన ప్రజాస్వామిక ఉద్యమంగా మలచడానికి ఎంతగానో ఉపయోగపడతాయి. హక్కుల రంగంలో పనిచేస్తున్న కార్యకర్తలకూ ఈ పుస్తకంలో అనేక విలువైన మార్గదర్శక సూత్రాలు దొరుకుతాయి.

బాలగోపాల్‌గారి దృష్టిలో సమాజంలో 'మానసిక ఏకత' ఎందుకు లేకుండా పోయిందో, 'సామరస్యం' ఎవరు లేకుండా చేసారో చెప్పే విశ్లేషణే సత్యాన్వేషణ. "మనిషికి 'ధర్మం' అంటూ ఉంటే అది సత్యాన్వేషణ తప్ప మరేమీ కాదు" అని భావించే బాలగోపాల్‌గారు ఈ రచనలలో 'హైందవ ఆలోచనా చట్రం' ఎంత అన్యాయమయినదో వివరించారు. ఈ పుస్తకంలోని ఆయన రచనలన్నీ ఏదో ఒక దాడి, ఘర్షణ లేదా వివక్ష సందర్భంలో రాసినవి. దళిత, పీడిత కులాల పక్షాన వారి హక్కుల కోసం రాసినవి. దళితులే కాదు మొత్తంగా పీడిత ప్రజానీకం స్వేచ్ఛను, సమానత్వాన్ని అనుభవించగల ప్రజాస్వామ్య సమాజం కోరుతూ రాసినవి. కొన్ని నిర్దిష్టమైన హక్కుల ఉల్లంఘన ఘటనలు, దళిత ఉద్యమ తీరుతెన్నులు, ప్రభుత్వ విధానాల నేపథ్యంలో తెలుగు సమాజపు రాజకీయ వ్యవస్థ స్వభావాన్ని విశ్లేషించారు. ఆధునిక తెలుగు సమాజంలో సైతం కులం ఒక సజీవ సామాజికసంబంధంగా, హింసా దౌర్జన్యాలు సాగించే పనిముట్టుగా... అధికారాన్ని, సంపదను, హోదాను సమకూర్చే సాధనంగా భిన్న రూపాల్లో ఎలా పని చేస్తున్నదో మనకు తన రచనల ద్వారా చూపించారు. కులం గతకాలపు సంప్రదాయమని, దాని అవశేషాలు మాత్రమే మిగిలాయని చేసే వాదనలు సరైనవి కాదని స్పష్టం చేసారు. నిజానికి కులం ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థతో మిళితమై, మళ్ళీ కొత్తరూపాల్లో జీవం పోసుకున్న తీరుని చూపించడమే బాలగోపాల్‌గారి రచనల్లోని ప్రత్యేకత. ప్రధాన స్రవంతి రాజకీయ

రంగంలో, న్యాయవ్యవస్థలో, విద్యారంగంలో, పత్రికా రంగంలో కులం ఎటువంటి పాత్ర పోషిస్తుందో బాలగోపాల్‌గారు వివరించారు.

హక్కుల ఉద్యమం రాజ్య హింస కేంద్రంగా కాక కులహింస, దానికి మూలమైన హైందవ సమాజాన్ని కేంద్రంగా చేసుకుని పుట్టి ఉంటే దళితులకు మరెంతో మేలు జరిగేదని భావించారాయన. అప్పుడు హక్కుల ఉద్యమం విశాల ప్రజాహక్కుల ఉద్యమంగా ఎదిగి ఉండేదని అన్నారు. అలాగే ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమాలు - ముఖ్యంగా దళిత, బహుజన ఉద్యమాలపై కూడా ఆయన చాలా విలువైన విమర్శలు, సూచనలు చేసారు.

**దాడులు, వివక్ష :**

సమాజంలో అంటరానితనాన్ని, వివిధ రకాల కులవివక్షను అమలు చేయడంలో, దళితులపై పాశవికదాడులకు పాల్పడడం, పురిగొల్పడం, దోషులకు అండగా నిలవడంలో - కాంగ్రెస్, తెలుగుదేశం, బి.జె.పి. లాంటి పార్లమెంటరీ పార్టీల పాత్ర గురించి, వాటి నైతిక బాధ్యత గురించి బాలగోపాల్‌గారు చాలాసార్లు ప్రస్తావించారు. వివిధ దాడులు, వివక్షల్ని రిపోర్టు చేసే సందర్భంలో కావచ్చు, పున్నయ్య కమిషన్ ముందు కావచ్చు - బాలగోపాల్‌గారు రాజకీయ పార్టీల ద్వంద్వ విధానాల్ని విమర్శించారు. దళితులపై దాడులు, వివక్ష ఘటనల్లో స్థానిక రాజకీయ శక్తులు ముందుంటాయని, ఈ శక్తులకు ప్రధాన రాజకీయ పార్టీల అండ ఉంటుందని చెపుతూ ప్రధాన రాజకీయ పార్టీలు తమ ప్రణాళికల్లో, విధాన ప్రకటనల్లో కులపరమైన అణచివేతను వ్యతిరేకిస్తారు కానీ గ్రామ, మండల స్థాయిలో తమ పార్టీలకు చెందిన స్థానిక నాయకుల కుల దురహంకారాన్ని, ఆధిపత్య ధోరణుల్ని, దౌర్జన్యాల్ని చూసీ చూడనట్టు ఊరుకోవడమే కాదు, అవసరమైతే వెనకేసుకొస్తారని బాలగోపాల్‌గారు తప్పు పట్టారు. దళితులపై జరిగే వివక్ష, హింసలను నిరోధించాలంటే స్థానిక పెత్తందారీ శక్తులను ఆర్థికంగా, రాజకీయంగా దెబ్బతీయాలని బాలగోపాల్‌గారు గట్టిగా పలు సందర్భాల్లో సూచించారు. దళితులపై దాడులకు, వివక్షకు కారకులైన స్థానిక పెత్తందార్లకు సివిల్ కాంట్రాక్టులు ఇవ్వరాదని, వారిని స్థానిక ఎన్నికల్లో అనర్హులుగా ప్రకటించాలని ప్రభుత్వాన్ని అడిగారు. స్థానిక ఆధిపత్య శక్తుల్ని నిలువరించే చర్యలు, పోలీసులు, ప్రభుత్వ అధికారులు జవాబుదారీతనంతో వ్యవహరించే చర్యలు తీసుకుంటేనే దళితులపై హింస తగ్గుముఖం పడుతుందని బాలగోపాల్‌గారు వాదించారు. అంబేద్కర్‌ని ఉటంకిస్తూ మొత్తంగా ప్రభుత్వ పాలనా వ్యవస్థను - వివిధ కులాల, వర్గాల ప్రజలకు ప్రాతినిధ్యం కల్పించడం ద్వారా ప్రజాస్వామీకరించవలసి ఉందని అన్నారు. ఈ చర్యలతో పాటు, దళితుల ఆర్థిక, రాజకీయ శక్తిని పెంచటానికి కనీస వేతనాలు, ఉపాధి పథకాలు, భూసంస్కరణలు లాంటి

అనేక సంక్షేమ చర్యల్ని, ప్రత్యేక రక్షణల్ని ప్రభుత్వం చేపట్టాలని బాలగోపాల్‌గారు సూచించారు. చట్టాలలో ముఖ్యంగా ఎస్.సి/ఎస్.టి అత్యాచార నిరోధక చట్టంలో, అనేక సవరణలు జరగాలని చెప్పారు. మన అసంపూర్ణ ప్రజాస్వామ్యం నిజమైన ప్రజాస్వామ్యంగా రూపొందటానికి రాజకీయ, సామాజిక కృషి మరింత అవసరమన్నారు.

**న్యాయవ్యవస్థ :**

దళితులు, ఇతర పీడిత కులాల ప్రజలు రాజ్యాంగం ద్వారా, ఇతర చట్టాల ద్వారా కల్పించిన రక్షణల్ని సక్రమంగా వాడుకోవడానికి న్యాయవ్యవస్థ పాత్ర చాలా కీలకమయినది. రాజ్యాంగ రక్షణలు, వివిధ చట్టాలు సామాజిక మార్పుకు సాధనాలుగా ఉపయోగపడాలి తప్ప, యధాస్థితివాదాన్ని బలపర్చడానికి కాదని బాలగోపాల్‌గారు చాలా బలంగా వాదించారు. రిజర్వేషన్లపై హైకోర్టుల నుంచి సుప్రీంకోర్టు వరకు ఇచ్చిన తీర్పుల్లో రిజర్వేషన్లను కుదించడం, వక్రీకరించడం, వ్యతిరేకించడం ద్వారా న్యాయవ్యవస్థ యధాస్థితివాదాన్ని బలపరుస్తూ ఉందని విమర్శించారు. సుప్రీంకోర్టు ఎస్.సి. కులాల వర్గీకరణను వ్యతిరేకించడం దళిత కులాల మధ్య అసమానతను గుర్తించ నిరాకరించడమే అన్నారు. ఈ విధంగా చట్టాన్ని యాంత్రికంగా వాఖ్యానించి సామాజిక మార్పుకి అడ్డుపడుతున్నదని బాలగోపాల్‌గారు విమర్శించారు. చలపతి, విజయవర్ధన రావు అనే ఇద్దరు దళిత యువకులకు ఉరిశిక్ష విధించడాన్ని వ్యతిరేకిస్తూ నేరానికి మొత్తం బాధ్యత నేరం చేసిన వ్యక్తులమీదే పెట్టడం సబబు కాదు; ప్రతీ నేరానికి వ్యక్తుల బాధ్యతతోపాటు ఆ నేరం జరిగే పరిస్థితులు కల్పించిన సమాజం బాధ్యత కూడా ఉంటుంది. కాబట్టి వారి ఉరిశిక్షను రద్దుచేసి, కారాగారవాస శిక్షగా మార్చాలని బాలగోపాల్ గారు వాదించారు. కేవలం చట్టాలలోని సెక్షన్‌లనే కాదు, సమాజ స్థితిగతుల్ని కూడా కోర్టులు పరిగణనలోకి తీసుకోవాలని బాలగోపాల్‌గారి అభిప్రాయం. అయితే, కోర్టులు అగ్రవర్ణ స్వభావాన్ని ప్రదర్శించటానికి, ధనిక వర్గాల ప్రయోజనాలకు వత్తాసు పలకడానికి ఒకానొక కారణం సుప్రీంకోర్టుతోసహా అన్ని కోర్టుల్లో అగ్రవర్ణాలకు చెందిన పురుషులే జడ్జిలుగా ఉండడమని అంటారు. న్యాయవ్యవస్థలో దళితులు, స్త్రీలు, ఇంకా ఇతర పీడిత వర్గాలకు తగినంత ప్రాతినిధ్యం లభిస్తేనే మన చట్టాలు సామాజిక మార్పుకి కొంతయినా తోడ్పడేవిధంగా వ్యాఖ్యానించబడతాయని బాలగోపాల్‌గారు చాలా బలంగా వాదిస్తారు. న్యాయవ్యవస్థ అగ్రకుల దురహంకారానికి ఉదాహరణగా హైకోర్టు చుండూరు స్పెషల్ కోర్టు జడ్జిగా ఉన్న దళితుడ్ని బదిలీ చేసిన ఉదంతాన్ని ఉదహరిస్తారు. జడ్జి దళితుడు కాబట్టి నిష్పాక్షిక విచారణకు పనికిరాడని రెడ్డి కుల ముద్దాయిలు హైకోర్టుకి ఫిర్యాదు చేయడమనేది బాలగోపాల్‌గారి దృష్టిలో రెండు రకాల నేరం. అందుకు చుండూరు రెడ్డి కుల ముద్దాయిలపై రెండు కేసులు

పెట్టాలన్నారు. న్యాయవ్యవస్థను అవమానించినందుకు కోర్టు ధిక్కారం కేసు, అగ్రకులాల నేరాల్ని విచారించడానికి దళితుడైన జడ్జి అనర్హుడని అవమానించి నందుకు పిసిఆర్ చట్టం క్రింద మరో కేసు నమోదు చేయాలన్నారు. అవేవీ చేయకపోగా హైకోర్టు దళిత న్యాయమూర్తిని బదిలీ చేసింది. బాలగోపాల్‌గారు ఈ చర్యని 'లజ్జాకరం' అన్నారు. చుండూరు మారణకాండను ఏ అహంకారంతో చేసారో, దళిత న్యాయ మూర్తిపై వాఖ్యల్లో కూడా అదే అహంకారాన్ని రెడ్డి కుల ముద్దాయిలు ప్రదర్శించారు. మొదటి నేరంపై విచారణ పూర్తి కాలేదు. రెండవ నేరం వారు కోరిన ఫలితాన్ని ఇచ్చిందంటూ బాలగోపాల్‌గారు న్యాయవ్యవస్థ విశ్వసనీయతపై సందేహాలు వ్యక్తం చేసారు.

**విద్యా, పత్రికా రంగాలు :**

బాలగోపాల్‌గారు ఉన్నత విద్యారంగంపై చాలా విమర్శనాత్మక వ్యాఖ్యలు చేసారు. ఐ.ఐ.టి.లలో రిజర్వేషన్లు అమలు కాకపోవడం, అక్కడ దళిత విద్యార్థులపట్ల వివక్ష గురించి రాస్తూ "దేశంలో అగ్రహారాలు ఇంకా ఎక్కడైనా మిగిలి ఉన్నాయంటే అది ఉన్నత (సాంకేతిక) విద్యారంగంలోనే అనేది ఆధునికతను అపహాస్యం చేసే విషయం కావచ్చును గానీ అది సత్యమే" అని అంటారు. రిజర్వేషన్లపై రాసిన వ్యాసాల్లో ఉన్నత విద్యా సంస్థలపై ఇలాంటి విమర్శలు చాలా ఉన్నాయి. (ఈ వ్యాసాలు వేరే పుస్తకంగా వస్తున్నాయి). ఈ పుస్తకంలో హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీ (హెచ్‌సియు)లో 10 మంది దళిత విద్యార్థుల తొలగింపు (రస్టికేషన్)కు బ్రాహ్మణీయ భావజాలమే కారణమని బాలగోపాల్‌గారు విశ్లేషించారు. ఏ విచారణా లేకుండా 10 మంది దళిత విద్యార్థుల్ని శాశ్వతంగా యూనివర్సిటీ నుంచి తొలగించడం నిబంధనల ఉల్లంఘన, సహజ న్యాయసూత్రాలను తుంగలో తొక్కడమే కాదు, 'అపాత్రదానం' కూడదన్న బ్రాహ్మణీయ విలువను వారు ప్రాథమిక హక్కులకూ, సహజ న్యాయసూత్రాలకూ వర్తింపచేయడమేనని బాలగోపాల్‌గారు వ్యాఖ్యానించారు. విజ్ఞత బోధనాంశమేనా అని ప్రశ్నిస్తూ "ఎక్కడో జరిగే అల్లర్లను కేవలం హింసగా కాక సామాజిక విషయంగా చూసి, చూడడం విద్యార్థులకు నేర్పి, పరిశోధనా గ్రంథాలు రాయగల సామాజిక శాస్త్రవేత్తలు కొలువు తీరివున్న విశ్వవిద్యాలయం తన విద్యార్థులు చేసిన హింసను క్షమించరాని నేరంగా భావించి, విచారణ అక్కరలేకుండా రస్టికేట్ చేయడం సమంజసం కాదన్నారు."

ఆంధ్రజ్యోతి దినపత్రిక-ఎంఆర్‌పిఎస్ నాయకుడు కృష్ణమాదిగ మధ్య వివాదం గురించి రాసిన వ్యాసంలో బాలగోపాల్‌గారు తెలుగు పత్రికారంగం గురించి చాలా విలువైన విశ్లేషణ చేసారు. జర్నలిజంలో సైద్ధాంతిక పక్షపాతంతో రాయడాన్ని అర్థం

చేసుకోవచ్చు. కానీ తెలుగు పత్రికలు సైద్ధాంతిక పక్షపాతం మాత్రమే కాక ఒక రాజకీయ పక్షానికో, వర్గానికో కొమ్ముకాస్తున్నాయని, ఈ రాజకీయ పాత్ర సరైంది కాదన్నారు. రాజకీయ పక్షాల కొమ్ము కాసే పత్రికలు తమపై దాడి జరిగినపుడు మాత్రమే పత్రికా స్వేచ్ఛ అనే విలువ వెనుక దాక్కోవడం అసమంజసం అన్నారు. పత్రికలు - పత్రికాస్వేచ్ఛ అనే విలువను ఆచరించాలి, ఆత్మపరిశీలన చేసుకోవాలని చెబుతూ అదే సమయంలో చట్టబద్ధ పాలన, పత్రికాస్వేచ్ఛ కలవారికంటే లేనివారికే ఎక్కువ అవసరం కాబట్టి రాజకీయ పక్షపాతం నుంచి, కొన్ని వర్గాల ప్రభావంనుంచి మనమే తెలుగు పత్రికల్ని కాపాడుకోవాలని బాలగోపాల్‌గారు అంటారు.

**దళిత ఉద్యమాలు :**

"నిన్నటివరకు తమ జీవితాలను తాము శాసించుకునే హక్కులేని దళితులు ఈ రోజు సమాజ జీవితాన్ని మేమే శాసిస్తామని ముందుకొస్తున్నారు. ఇది భారతదేశ చరిత్రలో ఒక మహత్తర ఘట్టం. అపూర్వ సందర్భం" అంటూ బాలగోపాల్‌గారు దళిత ఉద్యమం గురించి రాశారు. దళితులపై జరుగుతున్న భౌతికహింసనూ, వివిధ రకాల వివక్షను వ్యతిరేకిస్తూ వారికి అండగా నిలబడ్డారు. అక్కడితో ఆగిపోకుండా ఈ భౌతిక హింస వెనకనున్న భావజాలాన్ని గుర్తించడం అవసరమన్నారు. భారతదేశంలో వర్ణధర్మాన్ని సహజధర్మంగా భావిస్తారని, ఈ సహజధర్మాల సమాజం మనుషులందరినీ సమానులుగా గుర్తించదని, ఆ భావజాలమే మన సమాజంలో బలంగా ఉందని బాలగోపాల్‌గారు అంటారు. దళితులకు వ్యతిరేకంగా అన్ని కులాలవారు ఏకం కావడానికి వర్ణధర్మ భావజాలమే కారణమని వ్యాఖ్యానించారు. నేటి సమాజం వర్ణాలుగా విభజించబడి లేనప్పటికీ కులవ్యవస్థ దైవసృష్టి అనే భావనలో ఈ వర్ణధర్మం దాగివుందని బాలగోపాల్‌గారు వివరిస్తారు. దళిత ఉద్యమం బ్రాహ్మణీయ భావజాలం గురించి చేసిన విలువైన ఆలోచనల్ని, అంబేద్కర్ హిందూ సమాజం గురించి, కులం గురించి చేసిన విశ్లేషణల్ని ఆయన సృజనాత్మకంగా వివరించారు, వ్యాఖ్యానించారు. వామపక్షవాదులు కులాన్ని ఉపరితల అంశంగా చూడడాన్ని ఆయన విమర్శించారు. అలాగే కేవలం ఆర్థిక పోరాటాలతో కుల సమస్య పరిష్కారమవుతుందనే అవగాహనను ఆయన ఒప్పుకోలేదు. కులం - వర్గం సంబంధాల్ని సిద్ధాంతీకరించడంలో వామపక్షవాదులు విఫలమయ్యారని ఆయన అభిప్రాయపడ్డారు. "విడదీయరాని అంశాల్ని బలవంతంగా విడదీసి ఇక్కడ కులం ప్రధానమా లేక వర్గం ప్రధానమా అని చర్చించడంలో పెద్దగా అర్థం లేదేమో" అన్నారాయన. మొదట్లో దళిత ఉద్యమం ప్రజాతంత్ర విప్లవ పోరాటంలో అంతర్భాగంగా సాగాలి అన్నప్పటికీ, ఆ తరువాత కాలంలో దళిత ఉద్యమ నిర్దిష్టతను,

సమాజంలో దాని పాత్రను గుర్తించారు. కులతత్వంతో నేరుగా తలపడవలసిన అవసరాన్ని నొక్కి చెప్పిన ప్రజాస్వామిక ఉద్యమంగా దళిత ఉద్యమాన్ని గుర్తించారు. కుల సమీకరణను కేవలం ఆర్థిక కోణంనుంచి చూస్తే సరిపోదని, ఈ సమీకరణల్లో ఆధిపత్యకులాల కులాధిపత్యం ప్రధాన అంశమని అన్నారు. దళితులు కుల ప్రాతిపదికన సంఘటిత మవుతుంటే, ఆ సంఘటనలో ఆత్మగౌరవ ప్రశ్న ఉన్నదని ఆయన చెప్పారు. బాలగోపాల్‌గారి రచనల్లో దళిత ఉద్యమం లేవనెత్తిన ప్రశ్నలను సీరియస్‌గా చర్చించటం, వివిధ సమస్యల్ని విశ్లేషించే సందర్భంలో కులం పాత్రను ప్రత్యేకంగా ప్రస్తావించడం కనిపిస్తుంది. కారంచేడు తర్వాత బాలగోపాల్‌గారు ఎన్‌కౌంటర్లపై రాసినా, కరువుపై రాసినా, చంద్రబాబుపై రాసినా, రాజశేఖరరెడ్డిపై రాసినా ఆ వ్యాసాల్లో కులం ప్రస్తావన తప్పనిసరిగా ఉంది.

తరువాత కాలంలో దళిత ఉద్యమం సాంఘిక పోరాటాన్ని విస్మరించినదని ఆయన విమర్శించారు. మార్క్సిస్టు ఉద్యమాల ప్రభావంతో దళిత ఉద్యమం కేవలం రాజ్యాధికారాన్నే ప్రధాన లక్ష్యంగా చేసుకుని, దళిత రాజకీయ కృషిని "అధికారం కోసం అధికారానికి వ్యతిరేకంగా పోరాటం చేసే వ్యూహంగా" భావించడం వల్ల పెద్ద నష్టం జరిగిందన్నారు. కేవలం ప్రభుత్వం మీద డిమాండ్లతో కుల సమస్య పరిష్కారం కాదని, సమాజంలో జరగాల్సిన పోరాటం - ముఖ్యంగా సామాజిక వ్యవస్థల్లో, అలవాట్లలో, ఆలోచనా రీతుల్లో మార్పు కోసం కృషి ఎక్కువ అవసరం అని ఆయన అభిప్రాయం. బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థపై, సంస్కృతీ ఆలోచనా రీతులపై చేయాల్సిన పోరాటాన్ని దళిత ఉద్యమాలు విస్మరించాయని ఆయన అన్నారు. ఇక్కడే ఆయన మనం మళ్ళీ అంబేద్కర్, పెరియార్, ఫూలేలను లోతుగా అధ్యయనం చేయాలని గుర్తుచేస్తారు.

దళితులు రాజకీయ పార్టీలు స్థాపించి ఎన్నికల రంగంలో పాల్గొన్నారు. ముఖ్యంగా బహుజన సమాజ్ పార్టీ ఉత్తరప్రదేశ్‌లో గణనీయమైన విజయం సాధించిందని చాలామంది చెపుతుంటారు. బి.జె.పితో కలిసి అధికారం పంచుకోవడాన్ని, బ్రాహ్మణులతో కలిసి అది సర్వజన సమాజ్ పార్టీగా మారిన తీరుని బాలగోపాల్ విమర్శించారు. బిఎస్‌పికి చారిత్రక జ్ఞానం, తాత్విక దృష్టి లోపించిందని, రాజ్యాధికారం అంటే ప్రస్తుత రాజ్యాంగ యంత్రంలో అధికారం చేపట్టడం అనే పరిమిత అర్థంలో తీసుకుంటే అది దళిత ప్రయోజనాలకు ఉపయోగపడదని ఆయన వివరించారు. బిఎస్పీ తరహా రాజకీయాల్ని "పీడితులను ఒక తాటిన నిలబెట్టి నడిపించే బదులు బలవంతుల ఎత్తుగడలకు సహకరించి వారి ద్వారానే అధికారాన్ని అనుభవించాలన్న ఆలోచనగా" బాలగోపాల్ భావించారు. ఇలాంటి ఆలోచన అమలు

చేసిన నందిగామకు చెందిన ఉసేనప్పలాంటి దళితులు రెడ్డి కుల దురహంకారుల చేతిలో భౌతికంగా అంతమైన విషయం గుర్తుచేస్తారు. మరి మన దళిత నాయకులు రాజకీయంగా మూల్యం చెల్లించబోతారా అన్నది బాలగోపాల్‌గారి ప్రశ్న.

ఎన్నికల రాజకీయాల సందర్భంలోను, ప్యాపిలిలో దళితులపై దాడి ఘటన సందర్భంలోనూ ఎస్.సి., ఎస్.టి., బి.సిల ఐక్యత లేదనే వాస్తవాన్ని బాలగోపాల్‌గారు గుర్తు చేశారు. ఎస్.సి, ఎస్.టి, బి.సిల మధ్యన ఐక్యత కేవలం నినాదాలతో సాధ్యం కాదనీ, దానికోసం ప్రత్యేక రాజకీయ కార్యాచరణ అవసరమని బాలగోపాల్‌గారు అభిప్రాయపడ్డారు. ఈ ఐక్యతకు అవసరమయిన రాజకీయ, సామాజిక కృషిలో బి.సి నాయకులే ఎక్కువ చొరవ చూపాలనీ బాలగోపాల్‌గారు సూచించారు.

మొదట్లో మార్క్సిస్టు అవగాహననుంచి రాసిన ఒకటి, రెండు వ్యాసాల తరువాత బాలగోపాల్‌గారు దళిత ఉద్యమం ఒక స్వతంత్ర ఉద్యమంగా నడవాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారు. ఈ క్రమంలో ఆయన చాలా సరళమైన భాషలో, సంక్లిష్టమైన పదజాలాన్ని పక్కనపెట్టి రాసే ప్రయత్నం చేసారు. తాను వాడే భాషపట్ల చాలా జాగ్రత్త వహించేవారు. 'సవర్ణులు' అని వాడినా, 'దళిత కులాలు', 'పెత్తందారీ కులాలు' అని కొత్త ప్రయోగాలు చేసినా ఇవన్నీ కొత్త రాజకీయ సందర్భాల కోసం ఆయన సృష్టించినవే. హక్కుల కార్యకర్తగా, ప్రజల మేధావిగా ఆయన ఎవరి దృష్టికీ రాని 'ఆధిపత్య సంక్షేమ సంఘం' గురించి, ఎన్జీవోల గురించి, బందిపోట్ల గురించి, ఎరుకల, యానాది, దొమ్మరి కులాల గురించి, తెలంగాణలో "చదువూ చొరవా సామాజిక అభినివేశం" ఉన్న అబ్రహాం లాంటి దళిత యువకులవెతల గురించి రాసి మన అవగాహనకు చాలా పదును పెట్టారు. ఈ పుస్తకంతోపాటు బాలగోపాల్ గారు రిజర్వేషన్లపై, ఇతర పీడిత కులాలపై రాసిన తెలుగు, ఇంగ్లీషు వ్యాసాల్ని కూడా చదివితే బాలగోపాల్‌గారు దళిత దృక్కోణంనుంచి సమాజాన్ని చూసిన చూపు మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

**కె.సత్యనారాయణ**
అసోసియేట్ ప్రొఫెసర్
ఇఫ్ఎల్ యూనివర్సిటీ
హైదరాబాద్

22.09.2011

“ హిందుత్వవాదుల సామాజిక లక్ష్యాన్నీ రాజకీయ లక్ష్యాన్నీ కలిపి చూస్తే వారి మెదళ్ళలో ఉన్న భవిష్యత్ చిత్రాన్ని చూడగలుగుతాం. అది హైందవ సామాజిక పునాదిపైన నిలబడిన భారత అగ్రరాజ్యం. హైందవ సామాజిక పునాది అంటే మధ్యయుగాల నాటి కులవ్యవస్థే అనుకోనక్కరలేదు. పాతకాలపు కులవ్యవస్థ ప్రాతిపదికన ఆధునిక అగ్రరాజ్యాన్ని నిర్మించడం సాధ్యం కాదని వాళ్ళకు బాగానే తెలుసు. పైగా పెట్టుబడిదారీ వ్యవస్థ కల్పించగల సంపద వీళ్ళకెంత మాత్రం చేదు కాదు. అందుకే వాళ్ళకు గ్లోబలైజేషన్ కావాలి. దానికి అనువయిన ఆర్థిక సాంకేతిక వ్యవస్థలు, ప్రక్రియలు కావాలి. అక్కడ విదేశీ ద్వేషమేమీ లేదు. అయితే సాంఘిక జీవితం మాత్రం హైందవ విలువల ప్రాతిపదికన ఉండాలి. ఇవి చాలా చక్కగా అతుకుతాయి కూడా. సాంకేతిక ఆధునికత, నిచ్చెనమెట్ల హైందవ సామాజిక విలువలు, అగ్రరాజ్య హోదా - ఇదీ సంఘ్ పరివార్ ఊహించుకునే ఇండియా. వీరు ఆధ్యాత్మికత గురించి ఎంతగానయినా మాట్లాడనీ గాక, వీరి లక్ష్యం మాత్రం ఇదే.”

**- కె. బాలగోపాల్**

**(చరిత్ర పాఠాలపైన కాషాయం నీడ)**

**పిడిఎస్‌యు ప్రచురణ - డిసెంబరు 1999**

# కారంచేడు నుండి గుజరాత్ దాకా...

కారంచేడును కేవలం ఒకానొక ప్రత్యేకమయిన సంఘటనగానో, ఒకానొక కులం వాళ్ళు హరిజనుల మీద చేసిన దాడిగానో చూడడం పొరపాటు అవుతుంది. కారంచేడుకు కొన్ని ప్రత్యేకమైన లక్షణాలు ఉన్నాయి.

జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి అనే జమీందారు ప్రభావం వల్ల 1947కు పూర్వం ఆ గ్రామంలోని కమ్మ కులస్తులైన మోతుబరులలో జస్టిస్‌పార్టీ అనుకూలత, కాంగ్రెస్ వ్యతిరేకత ఉంది. 1947 తరువాత జస్టిస్ పార్టీ అస్తిత్వాన్ని కోల్పోయి కాంగ్రెస్ అధికారానికి రాబట్టి అందరూ కాకున్నా చాలామంది కాంగ్రెస్ వైపు మళ్ళారు. అయితే 1982లో తెలుగుదేశం ఏర్పడ్డాక మళ్ళీ మొత్తం అందరూ తెలుగుదేశం వైపు మొగ్గారు. కమ్మ కులస్తులు గ్రామంలో సంఖ్యరీత్యా చాలా ఎక్కువ కావడం గూడ ఈ మోతు బరులకు బలాన్ని ఇచ్చింది. వాళ్ళు కులం పేరు మీద తమ కులస్తులలోని మధ్యతరగతి మద్దతును సమీకరించుకోగలిగారు. మొత్తం కులాన్నంతా ఒక్క త్రాటిమీద నిలబెట్టగలిగారు. అయితే ఈ ప్రత్యేక లక్షణాలే కారంచేడు మారణకాండకు కారణమని అనుకుంటే పొరపాటవుతుంది. ఒక పోకడ సమాజంలో మొల కెత్తితే దానికి అనుకూలమయిన వాతావరణం దొరికినప్పుడు అది బలంగా ముందుకొస్తుంది. అంతమాత్రం చేత అలా వాతావరణం అనుకూలంగా ఉండడమే ఆ పోకడకు కారణమని అనుకోకూడదు.

అందుకే కారంచేడును అర్థం చేసుకోవడానికి మనం మన సమాజంలో తలెత్తుతున్న పోకడలను క్లుప్తంగానయినా పరిశీలించాలి. దానికి నేపథ్యంగా ఒకసారి చరిత్రను పునరావ లోకనం చేసుకోవాలి.

మన దేశంలో కులవ్యవస్థ చరిత్ర చెప్పాలంటే భూమి సంబంధాల చరిత్ర చెప్పాలి. మేమిక్కడ అంతటి సాహసం చేయడంలేదు గాని మాలమాదిగల ప్రస్తుత స్థితిని అర్థం చేసుకోవడానికి అవసరమయిన మౌలికమయిన విషయాలను మాత్రం తెలుసుకుందాం.

భూమి మీద స్వంత యాజమాన్యం ఏర్పడి వ్యవసాయ ప్రధానమయిన వర్గసమాజం పుట్టినప్పటినుండి, భూస్వాముల కమతాలలో శ్రమ ఎవరిచేత చేయించాలి, ఎట్లా చేయించాలి, వాళ్ళు చేసిన శ్రమలో అత్యధిక భాగాన్ని పాలకవర్గం ఎట్లా చేజిక్కించుకోవాలి అనేవి ప్రధానమయిన సమస్యలుగా ఉన్నాయి. ఆధునిక పారిశ్రామిక సమాజాలకు పూర్వం ఈ సమస్యలే అన్ని దేశాల చరిత్రనూ నడిపాయి. ఒక్కొక్క దేశం ఈ సమస్యను ఒక్కొక్క రకంగా పరిష్కరించింది. ఆ పరిష్కారాన్ని బట్టి కమతాలలో శ్రమచేసే శ్రామికులకు రకరకాల పేర్లు వచ్చాయి. బానిస, అర్థబానిస (Serf), వ్యవసాయ కూలీ, పాలేరు, జీతగాడు, రైతు, కౌలుదారు... ఇలాంటివే ఇంకా ఎన్నో పేర్లు.

వీళ్ళ చేత పని చేయించుకోవడానికి, దోపిడీకి లోబరుచుకోవడానికి ఆయా దేశాలలో ఎన్నో పద్ధతులు ప్రవేశపెట్టారు. కొన్నిచోట్ల బానిసల్ని చేసి యజమానులకు కట్టిపడేసారు. కొన్నిచోట్ల అర్థబానిసల్ని చేసి భూమికి కట్టిపడేసారు. యజమానినిగాని, భూమినిగాని విడిచిపెట్టిపోతే అది చట్టరీత్యా నేరం అన్నారు. మన దేశంలో గూడ ఈ రెండూ ప్రయత్నించారు. అయితే వీటికంటె గూడ ప్రధానమయిన ప్రయత్నం వర్ణవ్యవస్థ, కులవ్యవస్థల రూపంలో జరిగింది. కొంతమందికి జన్మతః భూమిగాని, ఇతర ఆస్తిగాని కలిగివుండే అర్హతలేదని, కలవాళ్ళ పొలాలలో కష్టం చేయడమే వీళ్ళ 'ధర్మం' అని సాంఘికంగా కట్టుదిట్టం చేసే ప్రయత్నం చేసారు.

మొదట్లో వీళ్ళను 'శూద్రులు' అన్నారు. ఈ 'శూద్రులు' అన్న మాటను బ్రాహ్మణ శాస్త్రకారులు వ్యవసాయ శ్రామిక వర్గానికే కాక, తమ వైదికమతాన్ని అంగీకరించని వారికందరికీ (ఉదాహరణకు విదేశీయులయిన గ్రీకులు, కుషాణులు, అన్యమతస్తులయిన బౌద్ధులు, జైనులు) ప్రయోగించడంవల్ల ఆ శాస్త్రకారులను అర్థం చేసుకోవడంలో కొంత ఇబ్బంది ఉందిగాని, మౌలికంగా శూద్రులు అంటే ఆస్తిలేని శ్రామికులే.

ఋగ్వేదంలోని పురుష సూక్తంలో ఆదిపురుషుడి ముఖం నుండి బ్రాహ్మణులు, భుజాలనుండి క్షత్రియులు, తొడలనుండి వైశ్యులు, పాదాలనుండి శూద్రులు పుట్టారని అన్నారు. అగ్రవర్ణాల వారికి సేవ చేయడమే శూద్రుల ధర్మం అని బ్రాహ్మణ శాస్త్రకారులంతా అన్నారు. స్వధర్మాన్ని ఆచరించకపోవడం మహాపాపం

అని భగవద్గీతలో కృష్ణుడు ఒక్కసారి కాదు, పదే పదే అన్నాడు. చివరికి, 'స్వధర్మంవల్ల మరణమే సంభవించినా ఫరవాలేదు; పరధర్మానికి ఆశపడడం కన్నా అదే నయం' అన్నాడు. శూద్రులు ఒకరి సేవకులని, వాళ్ళను ఇష్టానుసారం హింసించవచ్చుననీ ఐతరేయ బ్రాహ్మణంలో అన్నారు. ఆపస్తంబుడి నుండి మనువుదాక, మనువునుండి బృహస్పతి దాక 1000 ఏళ్ళపాటు శాస్త్రకారులంతా ఈ నియమాలను నొక్కి చెప్పడమే కాక, కూలిచేసే ధర్మాన్ని శూద్రులు అతిక్రమిస్తే ఎన్ని రకాలుగా శిక్షించవచ్చునో రూల్సు తయారుచేశారు. కూలికి సరిగ్గా పోకపోతే భౌతికంగా దండించవచ్చునన్నారు. పని మధ్యలో మానేస్తే చేసిన పనికి గూడ వేతనం ఇయ్యనవసరం లేదన్నారు. తిరగబడితే చేతులూ కాళ్లూ నరకమన్నారు. యజమానికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేసుకోవడానికి సహితం వీలులేదని కౌటిల్యుడు అన్నాడు.

ఇంత చేసినప్పటికీ శూద్రులు పూర్తిగా భూమిహీనులుగా ఉండిపోలేదు. వాళ్ళలో చాలామంది ఎంతో కొంత భూమి సంపాదించుకోవడం మొదలుపెట్టారు. మన దేశంలో వ్యవసాయ యోగ్యమయిన బీడు భూమి విస్తృతంగా ఉన్న కారణంగా వాళ్ళను కేవలం సేవక ధర్మానికే కట్టుబడి ఉండేలాగ చేయడం సాధ్యం కాలేదు. ఇవ్వాళ మనకు బంజర్లు తప్ప వేరే బీడు భూములు దొరకవుగాని క్రీ.శ. 1800 దాకా గూడా సారవంతమైన బీళ్లు దేశంలో చాలా ఉండేవి.

ఈ విధంగా ఒక పక్క శూద్రులు 'కంట్రోల్'లో లేకుండ పోతుంటే, వేరొక పక్క వ్యవసాయంలో అభివృద్ధి పెరిగి కూలివాళ్ళ అవసరం ఎక్కువయింది. క్రమంగా, అంత కాలం హైందవ సమాజానికి వెలుపల, ఆహార సేకరణ మీదనో, వేట మీదనో ఆధారపడి జీవించిన ఆటవికులు కొందరు గ్రామాలలోకి ప్రవేశించి వ్యవసాయ కూలీలుగా స్థిరపడ్డారు. వీళ్ళను హైందవ భూస్వామ్య సమాజం శూద్రుల కంటె నికృష్టంగా చూసింది. శూద్రుల మీద గతంలో పెట్టిన ఆంక్షల కంటె తీవ్రమయిన ఆంక్షలు వీళ్ళ మీద పెట్టింది. వీళ్ళే మాల, మాదిగ, మహర్, చమర్ తదితర పంచమ కులస్తులు. గాంధీ పరిభాషలో 'హరిజనులు'. వీళ్ళను అంటరాదని, చూడరాదని, వీళ్ళు ఊరికి వెలుపలే ఉండాలని తీర్మానించింది. అయితే ఈ నిషేధాలన్నింటికీ మూలం ఒక్కటే. అది వీళ్ళను భూమి నుండి వెలివేయడం. స్వంత భూమి కలిగివుండి స్వంత సేద్యం చేసుకునే అర్హతనుండి వీళ్ళను దూరం చేయడంద్వారా మన దేశ భూస్వామ్యవర్గం తన చెప్పుచేతలలో ఉండే కూలివర్గాన్ని తయారు చేసుకుంది. భూమినుండి వెలివేయడమేకాక సమాజం నుండి గూడ వీళ్ళను వెలివేసింది. అయితే ఆధునిక సంస్కర్తలంతా సమాజంనుండి వెలివేయడాన్నే ప్రధాన విషయంగా తీసుకుని సంస్కరించే ప్రయత్నం చేసారు. అందుకే వీళ్లు ఆ సంస్కరణలలో సహితం విజయం పొందలేదు.

కాలక్రమంలో మాలమాదిగలలో కొందరు కొంత భూమి, ఆస్తి, ఉద్యోగాలు సంపాదించుకున్నప్పటికీ మౌలికంగా ఈ విషయంలో మార్పురాలేదు. వాళ్లు చాలావరకు ఇప్పటికీ భూమిలేని కూలీలుగా ఉంటున్నారు. వాళ్ళతోబాటు కొన్ని గిరిజన తెగలకు చెందిన వాళ్లు, కొందరు కాపు తదితర కులాలకు చెందిన వాళ్ళు కలిసి ఇవాళ్టి వ్యవసాయ కూలీ వర్గం ఏర్పడింది. ప్రాచీనకాలంలాగే ఇప్పటికీ ఈ వర్గం అణచివేతకు గురవుతోంది. అప్పటిలాగే ఇప్పటికీ ఈ అణచివేతకు ఒక్కటే మూలకారణం - భూమి గలవాళ్ళకు తమ పొలాలలో చవకగా పనిచేసే కూలీలు కావాలి. అందుకే వ్యవసాయ కూలీలకు వేతనం పెంచడం అన్నా, మిగులు భూముల పంపకమన్నా, వారిలో తమ హక్కులను డిమాండ్ చేసే చైతన్యం పెంపొందించడ మన్నా - చివరికి చదువులలో, ఉద్యోగాలలో రిజర్వేషన్లన్నా భూమి గల వర్గాల నుండి ఇంత వ్యతిరేకత వస్తోంది. ఈ విషయంలో సాధారణ రైతులు సర్దుబాటు చేసుకోవడానికి సిద్ధమే గాని భూస్వాములు, మోతుబరులు మాత్రం బద్ధవిరోధులుగా ఉన్నారు. ఉండడమే కాక కులం ప్రాతిపదిక మీద సాధారణ రైతులను గూడ తమ వెనుక సమీకరించుకుంటున్నారు.

### వర్తమాన చరిత్ర

1947 తరువాత భారత ప్రభుత్వం ప్రకటించిన అభివృద్ధి విధానంలో రెండు ముఖ్య అంశాలున్నాయి. ఒకటి సాంకేతిక అభివృద్ధి. అంటే భారీ పరిశ్రమలు నెలకొల్పడం, ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగుమతి చేసుకోవడం, బహుళార్థ ప్రాజెక్టులను నిర్మించడం, వ్యవసాయంలో ఉత్పత్తి పెరుగుదలకోసం రసాయనిక ఎరువులు మొదలయిన ఉపకరణాలను దిగుమతి చేసుకోవడం (లేదా ఇక్కడే ఉత్పత్తి చేయించడం) మొదలయినవి. ఇవన్నీ గూడ మౌలికంగా ధనవంతులకు తోడ్పడే పథకాలే. ఈ విధంగా ధనికులను మరింత ధనికులుగా చేయడం ద్వారా అభివృద్ధిని సాధించాలనే ప్రయత్నం ఇది. ఇందులో ప్రభుత్వం ఆశించిన ప్రగతిని సాధించలేక పోయినప్పటికీ కొంత మేరకు సఫలం అయింది. ధనికులలో చాలామంది తమ ఆస్తులను రెండింతలు మూడింతలే కాదు వందరెట్లు గూడ పెంచుకున్నారు. దేశం ఎంత మేరకు అభివృద్ధి చెందిందన్నది వేరే సంగతి.

రెండవ అంశం సామాజిక సంక్షేమానికి సంబంధించినది. పేద వర్గాల అభ్యున్నతి కోసం, సంక్షేమం కోసం ప్రభుత్వం వివిధ పథకాలనూ విధానాలనూ ప్రకటించింది. శాసనాలు చేసింది. భూసంస్కరణలు, కౌలుదార్లకు రక్షణ, గిరిజనుల భూములు అన్యాక్రాంతం కాకుండ రక్షణ, కనీసవేతన చట్టాలు, పౌరసత్వ హక్కుల చట్టం, సన్నకారు రైతుల అభివృద్ధి సంస్థలు, ఎస్.సి., బి.సి. కార్పోరేషన్లు, గ్రామీణ ఉపాధి పథకాలు, గిరిజన అభివృద్ధి పథకాలు....ఇట్లా పేర్లు చెప్పుకుంటూ పోతే

లెక్కలేనన్ని ఉన్నాయి. కాని వీటి అమలులో మాత్రం ప్రభుత్వం ఘోరంగా విఫలమయిందని అందరూ అంగీకరిస్తారు. దీనికి రుజువుగా ప్రతిపక్షాలనో లేక అలవాటుగా ప్రభుత్వాన్ని విమర్శించేవారినో ఉటంకించాల్సిన పనిలేదు. ప్రభుత్వ సంస్థల రిపోర్టుల మాటలలోనే చెప్పవచ్చు. ఇక్కడ రెండు ఉదాహరణలు మాత్రం ఇస్తాను.

**(అ) కట్టుబానిసత్వం** (Bonded labour) : దేశంలోని వ్యవసాయ శ్రామికులలో చాలా భాగం ఏదో ఒక మేరకు కట్టుబానిసత్వానికి గురయి ఉంటారన్నది అందరికీ తెలిసిన విషయమే. దీన్ని రద్దు చేయడానికి ఎమర్జెన్సీలో Bonded Labour Abolition Act వచ్చింది. దీనికింద కట్టుబానిసలుగా గుర్తించబడింది, పునరావాసం పొందింది ఎందరో చూడండి :

| రాష్ట్రం | గుర్తించిన కట్టుబానిసల సంఖ్య | పునరావాసం పొందినవారి సంఖ్య |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 13, 422 | 8, 620 |
| బీహార్ | 7, 651 | 4, 503 |
| గుజరాత్ | 63 | 62 |
| కేరళ | 829 | 452 |
| మధ్యప్రదేశ్ | 1, 777 | 263 |
| ఉత్తరప్రదేశ్ | 8, 644 | 4, 584 |
| రాజస్థాన్ | 6, 047 | 6, 027 |
| మహారాష్ట్ర | 292 | 292 |
| ఒరిస్సా | 15, 632 | 1, 323 |
| తమిళనాడు | 27, 874 | 26, 964 |
| కర్ణాటక | 62, 699 | 31, 189 |
| **దేశం మొత్తం** | **1, 44, 930** | **84, 269** |

ఇవి 1982 లెక్కలు. అంటే దేశంలోని 6 కోట్ల వ్యవసాయ శ్రామికులలో 1.45 లక్షలు (0.25 శాతం) మాత్రమే కట్టుబానిసలుగా ఎంచబడగా, అందులో సగం మంది మాత్రమే పునరావాసం పొందారు. వీళ్ల పునరావాసం కోసం పెట్టిన ఖర్చుగూడ ఎందుకూ సరిపోదు. చట్టం ప్రకారం తలసరి 4000 రూపాయలు ఖర్చుపెట్టాలి. అది అరెకరం మెట్టభూమి కొనుక్కోవడానికి గూడ సరిపోదు. అయితే చట్టమే అట్లా ఉండగా, పెట్టిన ఖర్చు (మన రాష్ట్రంలో) కేవలం తలసరి 1869 రూపాయలే. (ఐ.ఐ.పి.ఏ వారి సూచన ప్రకారం తలసరి కనీసం 20 వేల రూపాయలయినా ఖర్చుపెట్టకపోతే వాళ్లు తిరిగి కట్టు బానిసత్వానికే పోతారు.)

**(ఆ) భూసంస్కరణలు :** భూస్వాముల కమతాల మీద గరిష్ట పరిమితి (Ceiling) విధించి మిగులు భూమిని వ్యవసాయ కూలీలకు పంచుతామన్నారు. 1960లలో ఒక విడత, 1972 తరువాత మరొక విడత భూపరిమితి (Land Ceiling) చట్టాలు వచ్చాయి. ఈ చట్టాల అమలు ఎంత బాగా ఉందో ఈ గణాంకాల వల్ల తెలుసుకోవచ్చు :

| | |
|---|---|
| భారతదేశంలో మొత్తం వాడకానికి అందుబాట్లో ఉన్న భూమి | 75 కోట్ల ఎకరాలు |
| భూపరిమితి చట్టాల క్రింద పంచబడ్డ మిగులు భూమి (1976) | 12.6 లక్షల ఎకరాలు |
| **మొత్తం భూమిలో ఇది -** | **0.17 శాతం** |
| భారతదేశంలో మొత్తం వ్యవసాయ శ్రామికుల జనాభా (1976 అంచనా) | 5 కోట్లు |
| మిగులు భూమిని పొందినవారి సంఖ్య | 10 లక్షలు |
| **మొత్తం వ్యవసాయ శ్రామికులలో ఇది -** | **2 శాతం** |

అంటే, 100 ఎకరాలలో 0.17 ఎకరాన్ని (అనగా 7 కుంటలను) వ్యవసాయ శ్రామికులలో 2 శాతానికి తలసరి ఒక్క ఎకరం కంటె కొంచెం ఎక్కువ పంచియిచ్చి, దీనితో భూమి కొరత తీరిందని నమ్మమంటున్నారు.

అన్ని సంక్షేమ పథకాల పరిస్థితీ ఇదే. అయితే విచిత్రమయిన విషయం ఏమిటంటే ఈ రకంగా ఒకవైపు సంక్షేమ పథకాలన్నీ అమలులో విఫలమవుతూనే ఉన్నా, వేరొకవైపు ధనికవర్గంలో వీటిపట్ల వ్యతిరేకత మాత్రం పెరుగుతూ ఉంది. ఎందుకంటే ఈ పథకాలవల్ల భౌతిక ప్రయోజనం ఉన్నా లేకపోయినా కూలిజనంలో చైతన్యం పెరుగుతుందని వాళ్లకు కోపం. అందుకే వ్యతిరేకిస్తున్నారు. ప్రభుత్వం గూడ ఇదే కారణంగా కాబోలు ఈ మధ్యకాలంలో సామాజిక సంక్షేమం గురించి కాని, సంస్కరణల గురించి కాని మాట్లాడడం మానేసింది.

సంక్షేమ పథకాలపట్ల ధనికులలో గల వ్యతిరేకత అన్నిటికంటె రిజర్వేషన్ల విషయంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. బలహీన వర్గాలకు ఇచ్చిన రిజర్వేషన్లను వ్యతిరేకించే పోకడ దేశమంతటా తలెత్తుతోంది. కొన్నిచోట్ల ఆందోళనలు సహితం మొదలయ్యాయి. అయితే, రిజర్వేషన్లు మంచివా చెడ్డవా అన్న చర్చలో పడి, అసలు అవి ఎంత మేరకు అమలవుతున్నాయో ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. అమలుకు సంబంధించిన వివరాలను (మచ్చుకు ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, కేంద్ర సర్వీసులు) ఇక్కడ ఇస్తున్నాము.

### ఆంధ్రప్రదేశ్ (1974 గణాంకాలు)

| | | |
|---|---|---|
| రాష్ట్ర జనాభాలో హరిజనుల సంఖ్య | | 14.60 శాతం |
| ఉద్యోగాలలో హరిజనులకు రిజర్వేషన్లు | | 14.00 శాతం |
| రిజర్వేషన్ల అమలు : వివిధ కేడర్లలో హరిజనుల సంఖ్య : | | |
| | క్లాస్ I | 5.5 శాతం |
| | క్లాస్ II | 3.3 శాతం |
| | క్లాస్ III | 5.5 శాతం |
| | క్లాస్ IV | 14.0 శాతం |

### ఉత్తరప్రదేశ్ (1974 గణాంకాలు)

| | | |
|---|---|---|
| రాష్ట్ర జనాభాలో హరిజనుల సంఖ్య | | 21.00 శాతం |
| ఉద్యోగాలలో హరిజనులకు రిజర్వేషన్లు | | 18.00 శాతం |
| రిజర్వేషన్ల అమలు : వివిధ కేడర్లలో హరిజనుల సంఖ్య : | | |
| | క్లాస్ I | 3.1 శాతం |
| | క్లాస్ II | 3.6 శాతం |
| | క్లాస్ III | 8.0 శాతం |
| | క్లాస్ IV | 12.8 శాతం |

### కేంద్ర సర్వీసులు (1975 గణాంకాలు)

| | | |
|---|---|---|
| దేశ జనాభాలో హరిజనుల సంఖ్య | | 14.00 శాతం |
| ఉద్యోగాలలో హరిజనులకు రిజర్వేషన్లు | | 14.00 శాతం |
| రిజర్వేషన్ల అమలు : వివిధ కేడర్లలో హరిజనుల సంఖ్య : | | |
| | క్లాస్ I | 1.44 శాతం |
| | క్లాస్ II | 3.02 శాతం |
| | క్లాస్ III | 13.73 శాతం |
| | క్లాస్ IV | 26.29 శాతం |

అగ్రవర్ణాలలో చాలామంది పేదవాళ్ళున్న మాట వాస్తవమే. వాళ్ళకు ప్రభుత్వం చేయూతనివ్వాలని అందరూ ఒప్పుకుంటారు. ఎస్.సి, ఎస్.టి, బి.సి వర్గాలకిచ్చే రిజర్వేషన్లుకాక ఆర్థిక ప్రాతిపదిక మీద అగ్రవర్ణాలకు చెందిన పేదవాళ్ళకు గూడ రిజర్వేషన్లివ్వాలంటే ఎవ్వరూ కాదనరు. కాని ఈ రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలను నడుపుతున్నది, వాటికి నాయకత్వం వహిస్తున్నది అగ్రవర్ణాలకు చెందిన పేదవాళ్ళు కాదు. అగ్రవర్ణాలకు చెందిన ధనికులు - ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల మోతుబరుల కుటుంబాలకు, పట్టణ ప్రాంతాల వ్యాపారస్తుల, ఉన్నత ఉద్యోగస్తుల కుటుంబాలకు

చెందినవారు నడుపుతున్నారు. ఈ ఉద్యమాలు ఒక న్యాయమైన కోర్కెను సాధించడానికి సాగుతున్నవి కావు. పేదవారి మీద దేశవ్యాపితంగా జరుగుతున్న దాడులలో భాగంగా నడుస్తున్న అప్రజాస్వామికమయిన ఆందోళనలు. అందుకే ఇవి కుల, మత కలహాల రూపం తీసుకుని గృహదహనాలకూ దళితుల మారణకాండకూ దారి తీస్తున్నాయి.

## గుజరాత్

ఈ మధ్యనే నడిచిన గుజరాత్ రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనను పరిశీలిద్దాం.

ఈ ఆందోళనకు నాంది గుజరాత్ ప్రభుత్వం తీసుకున్న ఒక నిర్ణయంలో ఉంది. మార్చి నెలలో జరగబోయే ఎన్నికలను దృష్టిలో ఉంచుకుని ఫిబ్రవరి నెలలో గుజరాత్ ప్రభుత్వం వెనుకబడ్డ తరగతుల (బి.సి) రిజర్వేషన్ కోటా 10 శాతం నుండి 28 శాతానికి పెంచింది. ఈ పెంపుదల రాణె కమిషన్ సూచించినదే. అయితే ఆ కమిషన్ 'వెనుకబడ్డ తరగతుల'ను గుర్తించడానికి కులం ప్రాతిపదికను కాక ఆర్థిక ప్రాతిపదికను ఉపయోగించాలని అభిప్రాయపడింది. సోలంకీ ప్రభుత్వం దీనిని పక్కనబెట్టి కులం ప్రాతిపదిక మీదనే నిర్ణయించింది.

ఫిబ్రవరి నెలలోనే ఈ నిర్ణయానికి వ్యతిరేకంగా అలజడి ప్రారంభమయింది. అయితే ఎన్నికలు గడిచేదాకా అది బలం పుంజుకోలేదు. మార్చి మొదటివారంలో ఎన్నికలు అయిపోయి, సోలంకీ ప్రభుత్వం పదవీ స్వీకారం చేయగానే మళ్ళీ మొదలైంది. ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ టిక్కెట్టు పొందడంలో విఫలురయిన కాంగ్రెస్ నాయకుల హస్తం ఇందులో స్పష్టంగా కనిపించింది. బి.జె.పి. నాయకులయితే ఆందోళనలో స్వయంగా పాల్గొన్నారు. పైకి వీళ్ళందరూ రిజర్వేషన్లను సమర్థిస్తూ మాట్లాడేవాళ్ళే. ఆందోళన క్రమంగా బలపడి మార్చి 18 నాడు అహమ్మదాబాద్ బంద్ విజయవంతంగా  ముగిసింది. ఆందోళనకారులు ప్రధానంగా విద్యార్థులు. వాళ్ళ సంస్థ నవరచనా సమితి కాగా వాళ్ళ తల్లిదండ్రులయిన హోదా గల పెద్దమనుషులు 'వాలీ మహా మండల్' అనే పేరిట సమీకృతమయ్యారు.

బంద్ విజయవంతంగా ముగిసిన మార్చి 18 రాత్రే అహమ్మదాబాద్‌లో మత కలహాలు ప్రారంభమయ్యాయి. ఎవరు ప్రారంభించారు, ఎందుకు ప్రారంభించారు అనేవి ఇప్పటికీ తేలని విషయాలు. 'రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన' ఏవిధంగానయితే సోలంకీకి వ్యతిరేకమయిన వ్యక్తుల రాజకీయ స్వప్రయోజనాలకోసం బలం పుంజుకుందో, అదే విధంగా ఆ ఆందోళనను ఆపించడం కోసం సోలంకీయే తన అనుయాయులైన హిందూ - ముస్లిం దొంగసారా వ్యాపారస్తులను వాడుకుని

'మతకలహం' సృష్టించాడన్న పుకారు అవాస్తవం కాకపోవచ్చు. ఈ మతకలహాల బెదురుకు ఆందోళనకారులు తమ ఆందోళన విరమించుకున్నారు. మతకలహాలను ప్రేరేపించడంలో సోలంకీ ఆశించినది ఇదే అయితే అది దక్కింది. కాని సోలంకీ అంతటితో ఆగక ఆందోళనకారుల నాయకులను అరెస్టు చేసి (మతకలహాలు ప్రేరేపించారన్న ఆరోపణ మీద) జైలులో పెట్టాడు. దానితో ఏప్రిల్ నెలలో ఆందోళన మళ్ళీ మొదలయింది. తమ నాయకులను వదిలిపెట్టాలన్న డిమాండుతో విద్యార్థులు ఆందోళన మళ్ళీ మొదలుపెట్టారు. ఈసారి ప్రభుత్వం వాళ్ళమీదికి పోలీసులను దించింది. వెంటనే పత్రికలన్నీ పెద్ద ఎత్తున పోలీసు అత్యాచారాల గురించి రాయడం మొదలుపెట్టాయి. గుజరాత్ హైకోర్టులో పోలీసులకు వ్యతిరేకంగా ఆందోళనకారులు పిటిషన్లు వేసారు. హైకోర్టుగూడ ఒక అసాధారణమయిన తీర్పులో ఇద్దరు (బి.సి. కులాలకు చెందిన) పోలీస్ అధికార్లు ఫలాన ప్రాంతానికి పోవడానికి వీలులేదని 'ఇంజంక్షన్' జారీ చేసింది. అడిగిందే తడవుగా బి.జె.పి. స్థావరమైన ఖాడియా ప్రాంతంలో జరిగిన పోలీసు అత్యాచారాల మీద న్యాయవిచారణకు ఆదేశం ఇచ్చింది.

ఏప్రిల్ 20 నాటికి అల్లర్లు తీవ్రతరమయ్యాయి. విస్తృతంగా బలహీన వర్గాలమీద, ముస్లింలమీద దాడులు జరిగి హత్యాకాండ కొనసాగింది. చివరికి న్యాయవిచారణ జరుగుతున్న ఖాడియా ప్రాంతంలో ఒక కానిస్టేబిల్‌ను ఎవరో చంపేసరికి పోలీసులు 'తిరగబడి' (ప్రభుత్వం మీద కాదు, ప్రజల మీద) గుజరాత్ సమాచార్ పత్రిక కార్యాలయాన్ని దగ్ధం చేయడం, దుకాణాలను లూటీ చేయడం మొదలయిన పనులు చేయసాగారు. ఇక అప్పటినుండి అల్లర్లు (ఎక్కువగా కుల, మత సంఘర్షణలు - ఇంకా స్పష్టంగా చెప్పాలంటే హరిజనుల మీద, ముస్లింల మీద దాడులు) ఎడతెరిపి లేకుండ కొనసాగి 200పైగా ప్రాణాలు పోయి సోలంకీ రాజీనామా చేసి రిజర్వేషన్‌ల పెంపుదలను వాయిదా వేయడానికి ప్రభుత్వం ఒప్పుకున్న తరువాత కొంతకాలానికి చల్లారింది. ప్రస్తుతం ఆందోళన 'విరమించబడింది.'

గుజరాత్ ఆందోళన గురించి ఇంత వివరంగా చెప్పడానికి గల కారణమేమంటే ఇందులో గమనించదగ్గ అంశాలు కొన్ని ఉన్నాయి.

1) ఆందోళన మొత్తం సంకుచితమయిన రాజకీయ ప్రయోజనాలతో ముడిపడి నడిచింది. ఒకవైపు సోలంకీ అధికార కాంక్ష, మరొకవైపు అతన్ని గద్దె దించాలన్న అతని ప్రత్యర్థుల కాంక్ష ఆందోళనలో బలమయిన ప్రోద్బలాలుగా పనిచేశాయి.

2) పైకి రిజర్వేషన్లను సమర్థిస్తూ మాట్లాడే భారతీయ జనతాపార్టీ, కాంగ్రెస్(ఐ) తదితర పార్టీల నాయకులు ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఆందోళనకు నాయకత్వం వహించారు.

3) మామూలుగా విద్యార్థులు ఏ ప్రజాస్వామిక ఉద్యమంలోకి వెళ్ళినా వెనక్కి లాగే తల్లిదండ్రులు ఈసారి తాము గూడ ఒక సంఘం పెట్టుకుని ఆందోళనలోకి దిగారు.

4) ఆందోళనను నడిపింది ధనవంతుల బిడ్డలు కాబట్టి హైకోర్టు వాళ్ళ పిటిషన్లను అపూర్వమయిన వేగంతో పరిశీలించి పోలీసు అత్యాచారాల మీద అపూర్వమయిన తీర్పు ఇచ్చింది. పత్రికలు కూడా ఆందోళనకు అనుకూలంగా పెద్ద ఎత్తున గోల. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' అయితే సోలంకీని గద్దె దించేదాకా తాను గూడ ఆందోళనలో ఒక శక్తి అయి పనిచేసింది.

5) ఆందోళనను ఆసరా చేసుకుని హరిజనుల మీద, ముస్లింల మీద ప్రాణాంతకమయిన దాడులు జరిగాయి. అత్యధికంగా ప్రాణాలు కోల్పోయింది వీళ్ళే.

ఒక్కమాటలో చెప్పాలంటే గుజరాత్‌లోని ధనిక వర్గమంతా ఉమ్మడిగా బలహీన వర్గాలకు వ్యతిరేకంగా నడిపిన ఆందోళన ఇది. అగ్రవర్ణాలకు చెందిన పేదవాళ్ళ గురించి కార్చిన కన్నీళ్లు కేవలం సాకు మాత్రమే. అందుకే ఈ ఆందోళనను గ్రామీణ ప్రాంతాలలో కూలిజనం మీద జరుగుతున్న దాడులకు అనుబంధ విషయంగా చూడక తప్పదు.

## ముగింపు

మన దేశంలో బలహీనవర్గాలమీద జరుగుతున్న అత్యాచారాలు మన దేశ పాలకులు అవలంబించిన ప్రగతి పథంతో ముడిపడి ఉన్నాయి. తరతరాల సామాజిక సంబంధాలలో ఎటువంటి మార్పు తేకుండా, దేశాన్ని కేవలం సాంకేతికంగా అభివృద్ధి చేసే విధానాన్ని అవలంబించిన కారణంగా, సాంప్రదాయకంగా పెత్తనం చేస్తున్న భూస్వామ్యవర్గాల పెత్తనం చెక్కుచెదరకపోవడమే కాక వాళ్ల ఆస్తులు  విపరీతంగా పెరిగాయి. వ్యాపారాలూ ఉద్యోగాలూ గూడ వాళ్ళవే అయ్యాయి. రాజకీయ అధికారమూ వాళ్ళదే అయింది. దీనితో వాళ్ళ అహంకారం గూడ విపరీతంగా పెరిగిపోయి పేదవర్గాల మీద దాడులు చేయడానికి, వాళ్ళ ఓట్ల కోసం కల్పించిన 'సంక్షేమ' పథకాలను సహితం నిరసించడానికి దారితీసింది. ఇది నానారకాల అల్లర్లకూ దాడులకూ ఆందోళనలకూ దారితీస్తోంది.

కొంత చారిత్రక కారణాలవల్ల, కొంత రాజకీయ కారణాలవల్ల ఈ దాడులు కులం తగాదాలుగాను, కులం ప్రాతిపదిక మీద చేసిన దాడులుగాను కనబడతాయి గాని, ఇక్కడ కులం ప్రధానం కాదు. ఏ ప్రాంతంలో దాడి చేసిన వారయినా ఆ ప్రాంతంలో భూమిపై పెత్తనం అధికంగా గల కులాలకు చెందినవారేగాని ఇతర అగ్రవర్ణాలకు చెందినవారు కాదు. కారంచేడులో కమ్మకులస్తులయితే, రంగారెడ్డి -

మహబూబ్‌నగర్ జిల్లాలలో తరచు హరిజనులపైన జరిగే అత్యాచారాలకు బాధ్యులు రెడ్లు, బీహార్‌లో భూమిహార్‌లు, ఉత్తరప్రదేశ్‌లో ఠాకూర్‌లు, గుజరాత్‌లో పటేళ్లు- వీళ్ళంతా గూడా ఆయా ప్రాంతాలలో పెద్దఎత్తున భూమి గలవాళ్ళే. కులం ప్రసక్తి ఎక్కడ వస్తుందంటే ఒక కులానికి చెందిన భూస్వాములు తమ తోటి కులస్తులయిన మధ్యవర్గాలను గూడ కొంతమేరకు తమ వెంట కులం పేరిట సమీకరించు కోగలుగుతున్నారు. అదే విధంగా, దాడికి గురయినవి గూడ కేవలం బలహీన కులాలు కాదు....ఎవరయితే ఈ పెత్తనానికి ఎదురు తిరిగి నిలబడ్డారో వాళ్లు గురయ్యారు, అవుతున్నారు.

ఈ దాడుల విషయంలో కులాలన్నీ ఒకటే అయినట్టు పాలక పార్టీల వైఖరి కూడ ఒకటే. రాస్వాల్‌కు తెలుగుదేశం నిజనిర్ధారణ కమిటీ, కారంచేడుకు కాంగ్రెస్(ఐ) నిజనిర్ధారణ కమిటీలు వెళ్ళడంలోనే ఈ అసహ్యకరమయిన వాస్తవం బహిర్గతమవు తోంది. ఈ పార్టీలన్నీ గూడ బలవంతుల తోటివే కాబట్టి ఒకచోట నేరం ఒకరిదయితే వేరొకచోట నేరం ఇంకొకరిదవుతుంది. తమది అయినచోట కప్పి పుచ్చి తమదికాని చోట శోకావేశపు హాహాకారాలతో దళితులను ముంచెత్తుతున్నారు.

ఇటువంటి పరిస్థితులలో ప్రజల కర్తవ్యం స్పష్టమే. ఈ దాడులకు మూల కారణమయిన దేశ ఆర్థిక అభివృద్ధి పథాన్ని సమసమాజం దిశగా మార్చే ప్రయత్నం చేపట్టాలి. అదొక్కటే కారంచేడులను, గుజరాత్‌లను ఆపగలదు. ఈ ప్రయత్నంలో పేదవాళ్ళందరి అవసరం (కులం ఏదయినా) ఒక్కటే : ఐక్యంగా ఉండి, ధనిక వర్గాలకు కాక తమకు ప్రయోజనకరంగా ఉండే ఆర్థిక వ్యవస్థను నిర్మించుకోవడం.

## కారంచేడు హత్యాకాండ రిపోర్టు

ముందుగా వేసుకున్న పథకం ప్రకారం జూలై 17 ఉదయం కారంచేడు భూస్వాముల పాశవికదాడిలో ఆరుగురు హరిజనులు గొడ్డళ్ళతో, బరిసెలతో నరికి చంపబడ్డారు. ముగ్గురు స్త్రీలు మానభంగం, లైంగిక అత్యాచారాలకు గురయ్యారు. ఎంతోమంది తీవ్రమైన గాయాలతో ఇంకా హాస్పిటల్‌లో ఉన్నారు. మాదిగపల్లిలోని ఇళ్ళు ధ్వంసం చేయబడ్డాయి. వారందరూ నిరాశ్రయులై ప్రాణాలు అరచేత పట్టుకుని చీరాలలో తలదాచుకుంటున్నారు. పదిరికుప్పం, బండారుపల్లి, వెంకటకృష్ణాపురం ఫక్కీలో జరిగిన ఈ ఘటన జనతా హయాంలో బెల్చి మారణకాండను (1978) మరిపించేదిగా ఉంది. కోటికి పడగలెత్తిన భూస్వాములు, రాష్ట్ర రాజకీయ నాయకులు (ముఖ్యమంత్రి బంధువర్గం), సినిమా ప్రొడ్యూసర్లు, పరిశ్రమాధిపతులకు నిలయమైన కారంచేడు గ్రామం ప్రకాశం జిల్లా చీరాల తాలూకాలోనిది. నగరాలను మరిపించే భవంతులతో నిండిన ఈ గ్రామం ఆంధ్రలో ఎంతో అభివృద్ధి చెందిన గ్రామంగా

చెప్పుకుంటారు. అయితే ఇంత 'అభివృద్ధి' చెందిన గ్రామంలో వ్యవసాయ కూలీల పరిస్థితి మాత్రం మధ్యయుగాలను గుర్తుకు తెస్తుంది. పాలేరుకు సంవత్సర జీతం రెండువేల రూపాయలు మాత్రమే. నాట్లు వేసే కాలంలో స్త్రీలకు 6 నుంచి 8 రూపాయలు, పురుషులకు 10 నుండి 12 రూపాయలకు మించి ఉండదు. ఈ కూలిరేట్లు పరిసర గ్రామాలకంటె తక్కువ కావడమేకాక, అభివృద్ధి చెందిన ప్రాంతానికి (Zone I) వర్తించే కనీస వేతనాలకంటె కూడా తక్కువ.

వేతనాలు మాత్రమేకాక మొత్తం పని పరిస్థితులు కూడా మధ్యయుగాలను తలపించేటట్లున్నాయి. పొలాన్ని పాలికి (Crop-Share) తీసుకునే రైతు రెండు రకాల ఏర్పాట్లలో ఒకటి ఎంచుకోవాలి. ఒక ఏర్పాటులో ఖర్చులన్నీ రైతే పెట్టుకుని పంటలో సగం భూస్వామికి ఇవ్వాలి. లెక్కవేసి చూస్తే ఈ ఏర్పాటులో రైతుకు తినడానికి గూడ సరిగ్గా మిగలదు. మరొక ఏర్పాటులో భూస్వామి ఎరువులు, మందుల ఖర్చు పెట్టుకుని కొంత మొత్తం అడ్వాన్స్ ఇస్తాడు. పంటలో మూడింట రెండు వంతులు అతనికి ఇవ్వాలి. అయితే ఈ ఏర్పాటును అంగీకరించే రైతు భూస్వామి ఇంట్లోను, భూస్వామి పొలంలోను వెట్టిచాకిరీ చేయాలి. ఈ చాకిరీ ఉదయం 4-30 గంటలకు భూస్వామి ఇంటిదగ్గర మొదలవుతుంది. ఉదయం గుడిలో గంట మోగేసరికి (దీనిని "హరే రామ గంట" అంటారట) భూస్వామి ఇంట్లో ఉండాలి. అప్పటినుండి రాత్రి 10 గంటల దాకా (అంటే దాదాపు 16 గంటలు) పని చేయాలి. ఇందులో తాను పాలికి తీసుకున్న పొలంలో చేసే పనికంటే భూస్వామి ఇంట్లో, పొలంలో చేసేదే ఎక్కువ ఉంటుంది. ఈ శ్రమకు దినకూలి 4 రూపాయిలు ఇస్తారు. అంటే పొలాన్ని పాలికి ఇవ్వడం అనే షరతుమీద భూస్వాములు కారు చవకగా కూలివాళ్ళ శ్రమశక్తిని కొనుక్కుంటున్నారు. అయినప్పటికీ ఈ ఏర్పాటులోనే భద్రత ఎక్కువగా ఉన్నట్టు అనిపించి కూలివాళ్ళు దీనినే ఎక్కువగా ఆశ్రయిస్తారట! ఈ ఏర్పాటు వెట్టిచాకిరీ (రద్దు) చట్టానికి, కనీస వేతనాల చట్టానికి విరుద్ధమని వేరే చెప్పనవసరం లేదు.

ఇంతేగాక పని పరిస్థితులు చాలా కఠోరంగా ఉన్నట్టు హరిజనులతో మాట్లాడితే తెలుస్తుంది. పాలేరు ఒక్కరోజు పనిలోకి వెళ్ళకపోయినా అతన్ని భౌతికంగా సైతం దండిస్తారు. జాగర్లమూడి తిరుపతయ్య దగ్గర పనిచేసిన పిల్లి సుబ్బారావు అనే యువకుడు ఒకనాడు పనిలోకి పోకపోతే ఆ సాయంత్రం భూస్వాములు అతని ఇంటికి వచ్చి అతని రోగిష్టి భార్య అంకమ్మను కొట్టి పోయారట. (ఇక్కడ గమనించ వలసిన విషయం ఏమిటంటే పాలేర్లకు సంవత్సరంలో కొన్ని దినాలు జీతంతోకూడిన సెలవు ఇవ్వాలని కనీస వేతనాల చట్టం అంటుంది.) అదే విధంగా ఒక పాలేరుగాని

9 నెలలు పనిచేసి ఆ తరువాత ఏ కారణంగానయినా పని మానేస్తే, అతనికి చేసిన 9 నెలల పనికి కూడ వేతనం ఇవ్వరు.

గ్రామంలోని 450 హరిజన కుటుంబాలు (300 మాదిగ, 150 మాల) ఈ పరిస్థితులలో జీవిస్తున్నారు. వాళ్ళు తిరగబడే ప్రయత్నం చేయకపోయినా అప్పుడప్పుడు సంఘటితమయ్యే ప్రయత్నాలు జరగకపోలేదు. ఆ ప్రయత్నాలేవీ భూస్వాములు సాగనివ్వలేదు. ఎవరయినా కూలివాళ్ళు 'తప్పులు' చేస్తే భూస్వాములంతా అప్పటి కప్పుడు చావడిలో 'కచ్చేరి' (పంచాయితీ) జరిపి దండించేవారు. అయితే గత రెండు సంవత్సరాలుగా కారంచేడుకు బయటి ఊళ్ళనుండి వచ్చిన కొందరు హరిజన యువకుల ప్రభావంవల్ల వాళ్ళలో కదలిక మొదలయింది. పెద్దగా పోరాటాలు చేయకపోయినా తమ హక్కులకోసం నిలబడడం, మాటకు మాట అనడం అలవర్చుకున్నారు. భూస్వాముల భాషలో చెప్పాలంటే - వాళ్లు వస్తే లేచి నిలబడడం లేదు, సిగరెట్ పారేయడం లేదు అని.

ఈ 'విపరీత పరిస్థితులు' కారంచేడుకు కొత్తకాదు గాని, కారంచేడులో భూస్వాముల కులం అయిన కమ్మకులస్తులు మొత్తం 15000 జనాభాలో 80 శాతం పైగా ఉండడం విపరీత పరిణామాలకు దారితీసింది. చాలాకాలంగా రాజుకుంటున్న సంఘర్షణ గత ఎన్నికలలో భూస్వాములు తెలుగుదేశం పార్టీకి, హరిజనులలో మెజారిటీ కాంగ్రెస్(ఐ)కి ఓటువేయడంతో పరాకాష్ఠనందుకుంది. ఈ కోణంనుండి చూస్తే కారంచేడు సంఘటనలో ఎటువంటి వైపరీత్యం లేదు. 1983 నుండి కూడ (పదిరికుప్పం హత్యాకాండతో మొదలుపెట్టి) తెలుగుదేశం మద్దతుదార్లయిన భూస్వాములు తమ రాజకీయ ప్రత్యర్థులను గృహదహనానికీ మారణకాండకూ గురి చేస్తూనే ఉన్నారు.

## జూలై 16-17 సంఘటనలు

జూలై 16 సాయంత్రం హరిజనులు ఉపయోగించే మంచినీటి చెరువుదగ్గర శ్రీనివాసరావు, రాయినీడు ప్రసాద్ అనే ఇద్దరు కమ్మకులస్తులయిన యువకులకు, కత్తి చంద్రయ్య, మున్నంగి సువార్త అనే ఇద్దరు హరిజనుల మధ్య తగాదా జరిగింది. గేదెకు పెడుతున్న కుడితినీళ్ళు చెరువులోకి పోతున్నాయని హరిజనులు అభ్యంతరం తెలిపారు. కమ్మ యువకులు చంద్రయ్యనూ సువార్తనూ చంద్రకోలతో కొట్టారు. సువార్త ఆ చంద్రకోలను లాక్కొని తిరిగి ఒక దెబ్బ వేసింది. ఆ రాత్రి కమ్మ యువకులు కొందరు సువార్త ఇంటికి పోయి ఆమెను బయటకులాగే ప్రయత్నం చేసారు గాని, హరిజనులలో కొందరు పెద్దమనుషులు (పందిరి నాగేశ్వరరావు తదితరులు)

సర్దిచెప్పగా వెళ్ళిపోయారు. అయితే సువార్త మామగారయిన మున్నంగి అంకయ్యతో పొద్దున వచ్చి తన కోడలి ప్రవర్తనకు సంజాయిషీ చెప్పమని చెప్పిపోయారు.

మర్నాటి ఉదయం అంకయ్య తన యజమాని అయిన మండవ రాధాకృష్ణమూర్తి ఇంటికిపోయి, జరిగిన విషయాన్ని వివరించి, అందులో సంజాయిషీ చెప్పకోటానికి ఏమీ లేదన్నాడు. అదే సమయంలో పందిరి నాగేశ్వరరావు టీ తాగటానికి అగ్రవర్ణాలవారి ఇళ్ళదగ్గర ఉన్న ఒక దుకాణానికి పోయాడు. కమ్మ కులస్తులయిన యువకులు కొందరు అతన్ని అక్కడే పట్టుకుని 'వీడు తగాదాలు పరిష్కారం చేసేంత పెద్దమనిషి అయ్యాడు' అని కొట్టి, అక్కడినుండి రాధాకృష్ణమూర్తి ఇంటికిపోయి, అంకయ్యను బయటకు పంపియ్యమని అడిగారు. ఆయన అంకయ్యను కాపాడే ప్రయత్నం చేసాడుగాని, ఆ యువకులు అతన్ని లాక్కు పోయారు. లాక్కుపోయి, కొట్టి, బందిలిదొడ్డి దగ్గర కూర్చోబెట్టి, మాదిగపల్లి మీదికి దాడికి బయలుదేరారు.

ఇక్కడ చెప్పవలసిన ముఖ్య విషయం ఏమిటంటే, ఇదంతా యాదృచ్ఛికంగా జరిగింది కాదు. 16 నాటి రాత్రి ఈ యువకులు రాయినీడు ప్రసాద్‌కు చెందిన బ్రాంది షాపులో కూర్చొని పథకం వేసుకున్నట్టు స్పష్టమయిన ఆధారాలున్నాయి.

ఇక ఆ తరువాత జరిగిన దాడిని వర్ణించడం కష్టం. వందల సంఖ్యలో (అంచనాలు 400 నుండి 3000 దాకా ఉన్నాయి) యువకులు కులంపేరిట బహిరంగంగా పిలుపు ఇచ్చుకుని సమీకృతమయి బరిసెలతోనూ గొడ్డళ్ళతోనూ మాదిగపల్లెను చుట్టుముట్టారు. ట్రాక్టర్ల మీద, మోటార్ సైకిళ్ళ మీద వచ్చారు. చుట్టుముట్టి దాడి మొదలుపెట్టారు. ఇళ్ళ మట్టిగోడలను తూట్లు పొడిచారు. ఫోటోలను పగలగొట్టారు. మనుషులను గొడ్డళ్ళతో నరికి బరిసెలతో పొడిచి చంపారు. తేళ్ళయేసు, దుడ్డు వందనం అక్కడికక్కడే చనిపోయారు. దుడ్డు రమేశ్ 21 నాడు గుంటూరు ఆస్పత్రిలో చనిపోయాడు. దుడ్డు యేసును అతని గర్భవతి అయిన కోడలు కాపాడబోగా ఆమెను పక్కకుతోసి అతన్ని గొడ్డళ్ళతో నరికారు. అతను 22 నాడు గుంటూరు ఆస్పత్రిలో చనిపోయాడు.

ఇట్లా దాడి జరగగానే హరిజనులు భయభ్రాంతులయి పొలాలలోకి పారి పోయారు. 70 సంవత్సరాల తేళ్ళ మోషె, తేళ్ళ ముత్తయ్య ఆ విధంగా పారిపోగా హంతకులు వాళ్ళను పొలాలలోకి తరిమి మహాక్రూరంగా చంపారు. గొడ్డలితో తల నరికి, వెల్లకిలా పడిపోగా పొత్తికడుపులో బరిసెగుచ్చి తిప్పారు. ఈ విధంగా మొత్తం ఆరుగురు చనిపోగా మరొక 20 మందిదాకా గాయాలతో చీరాల, గుంటూరు ఆస్పత్రులలో చేరారు.

స్త్రీలను గూడా ఈ హంతకులు విడిచిపెట్టలేదు. వాళ్ళ బట్టలు చింపి వాళ్ళతో అసభ్యంగా ప్రవర్తించారు. ముగ్గురు అమ్మాయిలపైన (మరియమ్మ, విక్టోరియా, సులోచన) అత్యాచారం చేసి, పొత్తికడుపు కింద కర్రలతో పొడిచారు. వీళ్ళుకూడ ఆస్పత్రి పాలయ్యారు.

ఈ విధంగా ఒక గంటపైగా బీభత్సం చేశారు. ఈ బీభత్సం జరుగుతుండగానే పోలీసులు వచ్చారని, పోలీసుల సమక్షంలోనే కొందరిని హత్యచేశారని హరిజనులంటారు. నిజానికి గ్రామంలోని మాలవాడలో కొంతకాలం క్రితం జరిగిన ఘర్షణల కారణంగా ఒకరిద్దరు జవాన్లు అంతకుముందు నుంచి గ్రామంలోనే ఉన్నారు. అయితే వీళ్ళు ఈ మారణ కాండను ఆపడానికి ఎటువంటి ప్రయత్నం చేసినట్లు కనిపించదు. ఆనాడే కాదు జరిగిన వారం రోజుల దాకా జిల్లా పోలీసు యంత్రాంగం చాలా అలసత్వాన్ని ప్రదర్శించింది. శవాలకోసం వెతికే ప్రయత్నం చేయలేదు. (ఎందుకు చేయడం లేదంటే "శవాలు ఉంటే గద్దలూ రాబందులూ తిరుగుతుంటాయి. వెతకనక్కరలేదు" అని జిల్లా ఎస్.పి. గోఖలేగారు అంటారు.) హంతకులు గ్రామంలో ఉన్నారేమో చూడటానికి ఇళ్ళు సోదా చేయలేదు. రైల్వేస్టేషన్, బస్‌స్టాండ్ల దగ్గర కాపలా పెట్టలేదు. ఈ హత్యాకాండ కుట్ర పూరితంగా జరిగింది కాబట్టి కుట్ర కేసు (సెక్షన్ 170 I P C ) పెట్టవలసింది, పెట్టలేదు. చివరికి, సంఘటన జరిగి వారం గడిచాక, దేశవ్యాపితంగా గొడవ మొదలయ్యాక, హంతకులకోసం గాలింపు మొదలుపెట్టారు. ఇప్పటికి 65 మందిని అరెస్టు చేసినట్టు వినికిడి. కేసు ఎంత బాగా నడుపుతారో ఎంత న్యాయం జరుగుతుందో వేచి చూడవలసిందే.

*నిజనిర్ధారణ కమిటీ నివేదిక - ఎ.పి.సి.ఎల్.సి, ఆగస్టు 1985*

(1985 జూలై 17నాడు కారంచేడులో జరిగిన మారణకాండ దేశాన్నంతా కలచివేసింది. 38 సంవత్సరాల స్వాతంత్ర్యం తరువాత దేశంలో బలహీనవర్గాల పరిస్థితి ఏమిటన్న ప్రశ్న లేవదీసింది. ఈ హత్యాకాండను కొందరు కులం తగాదాగాను, కొందరు తెలుగుదేశం దుశ్చర్యగాను, మరికొందరు మరొక విధంగాను వ్యాఖ్యానిస్తున్నారు. ఇదేదో కాకతాళీయంగా జరిగిన సంఘటన, దీన్ని మరీ ఎక్కువ చేయక 'శాంతించాలని' ఇంకొందరి అభిప్రాయం.

ఇన్ని రకాల దురభిప్రాయాలుండబట్టే ఈ పుస్తకం అవసరమయ్యింది. కారంచేడు కాకతాళీయమయిన సంఘటనా కాదు, కులం తగాదానూ కాదు, కేవలం తెలుగుదేశానికి ప్రత్యేకమయిన దుశ్చర్యా కాదు. అది మన దేశ వర్తమాన రాజకీయార్థిక అభివృద్ధికి సహజ పరిణామం. ఈ పరిణామాన్ని కారంచేడులోనే కాదు, గుజరాత్ తదితర రాష్ట్రాలలో చెలరేగుతున్న రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనలలో కూడా చూడవచ్చు. ఈ విషయాన్ని, ఈ సంబంధాన్ని వివరించే ప్రయత్నమే ఈ చిన్న పుస్తకం.)



# కుల సమస్య - రాజకీయ దృక్పథం

కుల సమస్య ఇవాళ కొత్తగా వచ్చింది కాదు గానీ ఇవ్వాళ గతంలో కంటే ఎక్కువగా చర్చకు వస్తోంది. అది చర్చకు రావడానికి గల కారణం సమకాలీన చరిత్రే.

కారంచేడు నుండి వరుసగా జరుగుతున్న అత్యాచారాలు ఒక కఠినమయిన వాస్తవాన్ని మన ముందు చర్చకు పెట్టాయి. ఈ దాడులలో ముద్దాయిలు అగ్రకులాలకు చెందినవారే అయినా ఎక్కువమంది సామాన్య రైతాంగమే. వాళ్ళు ఆర్థికంగా తమతో ఎక్కువ తేడా లేనటువంటి హరిజన పేద రైతాంగం, కూలిజనాల పైన కులం పేరిట దాడులు చేస్తున్నారంటే కులం అనేది వర్గాన్ని రెండుగా చీల్చి శత్రుబృందాలుగా మార్చగలుగుతుందా అనే ప్రశ్న వస్తుంది.

ఈ అత్యాచారాలకు ప్రతిస్పందనగా వచ్చిన దళిత ఉద్యమం మరొక ప్రశ్నను ముందుకు తెచ్చింది. అగ్ర కులాలలో పుట్టిన ప్రజాస్వామిక వాదులమీద కక్ష గట్టినట్లు దాడులు చేసే తెలివి తక్కువతనాన్ని పక్కనపెడితే - సహేతుకమైన విమర్శకు తావు ఉందన్న సంగతి దళిత ఉద్యమం గుర్తుచేసింది. కులం అనేది ఒక ఉపరితల అంశమనీ, వర్గపోరాటం ఫలితంగా పునాదిని ముందు విప్లవీకరిస్తే ఆపైన ఉపరితలంలో అనివార్యంగా (లేక ప్రయత్నపూర్వకంగా జరిగే సాంస్కృతిక విప్లవ పోరాట ఫలితంగా) వచ్చే మార్పులలో భాగంగా కులం అనేది మాయమయి పోతుందనీ భావించడం ఎంతవరకు సమంజసం అనేది ఈ ప్రశ్న. దానికి అనుబంధంగా - విప్లవ ప్రజానీకం చొరవతోను, చైతన్యంతోను సంఘటితపడడంలో వెనుకబాటుతనాన్ని ప్రదర్శించడానికి, వర్గ సమాజంలో ఎప్పుడయినా ఉండే ఆర్థిక సాంస్కృతిక అవరోధాలతో బాటు 'కులం' కూడా ఒక కారణం అని గుర్తించి దానిని

ప్రతిఘటించనవసరం లేదా అనే ప్రశ్న కూడా వస్తుంది. సమస్య తన పరిష్కారానికి తానే అడ్డం అయినట్టు చొరవలోనూ, చైతన్యంలోనూ అసమతుల్యం ఉండడానికి కులం ఒక కారణం అయినపుడు, దాని ఫలితంగా ప్రజా ఉద్యమాల అగ్రశ్రేణులలో కులంరీత్యా ఆధిక్యస్థానంలో ఉన్నవాళ్ళే ఎక్కువ ఉండడం అనేది జరిగితే, అది కుల సమస్య పరిష్కారానికీ ఆపైన ప్రజా ఉద్యమ పురోగమనానికీ అవరోధం కాదా అనే ప్రశ్న సైతం వస్తుంది. దళితుల సమస్యలు దళితులే పరిష్కరించుకుంటారనీ, స్త్రీల సమస్యలు స్త్రీలే పరిష్కరించుకుంటారనీ, గిరిజనుల సమస్యలు గిరిజనులే పరిష్కరించుకుంటారనీ, ముస్లింల సమస్యలు ముస్లింలే పరిష్కరించుకుంటారనీ భావించడం ఎవరి సమస్యలూ పరిష్కారం కాకుండా ఉండడానికే ఉపయోగ పడుతుంది. (అందుకోసమే, కాంగ్రెస్ ప్రభుత్వం తయారుచేసి పార్లమెంటు ముందుంచిన పారిశ్రామిక వివాదాల సవరణ బిల్లులో, కార్మికుల సమస్యలు కార్మికులే పరిష్కరించుకోవాలి అనే వాదనతో యూనియన్లలో కార్మికేతరుల పాత్రను నిర్బంధంగా తగ్గించే ప్రయత్నం చేస్తున్నారు.) అయితే ఈ ఆలోచనల వెనక ఉన్న ఒక న్యాయమయిన ప్రశ్నను గుర్తించాలి. అణచివేతకు గురయ్యే ప్రజలు ప్రతిఘటనా చైతన్యాన్ని స్వంతం చేసుకోనిదే అంతిమంగా మార్పు రాదు. అది జరిగినప్పుడు, పీడిత ప్రజానీకం తమ సమస్యల పరిష్కారం కోసం ఐక్యంగా చేసే పోరాటానికి అన్ని వర్గాలనుండీ నాయకత్వం సమంగా పుట్టుకొస్తుంది. అది జరగకపోతే ఏదో లోపం ఉన్నట్టు గుర్తించడం అవసరం. ఉద్యమాల నాయకత్వం అట్టడుగు కులాలనుండీ, స్త్రీలనుండీ, మైనారిటీలనుండీ సమపాళ్ళలో సహజంగానే పుట్టుకు రాకపోవడం ఒక లోపాన్ని సూచిస్తుందన్న వాదనను కొట్టి పారేయడానికి వీలులేదు.

గతంలో కులం ప్రస్తావన తీసుకురావడానికి వెనుకాడే పాలక వర్గాలు ఇప్పుడు తమ కొట్లాటలలో కులం ప్రసక్తి బాహాటంగా తీసుకురావడం ఎందుకు జరుగుతోంది అనేది మరొక చర్చనీయాంశం. 'తెలుగుదేశం కమ్మకులం పార్టీ' అని కాంగ్రెస్ వాళ్ళూ, 'కాంగ్రెస్ రెడ్డి, బ్రాహ్మణ పార్టీ' అని తెలుగుదేశం వాళ్ళూ ఉపన్యాసాలలోనే కాక హైకోర్టు సమక్షంలో చేసే వాదనలలోనూ పరస్పరం ఆరోపించుకోవడం మొత్తం పాలక వర్గాల శ్రేయస్సుకే నష్టదాయకం కాదా? మరయితే ఈ పని వాళ్ళు ఎందుకు చేస్తున్నారు? కులం శ్రామిక వర్గాన్ని రెండు శత్రుబృందాలుగా చీల్చగలదా అని ప్రశ్నించుకున్నట్టే అది పాలక వర్గాలను కూడ చీల్చగలదా అని ప్రశ్నించుకోవలసి వస్తుంది.

ఈ ప్రశ్నలను ఇవాళ తప్పనిసరిగా చర్చించుకోవాలి. కఠినమయిన సమస్యలు ఎదురైనప్పుడు చర్చించకుండ ఊరుకోవడం ఒక పొరపాటయితే, ఉదారవాద దృక్పథంతో చర్చించి మార్క్సిస్టు ముక్తాయింపును జోడించడం తరచుగా జరిగే

మరొక పొరపాటు. ఈ రెండు పద్ధతులలో కాకుండ 'కుల సమస్య'ను మార్క్సిస్టు దృక్పథంతో చర్చించడం అవసరం. అన్ని కోణాలనుండి పరిశీలించి సమగ్రంగా సమాధానం చెప్పడం ఒక్క వ్యాసంలో సాధ్యం కాదుగానీ ముఖ్యమైన విషయాలను పరిశీలిద్దాం.

## నేపథ్యం

మొదటిగా, కులం కేవలం ఒక ఉపరితల అంశం అనేది ఈనాడే కాదు ఏనాడూ నిజం కాదు. కులం పునాదికీ ఉపరితలానికీ కూడ సంబంధించిన విషయం. Caste is a material relation of production as well as an Ideology. అదే దాని బలం.

కులానికి గల సామాజిక పాత్రలో మూడు అంశాలున్నాయి.

(1) ఒక స్వతంత్రమైన ఆర్థిక జీవన విధానాన్ని అనుసరిస్తూ విడిగా బ్రతుకుతున్న తెగలను నాగరిక సమాజంలో కలుపుకుని పాలక వర్గాల దోపిడీకి లోబరుచుకొనడానికి కులం ఒక నిర్మాణ రూపంగా ఉపయోగపడింది. ఆ క్రమంలో ఒక వైపు పరసంపర్క నిషేధం వంటి గణ జీవిత లక్షణాలు కులాలకు సంక్రమించగా, మరోవైపు గణజీవితంలో లేని దోపిడీ అసమానతలు కొత్తగా వచ్చి చేరాయి. ఇప్పుడిప్పుడే తెగనుండి కులంగా మారుతూన్న ప్రజలను చూస్తే ఈ విషయం బాగా అర్థం అవుతుంది. (ఉదాహరణకు తూర్పు గోదావరి జిల్లా నుండి శ్రీకాకుళం దాకా తీరప్రాంతంలో అగ్నికులక్షత్రియులు అనే కులం తటస్థ పడుతుంది. కోనసీమలో వీళ్లు చాలా చోట్ల ప్రత్యేక గ్రామాలలో ఉంటూ చేపలు పట్టుకునే తెగగా జీవిస్తున్నారు. అయితే శ్రీకాకుళంలో మట్టుకు గ్రామాలలో స్థిరపడి చిన్న రైతులుగా బ్రతుకు తున్నారు. తెగ లక్షణాలు పూర్తిగా పోకపోయినా కులవ్యవస్థలో శ్రామికులకు సహజమైన ఆత్మన్యూనతా భావం మొదలయిన లక్షణాలు అలవరచుకున్నారు.)

(2) ఒక కులంలో పుట్టిన వారికి ఆ కుల వృత్తికి సంబంధించిన సామర్థ్యమే తప్ప వేరే నైపుణ్యంగానీ పనిముట్లుగానీ ఉత్పత్తి సాధనాలుగానీ విజ్ఞానంగానీ లేకుండా చేయడం ద్వారా, నాగరిక సమాజానికి అవసరమయిన విభిన్న ఉత్పత్తులను సరఫరా చేసే శ్రామిక జనాన్ని కులవ్యవస్థ తయారుచేసింది. ముఖ్యంగా అంటరానితనం అనేది కారుచవగ్గా పనిచేసే భూమిలేని కూలి జనాన్నీ, భృత్యులనూ సమకూర్చింది. బానిస వ్యవస్థలోలాగా ప్రత్యక్ష బలప్రయోగాన్ని ప్రధాన నిర్బంధ సాధనంగా వినియోగించకుండ, సామాజిక నిర్మాణం ద్వారానే కావలసిన ఫలితాన్ని సాధించింది కుల వ్యవస్థ. ఈ నిర్మాణాన్ని నిలబెట్టడం అధికార యంత్రాంగం బాధ్యత. దీనిని సమర్థవంతంగా నిలబెట్టినవాడు 'ధర్మ ప్రభువు'.

(3) సామాజిక నిర్మాణంలో ఉన్న ఈ నిర్బంధానికి తాత్విక, సాంస్కృతిక ఆమోదం కల్పించే చైతన్య రూపం కుల వ్యవస్థలోని మూడవ అంశం. భౌతిక శ్రమ అన్ని రకాల శ్రమలలోనికి నీచమయినదనీ, అందులోనూ కొన్ని రకాల శ్రమ మరీ నీచమయినదనీ కులవ్యవస్థ బోధిస్తుంది. మనుషులు పుట్టడమే తమ పూర్వ కర్మలకు ఉచితమయిన కులాలల్లో పుడతారనీ, తదనుగుణ్యమయిన జీవితాన్ని ఆచరించడమే సన్మార్గమనీ ధర్మవర్తనమనీ అంటుంది. గుణకర్మలను అనుసరించి తానే మనుషులను కులాలుగా విభజించాననీ, పరధర్మం ఎంత ఆకర్షణీయంగా అనిపించినా స్వధర్మాన్ని వదిలిపెట్టి దానిని ఆచరించడం ప్రమాదకరమనీ నారాయణుడు భగవద్గీతలో స్వయంగా అంటాడు. అష్టాదశ పురాణాలనుండి వేలాదిగా ఈ దేశంలో ప్రచారమయిన పుక్కిటి పురాణాల దాకా అన్నీ ఈ సందేశాన్నే చెప్తాయి. వీటిని ప్రచారంలో పెట్టడం బ్రాహ్మణుల కర్తవ్యం.

భారతీయ ఫ్యూడలిజంలో ఈ విధంగా కీలకమయిన పాత్రను నిర్వహించిన కులవ్యవస్థ ఆ రోజులలోనే అనేక ఒత్తిడులను ఎదుర్కొనింది. ఆర్థిక రంగంలో వచ్చిన మార్పుల ఫలితంగా కొత్త వృత్తులు పుట్టుకొచ్చాయి. పాత వృత్తులకు కొత్త ప్రాముఖ్యం వచ్చింది. సాంకేతిక పురోగతి వల్ల కొన్ని కులాలు ఆర్థికంగా బలపడ్డాయి. కొందరు వ్యక్తులు వ్యక్తిగతంగా కులవ్యవస్థను ఛేదించుకుని ఉన్నత పదవులను అందుకున్నారు. అయితే ఇవేవీ కులవ్యవస్థను మౌలికంగా మార్చలేదు. కుల వ్యతిరేక ఉద్యమాలు కూడా చాలా జరిగాయి గానీ అవి కూడ కులవ్యవస్థను నాశనం చేయలేక పోయాయి. అతికొద్ది మినహాయింపులతో, ఈ ఉద్యమాలలో ఏవీ కూడా కుల వ్యవస్థకూ బ్రాహ్మణ భావజాలానికీ కీలకమైన ధర్మం, ఆత్మ, మోక్షం అనే భావనలనూ కర్మ సిద్ధాంతాన్నీ తిరస్కరించలేదు. కులవివక్షనూ బ్రాహ్మణ ఆధిక్యాన్నీ మట్టుకే తిరస్కరించాయి. వాటిలో కొన్ని ఉద్యమాలు తామూ ఒక కులం రూపం తీసుకుని కులవ్యవస్థలో కలిసిపోయాయి. కొన్ని అల్ప సంఖ్యాక మతాలుగా స్థిరపడిపోయి కులవ్యవస్థలోని అనేక అవలక్షణాలను తామూ ఒంటబట్టించుకున్నాయి. కొన్ని కేవలం పాఠ్య పుస్తకాలలో పాఠ్యాంశాలుగానూ, మన చరిత్రలోనూ అభ్యుదయం లేకపోలేదని గొప్పలు చెప్పుకోవడానికి దృష్టాంతాలుగానూ మిగిలిపోయాయి. కొన్ని పూర్తిగా నామరూపాలు లేకుండా పోయాయి.

'పెట్టుబడి' కూడ కులవ్యవస్థను దెబ్బతీయగలదు. పెట్టుబడి అంటే డబ్బు కాదు. పెట్టుబడి అనేది ఒక సామాజిక సంబంధం, ఒక వ్యవస్థ. ఉత్పత్తి సాధనాలను, పనిముట్లను కోల్పోయి 'బజారునపడ్డ' శ్రామికుల శ్రమ శక్తిని స్వేచ్ఛా వినిమయంలో కొనుగోలుచేసి లాభార్జన దృష్టితో అమ్మకపు సరుకులను ఉత్పత్తిచేసి తనను తాను

పునర్వ్యాప్తి చేసుకుంటుంది పెట్టుబడి. ఆ క్రమంలో ఉత్పత్తి సాధనాలు, శ్రామికుల నైపుణ్యము, విజ్ఞానస్థాయి సాంకేతికంగా పురోగమనం చెందుతాయి. దీనికి అడ్డం వచ్చే ఫ్యూడల్ నిర్బంధాలనుండి ఇటు వనరులనూ అటు శ్రమశక్తినీ కూడా పెట్టుబడి విముక్తి చేస్తుంది. అందుకోసం తలపడవలసిన ఉపరితల అంశాలతో తలపడుతుంది. మన దేశంలో పెట్టుబడి అనేది అభివృద్ధి చెందివుంటే శ్రామికులను కులవ్యవస్థ నుండి విముక్తిచేసి కార్మికులుగా మార్చి ఉండేది.

బ్రిటిష్‌వాళ్ళు రాకపోతే మన దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థ స్వతంత్రంగా అభివృద్ధి చెంది ఉండేదా అనేది తెగని చర్చ. మొఘల్ పాలన కాలంలోనే పెట్టుబడి దారీ సంబంధాలు బలంగా వేళ్లూని విస్తరించాయని మొదట్లో సోవియట్ పరిశీలకులు సిద్ధాంతీకరించారు. అది నిజం కాదనీ, ఒక సిద్ధాంత చట్రాన్ని వాస్తవాల మీద బలవంతంగా రుద్దిన ఫలితంగా చేసిన నిర్ధారణేనని ఇర్ఫాన్ హబీబ్ వంటి భారతీయ చరిత్రకారులు వాదించగా వాళ్ళు కూడా ఈ మధ్య తమ అభిప్రాయాలను కొంత సవరించుకున్నట్టు ఉన్నారు. అదెలాగున్నా బ్రిటిష్ వాళ్ళ రాకతో మొదట వర్తక పెట్టుబడి రూపంలోనూ, తర్వాత సామ్రాజ్యవాద వర్తక పెట్టుబడి రూపంలోనూ పెట్టుబడి మన దేశంలోనికి బయటినుండి ప్రవేశించింది. ఇది కులవ్యవస్థనూ స్వయం పోషక గ్రామీణ వ్యవస్థనూ కొంతమేరకు దెబ్బతీసింది. అయితే సంపూర్ణంగా దెబ్బతీసే అవసరంగానీ సామర్థ్యం గానీ సామ్రాజ్యవాద పెట్టుబడికి లేవని త్వరలోనే స్పష్టం అయింది.

ఫ్యూడల్ దశలో కులవ్యవస్థకు ఉన్నట్టు చెప్పుకున్న పై మూడు లక్షణాలలో మొదటిది ఎట్లాగూ (పెట్టుబడి ప్రమేయం లేకుండానే) చారిత్రకంగా అప్రధానం అయిపోయింది. రెండవ విషయంలో సుమారుగా మార్పు వచ్చింది. పెట్టుబడి సాంద్రతనూ సాంకేతిక పురోగతినీ ప్రమాణంగా తీసుకొని ఆర్థిక రంగాన్ని సంఘటిత (Organised), అసంఘటిత (Un-organised) రంగాలుగా విభజిస్తే, ఉత్పత్తి సంబంధాలలో కులానికి చెందిన పాత్ర సంఘటిత ఆర్థిక రంగంలో చాలావరకు నశించింది.

అసంఘటిత ఆర్థిక రంగంలో మట్టుకు ఇప్పటికీ ఉత్పత్తి సాధనాలకూ పనిముట్లకూ నైపుణ్యానికీ అటు మనుషులకూ మధ్యనున్న సంబంధాన్ని నిర్ణయించడంలో కులం ప్రధాన పాత్ర కాకున్నా కీలకమయిన పాత్ర నిర్వహిస్తోంది. చాకలి, మంగలి, కుమ్మరి, బెస్త, మేదరి, గొల్ల తదితర కులాలలో పుట్టినవారికి ఇప్పటికీ వేరే వృత్తులకు సంబంధించిన నైపుణ్యంగానీ పనిముట్లుగానీ అందుబాట్లో లేవు. కాపు అనే పేరుతో పిలవబడే అనేక కులాలలో అత్యధిక భాగానికి సన్నకారు

సేద్యమూ, హరిజనులకు అసంఘటిత శ్రామిక రంగమూ తప్ప వేరే జీవనమార్గాలు అందుబాట్లో లేవు.

కాగా, సంఘటిత ఆర్థిక రంగంలో సైతం అసలు కుల ప్రమేయమే లేదనుకోవడం సరయింది కాదు. నిజానికి ఆ రంగంలోనే కుల ప్రమేయం కొత్త రూపాలలో - మరింత వికృత రూపాలలో - కనబడుతున్నది. సంఘటిత రంగంలో అగ్రకులాల సాంద్రత మొత్తం సమాజంలో కంటే బాగా ఎక్కువగా ఉంటుంది. నిమ్న కులాలవాళ్ళు బాగా తక్కువగా కనపడతారు. సంఘటిత రంగంలో ముఖ్యభాగమయిన ప్రభుత్వ ఉద్యోగ రంగంలో రిజర్వేషన్లు లేకపోతే ఆ మాత్రం కూడ ఉండకపోదురేమో! మరింత ఎక్కువగా వాళ్ళు ప్రవేశించాలని ప్రయత్నం చేసినప్పుడల్లా రిజర్వేషన్ వ్యతిరేక ఉద్యమాల దుమారం చెలరేగుతుంది. కులం సంఘటిత రంగంలో తన సాంప్రదాయిక పాత్రను కోల్పోయినప్పటికీ పెట్టుబడికీ ఉద్యోగాలకూ సంబంధించిన పోటీలో మాత్రం ఒక సాధనంగా ఉపయోగపడుతూనే ఉంది. రుణాలూ లైసెన్సులూ కాంట్రాక్టులూ సంపాదించడంలోనూ, ఉద్యోగాల పోటీలోనూ కులం నిర్వహిస్తున్న పాత్ర మనకు నిత్యజీవిత అనుభవమే. ఈ పోటీని బూర్జువా భావజాలం గొప్పగా ఆకాశానికి ఎత్తుతుందిగానీ ఇందులో అభద్రత ఒక ముఖ్యమయిన అంశం. పెట్టుబడి ఎక్కడుంటే అక్కడ అభద్రత ఉంటుంది. అందులోనూ పెట్టుబడి (మన దేశంలోలాగ) అస్వతంత్రం అయితే మరీ ఎక్కువగా ఉంటుంది. అందువల్ల కులం కల్పించే కృత్రిమమయిన భద్రత కోసం జనం కులతత్వాన్ని ఆశ్రయించటం సంఘటిత ఆర్థిక రంగంలోనే ఎక్కువగా కనిపిస్తుంది. ఈ కారణంగానే వెనుకబడిన ప్రాంతాల కంటే 'అభివృద్ధి చెందిన' ప్రాంతాలలోనే కులతత్వం ఎక్కువ ఉందనిపిస్తుంది.

ఇక మూడవ విషయానికొస్తే మనుషులు తమ 'గుణకర్మలను' బట్టి స్వాభావికంగానే అసమానంగా ఉంటారన్న భగవద్గీత ప్రవచనం భారతీయ భావజాలంలో ఈనాటికీ చాలా బలంగా ఉంది. అనేక ప్రజాతంత్ర ఉద్యమాలను చూసిన ఈ దేశంలో కర్మ సిద్ధాంతాన్నీ కుల ధర్మాన్నీ బాహాటంగా ప్రచారం చేయడం పాలకవర్గాలకు సాధ్యం కాదుగానీ అణువణువునా ఈ రెండింటినీ జీర్ణించుకున్న బ్రాహ్మణ భావజాలం భారత పాలకవర్గాల భావజాలంలో అతి ముఖ్యమయిన అంశం. అందులో అంతర్లీనంగానే ఉంటూ ఇవి రెండూ వ్యాప్తి చెందుతూ ఉంటాయి. ఈ విషయంలో మనకేమయినా అనుమానం ఉంటే టీవీ ప్రసారాలను దేశం నలుమూలలకూ వ్యాపింపజేసి క్రమం తప్పకుండా చూపిస్తున్న రామాయణ మహాభారతాలలో ప్రసారం అవుతున్న కథలను కాక అందులోని సందేశాన్ని జాగ్రత్తగా

పరిశీలిస్తే అనుమానం తీరుతుంది. అంత కష్టపడనక్కరలేదు. ఏ టీ బంకు దగ్గరయినా నిలబడి ఘంటసాల భగవద్గీత క్యాసెట్ విన్నా ఈ విషయం అర్థమవుతుంది.

## రాజకీయాలు - కులం

వలస దేశాలలో ప్రజాతంత్ర విప్లవం అంటే భూస్వామ్య సామ్రాజ్యవాద వ్యతిరేక విప్లవం. మన జాతీయోద్యమం కాంగ్రెస్ పార్టీ నాయకత్వంలోకి పోవడం వలన ఈ విప్లవ కర్తవ్యం సంపూర్ణం కాలేదు. కులం అనే సామాజిక అంశానికి సంబంధించి ఈ అసంపూర్తి ఎటువంటిదో పైన వివరించాము. కుల నిర్మూలన ప్రజాతంత్ర విప్లవాన్ని ముందుకు తీసుకుపోతున్న విప్లవశక్తుల కర్తవ్యం. అయితే దాని అర్థం ప్రజాతంత్ర విప్లవశక్తులు కుల నిర్మూలన పోరాటాన్ని చేపట్టాలని కాదు. కుల నిర్మూలన ఉద్యమాలతో కులం పోదు. కులం అనేది పోనిదే ఈ దేశంలో ప్రజాస్వామ్యంగానీ సోషలిజంగానీ సాధ్యం కావన్న అంబేద్కర్ అభిప్రాయంతో విభేదం లేదు. ఐతే ప్రజాసామ్యమయినా సోషలిజమయినా రావాలంటే ముందు కుల వ్యతిరేక ఉద్యమాలు నడపాలని దానినుండి అర్థం చేసుకుంటే పొరపాటవుతుంది. కులసమస్య విప్లవం తరువాత పరిష్కారమవుతుందని వదిలేయడం ఎంత తప్పో ఇదీ అంతే తప్పు.

ప్రజాతంత్ర విప్లవ పోరాటంలో అంతర్భాగంగా కుల సమస్యతో తలపడడం సరయిన వైఖరి. కులసమస్యను విడిగా విశ్లేషించి దానితో విడిగా తలపడటం వలన ప్రయోజనం లేదు. దానిని వ్యవసాయక విప్లవ పోరాటంలో అంతర్భాగంగా విశ్లేషించి ఆ పోరాటంలో అంతర్భాగంగా తలపడాలి. ఈ దృష్టితో విశ్లేషించినప్పుడు ప్రస్తుత దేశ రాజకీయాలలో కులం పాత్ర మూడు రకాలుగా కనబడుతుంది.

1. పాలక వర్గాల అంతఃకలహాలలో కులం.
2. పాలక వర్గాలకూ ప్రజలకూ మధ్యనున్న వైరుధ్యంలో కులం.
3. ప్రజల మధ్య సంబంధాలలో కులం.

వీటిని విడివిడిగా చర్చిద్దాం.

1. గత దశాబ్ద కాలంలో మన దేశ పాలక వర్గాలలో అనైక్యత చాలా పెరిగింది. తన నూరేళ్ళ చరిత్రలో కాంగ్రెస్ పార్టీ సాధించిన ప్రధానమయిన విజయం దేశ పాలక వర్గాలను ఐక్యంగా ఉంచడం. భూస్వాములు, వ్యాపారస్తులు, పెద్ద పెట్టుబడిదార్లు, వివిధ సామ్రాజ్యవాద దేశాల కంపెనీలు - అందరినీ అన్నింటినీ ఒక తాటిమీద నడిపి, అందరి అవసరాలూ తీరేటట్లు ఆర్థిక వ్యూహాన్ని కాంగ్రెసు

నాయకత్వం రచించింది. ఇప్పుడు కాంగ్రెసు పార్టీ పతనంగా మనకు కనబడుతున్న రాజకీయ పరిణామం వెనుకనున్నది బీటలువారుతున్న ఆ ఐక్యతే. జాతీయ ఉద్యమకాలంలో గాంధీ నాయకత్వంలోనూ ఆ తరువాత నెహ్రూ నాయకత్వంలోనూ ఈ ఐక్యతను నిలబెట్టడానికి రచించిన రాజకీయార్థిక వ్యూహానికి కాలం చెల్లిపోయింది. అది ఎందుకు జరిగిందని చర్చించడం ఇక్కడ సాధ్యపడదుగానీ, ఇక మీదట ఐక్యత అంటూ సాధ్యం కావాలంటే అది కొత్త ప్రాతిపదిక మీదనే జరగగలదు. ఆ కొత్త ప్రాతిపదిక కోసం, దానిని సాధించగల నాయకుని కోసం ఇవ్వాళ పాలకవర్గాలు అన్వేషిస్తున్నారు. రాజీవ్ గాంధీ మీద చాలామందికి నమ్మకం పోయిందిగానీ అందరికీ సమ్మతమైన ప్రత్యామ్నాయం ఎవ్వరికీ కనపడడం లేదు. ఈ లోపల పాలకవర్గాలలోని వివిధ సెక్షన్లు తమ ఉమ్మడి ప్రయోజనాలను విస్మరించి ఎవరికి తోచిన దిక్కుకు వారు బండిని లాగుతున్నారు. దానితోపాటు అసలు సమస్య సత్వరంగా పరిష్కారం అవుతుందన్న నమ్మకం కూడా పోయేసరికి ఎవరికివారు తామూ తమవారూ ఎంత వేగంగా ఎంత ఆస్తి సంపాదించుకోగలిగితే అంత సంపాదించుకుని బయట పడాలని చూస్తున్నారు. ఈ పరిస్థితిలో అనేక విషయాలను చర్చకు పెడుతున్నారు. అనేక తొందరపాటు చర్యలకు పాల్పడుతున్నారు. కేంద్ర - రాష్ట్ర సంబంధాలు, రాష్ట్రాల స్వయం ప్రతిపత్తి, అధికార వికేంద్రీకరణ, ప్రణాళికల వైఫల్యం చర్చకు వస్తున్నాయి. నిన్నటిదాకా జాతికి గర్వకారణం అని అందరూ పొగిడిన ఆర్థిక పారిశ్రామిక విజయాలను ఇవ్వాళ తామే వేళాకోళం చేస్తున్నారు. ప్రాంతీయతత్వాన్ని రెచ్చగొడు తున్నారు. ఒకరి కుంభకోణాలు ఒకరు బయట పెట్టుకుంటున్నారు. కులం పేరు పెట్టి తిట్టుకుంటున్నారు. దీర్ఘకాలిక దృష్టిలో ఇవి తొందరపాటు చర్యలే. అయితే వాళ్ళు ప్రస్తుతం దీర్ఘకాలిక దృష్టితో చూడడం లేదు.

కులం పేరుమీద తిట్టుకోవటానికి ఒక హేతుబద్ధమయిన కారణం కూడా ఉంది. పాలకవర్గాల అంతర్గత కలహాలలో ఎవరికివారు జనాన్ని తమ వెంట సమీకరించుకోవాలని చూడడం సహజం. అది ఎన్నికలకు ఎంత అవసరమో గూండా దాడులకూ అంతే అవసరం. ఈ జన సమీకరణకు కులం చాలా చవకయిన సాధనం. అగ్రకులాలలో పాలకవర్గాలకు చెందినవారు అల్ప సంఖ్యాకులే అయినా కులాభిమానం జన సామాన్యంలో విస్తృతంగా ఉంటుంది కాబట్టి 'తెలుగుదేశం పాలనలో రెడ్లకు అన్యాయం జరుగుతోంది' అనే ఆరోపణ ధనవంతులైన పెద్ద రెడ్ల వెనుక ఆ కులానికి చెందిన సామాన్య రైతాంగాన్ని సమీకరించడానికి చక్కగా ఉపయోగపడుతుంది. అదే విధంగా తెలుగుదేశం పార్టీ ఆవిర్భావానికి కృషి చేసినవారు 'కాంగ్రెస్ పాలనలో కమ్మకులానికి సరైన ప్రాతినిధ్యం ఇవ్వలేదు' అనే వాదనతో ఆ కులానికి చెందిన సామాన్యజనాన్ని తమ వెంట చాలా చాకచక్యంగా సమీకరించు తున్నారు. దేవినేని మురళి హత్యకేసులో జైలుకు పోయిన తరువాతే వంగవీటి

మోహన రంగారావు కాపు నాయకుడయ్యాడు. తెలుగుదేశం నాయకత్వంతో బెడిసిన తరువాతే ముద్రగడ పద్మనాభం కాపు నాయకుడయ్యాడు. 'కాపునాడు' వీళ్ళిద్దరికి రాజకీయ భద్రత సమకూర్చడం కోసం పుట్టింది. ఇది అగ్రవర్ణాలకే పరిమితం కాదు. కె.ఇ.కృష్ణమూర్తి కూడ ఎన్టీఆర్‌తో తగవుపడిన తరువాతే వెనుకబడ్డ వర్గాల నాయకుడయ్యాడు. అంతవరకు ఆయన కర్నూలు జిల్లాలో హత్యలకు పేరుపడినంతగా వేరే దేనికీ పేరు పడలేదు.

'కుల ప్రయోజనం' అనేది ఒకటి ఉందనే భ్రమ సామాన్యజనంలో ఉండబట్టే ఇది సాధ్యం అయింది. అగ్రకులాలకు చెందిన కొందరు వ్యక్తులు పదవులో ప్రాముఖ్యతో సంపాదించుకుంటే అది తమకే వచ్చినట్టు ఆ కులాలకు చెందిన సామాన్య జనం సంబరపడే పరిస్థితి, వాళ్ళతో 'ఐడెంటిఫై' అయ్యే పరిస్థితి ఇవ్వాళ ఉంది. అది ఉన్నంత కాలమే పాలకవర్గాల రాజకీయాలు కులంపేరిట మాట్లాడ గలవు. ఈ తప్పుడు చైతన్యం పోరాటక్రమంలో దానంతట అదే పోదు. అందుకు విరుద్ధంగా, అది పోరాట క్రమానికి అవరోధం కూడా కాగలదు. పోరాటక్రమంలో దానిని ముఖాముఖి ఎదుర్కొని పోగొట్టాలి. కులాన్ని గురించి మాట్లాడడానికి బిడియపడడం మానేయకపోతే ఇది సాధ్యం కాదు. ఈ విషయం ఇంకొంచెం వివరంగా కింద చూద్దాం.

2. ఏ వ్యవస్థాగతమయిన సంక్షోభం పాలకవర్గాల ఐక్యతను నాశనం చేసిందో అదే సంక్షోభం వ్యవస్థలోని కనీస ప్రజాస్వామిక లక్షణాలను కూడా ధ్వంసం చేసింది. అణచివేతనూ వర్గ సంఘర్షణనూ పెంచింది. ఈ అణచివేతకు కులం ఒక సాధనంగా ఉపయోగపడుతోంది.

సాంస్కృతికమైన అణచివేత కోసం బ్రాహ్మణ భావజాలాన్ని బాగా వ్యాపింప జేస్తున్నారు. గతంలో ఎన్నడూ లేనంత బాహాటంగా ఇది జరుగుతోంది. అన్యాయాన్ని అసమానతనూ ఆమోదింపజేసే కులధర్మం ఈ బ్రాహ్మణ భావజాలంలో అంతర్లీనంగా ఉండి పునర్వ్యాప్తి చెందుతూ ఉంది. కులం ప్రస్తావన వచ్చినప్పుడల్లా దానిని వ్యతిరేకించినట్టు కనిపిస్తూ బ్రాహ్మణ భావజాలంలో భాగంగా దానిని వ్యాపింప జేయడం మన దేశ పాలకవర్గాలు బాగా అభ్యసించిన విద్య.

ఈ ఆధ్యాత్మిక దాడులతోపాటు భౌతికదాడులకు కూడ కులం ఒక సాధనంగా ఉపయోగపడుతూ ఉంది. గ్రామీణ భూస్వామ్య పెత్తందారీ వర్గం మన దేశ పాలక వర్గాలలో ఒక ప్రధానమైన వర్గం. గత నలభైఏళ్ళ 'అభివృద్ధి' వల్ల ఈ వర్గం బాగా ప్రయోజనం పొందింది. కొందరు 'హరిత విప్లవం' వల్ల బాగుపడితే, కొందరు కాంట్రాక్టులు, సినిమాలు, సారాయి వ్యాపారంవల్ల బాగుపడ్డారు. గ్రామీణ బ్యాంకులు, పంచాయితీలు, సహకార రంగం అందరికీ ఉపయోగపడ్డాయి. ఈ

వర్గం ఒకవైపు గుత్త పెట్టుబడిదారీ వర్గంతో దేశవ్యాపితంగా తలపడుతూ మరొకవైపు గ్రామీణ రాజకీయార్థిక వ్యవస్థపైన తన ఆధిపత్యాన్ని నెలకొల్పాలని ప్రయత్నం చేస్తోంది. ఇందులో భాగంగానే గ్రామీణపేదలమీద దాడులు జరుగుతున్నాయి. పేదలు సంఘటితంగా ఉన్నచోట వాళ్లకు 'తీవ్రవాదులు' అన్న ముద్రవేసి పోలీసు యంత్రాంగం సహాయంతో అణచివేత ప్రయోగిస్తే, వాళ్ళు అసంఘటితంగా ఉన్నచోట కులం పేరుమీద సామాన్య రైతాంగాన్ని రెచ్చగొట్టి పేదలపైన దాడులు చేయిస్తున్నారు. కారంచేడు నుండి పిప్పరదాకా గత నాలుగేళ్ళలో జరిగిన హత్యాకాండలను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ వాస్తవం అర్థమవుతుంది. దాడిచేసేవారు ఎక్కువగా సామాన్య రైతాంగ యువకులు. వారి వెనుక ఆ గ్రామానికి చెందిన భూస్వామ్య పెత్తందారీ వర్గం ఉంటుంది. మళ్ళీ వారి వెనుక రాష్ట్ర రాజకీయాలలో ప్రముఖ స్థానంలో ఉన్న వ్యక్తులో, గ్రూపులో ఉంటారు. గత అయిదు సంవత్సరాలుగా వేరే ఏ జిల్లాలోనూ జరగనంతగా చిత్తూరుజిల్లాలో దళితుల పైన అత్యాచారాలు జరగడానికి, ఆ జిల్లాకి చెందిన చంద్రబాబునాయుడు, ముద్దుకృష్ణమనాయుడు రాష్ట్ర రాజకీయాలలో ప్రముఖస్థానంలో ఉండడానికి సన్నిహిత సంబంధం ఉందని మనం ఊహించనవసరం లేదు, అక్కడి జనమే చెప్తారు. 'మనవాడు' ముఖ్యమంత్రికి అల్లుడయితే మనకంతా ఏదో ఒరిగిందనే కులాభిమాన భ్రమ జనంలో ఉండబట్టే ఇది సాధ్యం అయింది.

ఈ భ్రమను నేరుగా ఎదుర్కొనటం అవసరం. కులాభిమానం ప్రస్తావన తెస్తే మధ్యతరగతి రైతులు ఉద్యమానికి దూరం అవుతారన్న జంకుతో ఊరుకుంటే అది అంతిమంగా పెత్తందార్లకే ఉపయోగపడుతుంది. చాలా రాజకీయ చైతన్యం ఉందనుకునే గ్రామాలలో సహితం జనం అకస్మాత్తుగా కులతత్వాన్ని ప్రదర్శించడం మొదలుపెడతారు. అయితే ఈ 'నేరుగా ఎదుర్కొనడం' అనేది కులవ్యతిరేక ఉద్యమాల రూపంలో కాదు. అవి దళితులకు తప్ప వేరే ఎవ్వరికీ రుచించవు. ఏ పెత్తందారీ వర్గమయితే కులాన్ని ఉపయోగించుకుని సామాన్య రైతాంగాన్ని కూలినాలి జనానికి వ్యతిరేకంగా రెచ్చగొడుతుందో ఆ పెత్తందారీ వర్గానికి వ్యతిరేకంగా అదే రైతాంగాన్నీ కూలిజనాన్నీ ఐక్యంగా సంఘటిత పరచిననాడే ఆ వాస్తవం బహిర్గతం అవుతుంది. పెత్తందార్లు గ్రామాలలో భూమిమీద, రాజకీయాలమీద, రుణ సంస్థల మీద, మార్కెటింగ్ వ్యవస్థమీద తమకున్న పెత్తనంతో కూలిజనాన్నేకాక సామాన్య రైతాంగాన్ని కూడ అణచివేస్తూ ఉంటారు. వాళ్ళ నోళ్ళు నొక్కడానికి ఇతర ఆయుధాలతో పాటు 'మనవాళ్ళు' అనే కులాభిమానాన్ని కూడ వాడుకుంటూ ఉంటారు. ఆ పెత్తనానికి వ్యతిరేకంగా ఉద్యమం నిర్మించినప్పుడు ఆ కులాభిమానం

వర్గ స్వభావమేమిటో అర్థం అవుతుంది. ఆ నిర్దిష్ట నేపథ్యంలో కులతత్వానికి వ్యతిరేకంగా కృషిచేయటం సాధ్యం అవుతుంది. కులతత్వం వర్గ పోరాటానికి ఎక్కడ ప్రతిబంధకం అవుతుందో అక్కడే దానితో తలపడడం సరయిన పద్ధతి.

కోస్తా ఆంధ్రవంటి 'అభివృద్ధి చెందిన' ప్రాంతాలలో దోపిడీ వర్గాలు అనుసరించే పద్ధతులు చాలా సున్నితంగా ఉంటాయి కాబట్టి వాళ్ళకి వ్యతిరేకంగా గ్రామీణ జనాన్ని ఐక్యం చేయడం చెప్పినంత సులభం కాదు. రైతాంగం ప్రభుత్వం మీదా పెట్టుబడిమీదా ఆధారపడడం అనేది పెరిగేకొద్దీ ఆ పోటీలోనూ సంక్షోభంలోనూ తమ కులానికి చెందిన పెత్తందార్లనూ, కులం కల్పించే భద్రతనూ ఆశ్రయించవలసిన అవసరమూ పెరుగుతుంది. ఆ అవసరాన్ని పెత్తందార్లు తమ ప్రయోజనాలకోసం ఉపయోగించుకుంటారు.

3. ప్రజలు ఒక శ్రామికవర్గంగా సంఘటితపడాలంటే తమను తాము ఒక వర్గంగా భావించుకోవడం మొదలవ్వాలి. అంటే Class-for-themselves కావాలి. దీనికి కులచైతన్యం అడ్డువస్తుంది. అంతదూరం పోనక్కరలేదు. సాధారణ మానవ స్పందనకు కూడా కులచైతన్యం అడ్డువస్తుంది. ప్రజల చైతన్యానికి 'సామాజిక ప్రాదేశికత్వం' అనే లక్షణం ఉంటుందని రణజిత్‌గుహ అనే చరిత్రకారుడు ఈ మధ్య కనుక్కున్నాడు. అంటే భౌగోళికంగా ఒక ప్రదేశాన్ని మట్టుకే 'మనదిగా' భావించినట్టు సమాజంలో కూడ ఒక భాగాన్ని మట్టుకే 'మనది' అనుకుంటారని చెప్పాడు. అయితే కులానికి ఈ లక్షణం ఉందని అంబేద్కర్ చాలాకాలం క్రితమే గుర్తించాడు. ఒక గ్రామంలో ఎవరికయినా అన్యాయం జరిగితే సాధారణంగా అది ఆ కులానికి తప్ప వేరే కులాలవాళ్ళకు తెలియను కూడా తెలియదు. యువకు లెవరయినా ఆవేశంతోనో ఆదర్శంతోనో తెలుసుకుని స్పందించినా "నీకెందుకొచ్చిన గొడవ ఊరుకో" అని పెద్దవాళ్ళు నోరు నొక్కేస్తారు. అంటే సాధారణ మానవ స్పందనకు కుల సంస్కృతిలో ఆమోదం లేదు, Legitimacy లేదు. ఇది గ్రామీణ దోపిడీవర్గాలకు బాగా ఉపయోగపడుతుంది. శ్రామికుల సమస్యలు వృత్తిని బట్టి మారుతాయి కాబట్టి ఒక్కొక్క కులాన్నీ విడివిడిగా అణచివేయడం సాధ్యం అవుతుంది. తెలంగాణ గ్రామాలలో దొరలు ఈ ఎత్తుగడను చాలా సమర్థవంతంగా అమలుచేసేవారు. అయితే రైతు-కూలీ సంఘం అనే నిర్మాణరూపం దీనిని ఎదుర్కోగలిగింది. వృత్తితోనూ, కులంతోనూ నిమిత్తం లేకుండా శ్రామికులనందరినీ ఒకే సంఘంలో ఐక్యం చేయడం ద్వారా అది సాధ్యం అయింది.

అయితే నిజమయిన సమస్య ఇది కాదు. ఈ శ్రామిక కులాలలోనూ అసమానతలు, హెచ్చుతగ్గులు, న్యూనతాభావం ఉండడం అసలయిన సమస్య. ఈ అసమానతలను పోగొట్టడం ప్రజాతంత్ర విప్లవ కర్తవ్యాలలో ఒకటి కాగా,

అసమానతలు ఉండడం వలన విప్లవ సంఘటన, చైతన్యము బలహీనపడతాయని గుర్తించాలి. ఇది కుల వ్యవస్థకే కాక స్త్రీల రాజకీయ చైతన్యానికి అడ్డుపడే కుటుంబ వ్యవస్థకు కూడా వర్తిస్తుంది. కుటుంబం అనేది భవిష్యత్తులో ఉంటుందా పోతుందా అనే చర్చ కంటే కుటుంబవ్యవస్థలోని ఈ అణచివేత లక్షణాన్ని ప్రతిఘటించవలసిన అవసరం చాలా ఎక్కువ.

కులవ్యవస్థను నేరుగా ప్రతిఘటించకుండా వదిలేస్తే ప్రజాతంత్ర విప్లవోద్యమం చాలా చైతన్యాన్నీ చొరవనూ కోల్పోతుంది. ఉద్యమం 'మనది' అని ప్రజలంతా అనుకున్న మేరకే చైతన్యంతో కదలివస్తారు. కులవ్యవస్థను బాహాటంగా వ్యతిరేకించని ఉద్యమంలో నిమ్న కులాలు 'మమేకం' కావు ('ఐడెంటిఫై' కావు). పురుషాధిక్యత విధించే శ్రమవిభజనను వ్యతిరేకించని ఉద్యమంతో స్త్రీలు మమేకం కారు. దానిని తమదిగా భావించరు.

ఈ విషయాలను కమ్యూనిస్టు పార్టీలు ఎప్పుడూ పట్టించుకోలేదనడం న్యాయం కాదు. పార్టీల నాయకులు అగ్రకులాలకు చెందిన మగవాళ్ళు కావడం వల్ల ఈ విషయాలను పట్టించుకోకపోవడమనేది కుట్ర పూరితంగా జరిగిందనే ఆరోపణ వాస్తవం కాదు. అయితే ప్రజల మధ్య ఉండే అసమానతను చర్చకు పెడితే అది ప్రజలలో చీలికకు దారితీస్తుందన్న భయం మట్టుకు నిజంగానే ఉండింది. ఇప్పటికీ ఉంది. ఇవన్నీ 'పోరాట క్రమంలో' పోతాయన్న సూత్రీకరణ ఈ భయాన్ని సిద్ధాంతీకరించింది. దాని ఫలితంగా తమకు నిత్యం ఆచరణలో ఎదురయ్యే ఈ సమస్యలను సిద్ధాంత స్థాయిలో గుర్తించి వర్గపోరాట అవగాహనతో జోడించలేక పోయారు. దానిని వైఫల్యంగానే గుర్తించాలి. ప్రజలకూ పాలకవర్గాలకూ మధ్యనున్న వైరుధ్యం చుట్టూ పోరాటాన్ని నిర్మిస్తూ తదనుగుణ్యమైన పోరాట రూపాలకూ నిర్మాణ అవసరాలకూ ప్రాధాన్యం ఇచ్చేటప్పుడు-ప్రజల మధ్యనున్న అసమానత గురించి అప్రమత్తంగా ఉండకపోతే అది ప్రజా చైతన్యానికి ప్రతిబంధకం కావడమేకాక, ఆ అసమానతలు ప్రజా ఉద్యమాలలో పునరావృతం అయ్యే ప్రమాదం ఉంది. ప్రజా సంఘాలలోనూ పునరావృతం అయ్యే ప్రమాదం ఉంది. అది ఏ మేరకు జరుగుతుందో ఆ మేరకు సామాజిక విప్లవంలో ఈ అసమానతల పరిష్కారం కష్టతరం అవుతుంది. ఆ మేరకు ప్రజాతంత్ర విప్లవం అసంపూర్తిగా ఉండడమే కాక, తిరోగమనానికి పునాది కూడా ఏర్పడే ప్రమాదం ఉంది.

*సృజన మాస పత్రిక, జనవరి 1990*



# చుండూరు మారణకాండపై ప్రభుత్వ వైఖరి

## రాష్ట్ర ప్రజానీకానికి పౌరహక్కుల సంఘం వినతిపత్రం

గౌ॥ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజలకు

విషయము : చుండూరు మారణకాండ - సదరు ఎస్.ఐ. లను అరెస్టు చేయక పోవుట - ముఖ్యనిందితులను అరెస్టు చేయుటలో వైఫల్యము నొందుట - దాడికి బాధ్యులయిన వారి ఆస్తులు జప్తు చేయకుండుట - స్పెషల్ కోర్టుల ఏర్పాటు పట్ల మిక్కిలి అనాసక్తి - గుంటూరు జిల్లాలో నిరంతర నిషేధాజ్ఞలు - అనీల్‌కుమార్ హత్య - ఎస్.పి.మీనాపై చర్య గైకొనకపోవుట ఇత్యాది....

అయ్యా/అమ్మా,

ప్రభుత్వమునకు తన విధులు గుర్తుచేస్తూ మెమొ రాండంలు అనగా వినతిపత్రములు సమర్పించి విసిగి యున్నాము. దొంగల ముఠా నాయకునకు 'అయ్యా! ఇవిగో ఇన్ని దొంగతనములు మీ ముఠా వలన జరిగినవి. ఇవి చట్టమునకు విరుద్ధమయినవి, దయయుంచి ఏదియేని చర్య గైకొనుడు' అని విజ్ఞాపన పత్రములు సమర్పించుట ఎంత నిరర్థకమో ఇదియును అంతేనని గ్రహించి యున్నాము. కావున ఈ ప్రభుత్వమునకు కాక, దానికి ఓట్లు వేసి ఎన్నుకొని తదుపరి పన్నులు గట్టి, సారాయి తాగి దానిని పోషించు చున్న మీకు అనగా ప్రజలకు విజ్ఞాపన పత్రము సమర్పించు కుందామని నిర్ణయించుకున్నాము. అంతేగాక కృత్రిమమైన ఈ తాసీల్దారు భాషలో కాక మీ భాషలోనే వ్రాయవలెనని నిర్ణయించు కున్నాము. ఈ మా విన్నపమును ఆలకించుడు.

**ప్రజలారా!**

చుండూరు హత్యాకాండ జరిగి రెండున్నర నెలలు గడిచాయి. రోజూ క్రమం తప్పకుండా దినపత్రికలలో చుండూరు

గురించి ఏదో వార్త ఉంటూనే ఉంది. ప్రభుత్వం బాధితులకు ఏమీ చేయడం లేదని ఒక వైపు, అంతా చేయడానికి సిద్ధంగా ఉన్నా కొందరు స్వప్రయోజనపరులు అడ్డం తగులుతున్నారని రెండవ వైపు వార్తలొస్తున్నాయి. దాడి జరుగుతున్నప్పుడు గుడ్లప్పగించి చూస్తూ ఉండిపోయిన ఎస్.ఐ., సి.ఐలమీద చర్య తీసుకోవాలని ఒకవైపు, విచారణ అయిపోగానే తప్పక తీసుకుంటాం....ఇంక ఆందోళన ఎందుకని రెండవవైపు ప్రకటనలు వస్తున్నాయి. స్పెషల్ కోర్టులు నెలకొల్పాలని ఒకవైపు, మూడు స్పెషల్ కోర్టులు పెడుతున్నాం గదా, ఇంకా గొడవెందుకని రెండవవైపు అంటున్నారు. దాడి చేసినవారివి, వారికి రక్షణ ఇస్తున్న వారివి ఆస్తులు జప్తుచేస్తామని ముఖ్యమంత్రి ఇచ్చిన హామీ ఏమయిందని ఒకవైపు, హామీ అమలుకు ఏవో చట్టపరమయిన ఆటంకాలున్నాయని ఇంకొకవైపు చెప్తున్నారు. అనీల్‌కుమార్‌ను ఉద్దేశ పూర్వకంగా హత్య చేసారని ఒకవైపు, కాదు దళితులు పోలీసులను భరించరాని బాధలు పెడితేనే పోలీసులు కాల్పులు జరిపారని రెండవవైపు ఆరోపణ ప్రత్యారోపణలు చేస్తున్నారు.

వీళ్లొకటి వాళ్లొకటి అంటూ ఉంటే 'మాకంతా అయోమయంగా ఉంది' అనుకోవడం తప్పు. నిజానిజాలు తెలుసుకోవలసిన బాధ్యత పౌరులుగా మన మీద ఉంది. దానికి ప్రాతిపదిక ఏదంటారా? చూడడానికి కళ్ళు, వినడానికి చెవులు, వ్యాఖ్యానించడానికి మౌలిక ప్రజాస్వామిక విలువల ప్రాతిపదిక ఉన్నాయి మనకు. ప్రజల హక్కులనూ ప్రభుత్వ బాధ్యతలనూ నిర్దేశించే రాజ్యాంగ శాసనాలున్నాయి. అనేక ఆందోళనల ఫలితంగా ప్రజలు సాధించుకున్న కొన్ని చట్టాలున్నాయి.

## 1. ఎస్.ఐ., సి.ఐ., డి.ఎస్.పిల అరెస్టు

ఆగస్ట్ 6న దాడి జరిగిన సమయంలో చుండూరులో పెద్దెత్తున మోహరించి ఉన్న పోలీసులు దాడిని నిరోధించడానికి గానీ దళితులను కాపాడడానికి గానీ ఏమీ చేయలేదు. పైగా దాడి మొదలుకాక ముందు దళిత యువకులను చెదరగొట్టి దాడికి పరోక్షంగా సహకరించారు. దాడి తమ కళ్ళముందు జరుగుతూ ఉంటే కనీసం ఆ సమాచారం జిల్లా కేంద్రానికి చేరవేయలేదు. ఇది ప్రభుత్వంతో సహా అందరూ ఒప్పుకుంటూ ఉన్న వాస్తవం.

దీనిని 'విధి నిర్వహణలో వైఫల్యం' అని ప్రభుత్వం అంటుంది. శాఖాపరంగా విచారణ జరిపి శాఖాపరంగా చర్య తీసుకుంటాం (అంటే ఇంక్రిమెంట్లు కోత, రివర్షన్ మొదలయిన చర్యలు తీసుకుంటాం) అని అంటుంది.

ఇది విధి నిర్వహణలో వైఫల్యం మాత్రమే కాదు, ఇది నేరం అని ఆందోళన కారులు అంటున్నారు. నేరానికి జరగవలసింది శాఖాపరమయిన విచారణ కాదు, కోర్టులో కేసంటున్నారు. దానికి శిక్ష రివర్షన్ కాదు, జీవిత ఖైదంటున్నారు.

ఇందులో ఎవరిది న్యాయం? చట్టం ఏమంటుంది? హత్యాకాండ తన కళ్లముందు గంటల తరబడి జరుగుతూ ఉంటే చూస్తూ నిలబడ్డ పోలీస్ అధికారి కేవలం విధి నిర్వహణలో విఫలం అయినట్టా? నేరానికి తోడ్పడ్డట్టు కాదా? భారత శిక్షాస్మృతిలో నేరానికి తోడ్పాటు ఆ నేరంతో సమానమయినది కాదా? మరి దోషులయిన పోలీసులను ఎందుకు అరెస్టు చేయరు?

ఈ ప్రశ్నలదాకా కూడా మనం పోనవసరం లేదు. మొదటిది చాలా సున్నితమైన ప్రశ్న అని నిపుణులు అంటారేమో. అయితే దళితులపైన దాడులకు సంబంధించి వేరే ప్రత్యేక చట్టం ఉంది. అందులో ఎటువంటి చర్చకు ఆస్కారం లేకుండా అంతా స్పష్టంగానే రాసి ఉంది.

**ఈ చట్టం ఎస్‌సి మరియు ఎస్‌టి (అత్యాచారాల నిరోధక) చట్టం. ఇది 1989లో జారీ అయింది. ఇందులో సెక్షన్ 4 :** ఒక ప్రభుత్వ ఉద్యోగి (షెడ్యూల్డు కులానికీ లేక తెగకూ చెందిన వ్యక్తి కాని పక్షంలో) ఈ చట్టం కింద తాను నిర్వహించవలసిన బాధ్యతలను తెలిసీ నిర్లక్ష్యం చేస్తే అది నేరం. దానికి శిక్ష 6 నెలల నుండి 1 సంవత్సరం ఖైదు.

**సెక్షన్ 3(2) (VI):** ఒక వ్యక్తి ఈ చట్టం క్రింద నేరం జరిగిందని ఎరిగివుండి, లేక ఆ విధంగా నమ్మడానికి కావలసిన ఆధారాలు కలిగివుండి, దానికి సంబంధించిన సాక్ష్యాలను మాయం చేసినా...లేక తెలిసి తప్పుడు సమాచారం ఇచ్చినా అది నేరం. అసలు నేరానికి ఎంత శిక్షో దీనికీ అంతే శిక్ష.

పై రెండు నేరాలూ ఆనాడు చుండూరులో డ్యూటీలో ఉన్న పోలీసులు చేసారు కదా? తెనాలి డి.ఎస్.పి. వీటిలో రెండవ నేరానికి పాల్పడ్డాడు కదా? అది షెడ్యూల్డు కులానికి చెందిన వ్యక్తికి కూడా వర్తిస్తుంది కదా? మరి అటువంటప్పుడు చట్టపరంగా అధికార్లందరినీ అరెస్టు చేసి కోర్టులో పెట్టి విచారించి శిక్షించవలసిందే గదా? దీనికి వివాదం ఎందుకు? చర్చలెందుకు? చట్టపరమయిన ప్రభుత్వ బాధ్యత చర్చనీయాంశం ఎట్లా అవుతుంది?

## 2. ఆస్తుల జప్తు

చుండూరు హంతకుల ఆస్తులను, వారికి సంరక్షణ కల్పిస్తున్నవారి ఆస్తులను జప్తు చేస్తామని ముఖ్యమంత్రి మొదట్లో ఆర్భాటంగా హామీ ఇచ్చాడు. ఆ తరువాత ఆ సంగతి మాట్లాడడం మానేసాడు. ఆందోళనకారులు ఆ హామీని నిలబెట్టుకోవాలని డిమాండు చేస్తున్నారు. ప్రజాస్వామ్యంలో ప్రజలకిచ్చే హామీలకేమీ విలువ లేదా? వాటిని అమలు చేయించుకునే హక్కు ప్రజలకు లేదా? పండితులు ఇది

చర్చించవలసిన విషయం అంటారేమో. అంతదూరం పోవద్దులెండి. ఆస్తుల జప్తు గురించి చట్టం ఏమంటుందో చూద్దాం.

అంటరానితనానికి సంబంధించిన నేరాలను అరికట్టడానికి మన దేశంలో 1955 నుండి ఒక చట్టం ఉంది. దానిపేరు పౌరసత్వ హక్కుల పరిరక్షణ చట్టం (పిసిఆర్ ఆక్ట్). అందులో -

**సెక్షన్ 10 A** : ఒక ప్రాంతములోని వ్యక్తులు ఈ చట్టం కింద నేరానికి పాల్పడినట్టు, లేక పాల్పడిన వారికి తోడ్పాటు ఇచ్చినట్టు, లేక నేరానికి పాల్పడినవారికి రక్షణ కల్పించినట్టు, లేక నేరస్తులను పట్టుకొనడానికి సహాయ సహకారాలు అందియ్యకున్నట్టు, లేక నేరానికి సంబంధించిన సాక్ష్యాలను కప్పిపెడుతున్నట్టు ప్రభుత్వానికి విశ్వసనీయంగా తెలిస్తే వారందరిమీద ఉమ్మడిగా జుర్మానా విధించ వచ్చును.

జుర్మానా చెల్లించకపోతే వారి ఆస్తులను జప్తు చేసుకుని ఆ మేరకు వేలం వేసి వసూలు చేసుకొనవచ్చునని సెక్షన్ 10A (5) అంటుంది.

ఈ సెక్షన్లు ఎస్.సి మరియు ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టానికి తు.చ. తప్పకుండ వర్తిస్తాయని ఈ చట్టంలోని సెక్షన్ 16 అంటుంది.

పై నేరాలకు చుండూరుకు చెందిన అగ్రకులస్తులు పాల్పడడం లేదా? ఒక్క చుండూరే కాదు, గుంటూరు జిల్లాలోని అనేక గ్రామాల అగ్రకులస్తులు చుండూరు హంతకులకు సహాయ సహకారాలు అందియ్యడం లేదా? గుంటూరు జిల్లాయే కాదు, కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ మొదలుకుని అనేక జిల్లాలలో అనేక గ్రామాల అగ్రకులస్తులు పై నేరాలకు పాల్పడడం లేదా? ఇది అందరికి తెలిసిన సంగతే కాదా? పత్రికలలో వార్తలు రావడం లేదా?

మరి చట్టాన్ని అమలు చేయడానికి ప్రభుత్వానికి మొగమాటం ఎందుకు? అందులో వాదోపవాదాలకూ చర్చలకూ తావేముంది?

### 3. స్పెషల్ కోర్టులు

చుండూరు మారణకాండ జరిగినప్పటినుండి స్పెషల్‌కోర్టుల ప్రస్తావన గందరగోళంగా వస్తూనే ఉంది. చుండూరు కేసు విచారించడానికి స్పెషల్ కోర్టు నెలకొల్పడానికి ప్రభుత్వం ఒప్పుకుంది. త్వరలోనే నెలకొల్పుతుందేమో కూడ. ఆ కోర్టు చుండూరులో ఉండాలా లేక తెనాలిలోనా అనేది బాధితుల సౌకర్యాన్ని బట్టి నిర్ణయించడం సబబు.

కానీ స్పెషల్ కోర్టుల వివాదం అక్కడితో ఆగిపోలేదు. చుండూరు కేసు కోసం ఒక స్పెషల్ కోర్టును పెట్టడమేకాక, దళితులపైన జరిగే దాడులను

విచారించడం కోసం శాశ్వతంగా జిల్లాకొక స్పెషల్ కోర్టును నెలకొల్పాలని ఆందోళన కారులు కోరుతున్నారు. ఇది కూడ చట్టపరంగా ప్రభుత్వ బాధ్యతే. ఎస్.సి. మరియు ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టం ఈ విషయాన్ని స్పష్టం చేస్తుంది.

**సెక్షన్ 14 :** ఈ చట్టం క్రింద విచారణ వేగంగా ముగించడం కోసం ప్రభుత్వం ప్రతీ జిల్లాలోనూ ఈ కేసులు విచారించడం కోసం ఒక స్పెషల్ కోర్టును నెలకొల్పాలి.

ఈ చట్టం జారీ అయి రెండేళ్లయింది. ప్రతీ జిల్లాలోని అదనపు సెషన్స్ కోర్టునొక దానిని ఈ చట్టానికి సంబంధించిన స్పెషల్ కోర్టుగా మొదట్లో ప్రకటించారు. అయితే దానివలన ఈ కేసుల విచారణ సత్వరంగా జరగాలన్న లక్ష్యం నెరవేరదు. పూర్తిగా ప్రత్యేకమైన కోర్టు ఉండాలి, లేకపోతే మిగిలిన కేసులతోబాటు ఇవికూడ సావధానంగా కుంటినడక నడుస్తూ ఉంటాయి. ఆరేళ్లయినా ఇంకా విచారణ ప్రారంభంకాని కారంచేడు కేసు గతి చూస్తున్నాము కదా!

ముఖ్యమంత్రి గారిప్పుడు దళితులపైన దాడులు నివారించడానికి రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలో మూడు స్పెషల్ కోర్టులు నెలకొల్పుతానని ప్రకటించారు. ప్రతీ జిల్లాలో ఒకటి నెలకొల్పాలని చట్టం అంటూ ఉంటే మూడు ప్రాంతాలకు మూడు అనడంలో అర్థం ఏమిటి? తెలంగాణకు స్పెషల్ కోర్టు మహబూబ్ నగర్‌లో పెడతారంట. అంటే ఆదిలాబాద్‌లో గిరిజనులపై దాడులు జరిగితే వాళ్లు సాక్ష్యం ఇవ్వడానికి మహబూబ్‌నగర్ చుట్టూ తిరగాలన్నమాట! ఇది ఎవరికి శిక్ష? దాడి చేసిన వారికా లేక దాడికి గురయిన వారికా?

## 4. బాధితుల పునరావాసం

పైవన్నీ చట్టం ప్రకారం తాను చేయవలసినవేనని ఒప్పుకున్నా పునరావాసం మట్టుకు తన దయాదాక్షిణ్యాల ఫలమేనని ప్రభుత్వం అంటుందేమో. ఒక ఎకరం ఇచ్చేదీ అర్ధఉద్యోగం ఇచ్చేదీ తన మెహర్బానీ అనుకుంటుందేమో. అది నిజం కాదు. పునరావాసం కూడా ఎస్.సి. మరియు ఎస్.టి (అత్యాచారాల నిరోధక)చట్టం క్రింద బాధితుల హక్కే.

**సెక్షన్ 21 (1)** : ఈ చట్టాన్ని సమర్థవంతంగా అమలు చేయడం కోసం అవసరమయిన అన్ని చర్యలూ చేపట్టాలి.

(2) (iii) అందులో భాగంగా, ప్రత్యేకించి, బాధితులకు ఆర్థికంగా, సామాజికంగా పునరావాసం కల్పించే చర్యలు చేపట్టవచ్చును. 'చేపట్టవచ్చును' అంటే చేపట్టకుండా పోవచ్చును కూడా అని అర్థం చేసుకోకూడదు. చట్టాన్ని సమర్థవంతంగా అమలు చేయడం కోసం ఏది అవసరమో అది తప్పనిసరిగా చేయవలసిందే. పునరావాసం అందుకు అవసరం అని వేరే చెప్పనవసరం లేదు.

పునరావాసం అంటే గుంటూరులోనో, తెనాలిలోనో భిక్షగాళ్లగా బ్రతకమని తెచ్చి వదిలేయడం కాదు. వాళ్లు మళ్లీ దాడులకు గురయ్యే దుస్థితి ఏర్పడకుండా స్వతంత్రంగా గౌరవంగా బ్రతికే పరిస్థితి కల్పించాలి. చట్టమే ఇంత చెప్పిన తరువాత ఇంక వాదోపవాదాలు దేనికి? శుష్క ప్రకటనలు దేనికి? స్వతంత్రంగా గౌరవంగా బ్రతకడానికి ఏ మాత్రం భూమి కావాలో, ఏపాటి జీవన వసతి కల్పించాలో ఎవరికి తెలియదు?

మన పాలకులు 'రూల్ ఆఫ్ లా' (Rule of Law) ను వంకాయల బేరానికి దిగజార్చారు. నాకు న్యాయం చేయమని పోలీస్ స్టేషన్‌కు పోతే 'ఎంతిస్తావ్' అంటాడు. ఎంతిస్తే అంత న్యాయం చేస్తాడు. ప్రభుత్వ యంత్రాంగమంతా అట్లాగే తయారయింది. 'ఎంతిస్తావ'ని అడక్కపోవచ్చు. 'నాకు రాజకీయంగా లొంగిపొమ్మని' ప్రభుత్వం చుండూరు బాధితులను అడుగుతూ ఉంది. లొంగిపోతే ఇంద్రలోకమే మీదంటూ ఉంది. ఇది రామరాజ్యం అవునోకాదో గానీ ప్రజాస్వామ్యం మట్టుకు కాదు.

**నిషేధాజ్ఞలు, అనీల్ కుమార్ హత్య :**

గుంటూరు జిల్లా ఎస్.పి. రఘువీర్ ప్రసాద్‌మీనా ప్రజాస్వామ్యంగా భావించే దేశంలో పోలీస్ అధికారిగా ఉండడానికి ఎంతమాత్రం అర్హతలేని వ్యక్తి అనేది పౌరహక్కుల సంఘం నిశ్చితాభిప్రాయం. ఆయనొక్కడికే లేదని కాదు, చాలామందికి లేదు. కానీ ఆయనకు మట్టుకు ఖచ్చితంగా లేదు.

'ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను వినకపోతే కాల్చేస్తాను' అని రెండు రోజులకొకసారి ఎవరినో ఒకరిని హెచ్చరిస్తూ ప్రకటనలిస్తూంటాడు ఈయన. ఏ శాసనం, ఏ రాజ్యాంగ అధికారం ఆయనగారికి ఆ రకమయిన ప్రకటనలు చేసే అధికారం ఇచ్చిందో ఆయనకే తెలియాలి. ప్రస్తుతం భారతదేశంలో అమలులో ఉన్న రాజ్యాంగం మట్టుకు ఇవ్వలేదు.

అయితే ఆయనకు ప్రజాస్వామ్యాన్ని గురించి కొన్ని నిర్దిష్టమయిన అభిప్రాయాలున్నాయి. రాజకీయ నాయకులకూ, పోలీసేతర ప్రభుత్వ అధికార్లకూ ఉన్న అధికారాలన్నీ పోలీసులకే ఇచ్చేయాలి. పోలీసులే దేశాన్ని చక్కగా ఏలగలరు. కోర్టులు ప్రజల హక్కులను కాపాడడం మానేసి పోలీసుల సౌకర్యాన్ని బట్టి తీర్పులివ్వాలి. మేధావులూ విద్యావంతులూ పత్రికారంగమూ అన్నీ అందరూ కూడ తదనుగుణంగా వ్యవహరించాలి. ప్రజలు ఏ రకమయిన అలజడులకూ ఆందోళనలకూ పాల్పడకూడదు. కష్టాలుంటే అధికార్లకు చెప్పుకోవాలి. అవి తీరకపోతే మళ్లీ చెప్పుకోవాలి. అంతే.

హిట్లర్ అనే ఆయనకు కూడా ఇట్లాంటి అభిప్రాయాలే ఉండేవి. ఆయన వాటిని అమలు చేయడం కోసం ఒక పార్టీ పెట్టుకుని రాజకీయరంగంలో పోటీపడి అధికారానికి వచ్చాడు. తన అభిప్రాయాలను అమలు చేయడానికి లక్షలాది మందిని చంపాడు. చివరికి తానే పతనం అయ్యాడు. మీనాగారు మన దురదృష్టం కొద్దీ ఐపిఎస్‌లో ఉత్తీర్ణులయి, రాజ్యాంగాన్ని అమలుచేసే ఎస్.పి. ఉద్యోగం చేపట్టి ఆ రాజ్యాంగంలో ప్రకటించిన ప్రజాస్వామిక విలువలకూ హక్కులకూ పూర్తిగా విరుద్ధమయిన ఈ అభిప్రాయాలను తుపాకులతో అమలు చేస్తున్నాడు. దాని పర్యవసానం ఎట్లా ఉంటుందో నిజామాబాద్‌లో మూడేళ్ళు ఎస్.పి.గా ఉండి రుచి చూపించాడు. 53 మంది యువకులను 'ఎన్‌కౌంటర్ల'లో కాల్చేసి గ్రామాలను దిగ్బంధం చేసి దాడులు చేసి వందలాది మందిని 'టాడా' కింద జైలుకు పంపించాడు.

ఇప్పుడు గుంటూరులో ఇంకొంచెం రుచి చూపిస్తున్నాడు. చుండూరు హత్యాకాండకు నిరసనగా ఎవ్వరూ ఎటువంటి ప్రజాతంత్ర ఉద్యమం చేపట్టడానికి వీలు లేదు. బంద్‌లు, నిరాహార దీక్షలు, ధర్నాలు, ఊరేగింపులు, బహిరంగసభలు అన్నీ బంద్. కాదంటారా? మీనాగారు కాల్చి పడేస్తారు. దళిత మహాసభ కాదనింది. చుండూరులో నిరసన ప్రారంభించింది. మీనాగారి పోలీసులు హుటాహుటిన రంగంలోకి దిగారు. చుండూరు చేరుకున్నారు. టెంటు పీకేసారు. బాధితులకోసం ఎవరెవరో ఇచ్చిన తిండిగింజలు ధ్వంసం చేసారు. అనీల్ కుమార్‌ను గురిపెట్టి కాల్చి చంపారు. నిరసనను భగ్నం చేయడమేకాక, పనిలో పనిగా చుండూరు హత్యాకాండకు ఒక ముఖ్యసాక్షిని, ఎదుగుతున్న ఒక దళిత నాయకుడిని పొట్టన పెట్టుకున్నారు.

'మేము ఎవ్వరికీ అనుమతి ఇవ్వడంలేదు' అని మీనాగారు జవాబు చెప్తారు. సర్వజనాభ్యుదయ పోరాట సమితికీ ఇవ్వడం లేదు. దళిత మహాసభకూ ఇవ్వడం లేదు. వేరే ఎవ్వరికీ కూడా ఇవ్వడం లేదంటారు. నిజానికి వారు అంత నిష్పాక్షికంగా లేరు. నిషేధాజ్ఞలను అతిక్రమించిన వారందరితో ఒకేరకంగా వ్యవహరించడం లేదు. అగ్రకులాల యువకులు ఎ.సి.కాలేజి మీద దాడిచేసిన రోజు మీనాగారు స్వయంగా అక్కడే ఉండి చాలా 'జాగ్రత్తగా' వ్యవహరించారు. ప్రాణనష్టం కాకుండా కాల్పులు జరిపించారు. దళితుల టెంటు పీకేసిన రోజున మీనాగారి పోలీసులు అంతటి జాగ్రత్త ప్రదర్శించడం అవసరం అనుకోలేదు.

అది పోనిచ్చి, అసలు ఆ సమాధానం న్యాయమైనదేనా? చట్టం చాలా నిష్పాక్షికమయినది. అది ఎవ్వరినీ అడుక్కోనివ్వదు. భిక్షగాడినీ అడుక్కోనివ్వదు,

కోటీశ్వరుడినీ అడుక్కోనివ్వదు అని ఒక ఆంగ్ల రచయిత వ్యంగ్యంగా అన్నాడు. ఈ రకమయిన నిష్పాక్షికత న్యాయమయినదేనా?

దళిత మహాసభ, దళితులకు మద్దతుగా నిలబడ్డ ఇతర సంస్థలు, ప్రజాతంత్ర ఉద్యమ సంస్థలు మౌలిక ప్రజాతంత్ర విలువలను ముందుకు తీసుకుపోవడం కోసం ఏర్పడిన సంస్థలు. సర్వజనాభ్యుదయ పోరాట సమితి ప్రజాతంత్ర విలువలను నాశనం చేయడంకోసం, ధ్వంసం చేయడంకోసం ఏర్పడిన సంస్థ. తరతరాల కుల అహంకారాన్నీ అగ్రకుల ఆధిపత్యాన్నీ పటిష్టం చేయడంకోసం పుట్టిన విషకూటమి. దళితులకు ఉద్యమాలు అవసరం. దళిత వ్యతిరేకులకు అవసరం లేదు. ఉద్యమాలు చేపట్టనిదే దళితులు తమ బలహీనతను పోగొట్టుకోలేరు. తమ అనైక్యతనూ వెనుకబాటుతనాన్నీ అధిగమించలేరు. 'సర్వజనులు' అని పేరు పెట్టుకున్న అగ్రకుల దురహంకారులు ఇప్పటికే బలవంతులు. ఇప్పటికే ఐక్యంగా ఉన్నారు. వాళ్ళకు ఉద్యమాల అవసరం ఏముంది? ఇద్దరి అవసరాలూ ఒకటే ఎట్లా అవుతాయి? 'వాళ్ల సభలకూ అనుమతి లేదు, మీ సభలకూ అనుమతి లేదు' అనడం నిష్పాక్షికత ఎట్లా అవుతుంది? ఇద్దరికీ అనుమతి ఇవ్వమనండి. ఇద్దరినీ మాట్లాడనివ్వండి. ఇద్దరినీ ఉద్యమించనివ్వండి. వాళ్ళకిది అవసరమో కాదోగానీ దళితులకు అవసరం. దళితులపైన దాడులు ఇంతగా జరుగుతున్నాయి, దీనికి పరిష్కారమేమిటి అని అందరూ వాపోతున్నారు. పరిష్కారం ఒకరు చెప్పేది కాదు. ఒకరు నిలబెట్టి అమలు చేసేది కాదు. దళితులు ఒకటై ఉద్యమించిన నాడే దొరుకుతుంది. ఉద్యమించే క్రమంలో దొరుకుతుంది. ఉద్యమించే హక్కును లేకుండ చేసి పరిష్కారం చెప్పండి అనడం దుర్బుద్ధిపూర్వకమయిన కుట్ర.

ప్రభుత్వం ఆ పనే చేస్తూ ఉంది. మెడమీద తుపాకి పెట్టి కాళ్లూ చేతులూ కట్టేసి ఇచ్చిన సహాయం తీసుకొమ్మంటుంది. నిరర్థకంగా తాను నియమించిన గంగాధరరావు కమీషన్‌తో సహకరించమంటుంది. ఎస్.ఐ., సి.ఐ.ల అరెస్టు కోరడం మానేయమంటుంది. అనీల్ కుమార్ హత్యను మరచి పొమ్మంటుంది. ఉద్యమం మానేసి ఇంటికి పొమ్మంటుంది. ఇది ప్రజాస్వామ్యం కాదని మేము అంటున్నాం. ఇది ఫాసిజం అంటున్నాం.

అందుకే ప్రజలారా మీకే విజ్ఞప్తి చేస్తున్నాం. ఉద్యమించే హక్కును కాపాడుకోండి. అది లేకుంటే భవిష్యత్తు లేదు. ప్రజాస్వామ్య విలువలనూ హక్కులనూ

కాపాడుకోండి. అవి లేనిదే పురోగతి లేదు. ప్రభుత్వం అనేది ఉన్నంతకాలం అది ప్రజాస్వామికంగా ఉండాలే తప్ప ఇష్టారాజ్యంగా ఉండడానికి వీలులేదని మెడలు వంచి రాజ్యాంగ బద్ధంగా చట్టబద్ధంగా పాలన సాగేలాగ చూడండి. లేకపోతే మనుగడే లేదు.

**ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కరపత్రంగా వచ్చింది**

**19 అక్టోబర్ 1991**



రాజకీయాలలో ఈ రోజు అందరూ అతి ఎక్కువగా మాట్లాడే విషయాలలో కులం ఒకటి. దళిత బహుజన కులాల అభ్యున్నతికి కట్టుబడి ఉన్నట్టు ప్రకటించుకోని పార్టీ ఏదీ ఇవాళ భారతదేశంలో లేదు. రాజకీయ నుడికారంలో అదొక ముఖ్య అంశం అయింది. అందరూ ఇంతగా కట్టుబడి ఉన్నప్పుడు సంపూర్ణమయిన అభ్యున్నతి సంగతి పోనీయండి, కనీసం గ్రామాలలో టీ షాపులలో దళితులకు వేరే గ్లాసులు పెట్టే దురాచారమైనా అంతమయి ఉండాలి. కానీ మన రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో ఈ మధ్యయుగాల సంప్రదాయం కొనసాగుతూనే ఉంది. చిత్తూరు, కర్నూలు, విజయనగరం జిల్లాలలో ఇది అతి ఎక్కువగా కనిపిస్తుంది. ఆ దురాచారం పాటించే గ్రామాలలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలుంటాయి. గ్రామ పెద్దలు ఈ పార్టీకో ఆ పార్టీకో చెంది ఉంటారు. దళితుల పట్ల పాటిస్తున్న అంటరానితనాన్ని ఆ గ్రామాలలో ఎవరయినా ధిక్కరిస్తే వారిని అదుపు చేయడంలో చురుకయిన పాత్ర నిర్వహించేది ఈ 'గ్రామ పెద్దలే'. జాతీయస్థాయిలోనూ, రాష్ట్రస్థాయిలోనూ ఈ పార్టీలు ప్రవచించే దళిత జనోద్ధరణకూ ఈ గ్రామాలలో వారి అనుయాయుల ప్రవర్తనకూ పోలిక ఏమీ ఉండదు.

దళితులపైన భౌతిక దాడులు కారంచేడు, చుండూరుల స్థాయిలో 1998లో జరగలేదు. కర్నూలు జిల్లా వేంపెంట మారణకాండను వీటితో పోలుస్తూ చాలా ఆందోళన జరిగింది గాని అది ఎంత ఘోరమైన ఘటన అయినప్పటికీ ప్రాథమికంగా ఫ్యాక్షన్ స్వభావం గల ఘటన. కారంచేడు, చుండూరుల స్వభావం వేరు. దాని స్వభావం వేరు. అయినప్పటికీ రాష్ట్రంలో మొత్తం మీద దళిత ప్రజలపైన భౌతిక దాడులు తగ్గాయనడానికి ఆధారాలేమీ లేవు. భౌతికదాడులే కాక ఇతర హక్కుల అతిక్రమణ కూడా సాగుతూనే ఉంది.

**(గడచిన సంవత్సర కాలంలో మానవ హక్కుల పరిస్థితి)**

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**1 మార్చి 1999**

# చుండూరు మారణకాండ

## జస్టిస్ గంగాధరరావు నివేదిక

ఎట్టకేలకు చుండూరు న్యాయవిచారణ నివేదిక బయటికి వచ్చింది. జస్టిస్ గంగాధరరావుగారు ప్రభుత్వం పరిశీలించమన్న అన్ని అంశాలనూ పరిశీలించి 98 పేజీల నివేదిక రాసారు. దళితులు ఈ న్యాయవిచారణ కమీషన్‌ను బహిష్కరించడం తనకు ఒక ప్రతిబంధకం అయిందనీ, దళితేతరులు (అగ్రకులాలకు ఇది వారు పెట్టిన పేరు) పూర్తి నిజం చెప్పడానికి ఇష్టపడలేదనీ, కాబట్టి తాను ప్రధానంగా పోలీసులు, రెవెన్యూ అధికారుల సాక్ష్యాలపైన ఆధారపడవలసి వచ్చిందనీ జస్టిస్ గంగాధరరావు గారు నివేదిక మొదట్లోనే ఒప్పు కున్నారు. తన నిర్ధారణలకు ఆ అధికారుల సాక్ష్యాలే ఆధారమని అన్నారు.

ఇది పూర్తిగా నిజం కాదని నివేదిక చదివిన వారికెవరికయినా అనిపించక తప్పదు. జస్టిస్ గంగాధరరావుగారికి స్వంత అభిప్రాయాలు చాలా ఉన్నాయి. వేరే సాక్ష్యాలు లేనిచోట ఈ అభిప్రాయాలతో ఖాళీలను పూరించారు.

చుండూరు మారణకాండ ఎందుకు జరిగింది అనేది ప్రభుత్వం ఆయనను పరిశీలించమన్న మొదటి ప్రశ్న. దీనికి ఆయన స్పష్టమయిన జవాబు ఇచ్చారు. దళిత (ప్రధానంగా మాల) కులానికి చెందిన యువకులు ఇతర కులాల మహిళలను వేధించటం వంటి రెచ్చగొట్టే చర్యలకు పాల్పడడంవల్ల అప్పటికే మాలలకూ ఇతర కులాలకూ మధ్యనున్న మనస్పర్థలు పెరిగి ఇతర కులాలు మాలలపైన దాడి చేసే పరిస్థితి ఏర్పడిందనేది ఈ ప్రశ్నకు వారిచ్చే జవాబు. 'సర్వజనాభ్యుదయ పోరాట సమితి' పేరిట

అగ్రకులాలు ఆనాడు ప్రచారం చేసిన అవగాహన ఇదే. ఎటొచ్చీ గంగాధరరావుగారు అక్కడున్నది దళితులు - అగ్రకులాలు అనే విషయాన్ని కూడా కప్పిపెట్టి, మాలలు - ఇతర కులాలు అంటూ చర్చించారు. అందుకే నివేదికలో ఎక్కడా ఆయన అగ్రకులాలు అన్న మాటే వాడలేదు. దళితేతరులు అన్న మాటే ఉపయోగించారు. అయితే తన అభిప్రాయం వేరు, చుండూరు అగ్రకులాల అభిప్రాయం వేరు అని చెప్పడం కోసం 'వాళ్ళ వాంగ్మూలాలలో వాళ్ళు గొడవంతా మాల యువకులు ఇతర కులాల స్త్రీలని వేధించడం వల్లనే వచ్చిందనీ, లేకపోతే అన్ని కులాలూ సఖ్యంగా బ్రతికేవారనీ అన్నారు. అది చాలావరకు నిజమేగానీ అదే ఏకైక కారణం అని నేను అనుకోవడం లేదు' అంటూ బేధం చూపించుకున్నారు. 'ఏకైక కారణానికి' 'చాలావరకు నిజమే' అనేది బేధమే అనుకుంటే జస్టిస్ గంగాధరరావుగారికీ, సర్వజనాభ్యుదయ పోరాట సమితికీ బేధం ఉందని ఒప్పుకోకతప్పదు.

చుండూరు హత్యాకాండకు పాల్పడింది ఎవరు అనేది ప్రభుత్వం ఆయనను పరిశీలించమన్న రెండవ ప్రశ్న. దీనికి మట్టుకు ఆయన జవాబు చెప్పలేదు. ఎందుకంటే దళితులు ఆయన ముందు హాజరుకాలేదు, హంతకుల వివరాలు చెప్పలేదు కాబట్టి. దళితుల దగ్గర పోలీసులు రికార్డు చేసుకున్న సెక్షన్ 161 స్టేట్‌మెంట్లు ఉన్నాయి కదా అంటారేమోనని చెప్పి, ఆ స్టేట్‌మెంట్లు ప్రామాణికం కావనీ, వాటిలోని నిజానిజాలు తేల్చడానికి వారిని క్రాస్ ఎగ్జామిన్ చేసే అవకాశం తనకు దొరకలేదనీ ఆయన అంటారు. అందువల్ల పోలీసులకు దళితులు ఇచ్చిన వాంగ్మూలాలలో హంతకుల పేర్లు ఉన్నప్పటికీ ఈ విషయంలో తానొక నిర్ధారణకు రాలేకపోతున్నా నన్నారు. ఇది న్యాయమయిన వైఖరే. బాధితులు సహకరించకపోతే హంతకులు ఎవరనేది నిర్ణయించి ప్రకటించడం సాహసమే అవుతుంది. కానీ ఈ హేతుబద్ధమయిన వైఖరి మొదటి విషయంలో ఎందుకు సాధ్యం కాలేదు? బాధితుల ఘర్షణకు గల కారణం మట్టుకు గుర్తించడం ఏవిధంగా సాధ్యం అయింది? రెండవ విషయంలో బాధితులు పోలీసులకు ఇచ్చిన స్టేట్‌మెంట్లయినా ఉన్నాయి. అవి ప్రామాణికం కాకపోవడం వేరే విషయం. మొదటి విషయంలో ఆ మాత్రం కూడా బాధితుల అభిప్రాయం తెలుసుకునే అవకాశం లేదుకదా! అయినా ఆ విషయంలో ఎటువంటి మొహమాటం లేకుండా జస్టిస్ గంగాధరరావుగారు ఏవిధంగా నిర్ధారణకు రాగలి గారు?

నిజానికి ఏదయినా ఒక విషయం మీద న్యాయవిచారణ జరపడానికి ఉపక్రమించినప్పుడు ఇరుపక్షాలు కాకపోయినా కనీసం బాధితులు సహకరించాలి. ఏ కారణంగానయితేనేమి, బాధితులు సహకరించదలచుకోకపోతే నిజాయితీ గల న్యాయ విచారణాధికారి తనకిచ్చిన బాధ్యత నిర్వర్తించడం సాధ్యం కాదని ప్రభుత్వానికి

చెప్పి తప్పుకోవాలి. కానీ న్యాయవిచారణలను న్యాయనిర్ణయానికి సంబంధించిన విధిగా కాక కేవలం జీతం ఇచ్చే ఉద్యోగంగా చూడడం ఇవాళ్టి నీతి కాబట్టి ఈ రకమయిన మొహమాటానికి తావులేకుండా పోయింది.

పోలీస్ అధికారుల వైఫల్యం ఏమయినా ఉందా అనేది మూడవ ప్రశ్న. పట్టపగలు భీకరంగా హత్యాకాండ జరిగితే దాని గురించి మరుసటి రోజుదాకా ఆ ఊరిలోనే ఉన్న పోలీస్ అధికారులకు తెలియలేదు. ఇందులో కేవలం వైఫల్యం కాదు, లాలూచీ కూడా ఉందని దళితులు ఆనాడు ఆరోపించారు. లాలూచీ లేదనుకుంటే చుండూరు అగ్రకులస్తులు పోలీసులను చాలా తెలివిగా బుట్టలో వేసుకున్నారనుకోవాలి. ఆగస్ట్ 6 పొద్దున్న సి.ఐ. సాయిబాబా, తెనాలి తాలూకా వేమూరు, చుండూరు, అమృతలూరు ఎస్.ఐలు కలిసి అంతకుముందు జరిగిన ఘర్షణలలో నిందితులను అరెస్టు చేయడానికి బయలుదేరారు. మొదట అగ్రకులస్తుల ఇళ్లు వెతికారు. అక్కడెవ్వరూ దొరకలేదు. తరువాత దళితుల ఇళ్ళమీదకి పోయారు. దళితులు పోలీసులను చూసి పారిపోయారు. తరువాత పోలీసులంతా తమ స్టేషన్‌కు తిరిగి వచ్చారు. అంతలో కొందరు రెడ్లు పోలీస్ స్టేషన్‌కు వచ్చి దళితులు నలుగురు రెడ్లపైన దాడి చేసారని ఫిర్యాదు చేసారు. పోలీసులు వాళ్ళ స్టేట్‌మెంట్ రాసుకుని దాడిచేసిన వారికోసం వెతకడానికి పోయారు. అదే సమయంలో రెడ్లు పెద్ద సంఖ్యలో పోగయి పొలాలవైపు పోతుండడం పోలీసులు చూసారు. వాళ్ళ చేతులలో కర్రలున్నాయి. వాళ్ళు వందల సంఖ్యలో ఉన్నారు. పోలీసులు వాళ్ళను కొంతదూరం తరిమి వెనక్కి వచ్చారు. రెడ్లు పొలాల వెంబడి దళితులను తరిమి నరికి హతమారుస్తుండగా పోలీసులు కడుపులో చల్ల కదలకుండా చుండూరులో కూర్చున్నారు. పైగా, దళితుల వల్ల అగ్రకులాల పిల్లలకు ప్రమాదం ఉంటుందేమోనని వాళ్ళను స్కూలునుండి సురక్షితంగా ఇంటికి తీసుకొనిరావడానికి అమృతలూరు ఎస్.ఐ. ఆధ్వర్యంలో బందోబస్తు కూడా ఏర్పాటయింది. నిజానికి రక్తసిక్తమయిన ఆ మధ్యాహ్నం చుండూరులో పోలీసులు చేసిన ఏకైక కార్యక్రమం ఇది. మారణకాండ నుండి ప్రాణాలతో తప్పించుకున్న కొందరు దళితులు ఆ రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత తెనాలి ఆర్.డి.వో. కు జరిగిన దారుణాన్ని గురించి చెప్పిన తరువాత గానీ హత్యాకాండ గురించి అధికారులు మేలుకోలేదు. అప్పుడు కూడా పోలీసులలో వెంటనే చలనం లేదు. ఆర్.డి.వో సి.ఐ. సాయిబాబాను అడగగా అంతా ప్రశాంతంగానే ఉందనీ, ఎవ్వరూ చనిపోలేదనీ జవాబు చెప్పాడు. 7వ తేదీ పొద్దున దాకా శవాల కోసం వెతకడం ప్రారంభించలేదు.

ఇదంతా న్యాయవిచారణ కమీషన్ ముందు నమోదయిన సాక్ష్యం. నివేదికలో జస్టిస్ గంగాధరరావుగారు ఏకరువు పెట్టిన సాక్ష్యం. కర్రలు పట్టుకొని పెద్దగుంపుగా

పొలాలవెంబడి పోతున్న అగ్రకులస్తులను ఊరికే కొంచెం దూరం తరిమి వెనక్కి రాకుండా, చెదరగొట్టేంతవరకు తరిమే ప్రయత్నం ఎందుకు చేయలేదన్న ప్రశ్న గంగాధరరావుగారు పోలీసులను అడిగారు. అంతకుముందు పోలీసుల దాడికి భయపడి దళితులు పొలాలలోకి పారిపోయిన సంగతి పోలీసులకు తెలుసు, పారిపోతూ మరి కొందరు రెడ్లను కొట్టి పోయారన్న ఫిర్యాదు కూడా పోలీసుల వద్ద ఉంది. అటువంటప్పుడు గుంపుగా కర్రలు పట్టుకొని పోతున్న అగ్రకులస్తులు పారిపోయిన దళితులపైన దాడి చేస్తారేమోనన్న అనుమానం పోలీసులకు ఎందుకు రాలేదని గంగాధరరావుగారు ప్రశ్నించారు. కనీసం రాత్రి తెనాలి ఆర్.డి.వో. ఫోన్ చేసి అడిగినప్పుడయినా ఎందుకు గ్రహించలేకపోయారనీ, అంతా ప్రశాంతంగా ఉందనే సమాధానం ఏ విధంగా ఇవ్వగలిగారనీ ప్రశ్నించారు. చివరికి పోలీసుల వైఫల్యం గురించి ఆయన అభిప్రాయమేమిటంటే, సి.ఐ. సాయిబాబా గ్రామంలో దళితులపైన దాడి జరగకుండా రక్షణ కల్పించడంలో సఫలీకృతుడయ్యాడు. అయితే పొలాలలోనూ పొరుగూరిలోనూ దాడి జరగకుండా నిరోధించలేకపోవడం ఆయన వైఫల్యం. దీనికి అప్పటికే ప్రభుత్వం విధించిన తాత్కాలిక సస్పెన్షన్ చాలని జస్టిస్ గంగాధరరావుగారి అభిప్రాయం. అంటే ఆయన కొత్తగా విధించే శిక్షగానీ విచారణగానీ ఏమీ లేదు. ఇక చుండూరు ఎస్.ఐ. శ్రీనివాసులు మాటకొస్తే, ఇతర కులాల స్త్రీలను మాల యువకులు వేధించినప్పుడు ఆయన సకాలంలో సరయిన చర్య తీసుకోకపోవడం వల్లనే పరిస్థితి ఇక్కడిదాకా వచ్చిందంట. అంటే దళితులను ఎస్.ఐ. సకాలంలో అణచి వేయకపోవడంవల్ల దళితులపైన హత్యాకాండకు దారితీసే పరిస్థితులు ఉత్పన్న మయ్యాయని! కాబట్టి శ్రీనివాసులను చుండూరు నుండి బదిలీచేసి అతని స్థానంలో ఒక 'గట్టి మనిషి'ని వేయాలని జస్టిస్ గంగాధరరావుగారి సూచన. 'గట్టి మనిషి' అంటే దళితులు తమను వేధిస్తున్నారని అగ్రకులస్తులు ఫిర్యాదు చేయగానే దళితులపైన కఠినమయిన చర్యలు తీసుకునే వాడని అర్థం. అటువంటి ఎస్.ఐ.లను చుండూరు వంటి ఊళ్ళలో వేస్తే ఏ మారణకాండలూ జరగవని జస్టిస్ గంగాధరరావుగారి అభిప్రాయం.

ఆగస్ట్ 10వ తేదీన (చుండూరు మృతుల అంత్యక్రియలు జరిగిన దినం) జరిగిన అల్లరిని, దహనకాండను, మల్లారెడ్డి హత్యను నివారించడం ఎందుకు సాధ్యం కాలేదనేది కమీషన్ ముందున్న నాలుగవ ప్రశ్న. ఈ ప్రశ్నను చర్చించేటప్పుడు జస్టిస్ గంగాధరరావుగారు రెండు విషయాలను కీలకంగా భావించారు. ఒకటి, మృత దేహాలను బోస్ విగ్రహం దగ్గరే పూడ్చిపెట్టాలని దళిత నాయకులు పట్టుపట్టడం. రెండు వరవరరావు, గద్దర్, కత్తిపద్మారావు వంటి నాయకులు హాజరు కావడం వల్ల జనం అసహనంగా ఉండడం. చుండూరు దళితులు గతంలో శ్మశానంగా

ఉపయోగిస్తున్నచోట ఇంతమందిని ఖననం చేయడానికి చోటు లేదని అందరూ ఒప్పుకున్నారని ఆయన అంటాడు. అయితే అందుకు ప్రత్యామ్నాయంగా రెవెన్యూ అధికారులు చూపించిన రెండు స్థలాలను దళిత నాయకులు తిరస్కరించడానికి కారణం వాళ్ళు ముందుగానే ఊరిమధ్యన బోస్‌బొమ్మ దగ్గర మృతదేహాలను ఖననం చేయాలని నిర్ణయించుకోవడమే నంటాడు. ఈ నిర్ణయం 9వ తేదీన జరిగిందనీ అంటాడు. గ్రామస్తులు దీనికి ఒప్పుకోరన్న విషయం అటుంచి, గ్రామం మధ్యన శవాలను పూడ్చిపెట్టడం 'హైందవ సాంప్రదాయానికి విరుద్ధం' అని ఈ నిర్ణయాన్ని జస్టిస్ గంగాధరరావుగారు విమర్శిస్తారు. చుండూరు దళితులు ఎక్కువగా క్రైస్తవులు కాబట్టి ఈ 'హైందవ సంప్రదాయం' తమకు వర్తించదని వారు జవాబు చెప్తే? పొలాల మధ్య దళితులను నరకడానికి అభ్యంతరం చెప్పని హైందవ సంప్రదాయం ఊరి మధ్యన ఖననానికి అభ్యంతరం ఎందుకు చెప్పాలని అడిగితే?

హైందవ సాంప్రదాయానికి విరుద్ధమైన ఈ నిర్ణయాన్ని దళిత నాయకులు 9వ తేదీనే తీసుకోగా, 10వ తేదీన అంత్యక్రియల సమయంలో చుండూరుకు వచ్చిన జిల్లా కలెక్టర్ ఊరి మధ్య శవాలను పూడ్చి పెట్టడం జరగకూడదని, జరగనివ్వమని వాళ్ళతో కచ్చితంగా చెప్పకుండా వాళ్ళను నిర్ణయం మార్చుకొమ్మని అడుక్కున్నాడని జస్టిస్ గంగాధరరావుగారు జిల్లా కలెక్టర్‌ను అభిశంసించారు. కాబట్టి కలెక్టర్‌ను బదిలీచేసి 'గట్టి మనిషి'ని గుంటూరు జిల్లాలో వేయాలని సూచించారు. 'గట్టి మనిషి' అంటే అర్థమేమిటో మళ్ళీ స్పష్టమే. దళితులు హైందవ సాంప్రదాయానికీ, అగ్రకులాల ఇష్టానికీ, అధికార్ల సూచనలకూ విరుద్ధంగా నడుచుకుంటే నిర్దాక్షిణ్యంగా ఆపేవాడని అర్థం. ఏ విధంగా ఆపగలడు? అంత జనసమ్మర్థంలో ఆయనకున్న మార్గం ఒకటే. పోలీసులను పురమాయించి కాల్పులు జరిపించాలి. మరికొంతమందిని చంపి అంత్యక్రియల కార్యక్రమాన్ని చెల్లాచెదరు చేయాలి. ఈ పనే చేసి ఉండాలని జస్టిస్ గంగాధరరావుగారి అభిమతమా? కాదు. అంతమంది జనం ఉన్నప్పుడు కాల్పులు జరపడం, చెదరగొట్టడం సరయిన చర్యకాదనీ పోలీసులు ఆ పని చేయకపోవడమే మంచిదయిందనీ ఆయన ఎస్.పి. మీనాను, డి.ఐ.జి. అరవిందరావును అభినందిస్తారు. మరి అట్లాంటప్పుడు కలెక్టర్ 'కాదు కూడదని కచ్చితంగా చెప్పడం ఎట్లా? ఈ కలెక్టర్ బదులు 'గట్టి మనిషి' ఉంటే ఏం చేసేవాడు? అసలు ఊరి మధ్య ఖననం చేయాలన్న నిర్ణయానికీ ఆ సాయంత్రం జరిగిన దహనకాండకూ మల్లారెడ్డి హత్యకూ ఎటువంటి సంబంధం లేదు. అంత్యక్రియలు ఎక్కడ జరిగినా ఆనాటి ప్రతీకార చర్యలు జరిగేవేనేమో. అటువంటప్పుడు జస్టిస్ గంగాధరరావుగారు ఈ చర్చ ఎందుకు చేసినట్టు?

అయిదవ ప్రశ్న ఒక నెలరోజుల తరువాత (సెప్టెంబర్ 10వ తేదీన) జరిగిన కాల్పులు. చుండూరు శిబిరంలో నిరాహారదీక్ష చేస్తున్న దేవరపల్లి ప్రసాదరావు, మద్దు దయాసాగర్‌లను అరెస్టు చేసి ఆస్పత్రికి పంపించడానికి సెప్టెంబర్ 10వ తేదీ సాయంత్రం పోలీసులు బయలుదేరారు. తమ న్యాయమయిన ఆందోళనను పోలీసులు ఈ విధంగా భగ్నం చేయడం పట్ల దళితులు నిరసన వ్యక్తం చేసారు. ఆ నేపథ్యంలో చిన సోమ్లానాయక్ అనే హెడ్ కానిస్టేబుల్ కాల్పులు జరపగా అనీల్ కుమార్ చనిపోయాడు. ఈ కాల్పులు సమర్థనీయమా కాదా అనేది నిర్ణయించాలంటే కేవలం పోలీసుల సాక్ష్యం సరిపోదు. దళితుల సాక్ష్యం కావాలి, సహకారం కావాలి. అది లేకపోయినప్పటికీ జస్టిస్ గంగాధరరావుగారు తొణకకుండా తన కర్తవ్యం ముగించగలిగారంటే ఆశ్చర్యం కలగకమానదు. కాల్పుల గురించి పోలీసులు చెప్పిన కథనంలో వైరుధ్యాలున్నాయని ఆయనే గుర్తించాల్సింది. దళితులలో కొందరు తీవ్రవాదులు చేరారనీ, వాళ్ళు కర్రలు, రాళ్ళు, సూదులు, కారప్పొడి వంటి ఆయుధాలు ధరించి పోలీసులపైన రాళ్ళు విసరడమే కాక సూదులతో పొడిచారంట, పోలీసుల బీర్జాలను పిసికారంట. ఇది డి.ఎస్.పి. నుండి కానిస్టేబుళ్ళదాకా అందరి సాక్ష్యం. ఇది అసంబద్ధంగా, విడ్డూరంగా ఉందని జస్టిస్ గంగాధరరావుగారికి తోచలేదు. అయితే అనీల్ కుమార్ స్వయంగా చినసోమ్లానాయక్ పైన రాయి వేసి గాయం కలిగించగా అతను ఆత్మరక్షణ కోసం ఎదురు కాల్పులు జరిపాడనేది ఇతర పోలీసు సిబ్బంది కథనం. కాగా, కాల్పులు జరిపిన సోమ్లా నాయక్ తనపైన రాయి విసిరిందెవరో తెలీదంటాడు. రాయి తగిలి కింద పడిపోయాడంట. లేచి చూసేసరికి దళితులు రాళ్ళతో, గొడ్డళ్ళతో దాడికి వస్తున్నారంట. చుట్టూ చూస్తే కాపాడే నాథుడు కనిపించలేదంట. ఇంక గత్యంతరం లేక రెండు రౌండ్లు కాల్చి స్పృహతప్పి పడిపోయాడంట.

ఇంతా చేసి అతని తలమీద ఉన్నది చిన్న గాయమే. పుర్రె ఎముకకు గాయం లేదు, కేవలం చర్మానికే గాయం అయింది. అతని ఒంటి మీద వేరే గాయమూ లేదు. వేరే ఎవ్వరి ఒంటి మీదా గాయాలు లేవు. అదేమంటే సూదులతో పొడిచారనీ, బీర్జాలు పిసికారనీ అంటారు!

చినసోమ్లానాయక్ కాల్పులు జరపడంలో 'ఆత్మరక్షణ' పరిధిని అధిగమించాడని జస్టిస్ గంగాధరరావు భావిస్తూనే, అతనికి ఎవరినీ చంపే ఉద్దేశ్యం లేదనీ పైగా ఈ పని తన విధి నిర్వహణలో భాగంగా చేసాడనీ అందువల్ల అతనిపైన క్రిమినల్ కేసు పెట్టనవసరం లేదనీ నిర్ధారించారు. ఒకప్పటి రాష్ట్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి నుండి ఇటువంటి అభిప్రాయం వినవలసి రావడం చాలా ఆశ్చర్యకరం. ఎవరయినా ఒక వ్యక్తి నిష్కారణంగా భయపడి జనంలోకి కాల్పులు జరిపి ఒకరి

ప్రాణం తీస్తే అది 'ఆత్మరక్షణ పరిధిని అధిగమించే చర్య అయినప్పటికీ అతనికి ఎవరినీ చంపే ఉద్దేశ్యం లేదు కాబట్టి అతనిపైన కేసు పెట్టనవసరం లేదని' గంగాధరరావుగారు అంటారా? అది నిష్కారణంగా భయపడి చేసిన కాల్పులు కాదనీ, దళితుల తలలో నాల్కలాగా ఉన్న అనీల్ కుమార్‌ను కావాలనే కాల్చి చంపారనీ చుండూరు దళితులు అంటున్నారు. రాళ్ళు వేయడం, సూదులతో పొడవడం, బీర్జాలు పిసకడం వట్టి అబద్ధం అంటున్నారు. నిరాహారదీక్షకు కూర్చున్న వారిని పోలీసులు బలవంతంగా తొలగించడానికి వచ్చి శిబిరం దగ్గర వున్న తిండి గింజలను చిందర వందర చేసి దౌర్జన్యం చేయగా దళితులు ప్రతిఘటించారనీ, అనీల్ కుమార్ ఘర్షణను శాంతపరచి గొడవ కాకుండా చూసే ప్రయత్నం చేసాడనీ, పోలీసులు కావాలనే అతనిని కాల్చి చంపారనీ చుండూరు దళితులు అంటున్నారు. వాళ్ళు కమీషన్‌కు సహకరించలేదు కాబట్టి వాళ్ళ సాక్ష్యం నమోదు కాలేదు. బాధితుల సాక్ష్యం నమోదు కానంతమాత్రాన వచ్చిన ఇబ్బంది ఏమీ లేదని జస్టిస్ గంగాధరరావు గారు భావించారు. కాబట్టి కేవలం పోలీసుల సాక్ష్యాన్ని ఆధారం చేసుకొని నిర్ధారణకు వచ్చారు. పోనీ అదే నిజమనుకున్నా ఆయన చేసిన నిర్ధారణ ప్రకారమే హెడ్ కానిస్టేబుల్ సోమ్లానాయక్ పైన సెక్షన్ 302 కాకపోయినా 304 అయినా పెట్టనక్కర లేదా? నిరాధారంగా భయపడి కాల్పులు జరిపితే అది విధి నిర్వహణ అవుతుందా? డ్యూటీలో ఉన్నప్పుడు పోలీసులు ఏమి చేసినా అది విధినిర్వహణ అవుతుందా? వాళ్ళు నిర్వహించవలసిన విధితో దానికి హేతుబద్ధమయిన సంబంధం ఉండనవసరం లేదా? న్యాయశాస్త్ర కోవిదులయిన జస్టిస్ గంగాధరరావుగారికి ఈ ప్రశ్నలు కొత్తవా? లేకపోతే హైకోర్టు న్యాయమూర్తి అయినంతమాత్రాన ఆయన న్యాయశాస్త్ర కోవిదుడయి ఉంటాడని భావించడం మన మూర్ఖత్వమా?

ఇటువంటి ఘటనలు పునరావృతం కాకుండా ఉండడానికి కమీషన్ ప్రభుత్వానికి ఏమి సూచిస్తుందనేది చివరి ప్రశ్న. దళితుల పునరావాసానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలను ఈ సందర్భంగా జస్టిస్ గంగాధరరావుగారు ప్రస్తావిస్తూ 'అవి అత్యంత ఉదారంగా ఉన్నాయి' అన్నారు. వాటి పరిస్థితి ఏమిటో దళితులు చెప్పకపోయినా దినపత్రికలు చదివి గంగాధరరావుగారు తెలుసుకొని ఉంటే బాగుండేది. క్లుప్తంగా చెప్పాలంటే 'అత్యంత ఉదారమయిన' ఈ హామీలలో ఒక్కటి మట్టుకే అమలయింది. అదేమిటంటే ఒక్కొక్క దళిత కుటుంబానికి రెండేసి గేదెలను ఇవ్వడం. ఒక గేదె ఉచితంగా, ఒకటి అప్పుగా ఇచ్చారు. ఈ గేదెల పాలు అమ్ముకుని బ్రతుకుతున్నారు చుండూరు దళితులు. ఒక్కొక్క కుటుంబానికి 1 ఎకరం వ్యవసాయభూమి ఇస్తామన్నారు. 700 కుటుంబాలు లెక్క చూపిస్తే 550

కుటుంబాలను మట్టుకే గుర్తిస్తామని చెప్పి వారిలో 57 కుటుంబాలకు మట్టుకే ఒక ఎకరం చొప్పున భూమి ఇచ్చారు. అందులో 26 ఎకరాలు మట్టుకే వ్యవసాయ యోగ్యమయినది. ('పంచపాండవులు మంచం కోళ్ళు....' జ్ఞాపకం వస్తోందా?) ఒక్కొక్క కుటుంబానికి ఒక్కొక్క ఇల్లు కట్టిస్తామన్నారు కానీ ఇప్పటికి (అంటే దాడి జరిగి సంవత్సరన్నర గడిచిన తరువాత) సగం ఇళ్ళుమట్టుకే తయారయ్యాయి. చదువుకున్న వాళ్ళందరికీ ఉద్యోగాలిస్తామన్నారు. కానీ నిన్నటిదాకా ఒక్కరికీ ఇవ్వలేదు. ఇప్పుడు ఇంటర్ పాసయిన వాళ్ళకు ఉద్యోగాలిచ్చే ప్రయత్నం ప్రారంభం అయిందని తెలుస్తోంది. కానీ పదవతరగతి పాసయి ఆపేసిన వాళ్ళు కూడా ఏవో కొన్ని ఉద్యోగాలకు అర్హులేకదా? వాళ్ళకెప్పుడిస్తారు? 'పునరావాస చర్యలు' కాక కేసు సత్వరం ముగియడం కోసం చుండూరు కోసమే ఒక ప్రత్యేక కోర్టు నెలకొల్పి ప్రత్యేక జడ్జినీ, ప్రత్యేక పి.పినీ నియమిస్తామని హామీ ఇచ్చారు. చేసిందేమిటంటే చుండూరులో ఒక కోర్టు బిల్డింగ్ కట్టారు. కానీ కేసు మట్టుకు గుంటూరులో ఉన్న మూడు జిల్లాల ఎస్.సి., ఎస్.టి. అత్యాచారాల ప్రత్యేక కోర్టులో అన్ని కేసులలో ఒక కేసుగా విచారణ జరుగుతున్నది. తేడా ఏమంటే ఈ కేసు వాయిదా ఉన్న రోజున జడ్జిగారు గుంటూరు బదులు చుండూరులో కూర్చుంటారు! ఇవీ గంగాధరరావుగారికి 'అత్యంత ఉదారంగా' కనిపించిన చర్యలు!

భవిష్యత్తులో ఇటువంటి దాడులు ఎక్కడా జరగకుండా ఉండాలంటే ఏమేమి చర్యలు తీసుకోవాలో కూడా జస్టిస్ గంగాధరరావుగారు సూచించారు. పోలీసు యంత్రాంగాన్ని పటిష్టం చేయాలి, సరయిన శిక్షణ ఇవ్వాలి, ఇంటలిజెన్స్ అభివృద్ధి కావాలి మొదలయిన సాధారణ సూచనలను పక్కకుపెడితే కొన్ని చెప్పుకోదగ్గ అభిప్రాయాలను, సలహాలను ప్రభుత్వం ముందుంచారు. వీటిని ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఎందుకంటే మేధావులు, న్యాయమూర్తులు, ఉదారులు అని మనం అనుకునే వాళ్ళ ఆలోచనలు ఎంత బాగున్నాయో తెలుసుకోవడం అవసరం. వీటిని వారి మాటలలోనే తెలుసుకుందాం.

1. చుండూరులో ఘర్షణకు కారణం అగ్రకులాల సంప్రదాయక ఆధిపత్యాన్ని చదువుకున్న దళితులు సవాలు చేయడం. అది విలువలకు కూడా సవాలు. ఇతర కులాలు దళితులను తక్కువగా చూడాలని ప్రయత్నించగా, అగ్రకులాలతో సమంగా ఆధునికతను సాధించుకున్న దళితులు సామాజికంగా గుర్తింపు కావాలని కోరు కుంటున్నారు. ఈ సమానత్వం తిరస్కరించబడిన కారణంగా కొందరు దళిత యువకులు దూకుడుగా ప్రవర్తిస్తున్నారు. వాళ్ళు ఇతర కులాలను కావాలని రెచ్చగొడుతున్నారు. చుండూరులో ఈ రెచ్చగొట్టే చర్యలు స్త్రీలను వేధించడం, బలాత్కరించడం మొదలయిన రూపాలు తీసుకున్నాయి. స్త్రీలను వేధించడం అనేది

అన్ని చోట్ల ఉండే విషయమే అయినప్పటికీ, అగ్రకులాల స్త్రీలను దళితులు వేధిస్తే ఉత్పన్నమయ్యే పరిస్థితులు భిన్నంగా ఉంటాయి. అగ్రకులాలలో చాలా బలమయిన నిరసన తప్పనిసరిగా పుడుతుంది. వాళ్ళు దళితులను వేధించడానికి అవకాశం కోసం చూస్తుంటారు. ఈ రకమయిన రెచ్చగొట్టే చర్యలను అదుపు చేయడానికి ఒకటే మార్గం ఉంది. వాటికి బాధ్యులయిన వారిని వెంటనే గుర్తించి తగు చర్య తీసుకోవాలి. పోలీసులు ఉండవలసినంత చురుగ్గా లేరు. 'చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడం వ్యర్థం' అనే నానుడి అన్ని శాంతి భద్రతల సమస్యలకూ వర్తిస్తుంది. స్థానిక ఎస్.ఐ. ఈ దుష్ప్రవర్తనను వెంటనే గుర్తించి దోషులపైన చర్య తీసుకొని ఉంటే పరిస్థితి అదుపులోకి వచ్చేది. కాబట్టి సున్నితమయిన పరిస్థితి ఉన్న చుండూరు వంటి గ్రామాలలో, సకాలంలో గట్టి చర్యలు తీసుకోగల పోలీస్ అధికారులను నియమించాలని నేను సూచిస్తున్నాను.

2. గతంలో గ్రామాలలో ప్రభుత్వానికి కళ్ళు, చెవులుగా పనిచేసే గ్రామాధికార్లు ఉండేవారు. వారి ద్వారా గ్రామ పరిస్థితులు ప్రభుత్వానికి తెలిసేవి. గ్రామ మునసబే గ్రామ మేజిస్ట్రేటుగా వ్యవహరించేవాడు. స్థానికుడు కావడం వల్ల అతను పోలీసులకూ రెవిన్యూ వారికీ సమాచారం సేకరించడానికి ఉపయోగపడేవాడు. అంతేకాక గ్రామంలో శాంతిభద్రతలకు అతనే బాధ్యుడు. కాబట్టి గ్రామంలో ప్రభుత్వానికి వెన్నెముకగా ఉండి ప్రభుత్వానికి గ్రామానికి అనుసంధానం కుదిర్చే గ్రామ అధికారులను ప్రభుత్వం నియమించాలి.

3. రాజకీయ పార్టీలు, నాయకులు ఇటువంటి ఘర్షణలవల్ల ప్రయోజనం పొందే ప్రయత్నం చేయకూడదు. దానివల్ల కుల సంఘర్షణలు పెరుగుతాయి తప్ప ఏ కులానికీ ప్రయోజనం కలగదు. కాబట్టి కుల ఘర్షణలలో ఎవ్వరూ ఏ కులం పక్షమూ తీసుకోకూడదనే ప్రవర్తనా నియమావళి అన్ని రాజకీయ పార్టీలు రూపొందించుకోవాలి. కులాలను ఐక్యంచేసి ఘర్షణను తొలగించే మార్గాన్ని అన్ని రాజకీయ పార్టీలు కలిసి కూర్చొని అన్వేషించాలి. ఈ ప్రవర్తనా నియమావళి గ్రామాస్థాయిలో కూడా అమలు కావాలి.

4. సున్నితమయిన విషయాలలో వేలుపెట్టి రాజకీయంగా ప్రయోజనం పొందడం అలవాటయిపోయిన నాయకమ్మన్యులు కొందరున్నారు. సంఘటన జరగడానికి కారణభూతమయిన పరిస్థితులు ఏవయినా కానీగాక, సమస్యను ఆ గ్రామానికే పరిమితం చేసి ఇతర ప్రాంతాలలో దాని ప్రభావం పడకుండా చూడడం అవసరం. కాబట్టి గ్రామంలోకి అటువంటి వ్యక్తుల రాకపోకలను నిరోధించడం అవసరం.

5. దళితులు, దళితేతరులు గ్రామాలలో తరతరాలుగా నివసిస్తున్నారు. కొందరు వ్యక్తులు గ్రామం వదిలి మెరుగయిన బ్రతుకుకోసం బయటికి పోవచ్చునేమో గానీ ఒక కులం మొత్తంగా ఎక్కడికీ పోలేదు. ఇతర కులాలను కాదని విడిగా బ్రతక జాలదు. కాబట్టి తాత్కాలికంగా కులాల మధ్య ఏ ఘర్షణలు వచ్చినా అది శాశ్వత ఎడబాటుకు దారి తీయకూడదు. కాబట్టి ప్రభుత్వం తీసుకునే పునరావాస చర్యలు దళితులకు సహాయం చేయడానికి ఉపయోగపడడమే కాక, గ్రామాన్ని సామాజికంగా, ఆర్థికంగా ఐక్యం చేసేటట్టు ఉండాలి. నా అభిప్రాయంలో ప్రత్యేక హాస్టళ్ళు, ప్రత్యేక స్కూళ్ళు, ప్రత్యేక గృహాలు కులాల ఐక్యతకు కాక విభేదాలను పెంచడానికి దోహదం చేస్తాయి.

వీటిలో మొదటిది (పైన చెప్పినట్టు) సర్వజనాభ్యుదయ పోరాట సమితి అవగాహన. రెండవది ఊడబీకిన మునుసబు కరణంల (పటేల్ పట్వారీ) మనస్సులను రంజింపజేసే సూచన. గ్రామాలలో ప్రభుత్వానికి 'వెన్నెముకగా' 'అనుసంధానంగా' ఉంటూ వాళ్లు చేసిన ఘనకార్యాలు ఎవరికి తెలియనివి! అగ్రకులాలు దళితులపైన దాడి చేస్తే 'ఎవరి పక్షం తీసుకోకుండా ఇద్దరినీ కలిపే ప్రయత్నం చేయాల'నే మూడవ సూచన గ్రామపెత్తందార్ల మనస్సుకు హత్తుకునే సూచన. వాళ్ళ అభిప్రాయం ఎప్పుడూ అదే! నాలుగవది ఎస్.పి. మీనా మనస్ఫూర్తిగా నమ్మి శాయశక్తులా అమలు చేసిన అభిప్రాయం. ప్రజల సమస్యల నుండి ఉత్పన్నమయ్యే ఉద్యమాలను, ఉద్యమకారులనూ సంఘవ్యతిరేక చర్యలుగా, వ్యక్తులుగా చూసే పోలీసు దృక్పథం నుండి పుట్టిన అభిప్రాయం ఇది. అయిదవది మండల్ వ్యతిరేక ఉద్యమకారులు మెడకు మైక్ కట్టుకుని ప్రచారం చేసిన అవగాహన. ప్రత్యేక హాస్టళ్ళు, ప్రత్యేక కాలనీలు దళితులు కోరుకోవడం వల్ల రాలేదు. అగ్రకులాల వైఖరి వల్ల వచ్చాయి. ప్రత్యేకంగా కట్టకపోతే దళితులకు హాస్టళ్ళు, ఇళ్ళు లేకుండానే పోతాయేమో జస్టిస్ గంగాధరరావుగారు కొంచెం ఆలోచిస్తే బాగుంటుంది.

ఇన్ని చెప్పిన తరువాత వారు ప్రభుత్వం నేరవిచారణ త్వరగా జరిపించి హంతకులను శిక్షించాలనీ, దళితుల పునరావాసం కంటే వారి హక్కుల పరిరక్షణకు ప్రభుత్వం ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలనీ, అగ్రకులాలు వారిని వేధించకుండా చూడాలనీ ప్రభుత్వానికి హితోపదేశం చేసి ఏం ప్రయోజనం?

స్వేచ్ఛ మాసపత్రిక
**జనవరి - ఫిబ్రవరి 1993**



# కులవ్యవస్థ - పౌరహక్కులు

కులాన్ని గురించి, కుల వ్యవస్థను గురించి ఈరోజు సమాజంలో చాలా చర్చ జరుగుతున్నది. నిన్నటివరకు తమ జీవితాలను తాము శాసించుకునే హక్కు లేని దళితులు ఈ రోజు సమాజ జీవితాన్ని మేమే శాసిస్తామని ముందుకొస్తున్నారు. ఇది భారతదేశ చరిత్రలో ఒక మహత్తర ఘట్టం. అపూర్వ సందర్భం.

ఈ ఘట్టం అందరినీ కులవ్యవస్థ గురించి ఆలోచింప జేస్తున్నది. రాజకీయాలు, సంస్కృతి, చరిత్ర, సాహిత్యం - ఒక్కొక్క జీవితరంగం లోనూ చర్చ జరుగుతున్నది.

కారంచేడు హత్యాకాండ జరిగిన నాటినుండి కులానికీ పౌరహక్కులకూ ఉన్న సంబంధాన్ని గురించి పౌరహక్కుల ఉద్యమం ఆలోచిస్తూ ఉంది. దళితుల ఉద్యమాల నుండి, ఆకాంక్షల నుండి నేర్చుకుంటూ ఉంది. తన ఆచరణ ద్వారా దళిత ఉద్యమాలకు సహాయ సహకారాలు అందిస్తూ ఉంది. ఈ క్రమంలో తన అవగాహనను పెంచుకుంటూ ఉంది.

అగ్రకులాలకు చెందిన గ్రామీణ పెత్తందారీ మూకలు దళితులపైన దాడిచేసి గృహాలు దహనం చేసినప్పుడు, బరిసెలతో గొడ్డళ్ళతో దళితులను పొడిచి నరికి పోగులు పెట్టినప్పుడు 'ఇది ఘోరం, అన్యాయం' అని అనుకోవడం, దోషులను శిక్షించడం కోసం కృషి చేయడం, న్యాయం కోసం జరిగే దళితుల ఉద్యమా లలో పాల్గొనడం ఒకెత్తు.

ఈ హింస వెనుక ఉన్న వ్యవస్థను, దాని నిర్మాణాన్నీ, భావజాలాన్నీ గుర్తించడం ఇంకొకెత్తు. ఆ నిర్మాణం, భావజాలం నాశనం కానిదే ఈ దాడులు ఆగవని పౌరహక్కుల ఉద్యమం గుర్తించింది. కులనిర్మూలన జరగనిదే 'ప్రజాస్వామ్యం' అనే మాటకు భారత సమాజంలో నిండయిన అర్థం రాదని గుర్తించింది.

కారంచేడు, చుండూరు వంటి దాడులు కులవ్యవస్థలో ఉండే భౌతిక దౌర్జన్యాన్నీ హింసనూ కళ్ళకు కట్టినట్టు చూపించాయి. ఆ హింస వెనుక దాగి ఉన్న అమానుషమయిన విషవ్యవస్థ పైన చర్చను ఆహ్వానించాయి.

మండల్ కమీషన్ ప్రతిపాదనలను అమలు చేస్తానని కేంద్ర ప్రభుత్వం ప్రకటించినప్పుడు కులవ్యవస్థలోని భౌతిక హింసేకాక తాత్విక హింస కూడ బయటకు వచ్చింది. దళితులకు సంపూర్ణమయిన మనుషులుగా గుర్తింపు ఇవ్వని బ్రాహ్మణీయ సంస్కృతి కొత్త నినాదాలతో, ఆధునిక పరిభాషతో ముందుకొచ్చింది. భౌతిక దాడులనూ హింసనూ అరికడితే చాలదనీ, సామాజిక నిర్మాణం, సంస్కృతి, భావజాలం తదితర రంగాలన్నిటిలోనూ కులనిర్మూలన కోసం కృషి జరగకపోతే ఆ హింసకు పునాది అయిన వ్యవస్థ నాశనం కాదనీ 'మండల్' సంఘర్షణ స్పష్టంగా చూపించింది.

ఈ కృషి ఏ విధంగా జరగాలనే విషయంలో రాజకీయ విభేదాలుంటాయి. విభిన్న రాజకీయ సిద్ధాంతాల మధ్య ఘర్షణ ఉంటుంది. ఆధునిక కాలంలో ఈ కృషిని రాజకీయంగా చేపట్టిన పెరియార్, ఫూలె, అంబేద్కర్ వంటి వాళ్లు తమ సిద్ధాంత దృక్పథాన్ని ప్రతిపాదించారు. వాళ్ల ఆలోచనల ప్రేరణతో కృషి కొనసాగుతూ ఉంది. అందులో భాగంగానే ఈ రోజు బహుజన సమాజ్ పార్టీ ఒక కొత్త రాజకీయ శక్తిగా దేశ రాజకీయాలలో ముందుకు వచ్చింది. కానీ కులనిర్మూలన గురించి ఇందుకు భిన్నమైన ఆలోచనలు, సిద్ధాంతాలు ఉన్నాయి, ఉంటాయి.

ఈ వివిధ ఆలోచనల తప్పొప్పులను, సాధ్యాసాధ్యాలను బేరీజు వేయడం పౌరహక్కుల సంఘం ఉద్దేశ్యం కాదు. ఈ ఆలోచనల నేపథ్యంలో కులనిర్మూలనను ఒక ప్రజాతంత్ర కర్తవ్యంగా గుర్తించి దాని ఆవశ్యకతను వివరంగా చర్చించవలసిన అవసరం ఉందని పౌరహక్కుల సంఘం భావిస్తూ ఉంది.

మనిషయి పుట్టిన కారణంగా ప్రతి ఒక్కరికి కొన్ని సహజ హక్కులుంటాయనేది ఒక బలమయిన ప్రజాతంత్ర భావన. ఏవి 'సహజ హక్కులు' అని నిర్వచించడంలో అభిప్రాయభేదాలకు తావు ఉన్నా ఈ భావన ప్రజాతంత్ర దృక్పథానికి కీలకమయింది. వర్ణ వ్యవస్థ, వర్ణ ధర్మం, బ్రాహ్మణీయ భావజాలం దీనికి బద్ధ శత్రువులు. అసలు వర్ణ ధర్మం ప్రకారం 'మనిషయి పుట్టడం' అనే మాటకే అర్థం లేదు. బ్రాహ్మణులుగా పుడతారు. శూద్రులుగా పుడతారు. అతి శూద్రులుగా పుడతారు. ఆడవాళ్ళుగా పుడతారు. మగవాళ్ళుగా పుడతారు. కాబట్టి పుట్టినందుకు ఎవరికీ సహజ హక్కు లుండవు. సహజ ధర్మాలు మాత్రమే ఉంటాయి. ధర్మం అంటే పుట్టిన పుట్టుకను అనుసరించి జీవితాన్ని ఆచరించడం.

ఈ సహజ ధర్మాల సమాజం, సమాన విలువ ఉన్న మనుషుల సమూహం కాదు. అదొక హెచ్చుతగ్గుల నిచ్చెన. నిచ్చెన కింది నుండి మీదికి, మీది నుండి కిందికి పోయే హక్కు, అవకాశం ఎవరికీ లేదు. మీది మెట్ల మీద ఉన్నవాళ్లకు పరపతి ఎక్కువ, అధికారం ఎక్కువ, అవకాశాలు ఎక్కువ. ఎంత మీదికి పోతే అంత ఎక్కువ. ఎంత కిందికి పోతే అంత తక్కువ. ప్రజాస్వామ్య భావనకు ఇంతకంటే పూర్తిగా విరుద్ధమయిన వ్యవస్థ వేరే ఏదీ ఉండదు. అందుకే దీనిని వ్యతిరేకించిన వాళ్ళందరినీ పాశ్చాత్య దేశాల ప్రజాతంత్ర విప్లవంలో పుట్టిన 'సహజ హక్కుల' భావన ఆకర్షించింది. జ్యోతిబా పూలే థామస్ పెయిన్‌ను ఉటంకించాడు. అంబేద్కర్ ఫ్రెంచి విప్లవ ఆశయమైన 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం' అనే లక్ష్యాన్ని ఉటంకించాడు.

వర్ణ ధర్మ నిచ్చెన వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాల ఫలితంగా భారత రాజ్యాంగం దానిని నిషేధించింది. రాజ్యాంగ పరిషత్ డ్రాఫ్టింగ్ కమిటీ అధ్యక్షుడయిన అంబేద్కర్ దీనికోసం ప్రత్యేకంగా కృషి చేసాడు. రాజ్యాంగంలోని ఆర్టికల్ 14 పరోక్షంగా కులవ్యవస్థను నిషేధిస్తే, ఆర్టికల్స్ 15, 16, 17 ప్రత్యక్షంగానే కులనిషేధాన్ని ప్రస్తావించాయి. కులం ఫలితంగా పుట్టిన వివక్ష సంపూర్ణంగా పోయేటటువంటి సామాజిక వ్యవస్థ కోసం భారత ప్రభుత్వం కృషి చేయాలని రాజ్యాంగ ఆదేశిక సూత్రాలు చెప్తాయి.

ఇదొక చెప్పుకోదగ్గ మార్పే.

అయినా సామాజిక ఆర్థిక రాజకీయ జీవితంలో కులవ్యవస్థ, వర్ణధర్మం, బ్రాహ్మణ సంస్కృతి ఈనాటికీ బలంగానే ఉన్నాయి. కారంచేడు, చుండూరు వంటి దాడులు కేవలం రోగ లక్షణం మాత్రమే. సమాజంలో ఆస్తి, సంపద, అధికారం, హోదా....ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని రకాల పెద్దరికం కొద్దిశాతంగా ఉన్న అగ్రకులాల చేతిలోనే ఉంది. ఈ వివక్ష ఉన్నంతకాలం సమాన అవకాశాలు అనే మాటకు అర్థం లేదు. భౌతిక జీవితంలో ఉన్న ఈ వివక్షకు తగిన భావజాలం, ఆలోచనలు తాత్విక జీవితంలోనూ, సంస్కృతిలోనూ కూడా చాలా ప్రబలంగా ఉన్నాయి. ఈ రోజు అవన్నీ 'హిందూత్వం' అనే రాజకీయ సిద్ధాంతంతో వర్ణ ధర్మ సంరక్షణ కోసం రాజకీయ పార్టీల రూపంలో, 'స్వయంసేవా' సంస్థల రూపంలో, ధర్మ సంసద్ రూపంలో ముందుకు వస్తున్నాయి. పైకి హిందూత్వం కేవలం మైనారిటీలకు శత్రువుగా కనిపించినా నిజానికి అది వర్ణ ధర్మ సంరక్షణ కోసం - అందులో భాగంగా దళితుల అణచివేత కోసం - ముందుకొస్తున్నదని స్పష్టంగానే

తెలుస్తోంది. ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ మధ్యంతర ఎన్నికలలో దళితుల స్పందనే ఈ విషయాన్ని రుజువు చేసింది.

జీవితంలోని అన్ని రంగాలలో అలుముకొనిపోయి ఉన్న కులవ్యవస్థ సమూల నిర్మూలనం జరగనిదే భారతదేశాన్ని ఒక ప్రజాతంత్ర సమాజంగా మార్చే కృషి పరిపూర్ణం కాదు. ఆ ఆవశ్యకత గురించి, అందుకోసం దేశంలోని వివిధ ప్రాంతాలలో జరిగిన, జరుగుతున్న ప్రయత్నాల గురించి చర్చించుకునేందుకే ఈ సదస్సు.

**ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కరపత్రంగా వచ్చింది**

**25 ఏప్రిల్ 1994**



# సమానత్వం ఒక ప్రజాస్వామిక హక్కు

భారతదేశంలో కులవ్యవస్థ చేత, పురుషాధిక్య సామాజిక వ్యవస్థ చేత అణచివేయబడ్డ ప్రజానీకం సమాన ప్రతిపత్తి కోసం, సమాన అవకాశాల కోసం ఆందోళనలు, పోరాటాల ఫలితంగా విద్యా, ఉద్యోగ, రాజకీయ రంగాలలో రిజర్వేషన్లు కొంతమేరకు కల్పించడం జరిగింది. ఇవి బ్రిటిష్ పాలనా కాలంలోనే కొన్ని రాష్ట్రాలలో మొదలయ్యాయి. స్వాతంత్ర్యానంతరం కొనసాగాయి. విస్తృతం అయ్యాయి.

ప్రభుత్వ ఉద్యోగాలలోనయినా వేరే ఏ విషయంలోనయినా కులం, జాతి, ప్రాంతం, లింగం, మతం అనే వివక్షకు స్థానం ఉండడానికి వీలులేదని భారత రాజ్యాంగం ఆర్టికల్స్ 15, 16లలో అంటుంది. ఇవి ప్రాథమిక హక్కుల జాబితాలో ఉన్నాయి. అంటే సంప్రదాయ బ్రాహ్మణీయ 'ధర్మం' ఇకమీదట చెల్లదని, అది రాజ్యాంగ విరుద్ధమని భారత రాజ్యాంగం అంటుంది.

వివక్ష చెల్లదని ప్రకటిస్తే సరిపోదు. దానిని సామాజిక వ్యవస్థ నుండి పూర్తిగా పెకిలించివేసి అందరికీ సమాన ప్రతిపత్తినీ సమాన అవకాశాలనూ కల్పించాలి. ఇదొక సామాజిక ఆర్థిక రాజకీయ కృషి. ఒక మౌలిక ప్రజాతంత్ర కృషి. అయితే ఇది రాజ్యాంగం చేసి పెట్టగల పని కాదు. రాజ్యాంగం చేయగలిగినది ఈ కృషికి అవసరమైన హక్కులనూ, అధికారాలనూ, సూత్రాలనూ, ప్రమాణాలనూ ప్రతిపాదించడం మాత్రమే.

ఆర్టికల్స్ 15, 16లలో కులం, లింగం, మతం, జాతి తదితర వ్యవస్థీకృత వివక్షలు చెల్లవని ప్రకటించిన భారత రాజ్యాంగం, ఆ అసమానత్వాన్ని పోగొట్టడానికి దోహదపడే ప్రత్యేక చర్యలు చేపట్టే అవకాశాన్ని కూడా ప్రభుత్వానికి ఇచ్చింది. 'సామాజిక ఆర్థిక

రాజకీయ న్యాయం' భారత రాజ్యాంగ లక్ష్యం కాబట్టి ఆ అవకాశాన్ని ప్రభుత్వం తనకు బుద్ధిపుడితే ఉపయోగించుకోవచ్చుననీ, లేకపోతే లేదనీ వాదించడానికి వీలులేదు. వాటిని ప్రభుత్వం క్రియాశీలకంగా ఉపయోగించుకుని సాంఘిక ఆర్థిక అసమానతలను ప్రయత్నపూర్వకంగా పోగొట్టాలి. రాజ్యాంగం ప్రభుత్వానికి ఇచ్చిన ఈ అవకాశాలు నిజానికి వివక్షకూ పీడనకూ గురి అయిన ప్రజల హక్కులు. ఇవి కేవలం ప్రభుత్వం అధికారాలు కావు. ఆ హక్కులు వారికి దక్కేటట్టు చూడడం ప్రభుత్వం బాధ్యత. జాతి జీవన వ్యవస్థలన్నిటిలోనూ సామాజిక ఆర్థిక రాజకీయ న్యాయం నెలకొనేటట్టు విధానరచన చేయడం ప్రభుత్వం బాధ్యత అని భారత రాజ్యాంగంలోని ఒక ముఖ్య ఆదేశిక సూత్రం అయిన ఆర్టికల్ 38 అంటుంది. తరతరాలుగా అన్యాయానికి గురయిన పీడిత కులాలకూ, ఆదివాసులకూ, స్త్రీలకూ న్యాయం చేకూర్చే అధికారాన్ని ప్రభుత్వం తగురీతిలో వినియోగించుకుని తీరాలి. దళితులు, ఆదివాసుల (రాజ్యాంగ పరిభాషలో షెడ్యూల్డు కులాలు, తెగల) విషయంలోనయితే ఏ అనుమానానికీ ఆస్కారం మిగిలించకుండ, ప్రభుత్వ ఉద్యోగ నియామకాలలో ఆ వర్గాల అవసరాలను తప్పనిసరిగా లెక్కలోకి తీసుకోవాలని ఆర్టికల్ 335 స్పష్టం చేస్తుంది.

ఈ హక్కులూ, అవకాశాలూ రాజ్యాంగంలో ఉన్నాయంటే దానికి కారణం పీడితులు చేసిన ఆందోళనలు, పోరాటాలే. అవి నిజంగా అమలుకావాలన్నా లేక మరింత విస్తృతం కావాలన్నా పోరాటాలు అవసరమే. దళితులు, స్త్రీలు, ఆదివాసులు స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తరువాత అనేక ఉద్యమాలు చేసారు. చట్టసభలలోనూ, బయటా కూడా చేసారు. వాటి ఫలితంగా విద్యా ఉద్యోగ రాజకీయ రంగాలలో రిజర్వేషన్లు, ఆర్థిక పురోభివృద్ధికి కొన్ని ప్రత్యేక సదుపాయాలు, సబ్సిడీలు, సులభ రుణాలు మొదలైనవి ప్రభుత్వ విధానాలలో చోటుచేసుకున్నాయి. దళితులు, ఆదివాసులతో మొదలుపెట్టి కాలక్రమంలో వెనుకబడిన కులాలకూ, స్త్రీలకూ ఇవి కొంతమేరకు విస్తరించాయి. కేంద్రప్రభుత్వం అధీనంలో ఉన్న విద్య, ఉద్యోగ రంగాలలో వెనుకబడిన కులాలకు రిజర్వేషన్లు మండల్ కమిషన్ ద్వారా ఈ మధ్యనే లభించాయి. దానికోసం దేశ రాజకీయ సామాజిక రంగాలలో జరిగిన సంఘర్షణను మనమింకా మరచిపోలేదు. స్త్రీల విషయంలోనయితే ఒక జాతీయ విధానమేదీ లేదు. మన రాష్ట్ర ప్రభుత్వం ఈ మధ్యనే విద్యా ఉద్యోగ రంగాలలో స్త్రీలకు 33 శాతం రిజర్వేషన్లు ప్రకటించింది. చట్ట సభలలో దళితులకు, ఆదివాసులకే తప్ప స్త్రీలకు, వెనుకబడిన కులాలకూ రిజర్వేషన్లు లేవు. నూతన పంచాయతీ రాజ్ వ్యవస్థ మాత్రం పంజాయతీరాజ్ పదవులలో వారికి రిజర్వేషన్లు కల్పించింది.

అయితే రాజ్యాంగం 'ఇకపైన చెల్లదు' అని ప్రకటించిన బ్రాహ్మణీయ వర్ణ వివక్ష, స్త్రీ పురుష అసమానత సమాజంలో బలంగా వ్యవస్థితమయి ఉన్నాయి కాబట్టి సమానత్వ సాధన చట్టాలలో, ప్రభుత్వ విధాన ప్రకటనలలో కనిపించినంతగా వాస్తవానికి పురోగమించలేదు. ఆధిపత్యం వల్ల ప్రయోజనం పొందేవారు పురోగమించనివ్వరు. ఉద్యోగ రిజర్వేషన్లలో 'బ్యాక్‌లాగ్' పోస్టులు దండిగా ఉన్నాయి. 'బ్యాక్‌లాగ్' అన్నమాట ఉపయోగించడం వల్ల అవి కాకతాళీయంగా నిండకుండా ఉండిపోయాయన్న ధ్వని ఉంటుంది. కొన్ని సందర్భాలలో నిజంగానే ఆయా పీడిత కులాలలో ఆ ఉద్యోగానికి కావలసిన డిగ్రీలు, అనుభవం గలవారు దొరకక పోవచ్చును. కానీ ఎక్కువ భాగం ఇవి నిండకుండా ఉండిపోయినవి కావు. నింపకుండా ఉండిపోయినవి. వాటిని నింపకుండా మిగులబెట్టడానికి ఆధిపత్య కులాలవాళ్ళు అనేక ఎత్తుగడలు అవలంబిస్తుంటారు. ప్రభుత్వశాఖల కంటే విద్యాసంస్థలలో ఇది ఎక్కువగా ఉంది. అడ్వర్‌టైజ్‌మెంట్ లేకుండా, రోస్టర్ ప్రమాణాలు పాటించకుండా, పార్ట్‌టైం లేక అడ్‌హక్ పోస్టులుగా తమ సన్నిహితులకు, ఆశ్రితులకు, ఒక్కొక్కసారి డబ్బులు ముట్టజెప్పిన వారికి ఇచ్చి, వారికి 'హక్కులు' కల్పిస్తారు. తమ క్వాలిఫికేషన్స్ మెరుగుపరచుకునే అవకాశం కల్పిస్తారు. చివరికి ఆ పోస్టు రెగ్యులరైజ్ అయినప్పుడు అప్పటికే సర్వీస్‌లో ఉన్నారని చెప్పి వారికే ఇప్పిస్తారు.

పంచాయతీరాజ్ వ్యవస్థలో రిజర్వ్ పోస్టులలో ఎన్నికయ్యేది ఒకడయితే పెత్తనం చేసేది ఇంకొకడు. సర్పంచ్ దళితుడయితే ఉపసర్పంచ్ అయిన ఆధిపత్య కులస్తుడే అసలు సర్పంచ్ అవుతాడు. సర్పంచ్ స్త్రీ అయితే ఆమె భర్తే సర్పంచ్ కుర్చీలో కూర్చుంటాడు. ఆర్థికరంగంలో కల్పించిన సబ్సిడీలు, రుణాలు, ప్రత్యేక సదుపాయాలు కూడా బినామీగా, బలవంతంగా బలవంతుల పాలవుతున్నాయి.

సమానత్వం దిశగా సాధించుకున్న చట్టపరమైన హక్కులను వాస్తవంగా పొందడానికి పీడితులు మళ్లీ పోరాటం చేయవలసి ఉంటుందని దీనిని బట్టి అర్థం అవుతుంది. ఇది ఒక్క రిజర్వేషన్ల విషయంలోనే కాక అన్ని హక్కులకూ వర్తిస్తుందనేది పౌరహక్కుల ఉద్యమం అనుభవం.

అయితే ఇదంతా ఒకెత్తయితే, ఇప్పుడు జరుగుతున్న పరిణామాలు ఒకెత్తు. ఇప్పటివరకు పీడిత కులాలు, ఆదివాసులు, స్త్రీలు వ్యక్తం చేసిన ఆకాంక్షలకు ఆ మాత్రమైనా స్పందన రావడానికి గల కారణం 'సామాజిక ఆర్థిక రాజకీయ' న్యాయం సాధించడంలో ప్రభుత్వానికి గల బాధ్యతను గుర్తించడం, దానికోసం ప్రభుత్వం

చేపట్టవలసిన కర్తవ్యాలను గుర్తించడం. ఇప్పుడు ఈ గుర్తింపే పక్కకుపోతూ ఉంది. పెట్టుబడిదారులకు అవసరమైన సదుపాయాలు కల్పించే బాధ్యత, పోలీసు వ్యవస్థను సమర్థంగా నడిపే బాధ్యత - ఇవి తప్ప ప్రభుత్వానికి సమాజంపట్ల వేరే బాధ్యతలేవీ లేవనేది ప్రస్తుతం అంతర్జాతీయంగానే ఆధిపత్య స్థానంలో ఉన్న దృక్పథం. ఇదే ఈ రోజు భారత ప్రభుత్వం దృక్పథం. దీనిని అమలుచేసే క్రమంలో సామాజిక న్యాయాన్ని సాధించే బాధ్యతను, ఆర్థిక సాంఘిక రంగాలలో నిర్వహించవలసిన కర్తవ్యాలను ప్రభుత్వం ఒకటొకటిగా వదులుకుంటూ ఉంది. గతంలో ప్రభుత్వం నిర్వహించిన కర్తవ్యాలు ఒకటొకటిగా ఇప్పుడు ప్రైవేట్‌పరం అవుతున్నాయి. విద్యాసంస్థలు, ఆస్పత్రులు, కీలక పరిశ్రమలు, రవాణావ్యవస్థ, ప్రైవేట్ పెట్టుబడిదార్ల లాభాల వేటకు వేదికలవుతున్నాయి

దీనివల్ల రాగల అనేక దుష్ఫలితాలు అటుంచి, విద్యా ఉద్యోగరంగాలలో దళితులు, ఇతర పీడితకులాలు, ఆదివాసులు, స్త్రీలు ఇప్పటిదాకా సాధించుకున్న రిజర్వేషన్ హక్కుకు పునాది ఎగిరిపోతుంది. మళ్లీ చాతుర్వర్ణం విద్యా ఉద్యోగ రంగాలలో నెలకొనే పరిస్థితి పునరావృతం అవుతూఉంది. స్త్రీలు మళ్లీ వంటింట్లోకి, దళితులు అసంఘటిత కార్మిక రంగంలోకి నెట్టబడే రోజులు తిరిగి వస్తున్నాయి. ఇప్పటిదాకా ఈ విషయంలో సాధించుకున్న పాక్షికమైన ప్రజాస్వామిక ప్రగతికి ఇది గొడ్డలిపెట్టు.

ప్రైవేట్ రంగంలోని ఉద్యోగాలు ప్రస్తుతం ఎవరి గుప్పిట్లో ఉన్నాయన్న విషయాన్ని పరిశీలిస్తే, రేపు సమాజవ్యాప్తంగా రాబోయే పరిస్థితి కొంత అర్థం అవుతుంది. పౌరహక్కుల సంఘం హైదరాబాదు, వరంగల్, నెల్లూరు, కృష్ణ, పశ్చిమగోదావరి, విజయ నగరం జిల్లాలలోని 13 ప్రైవేట్ విద్యాసంస్థలలో ఈ పరిశీలన జరిపింది. ఆ 13 విద్యా సంస్థలలోని 376 మంది అధ్యాపకులలో 310 మంది బ్రాహ్మణ, కమ్మ, రెడ్డి తదితర ఆధిపత్య కులాలకు చెందినవారు. 54 మంది బి.సి. కులాలవారు, 11 మంది షెడ్యూల్డు కులాలవారు కాగా ఒక వ్యక్తి మాత్రమే షెడ్యూల్డు తెగకు చెందినవాడు. 376 మందిలో 60 మంది మాత్రమే స్త్రీలు. మళ్ళీ స్త్రీలకు కొంత ఉద్యోగ అవకాశాలుండేది అధ్యాపక రంగంలోనే!

విద్యా సంస్థలలోని అధ్యాపక, అధ్యాపకేతర సిబ్బందిని (ప్రొఫెసర్ల నుండి స్వీపర్లదాకా) తీసుకుంటే చాతుర్వర్ణం నమూనాయే కనిపిస్తుంది. వరంగల్‌లోని కాకతీయ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అండ్ సైన్సెస్‌ను ఒక ఉదాహరణగా తీసుకోవచ్చును.

| | ఎస్.సి, ఎస్.టి | బి.సి | ఆధిపత్య కులాలు | మొత్తం |
|---|---|---|---|---|
| అధ్యాపకులు, ఆఫీసర్లు ఆఫీసు సూపరింటెండెంట్లు | - | 4 | 65 | 69 |
| గుమాస్తాలు, స్టెనోలు | 1 | 3 | 17 | 21 |
| టెక్నికల్, సపోర్టింగ్ సిబ్బంది, డ్రైవర్లు, అటెండర్లు, వాచ్‌మెన్, కాంపౌండర్లు | 9 | 49 | 17 | 75 |
| మాలీలు, స్వీపర్లు | 10 | 1 | - | 11 |

ప్రైవేట్ పారిశ్రామిక రంగంలోని పరిస్థితి కూడా ఇంతకంటే భిన్నంగా లేదు. విశాఖ పట్నంలోని కోరమండల్ ఫెర్టిలైజర్‌ను ఉదాహరణగా తీసుకుంటే అందులోని 400 మంది సూపర్‌వైజర్, టెక్నికల్ సిబ్బందిలో గిరిజనులొక్కరూ లేరు. బి.సి కులాలవారు 35 మంది, దళితులు 18 మంది మాత్రం ఉన్నారు. మిగిలిన 347 మంది ఆధిపత్య కులాలవారే. ఉద్యోగహోదా తగ్గే కొద్దీ ఎస్.సి., బి.సి. కులాలవారి సంఖ్య పెరుగుతుంది. అయితే స్త్రీలు మాత్రం కోరమండల్‌లోని 635 మంది సిబ్బందిలో ఇద్దరే ఇద్దరు! గిరిజనులు ఒక్కరూ లేరు. కడప జిల్లా యెర్రగుంట్లలోని జువారి సిమెంట్ ఫ్యాక్టరీలో మొత్తం 149 మంది సిబ్బందిలో (పర్మనెంట్ కార్మికులను కలుపుకుని) ఒక్క స్త్రీ కూడా లేదు. ప్రైవేట్ పారిశ్రామిక రంగంలో స్త్రీల స్థానం అన్నిచోట్లా ఇదే మోతాదులో కనిపిస్తుంది. కర్నూలు జిల్లా ఆదోనిలోని రాయలసీమ స్పిన్నింగ్ మిల్లులోని 61 మంది సిబ్బందిలో ఇద్దరు మాత్రమే స్త్రీలు. కాజువల్, కాంట్రాక్టు కార్మికులను, అసంఘటిత రంగాన్నీ లెక్కలోకి తీసుకుంటేనే స్త్రీలు కనిపిస్తారు.

ఒక్కమాటలో చెప్పాలంటే మన సాంఘిక వ్యవస్థలోని అసమానత, ఆధిపత్యం ప్రైవేట్ రంగంలోని ఉద్యోగాలలో ప్రతిఫలిస్తుంది. దేశవిధానాలలో ప్రైవేటీకరణ పెరిగే కొద్దీ ఈ అప్రజాస్వామిక స్థితి మరింతగా విస్తరిస్తుంది. దీనిని ఎదుర్కొనే ప్రజాతంత్ర కర్తవ్యం ప్రగతిశీలులందరి మీదా ఉంది. కనీసం ప్రభుత్వ రంగంలో ఉన్న రిజర్వేషన్లను ప్రైవేట్ రంగానికి కూడా వర్తింపజేయనిదే ఇప్పటికి సాధించుకున్న ప్రగతిని కూడ కాపాడుకోలేము.

**ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కరపత్రంగా వచ్చింది**

**సెప్టెంబర్ 1995**



# చలపతిరావును, విజయవర్ధనరావును ఉరితీయాల్సిందేనా?

చిలకలూరిపేట బస్సు దహనం కేసులో ఉరిశిక్ష పడిన సాతులూరి చలపతిరావును, గంటెల విజయవర్ధనరావును మరణదండన నుండి తప్పించమని కోర్టులను, ప్రభుత్వాన్నీ పౌరహక్కుల సంఘం ఎందుకు కోరుతూ ఉందో వివరించమని చాలామంది అడుగుతున్నారు. ఉద్దేశ్యపూర్వకంగా బస్సుకు నిప్పుపెట్టి 23 మంది అభం శుభం ఎరుగని ప్రయాణీకులను చంపిన హంతకులకు ఉరి తప్పించడానికి ప్రయత్నించడం ఒక పౌరహక్కుల సంఘం చేయవలసిన పనేనా? చేయడానికి ఇంత కంటె మంచి పనులేవీ లేవా? చంపినప్పుడు వాళ్ళకు లేని దయ వాళ్ళపైన మనకెందుకుండాలి? చంపినవాళ్ళ జీవించే హక్కు గురించి మాట్లాడే వాళ్ళు చచ్చిన వాళ్ళ జీవించే హక్కు గురించి ఏమంటారు? చంపిన వాళ్ళు పేద నిరుద్యోగ దళిత యువకులు కాబట్టి సానుభూతి చూపించాలంటున్నారే, మరి చచ్చిన 23 మందీ బలిసిన కులాలకూ, వర్గాలకూ చెందినవారేనా? వాళ్ళ గురించి పౌరహక్కుల సంఘానికి బాధ లేదెందుకు?

ఈ ప్రశ్నలు, ఇటువంటి ప్రశ్నలు, గడిచిన మూడు నెలలుగా పౌరహక్కుల సంఘాన్ని రాష్ట్రమంతటా వెంటాడుతున్నాయి. ఇవి పూర్తిగా అహేతుకమైన ప్రశ్నలు కావు. వీటికి హేతుబద్ధంగా సమాధానం చెప్పవలసిందే. మన ఆత్మ సంతృప్తికి మనం ఏవో జవాబులు చెప్పుకొని, ఒప్పుకోని వారికి తెలివి లేదనో మనసు లేదనో సర్దిచెప్పుకుంటే సరిపోదు. చెప్పే జవాబు ప్రశ్నించే వాళ్ళ ఆలోచనలను తాకగలిగింది కావాలి. ఆలోచనలు మారాలంటే సంభాషణ జరగాలి. ఏక పక్షమైన సిద్ధాంత వివరణ కాదు.

ఈ ప్రశ్నలకు హేతుబద్ధమైన జవాబులు వెతికే ప్రయత్నం చేస్తాము. అయితే వీరిద్దరి ఉరిశిక్ష విషయంలో మన రాష్ట్రంలో వ్యక్తమవుతున్న ఆవేశంలో ఉన్న ఒక అహేతుకమైన అంశాన్ని మాత్రం ముందు ప్రస్తావించాలి. గడిచిన 17 సంవత్సరాలుగా మన రాష్ట్రంలో ఎవ్వరికీ మరణదండన అమలు చేయలేదు. ఎంత ఘోరమైన హత్యలు చేసిన వారికైనా యావజ్జీవ కారాగార శిక్ష మాత్రమే వేస్తున్నారు. క్రింది కోర్టు ఒకవేళ మరణదండన విధించినా పై కోర్టులు దానిని సడలిస్తున్నాయి. ఈ 17 సంవత్సరాలలో మన రాష్ట్రంలో దాదాపు 40 వేల హత్యలు జరిగాయి. అందులో క్రూరంగా, పకడ్బందీగా, వ్యూహాత్మకంగా చేసిన హత్యలు ఎన్నో ఉన్నాయి. వాటిలో ఏ ఒక్కదానికీ ఎవరినీ ఉరితీయలేదు. చాలామందికసలు ఏ శిక్షా పడలేదు. ఈ హంతకులందరినీ ఉరితీయవలసిందేనని రాష్ట్రంలో ఎప్పుడూ ఎవరూ ఆందోళన చేయలేదు. పెద్దగా ఆవేశపడలేదు. పత్రికలకు ఘాటైన ఉత్తరాలు రాయలేదు. కానీ ఉరిశిక్షపడిన చలపతిరావు, విజయవర్ధనరావులను ఉరి తీయకపోతే మాత్రం ఈ రాష్ట్రానికింక మనశ్శాంతి ఉండదేమో అనిపించేంతగా అందరూ ఆవేశపడుతున్నారు. ఇది ఎంతవరకు సహేతుకం అనేది అందరూ కొంచెం ఆలోచిస్తే బాగుంటుంది.

ఆ ఇద్దరినీ ఉరితీయవలసిందేననే వాళ్ళు వేస్తున్న ప్రశ్నలకు సమాధానం చాలా కోణాలనుండి చెప్పవచ్చును. ఈ కేసులకు సంబంధించిన వాస్తవాలను బట్టి వారిద్దరికీ 'క్షమాభిక్ష' కోరడం సబబని వాదించవచ్చును. ఉరిశిక్షను గురించి భారత సుప్రీంకోర్టు ప్రవచించిన ప్రామాణిక సూత్రాలను ఆధారం చేసుకొని వాదించవచ్చును. నేరం - శిక్ష అనే విషయాల గురించి న్యాయశాస్త్రంలోనూ సామాజిక శాస్త్రాలలోనూ చాలా కాలంగా జరుగుతున్న చర్చను ప్రాతిపదిక చేసుకొని వాదించవచ్చును. నేరానికీ శిక్షకూ ఉండే సాంఘిక ఆర్థిక నేపథ్యాన్నీ స్వభావాన్నీ ప్రామాణికంగా తీసుకొని వాదించవచ్చును. వాటిన్నిటిలోనూ మళ్ళీ ఉపకోణాలు కూడా ఉంటాయి.

పైవాటిలో ఏ కోణాన్ని ప్రమాణం చేసుకుని చూసినా చలపతిరావు, విజయవర్ధనరావులను ఉరితీయకుండా కారాగార శిక్షతో సరిపెట్టుకోవడం సబబని సహేతుకంగానే వాదించవచ్చును. పూర్తి వివరాలలోకి పోకుండా క్లుప్తంగా ఒక్కొక్క కోణం నుండి విషయాన్ని వివరిస్తాము.

1. చిలకలూరిపేట బస్సు దహనం కేసుకు సంబంధించిన ఒక ముఖ్య వాస్తవం ఏమిటంటే చలపతిరావు, విజయవర్ధనరావులు నేరచరిత్ర కలిగిన వ్యక్తులు కారు. వాళ్ళు గతంలో ఎప్పుడూ ఏ నేరమూ చేయలేదు. వాళ్ళ జీవితం నేర

ప్రపంచానికి చాలా దూరం. ఇద్దరూ కాయకష్టం చేసుకుని బ్రతికిన పట్టణ ప్రాంత దళితులు. పట్టణ ప్రాంత అసంఘటిత కార్మికరంగం నిత్యం ఎదుర్కొనే దుర్భర పరిస్థితులు వాళ్ళను క్రుంగదీసాయి. సరళమైన వచనశైలిలో చలపతిరావు చెప్పుకున్న తన కథలోనే అతని బాధలు తెలుసుకునే అవకాశం తెలుగు పాఠకులకు ఉంది. అతనిని ఉరితీసినా తీయకపోయినా దానిని ఏదో ఒక పత్రిక ప్రచురిస్తుందని ఆశిస్తాము.

కాబట్టి వీళ్ళిద్దరి నుండి సమాజాన్ని (ప్రైవేట్ ఆస్తినే కానివ్వండి) కాపాడవలసిన అవసరం ఏమీ లేదు. వాళ్ళు నేరాలు చేసి తలపండిన వాళ్ళయితే - వాళ్ళను వదిలిపెడితే మళ్ళీ దోపిడీలు చేస్తారని భయపడవచ్చు. కానీ ఈ ఇద్దరి విషయంలో ఆ భయం అనవసరం. వాళ్ళకు గౌరవప్రదమైన శ్రమతో బ్రతుకు గడిచేటట్టయితే మళ్ళీ నేరాన్ని గురించి ఆలోచించరు. నేరస్తులందరి గురించి ఈ మాటలు అనలేకపోవచ్చు. కానీ ఈ ఇద్దరి గురించి కచ్చితంగా అనగలము. అటువంటప్పుడు వాళ్ళను హతమార్చి 'పీడ' విరుగడ చేసుకోవాల్సిన అవసరం సమాజానికి ఏముంది? వాళ్ళు బ్రతికి ఉంటే జైల్లోనయినా బయటయినా శ్రమచేసి సమాజాన్ని సంపన్నం చేస్తారు కదా?

2. ఈ కేసుకు సంబంధించిన మరొక ముఖ్యమైన వాస్తవం ఏమిటంటే వాళ్ళు బస్సును కావాలని తగులబెట్టలేదు. ప్రయాణీకులను చంపాలనీ చంపలేదు. బస్సులో పెట్రోల్ పోసి బెదిరించి దోచుకుందామని మాత్రమే వాళ్ళు అనుకున్నారు. కానీ (వాళ్ళ అనుభవరాహిత్యం వల్ల) తాము ఊహించిన దానికంటే భిన్నంగా బస్సు సిబ్బంది, ప్రయాణీకులు స్పందించేసరికి వాళ్ళు తత్తరపడ్డారు. ప్రయాణీకులు ఎంత గాభరా పడ్డారో వీళ్ళు కూడా అంత గాభరా పడ్డారు. అందరూ ఒకేసారి బస్సునుండి బయటపడాలని ప్రయత్నించారు. ఎట్లా అంటుకుందో గానీ ఈ గొడవలో పెట్రోల్ అంటుకుని బస్సు దహనం అయింది.

రద్దీగా ఉండే బస్సులో పెట్రోల్ పోసి దొంగతనం చేయాలన్న ఆలోచనే బాధ్యతారహితమైనది. (దానికి వారిని పురిగొల్పిన పరిస్థితులేమయినప్పటికీ, వాటికి ఆ బస్సులోని ప్రయాణీకులు బాధ్యులు కారు) ఆ బాధ్యతారాహిత్యం పర్యవసానమే బస్సు దహనం. దానికి చలపతిరావు, విజయవర్ధనరావు శిక్ష అనుభవించక తప్పదు. కానీ ఎంత శిక్ష ఉచితంగా ఉంటుంది? వాళ్ళను ఉరి తీయడమే ఉచితమైన శిక్షా? ముందుగా ఉద్దేశపూర్వకంగా పథకం వేసుకుని, నిపుణులయిన హంతకులను కిరాయికి తీసుకొని, ప్లాన్ వేసి మాటుగాసి చంపిన ఎన్నో కేసులలో రకరకాల కారణాలవల్ల హంతకులు ఉరి తప్పించుకుంటున్నారు.

అటువంటప్పుడు, తాము ఉద్దేశించని ఘటనల వల్ల - వాటికి మూలం తమ బాధ్యతారహితమైన ప్రయత్నమే అయినప్పటికీ - మనుష్యుల చావుకు కారకులయిన వారిని ఉరి తీయాల్సిందేననడం సబబా?

3. మరణదండన భారత రాజ్యాంగం ప్రకారం చెల్లుతుందా చెల్లదా అనే విషయంపై సుప్రీంకోర్టులో చాలాసార్లు వాదోపవాదాలు జరిగాయి. ఇప్పటికీ ఈ చర్చ అయిపోలేదు. ప్రస్తుతం అమలులో ఉన్న సుప్రీంకోర్టు అభిప్రాయం ఏమిటంటే, హత్యకేసులలో మరణదండన సులభంగా వేయకూడదు. అరుదయిన వాటిలోకీ అరుదయిన కేసులలో (Rarest of Rare Cases) మాత్రమే వేయాలి. ఈ వాదనతోనే, సెషన్స్ కోర్టు వేసే మరణదండనను పై కోర్టులు తరుచుగా కొట్టేస్తుంటాయి. కానీ చలపతిరావు, విజయవర్ధనరావుల విషయంలో ఈ వాదనను హైకోర్టు, సుప్రీంకోర్టు ఒప్పుకోలేదు. పోలీసులు తమ చార్జిషీటులో బస్సు దహనాన్ని అసంకల్పితంగా లేక తత్తరపాటుతో జరిగిన చర్యగా కాక ఉద్దేశ్యపూర్వకంగా చేసిన చర్యగా చూపించారు. కోర్టులు దానిని నమ్మాయి. అంతే కాక ముద్దాయిల లక్ష్యాన్ని కూడా కోర్టులు వికృతంగా అర్థం చేసుకున్నాయి. దారిద్ర్యం నుండి బయటపడడానికి చేసిన ప్రయత్నంగా కాక, అడ్డదారులు తొక్కి ధనవంతులు అయ్యే ప్రయత్నంగా అర్థం చేసుకున్నాయి. దేశాన్ని దోచి ధనవంతులయిన వాళ్ళు ఉన్నారు గానీ బస్సులు దోచి ధనవంతులయిన వాళ్ళెవరూ లేరు. అయినా కోర్టులు ఈ ఇద్దరి లక్ష్యాన్ని ఆ విధంగానే అర్థం చేసుకొని, అటువంటి వారికి కరుణ చూపించనవసరం లేదని నిర్ణయించాయి. చలపతిరావు, విజయ వర్ధనరావుల పట్ల న్యాయమూర్తులలో సానుభూతి కొరవడింది. అందులో ఆశ్చర్యమేమీ లేదు. ప్రత్యేకమైన ప్రయత్నం చేయకపోతే మనుషులు 'తమబోటి' వారి పట్ల మాత్రమే సానుభూతితో స్పందించగలరు. ఈ ఇద్దరూ న్యాయ మూర్తులకు 'తమబోటి' వారిగా కనిపించలేదు. కులం, వర్గం కట్టిన గోడలు అడ్డం వచ్చాయి. వాళ్ళ ఆవేదననూ ఆరాటాన్నీ అర్థం చేసుకోలేకపోయారు.

అయినప్పటికీ ఈ ఘటనను 'అరుదయిన వాటిలోకీ అరుదయినది'గా భావించ వలసిందేనా అంటే, చనిపోయిన వారి సంఖ్య కారణంగా అవుననే న్యాయ మూర్తులు నిర్ణయించారు. 23 మంది అమాయకులు చనిపోయారనేది కోర్టులనూ ఇతర ప్రజలనూ ఆవేశానికి గురిచేసింది, చేస్తూ ఉంది. ఇది సహేతుకమైన వైఖరేనా? ఒకవేళ ఆ రోజు బస్సులో అయిదారుగురు మాత్రమే ప్రయాణీకులు ఉండి ఉంటే ఏమయ్యేది? రద్దీ తక్కువ కావడం వల్ల వారిలో కొందరు తప్పించుకుని ఒకరిద్దరు మాత్రం తప్పించుకోలేకపోయారనుకుందాం.

అప్పుడు కోర్టులు ఇంత నిర్దయగా ఉండేవా? ముద్దాయిలకు క్షమాభిక్ష పెట్టాలన్న డిమాండ్ పట్ల ప్రజలకు ఇంత కోపం వచ్చేదా? లేదనుకుంటాము. అంటే ఒక చర్య అసంకల్పితంగా, అనుద్దిష్టంగా, పొరపాటుగా (అది ఎంత ఘోరమైన పొరపాటయినా కానీయండి) జరిగినప్పుడు దాని ఫలితంగా ఎక్కువ మంది చనిపోయినట్టయితే అది 'అరుదైన వాటిలోకీ అరుదైన ఘటన' అయిపోతుందా? ఎవ్వరినీ చంపే ఉద్దేశ్యం వాళ్ళకు లేనప్పుడు ఎంతమంది చనిపోయారనేదాని వల్ల నేరం తీవ్రత పెరగదు. చంపే ఉద్దేశం ఉంటే అది వేరే సంగతి.

ఇంక కోర్టుల సంగతి పక్కన బెట్టి మిగిలిన విషయాలు చూద్దాం.

4. ఒక నేరం చేసిన తరువాత చలపతిరావు, విజయవర్ధనరావులంత సులభంగా చట్టం చేతికి చిక్కిపోయిన వాళ్లు కొద్దిమందే ఉంటారు. పోలీసులు వాళ్ళను ఒకటి రెండు రోజులలోనే అరెస్టు చేశారు. వేగంగా, నిరాటంకంగా నేరపరిశోధన ముగించి, జరిగిన సంఘటనను అతిగా చేసి చూపించే చార్జిషీటు పెట్టారు. సాక్షులందరూ నిర్భయంగా సాక్ష్యం చెప్పారు. కోర్టు నిర్మొహమాటంగా మరణదండన విధించింది.

అన్ని హత్య కేసులూ ఈ విధంగా నడవవు. ముద్దాయిలు సాంఘికంగా, ఆర్థికంగా బలవంతులయినా, ఒక రాజకీయ ఉద్యమానికి చెందిన వారయినా, కనీసం వృత్తి నేరస్తులయినా ఈ క్రమానికి ఎక్కడో ఒక చోట బ్రేక్ పడి ఉండేది. వీళ్ళకు ఆ మూడు లక్షణాలూ లేవు. వీళ్ళిద్దరూ దిక్కుమొక్కులేని దళిత శ్రామికులు. వీళ్ళు పోలీసుల చేతులు తడిపి వారి పరిశోధన కొంచెం తమకు అనుకూలంగా జరిగేటట్టు చూసుకోలేకపోయారు. ఎవరి చేతా ఎస్‌పిగారికో డిఐజిగారికో చెప్పించలేకపోయారు. సాక్షులను కొనలేకపోయారు, బెదిరించలేకపోయారు. కేసుకు అడుగడుగునా సాంకేతిక ఇబ్బందులు కల్పించి (కారంచేడు ముద్దాయిలు చేసినట్టు) సాగదీయలేకపోయారు. వేరే ఏ రకంగానూ తమను తాము కాపాడుకోలేకపోయారు. గవర్నర్ దగ్గరా రాష్ట్రపతి దగ్గరా వీళ్ళ తరపున గట్టిగా ఒత్తిడి పెట్టే ఘరానా మనుషులెవరూ లేరు. ముఖ్యమంత్రి చెవిలో ఒకమాట వేసి గవర్నర్ చేత క్షమాభిక్ష అర్జీపైన సంతకం పెట్టించగల శ్రేయోభిలాషులు కూడా వీళ్ళకు ఎవరూ లేరు.

వీళ్ళిద్దరినీ ఉరితీయవలసిందేనని ఆవేశపడుతున్న వాళ్ళంతా ఈ వాస్తవాల నొకసారి తలచుకుంటే మంచిది. మన దేశంలో బలవంతులు - కులం, డబ్బు,

అధికారం, హోదా ఉన్నవాళ్ళు చట్టానికి సులభంగా చిక్కరు. చిక్కేది బలహీనులే. 'బలవంతులను న్యాయస్థానాలు శిక్షించలేకపోతున్నాయి కాబట్టి బలహీనులను సైతం విడిచిపెట్టమనడం న్యాయవ్యవస్థను భ్రష్ఠు పట్టించడం కాదా? వీళ్లనే కాక వాళ్ళను కూడా శిక్షించమని ఉద్యమించడం సబబుగా ఉండదా?' అని ఎదురు ప్రశ్న వేస్తారేమో. బలవంతులను శిక్షించలేని న్యాయవ్యవస్థను మూసివేయాలని మేము అనడం లేదు. కాని చేతికి చిక్కారు కదా అని బలహీనులపైనే చట్టం తన ప్రతాపమంతా చూపించనవసరం లేదు.

బలవంతులు చట్టానికి చిక్కకపోవడం ఒకటే కాదు, వాళ్ళకు నేరాలకు పాల్పడవలసిన 'అవసరం' కూడా ఉండదు. వాళ్ళు అవసరం కోసం కాక అదనపు ప్రయోజనాల కోసం నేరాలకు పాల్పడతారు. (క్షణికోద్రేకం వంటి కొన్ని ఇతర కారణాలు కూడా ఉండవచ్చు.) బలహీనులు (ఎప్పుడూ కాకపోయినా) తరుచుగా ఒక అవసరం పెట్టే ఒత్తిడి వల్ల నేరానికి పాల్పడతారు. ఇతరుల సంగతి ఎట్లాగున్నా, చలపతిరావు, విజయవర్ధనరావుల విషయంలో ఇది పూర్తిగా వాస్తవం. వాళ్ళు తమ కుటుంబాలను ఆర్థిక సమస్యల నుండి బయట పడేయడం కోసం ఈ దొంగతనానికి పూనుకున్నారు. ఒక అవసరం కోసం కాక స్వార్థ ప్రయోజనాల కోసం నేరాలకు పాల్పడే బలవంతులు చట్టానికి దొరకకుండా అనేక రూపాలలో తప్పించుకోగలరు. చట్టం ఇచ్చే హక్కులనే అందుకోసం వాడుకోగలరు. ఏదో ఒక అవసరం లేక ఒత్తిడి కారణంగా నేరాలలోకి నెట్టబడే బలహీనులు చట్టానికి దొరుకుతారు. దొరికారు కదా అని చట్టం తన ప్రతాపమంతా వారిపైన చూపించ వలసిన అవసరం లేదు. వాళ్ళ జీవన పరిస్థితులను దృష్టిలో ఉంచుకుని కొంత ఉదారంగా వ్యవహరించవచ్చును. అదే ఉచితంగా ఉంటుంది.

మర్రి చెన్నారెడ్డిని ముఖ్యమంత్రి కుర్చీ నుండి దింపి నేదురుమల్లి జనార్ధనరెడ్డిని ఎక్కించడం కోసం హైదరాబాద్‌లో 200 మందిని ఊచకోత కోయించిన సంగతి తెలిసిందే. అది కుట్రపూరితంగా జరిగిన మారణకాండ. అయినా దానికి పోలీసులు కుట్ర కేసు పెట్టలేదు. విడివిడిగా హత్యకేసులు పెట్టారు. ఆ కేసులు కోర్టులలో నత్తనడక నడుస్తున్నాయి. వాటిలో ఎవరికైనా శిక్ష పడినా ఉరిశిక్ష మాత్రం పడదని గట్టిగా చెప్పవచ్చును. అవి అధికారబలం ఉన్నవాళ్ళు వృత్తి నేరస్తులను కిరాయికి తీసుకొని చేయించిన హత్యలు. వాళ్ళు బలమైన సాక్ష్యాలను కోర్టుదాకా రానివ్వరు. ఆ పని చేతకాని చలపతిరావు, విజయవర్ధనరావులు పేదరికపు ఒత్తిడి కారణంగా చేసిన తప్పిదానికి ఉరికంబం ఎక్కవలసిందేనా?

5. 'నేరం ఎంతటిదయితే శిక్ష కూడా అంతే ఉండాలి' అనేది నేరం - శిక్షల గురించి చాలామందికి ఉండే అభిప్రాయం. నువ్వు ఎంత హాని చేస్తే నీకు తిరిగి అంతే హాని జరిగితేనే సరైన పరిహారం జరిగినట్టు అని చాలామంది భావిస్తారు. సాంప్రదాయక నేరస్మృతులు ఈ 'కంటికి కన్ను పంటికి పన్ను' అనే వైఖరికి అధికార ముద్ర వేశాయి. దీని ఫలితం ఏమిటంటే నేరానికి బాధ్యత మొత్తం నేరం చేసిన వ్యక్తి పైననే పెట్టడం. కానీ నిజానికీ ప్రతీ నేరానికీ వ్యక్తి బాధ్యతతో పాటు పరిస్థితుల బాధ్యత కూడా కొంత ఉంటుంది. పరిస్థితులకు సామాజిక వ్యవస్థ బాధ్యత వహించవలసి ఉంటుంది కాబట్టి, జరిగిన ప్రతీ నేరానికి, దానికి పాల్పడిన వ్యక్తితోపాటు సమాజం కూడా కొంత బాధ్యత స్వీకరించవలసి ఉంటుంది. ముఖ్యంగా - రకరకాల ఒత్తిడులలో జీవించే పేద, దళిత వర్గాల వారు, పరిసరాల ప్రభావానికి సులభంగా లోనయ్యే యువకులు చేసే నేరాలకు సమాజం బాధ్యత చాలా ఉంటుంది. మరి 'సమాజం' అనే దానిని శిక్షించలేము కదా అనవచ్చు...ఏమో - అది కూడా ఆలోచించవలసి ఉంటుంది. చలపతిరావు, విజయవర్ధనరావులను నేరానికి నెట్టిన పరిస్థితులకు సమాజం పరిహారం చెల్లించే మార్గమేదీ ఆలోచించలేమా?

సమాజాన్ని తగుపాళ్ళలో శిక్షించలేకపోయినా, వ్యక్తిమీదే తప్పంతా పెట్టి 'నువ్వు చంపావు కాబట్టి నువ్వు చావవలసిందే'ననడం సబబు కాదు. మరణదండన అంటేనే హత్యకు పూర్తి బాధ్యత హంతకునిపైన పెట్టడం అని అర్థం. సమాజం బాధ్యతను గుర్తిస్తే శిక్షల కాఠిన్యాన్ని తగ్గించాల్సి ఉంటుంది. మరణదండనను సూత్రప్రాయంగా వ్యతిరేకించడానికి గల కారణాలలో ఇదొకటి. ఎవరయితే సాంఘిక, ఆర్థిక వ్యవస్థనుండి పుట్టే ఒత్తిడులవల్ల నేరాల వైపు ఆకర్షితులవుతారో వాళ్ళ విషయంలో శిక్షలు మరీ సరళంగా ఉండాలి. కానీ విడ్డూరం ఏమిటంటే ఈనాటి న్యాయవ్యవస్థలో వాళ్ళే ఎక్కువగా శిక్షించ బడుతున్నారు.

'తిండిలేని వాళ్ళంతా దొంగతనాలు చేస్తున్నారా? ఎట్లాగో కష్టపడి ఒకరికి హాని చేయకుండా బతకడం లేదా?' అని చాలామంది అడుగుతున్నారు. ఎంత పేదరికంలోనయినా దొంగతనానికి పాల్పడకుండా బ్రతకడం గొప్ప విషయమా లేక తెలివి తక్కువతనమా అనే ప్రశ్నను పక్కన పెడదాం. దానిని వివరంగా చర్చించడానికి ఇది సందర్భం కాదు. దానికి సులభమైన జవాబు కూడా లేదు. ఎందుకంటే దొంగతనం అనేది కేవలం ప్రైవేటు ఆస్తి అనే భావనపైన దాడి కాదు. అది దొంగతనానికి పాల్పడే మనిషి స్వీయ వ్యక్తిత్వంపైన దెబ్బ కూడా.

కానీ దొంగతనం చేసి డబ్బు సంపాదించుకుందామన్న ఆలోచన ఈనాటి నిరుద్యోగ యువకులకు సులభంగా వస్తుందంటే దానికి బాధ్యులెవరు? ఆ నిరుద్యోగ యువకులేనా? అక్రమార్జనలో తప్పేమీ లేదన్న అభిప్రాయం సమాజంలో ప్రబలడానికి కారకులు చలపతిరావు, విజయవర్ధనరావుల వంటి పేద, దళిత, నిరుద్యోగ యువకులు కారు. అధికారం, సంపద, హోదా ఉన్న అగ్రకుల పెత్తందార్లు. దేశ ప్రధాని నుండి ఊరి ప్రెసిడెంట్ దాకా అందరికీ ఈ పాపంలో భాగం ఉంది. డబ్బు సంపాదనలో అక్రమం, సక్రమం అనే తేడా లేదనే అభిప్రాయాన్ని స్థిరపరచింది ఈ పెద్దమనుషులే. వీళ్ళు తీర్చిదిద్దిన సంస్కృతి చేత ప్రభావితులైన చలపతిరావు, విజయవర్ధనరావులు బస్సు దోపిడీకి పాల్పడదామని నిర్ణయించుకుంటే ఆ తప్పంతా ఈ ఇద్దరి మీదనే ఎందుకు పెట్టాలి? ఈ సంస్కృతీ వైపరీత్యానికి కర్తలయిన ఘరానా నేరస్తులను సమాజం శిక్షించలేకపోతే పోయింది, కనీసం వీళ్ళను కొంతయినా కనికరించవచ్చును కదా?

6. '23 మందిని చంపిన వాళ్ళను కూడా ఉరితీయలేకపోతే ఇంక సమాజంలో నేరాలను ఆపేది ఎట్లా'గని చాలామంది ఆవేశంగా ప్రశ్నిస్తున్నారు. కఠినమైన శిక్షలు వేయకపోతే నేరాలు ఆగవనీ, నేరాలను ఆపడానికి కఠినమైన శిక్షలు అవసరమనీ చాలామంది నమ్ముతున్నారు. నేరానికీ శిక్షకూ మధ్యనున్న సంబంధం ఇంత సరళమైందా? శిక్ష పడుతుందన్న భయమొక్కటే నేరాలను అదుపు చేస్తుందా? కఠినమైన శిక్ష పడుతుందన్న భయం లేకపోతే మనుషులను నేరాలు చేయకుండా ఆపేది వేరే ఏదీ లేదా? శిక్ష పడుతుందన్న భయం ఉన్నా నేరానికి పురిగొల్పే పరిస్థితులు, శక్తులు ఏవీ లేవా?

   ఈ ప్రశ్నల గురించి సామాజిక శాస్త్రవేత్తలు చాలా చర్చ, పరిశోధన చేసి ఉన్నారు. నేరాలను అదుపు చేయడంలో శిక్షల కాఠిన్యానికి ఉండే పాత్ర చాలా స్వల్పం అనేది ఈ పరిశోధనల సారాంశం. నేరానికీ, శిక్ష పడుతుందన్న భయానికీ మధ్య చాలా ఇతర అంశాలు ఉంటాయి. సమాజం, అందులోని వివిధ వర్గాల ప్రజల సామాజిక స్థితిగతులు, సామాజిక సంస్కృతి, నైతిక ప్రమాణాలు మొదలయినవన్నీ నేరాలను పెంచడంలోనూ అదుపు చేయడంలోనూ పాత్ర నిర్వహిస్తాయి. కాబట్టి శిక్ష కఠినంగా లేకపోతే నేరాలు పెచ్చరిల్లిపోతాయని గానీ, శిక్ష కఠినంగా ఉంటే నేరాలు తగ్గుతాయని గానీ నమ్మడానికి అధారాలేమీ లేవని పరిశోధకులు అంటున్నారు.

   సమాజంలో నేరాలు అదుపు చేయాలంటే వివిధ సామాజిక జీవిత రంగాలలో అనేక చర్యలు చేపట్టవలసి ఉంటుంది. చాలా మార్పులు తీసుకురావాల్సి ఉంటుంది. అప్పుడు 'శిక్ష' అనేది హింసించడం ద్వారా నేరాలను అదుపు చేసే

ప్రక్రియ కాక, తప్పుచేసిన మనిషిని సమాజానికి ఉపయోగపడే వ్యక్తిగానూ ఆ తప్పుకు స్థానం కల్పించిన సమాజాన్ని మనిషికి ఉపయోగపడే జీవితరంగంగానూ మలచుకునే సంస్కరణాత్మక ప్రక్రియ కాగలదు. సంస్కరణకు లోను కావలసింది కేవలం నేరం చేసిన వ్యక్తే కాదు - అతనికి స్థానం కల్పించిన సమాజం కూడా.

కాబట్టి హంతకులను ఉరితీయకపోతే హత్యలు ఆగవు అనుకోనవసరం లేదు. ప్రపంచంలోని 55 దేశాలలో ఇప్పుడు మరణదండన రద్దు చేయబడింది. మరొక 42 దేశాలలో మరణ దండన నేరస్మృతులలో ఉన్నప్పటికీ ఆ దండన విధించడం మానేసారు. వాటిలో అభివృద్ధి చెందిన దేశాలే కాక మనబోటి మూడవ ప్రపంచపు దేశాలు కూడా ఉన్నాయి. కానీ మరణ దండన రద్దు చేసిన దేశాలలో ఆ తరువాత హత్యలు పెరిగిన దాఖలాలు లేవని శాస్త్రీయ పరిశోధనలు తెలుపుతున్నాయి. నేరానికీ, శిక్షపడుతుందన్న భయానికీ మధ్యనున్న సంబంధం ఏమంత ప్రత్యక్షమైనదీ కాదు, సరళమైనదీ కాదు.

నిజానికి శిక్షలు కఠినంగా లేకపోతే నేరాలు ఎట్లా ఆగుతాయని ఆవేశపడుతున్నారు గానీ లోపలికి తరచి చూసుకుంటే అసలు కారణం అది కాదు. శిక్షలు కఠినంగా ఉండాలనే కోరికలో అంతర్లీనంగా ఉన్నది ప్రతీకార వాంఛ. మనలో ఎవ్వరైనా ఏరోజయినా ఒక దొంగతనానికి లేక దోపిడీకి గురి కావచ్చును కాబట్టి అలా గురి అయినవారితో సహానుభూతి చెంది ప్రతీకారం కోరుకుంటున్నాము. అందుకే ఆ ఇద్దరినీ ఉరితీసి తీరాలని అందరూ ఇంతగా ఆవేశపడుతున్నారు. కాని శిక్షాస్మృతికి ఈ రకమైన ప్రతీకారేచ్ఛ ప్రమాణం కావచ్చునా అనేది కొంచెం శాంతంగా ఆలోచించవలసిన విషయం. ఒక నష్టానికి గురయిన వ్యక్తి దానికి కారకుడయిన వ్యక్తిని పురిగొల్పిన పరిస్థితుల గురించి ఆలోచించలేడనీ, ఎటువంటి కనికరం చూపించలేడనీ మనకు తెలుసును. నష్టానికి లోనయి ఆవేశపడుతున్న వ్యక్తి చెప్పే న్యాయాన్ని మనం మామూలుగా విశ్వసించం. ఎందుకంటే ప్రతీకార కాంక్షతో రగిలిపోయే మనిషి న్యాయం ఆలోచించలేడని మనకు తెలుసును. శిక్షలు కఠినంగా ఉండి తీరాలని సమాజంలో సాధారణంగా వినిపించే అభిప్రాయం వెనుకనున్నది ఈ ప్రతీకార ఆవేశమే తప్ప నిలకడగా చేసే ఆలోచన కాదు. కానీ నిలకడగా ఆలోచించినప్పుడే నేరం వెనుక ఉన్న అన్ని పరిస్థితులను లెక్కలోకి తీసుకుని శిక్షల గురించి సహేతుకంగా ఆలోచించ గలుగుతాం. ఒక ఉమ్మడి ప్రతీకారేచ్ఛతో రగిలిపోయే సమాజం ఉరిశిక్ష గురించి సహేతుకంగా ఆలోచించజాలదు.

**7. ఒక ఆఖరి మాట :**

మనం సాధారణంగా హింసను అసహ్యించుకుంటాం. ఒక మనిషి మరొక మనిషిని హింసిస్తే దానికి చాలా బలమైన కారణం ఉంటే తప్ప ఆమోదించం. ఏ సమస్యకయినా శాంతియుతమైన పరిష్కారం వెతుక్కోవడమే మంచిదని నమ్ముతాం. పూర్తిగా అనివార్యమైతేనే బలప్రయోగాన్ని ఆమోదిస్తాం.

కానీ శాంతిభద్రతల పేరిట, చట్టం పేరిట, సమాజ ప్రయోజనాల పేరిట, న్యాయం పేరిట రాజ్యవ్యవస్థ పాల్పడే హింసను సులభంగా ఆమోదించడమే కాక తరుచుగా ఆహ్వానిస్తాము కూడా. దీనికొక నేపథ్యం ఉంది. సమాజాన్ని క్రమశిక్షణలో పెట్టే బాధ్యత రాజ్యవ్యవస్థకు చారిత్రకంగా కట్టబెట్టబడింది. అందుకోసం బలప్రయోగం చేసే అధికారం రాజ్యవ్యవస్థకు ఇవ్వబడింది. కాబట్టి భద్రత పేరిట రాజ్యవ్యవస్థ చేసే బలప్రయోగాన్ని మన మంచి కోసమే మనం ఆహ్వానిస్తున్నామనుకుంటాము.

కానీ భద్రత నెలకొల్పడం కూడా ఒక సామాజిక సమస్యే. అన్ని సామాజిక సమస్యల లాగా దీనిని కూడా వీలయినంత వరకు సామరస్యంగా, శాంతి యుతంగా, బలప్రయోగానికి పాల్పడకుండా పరిష్కరించమని మనమెందుకు కోరలేకపోతున్నాము? వేరే విషయాలలో శాంతినీ అహింసనూ కాంక్షించేవాళ్ళం, ఈ విషయంలో మాత్రం కఠినమైన బలప్రయోగమే పరిష్కారం అని ఎందుకు నమ్ముతున్నాము? నేరాలను అరికట్టడానికి ఇతర మార్గాలన్నీ అన్వేషించి, అవి సరిపోని మేరకు మాత్రమే శిక్షా వ్యవస్థను ఆశ్రయించాలని ఎందుకు అనలేక పోతున్నాము? కఠినమైన శిక్షలు వేయడం ఒక్కటే పరిష్కారం అని ఎందుకు అనుకుంటున్నాము? మానవ ప్రవర్తనలో అనాగరికంగా భావించే హింసను రాజ్యవ్యవస్థ దగ్గరికొచ్చేసరికి సులభంగా ఆహ్వానించడమే కాక అది మరింత కఠినంగా ఉండాలనీ నిర్దయగా ఉండాలనీ అనుకోవడంలో ద్వంద్వ ప్రమాణాలు లేవా? చలపతిరావు, విజయవర్ధనరావులు చేసిన హత్యను అసహ్యించుకునే వాళ్ళు, వారిద్దరినీ ఇప్పుడు రాజ్యవ్యవస్థ హత్య చేయవలసిందేనని ఆవేశపడడం ఈ ద్వంద్వ ప్రమాణాలకు నిదర్శనం కాదా?

కొంచెం ఆలోచించమని మనవి.

**(ఏకలవ్య ప్రచురణగా వచ్చిన 'చలపతి, విజయవర్ధనం' లో వచ్చిన వ్యాసం)**

**20 నవంబర్ 1996**



# మాలమాదిగ ఘర్షణల నివారణ కోసం కృషి చేద్దాం

మాలమాదిగ కులాల మధ్య రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో తలెత్తుతున్న ఘర్షణలు అందరికీ ఆందోళన కలిగిస్తున్నాయి. దళిత చైతన్యం కులవ్యవస్థను, కులాధిక్యతను బలంగా సవాలు చేస్తున్న దశలో ఈ రెండు కులాల మధ్య వైషమ్యాలు తలెత్తడం చాలా బాధాకరమైన విషయం. దీనిని సకాలంలో పరిష్కరించక పోతే మొత్తంగానే దళితులు నష్టపోవడమే కాక కులనిర్మూలన కార్యక్రమం వెనకడుగు వేసే ప్రమాదం ఉంది.

ఈ రెండు కులాలు అంటే రాష్ట్రంలోని 59 దళిత కులాలు, వీరు తరతరాలుగా హైందవ సమాజం చేత వెలివేయబడిన పంచములు, 'ఊరి' బయట బ్రతికిన 'పల్లె' జీవులు, అంటరాని వారు, ఇతరుల ఇళ్లలోకి పోకూడనివారు, కొన్నిచోట్ల ఇతరుల కళ్ళకు కనిపించకూడని వారు, హైందవ సమాజం నీచంగా భావించిన పనులను తమ 'కులధర్మం'గా చేసినవారు. ఈ ప్రజలు ఈ రోజు తమలో తాము కలహించుకోవడ మేమిటి?

గడచిన కొన్ని దశాబ్దాల నుంచే దళితులు సమాజంలో కొద్దికొద్దిగా పైకి వస్తున్నారు. వామపక్ష పార్టీలు నడిపిన భూమి పోరాటాలూ కూలి పోరాటాలూ దళితుల ఆర్థిక స్థితినీ చైతన్యాన్నీ మెరుగుపరిస్తే, దళిత ఉద్యమం ముందుకు తెచ్చిన సమాన గౌరవం, సమాన ప్రతిపత్తి అనే డిమాండ్లు దళితుల సాంఘిక స్థితిని మెరుగుపరిచాయి. ఆత్మవిశ్వాసాన్నీ ఆత్మగౌరవాన్నీ ఇచ్చాయి. ఈ ఉద్యమాల ఫలితంగా కనీస వేతన చట్టాలు, భూసంస్కరణ చట్టాలు, విద్యా ఉద్యోగ రాజకీయ రంగాలలో రిజర్వేషన్లు, అంటరానితనాన్ని నిషేధించే చట్టాలు, దళితులపైన జరిగే భౌతిక

హింసను కఠినంగా శిక్షించే చట్టాలు వచ్చాయి. రాజకీయ రంగంలో దళితుల బలం పెరిగింది. దళితులను వెలివేసే ఆచారాలు కొద్దికొద్దిగా క్షీణించసాగాయి. కించపరిచే అలవాట్ల పట్ల నిరసన, ప్రతిఘటన పెరగడంతో అవి కూడా గతంలోలాగ సాగడం కష్టతర మయింది. విద్యా ఉద్యోగ రంగాలలో, తెల్లబట్టల జీవిత రంగంలో దళితులు చెప్పుకోదగ్గ సంఖ్యలో ప్రవేశించారు. దళిత జనాభాలో ఈ సంఖ్య చిన్నదే కావచ్చుకానీ, ఈ మార్పు తీసుకొచ్చిన ఆత్మవిశ్వాసం, సాంస్కృతిక మార్పు స్వల్పం కాదు. సగటు దళితులు ఈరోజు ఆర్థికంగా తమ తాత ముత్తాతల కంటే ఏమంత బాగుండక పోవచ్చు. సాగునీటి సమృద్ధి ఉన్న ప్రాంతాలలో తప్ప ఇతర ప్రాంతాలలో మార్పు పెద్దగా లేకపోవచ్చు. కానీ సాంఘిక స్థితిగతులు అంతకంటే ఎక్కువే మారాయి.

దళితుల ముందు ఇంకా ఎన్నో సమస్యలున్నాయి. పోరాటాల ఫలితంగా వచ్చిన సంస్కరణలూ చట్టాలూ సక్రమంగా అమలు కావడం లేదు. ఎస్.సి, ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం నుండి ఉద్యోగ రంగంలో రిజర్వేషన్ల దాకా అన్నిటికీ ఇది వర్తిస్తుంది. అత్యాచారాల గురించి దళితులిచ్చే ఫిర్యాదులలో ఎక్కువ భాగం ఇన్వెస్టిగేషన్‌కు నోచుకోకుండ పోలీసుస్టేషన్ డైరీలలో మగ్గుతున్నాయి. 'రాజీ' ఒత్తిళ్ళకు న్యాయం బలి అవుతున్నది. భూసంస్కరణలు సక్రమంగా అమలు కాకపోవడంవల్ల దళితులకు భూమి దక్కకుండానే పోయింది. కనీసం ప్రభుత్వ పోరంబోకులయినా దున్నుకుందామంటే దానికోసం కూడా అడుగడుగునా పోరాటం చేయక తప్పని స్థితి ఏర్పడింది. పారిశ్రామికీకరణ వేగంగా జరగకపోవడం వలన ప్రత్యామ్నాయ ఉద్యోగ అవకాశాలు పెరగడం లేదు. కూలిరేట్లు పెరుగుతూనే ఉన్నాయి గానీ పెరుగుతున్న ధరలు వాటిని వెన్నంటి తరుముతున్నాయి. ఏమయినా అవకాశం ఉంటే అది విద్యా ఉద్యోగ రంగాలలోనే. ఈ రంగాలలో దళితులు సాధించే ప్రగతి కేవలం ఆర్థిక ప్రయోజనాన్నే కాక, సామాజిక హోదానూ గౌరవాన్నీ కూడా పెంచుతుంది. కాబట్టి దీనిపట్ల దళితులు ఆకర్షితులు కావడం సహజం. మాదిగల్లోనూ మాలల్లోనూ అత్యధిక మెజారిటీ కూలి చేసుకుని బతికే వాళ్లే కాబట్టి కొద్దిమందికి మాత్రమే అందుబాట్లో ఉండే ఉద్యోగాల గురించి ఆందోళనలెందుకు అని వాదించడం కులవ్యవస్థ స్వభావాన్ని అర్థం చేసుకోకపోవడం అవుతుంది. అయితే రిజర్వేషన్లు కల్పించే ఉద్యోగావకాశాలు ప్రభుత్వ కళాశాలలు, ప్రభుత్వ ఉద్యోగ రంగం ఉన్నంతవరకే ఉంటాయి. సరళీకరణ పేరిట ఆర్థిక వ్యవస్థే గాక సామాజిక సేవారంగాలు కూడా ప్రైవేటీకరణ పాలయ్యేకొద్దీ ఈ ఒక్క అవకాశం కూడ తెరమరుగయ్యే ప్రమాదం ఉంది.

ఉద్యోగ అవకాశాల దగ్గరే దళిత కులాల మధ్య పోటీ రావడాన్ని ఈ నేపథ్యంలో అర్థం చేసుకోవచ్చు. మన రాష్ట్రంలోని 59 దళిత కులాలు సాంఘికంగా, విద్యాపరంగా ఒకే రకంగా అభివృద్ధి చెందలేదు. ప్రభుత్వ ఉద్యోగ రంగంలో అందరి ప్రాతినిధ్యం ఒకే రకంగా లేదు. రాజ్యాంగంలోని 15(4) అధికరణం ప్రకారం రిజర్వేషన్లకయినా, వేరే ఏ ప్రత్యేక సదుపాయానికయినా 'సాంఘికంగా, విద్యాపరంగా వెనకబడి ఉండటం' ప్రమాణం కాగా, 16(4) అధికరణం ప్రకారం 'ప్రభుత్వ ఉద్యోగాలలో తగిన ప్రాతినిధ్యం లేకుండా ఉండటం' రిజర్వేషన్లకు ప్రమాణం. ఎస్.సి.లు మొత్తంగా ఈ రెండు ప్రమాణాల ప్రకారమూ రిజర్వేషన్లకు అర్హులే. మాల కులస్తులు అభివృద్ధి చెందిపోయారు కాబట్టి వాళ్ళను ఎస్.సి.జాబితా నుంచి తొలగించాలని మాదిగల్లో కొందరు చేస్తున్న వాదన సరైంది కాదు. అయితే ఎస్.సి.లలో ఏ కులాలయితే పైరెండు విషయాలలోనూ మరీ వెనుకబడి ఉన్నాయో వారికి ఎస్.సి. రిజర్వేషన్‌లో ప్రత్యేక వాటా ఇవ్వడం (దానికి అనుగుణంగా ఎస్.సి. రిజర్వేషన్‌ను వర్గీకరించడం) ఈ ప్రమాణాల ప్రకారమే న్యాయమైందని అందరూ అంగీకరించాలి. అది రాజ్యాంగబద్ధం కూడా అవుతుందని గతంలో సుప్రీంకోర్టు బి.సి. కులాలను 'వెనుకబడినవి', 'మరీ వెనుకబడినవి' అని వర్గీకరించడంలో తప్పేమీలేదని ఇచ్చిన తీర్పులను బట్టి తెలుస్తుంది. ఈ సూత్రం ప్రకారమే మన రాష్ట్రంలో బి.సి. కులాలను రిజర్వేషన్‌ల నిమిత్తం ఎ,బి,సి,డిలుగా వర్గీకరించారు.

ఈ ఆధారాలతోనే జస్టిస్ రామచంద్రరాజు కమిషన్ ఎస్.సి. రిజర్వేషన్ వర్గీకరణను సమర్థించింది. అక్షరాస్యతను ప్రమాణంగా తీసుకున్నా, ప్రభుత్వ ఉద్యోగరంగాలలో ఏ కులంవారు ఏ నిష్పత్తిలో ఉన్నారనేది ప్రమాణంగా తీసుకున్నా 59 దళిత కులాల మధ్య తేడా స్పష్టంగా ఉంది. కాబట్టి వర్గీకరణ రాజ్యాంగ బద్ధమే కాకుండా అవసరం కూడా అని కమిషన్ భావించింది. వర్గీకరణను సమర్థించే వారందరి అభిప్రాయం కూడా ఇదే.

అయితే ఈ తేడాకు గల కారణమేమిటో చూడాలని, విద్యా ఉద్యోగ రంగాలలో వివిధ దళిత కులాల మధ్య అసమానత ఎందుకుందో చూడకుండా వర్గీకరణ చేయడం సరైనది కాదని వర్గీకరణను వ్యతిరేకించేవారు వాదిస్తున్నారు. కొన్ని కులాలకు చెప్పులు కుట్టడం వంటి వృత్తులు ఉండగా వేరేవాళ్లకు వృత్తులు లేవని, వృత్తులు ఉండటం వలన ఆ కులాలకు విద్యా ఉద్యోగ రంగాలలో ప్రవేశించవలసిన అవసరం, ఆసక్తి అంతగా లేవని వాదిస్తున్నారు. కాని ఆ వృత్తులు

చనిపోతారు తప్ప ఏ సేనల కార్యకర్తలూ ఏ రోజూ చనిపోరు. కోర్టులలోనూ పెత్తందారీ కులాల సేనలపైన జరిగే నేర విచారణలలో సాక్ష్యాలు నమోదు కావు. వారికి శిక్షలు పడవు. తమకు వ్యతిరేకంగా సాక్ష్యం నమోదు కాకుండా చూసుకోవడంలో సి.పి.ఐ.(ఎం.ఎల్.) పార్టీలు కూడా మరీ చేతకాని వారేం కాదు. కానీ వారికి అప్పుడప్పుడు శిక్షలు పడుతుంటాయి. నాలుగేళ్ళ కింద ఒక కేసులో 13 మందికి ఉరిశిక్ష కూడా పడింది (సుప్రీంకోర్టు తర్వాత కొట్టేసిందనుకోండి). అంతేకాకుండా వివిధ పెత్తందారీ కులాలకు చెందిన సేనలు ఒకరితో ఒకరు ఘర్షణ పడిన సంఘటనలు పెద్దగా లేవు కానీ నక్సలైట్ పార్టీలు తరచుగా తమలో తాము ఘర్షణ పడుతూ ఒకరి కార్యకర్తలనొకరు చంపుకుంటుంటారు.

కాబట్టి ఇది ఏ రకంగానూ సమాన పోరు కాదు. ఈ అసమాన పోరులో నాలుగయిదేళ్ళ కింద ప్రవేశించిన కొత్త సేన రణబీర్ సేన. ఇది మొదట్లో భోజ్‌పూర్ జిల్లాకు పరిమితమయి ఉన్న భూమిహార్ కులం సేన. 1997లో పాట్నా జిల్లాలోనికి ప్రవేశించింది. 1997 డిసెంబరు 1వ తేదీన జెహానాబాద్ జిల్లాలోని లక్ష్మణపూర్ బాతెలో 62 మందిని చంపిన ఘటన రణబీర్ సేన జెహానాబాద్ జిల్లాలో పాల్పడిన మొదటి మారణకాండ. కానీ ఆనాటి హంతకులు ఆ జిల్లా వారు కారనీ, లక్ష్మణపూర్ బాతె గ్రామాన్ని ఆనుకుని ఉన్న సోన్ నదిని దాటి భోజ్‌పూర్ జిల్లా నుంచి వచ్చారనీ భావించారు.

కానీ ఈ సంవత్సరం జరిగిన రెండు హత్యాకాండలను బట్టి చూస్తే ఈ భూమిహార్‌ల సేన జెహానాబాద్ జిల్లాలోనూ బలపడినట్టు అర్థమవుతుంది. జనవరి 25వ తేదీన ఆ జిల్లాలోని రుఖ్‌సాగర్ భీగాలో రణబీర్‌సేన హంతకులు 22 మంది దళితులను కాల్చి చంపారు. ఫిబ్రవరి పదవ తేదీ రాత్రి నారాయణపూర్‌లో 12 మందిని చంపారు. రెండు సంఘటనలలోనూ హతులలో స్త్రీలు, పిల్లలు కూడా ఉన్నారు. రణబీర్‌సేన చేసే అన్ని హత్యలకూ ఒక సామాన్య లక్షణం ఉంది. వారు భూమిహార్ కుల ఆధిక్యతను గట్టిగా ప్రశ్నించిన వ్యక్తులనుగానీ భూమి పోరాటాలలో అగ్రభాగాన నిలిచిన వ్యక్తులనుగానీ ఏరి చంపరు. ఒక దళితవాడ మీదపడి నిర్దాక్షిణ్యంగా చంపుతారు. చంపుతారు అనేకంటే ఊచకోత కోస్తారు అనడం సబబుగా ఉంటుందేమో. చనిపోయే వారిలో ఏ పోరాటంలోనూ ఏనాడూ పాల్గొనని వారు ఉండవచ్చు. అసలు పోరాటం అంటే ఏమిటో తెలియని పసిపిల్లలు కూడా ఉండవచ్చు. వాళ్ళు ఊచకోత కోసం ఎంచుకునే గ్రామాలు సైతం నక్సలైట్లు నిర్వహించిన పోరాటాలలోగానీ, వేరే ఇతర పోరాటాలలోగానీ అగ్ర భాగాన నిలిచిన గ్రామాలు కావు. అసలు పెద్దగా ఏ పోరాటంలోనూ పాల్గొన్న గ్రామాలు కావు.

పోరాటచరిత్ర కలిగిన గ్రామాలను ఎంచుకుంటే ప్రతిఘటన ఎదురుకావచ్చు. కాబట్టి అటువంటి చరిత్రలేని గ్రామాలనే ఎంచుకుంటారు. పోరాటాలలో పాల్గొన్నా, పాల్గొనకున్నా ఏ దళితవాడనయినా, ఏ రోజయినా ఊచకోతకు గురి చేయగలరన్న బెదిరింపు మొత్తంగా దళితులను టెర్రరైజ్ చేయడానికి బాగా ఉపయోగపడుతుంది.

ఇప్పుడు రుఖ్‌సాగర్ భీగా, నారాయణపూర్ హత్యాకాండల ఫలితంగా రబ్రీదేవి ప్రభుత్వం రద్దయింది. రణబీర్ సేనను అదుపు చేయడానికి రబ్రీదేవి ప్రభుత్వమైనా అంతకుముందు లాలూ యాదవ్ ప్రభుత్వమైనా ఏమీ చేయలేదనేది వాస్తవమే. కానీ వారే కాదు, గడిచిన రెండు దశాబ్దాలుగా బీహార్‌ను పరిపాలించిన ఏ పార్టీ ఈ సేనలను అదుపు చేయలేదు. అటువంటప్పుడు రబ్రీదేవి ప్రభుత్వ వైఫల్యం అంటూ ఆమె పాలనను రద్దు చేయడం ఎందుకు?

పైగా రణబీర్ సేన బి.జె.పి. - సమతా పార్టీల కూటమికి చాలా దగ్గర అనేది బీహార్‌లో అందరూ ఎరిగిన బహిరంగ రహస్యం. వారి హింసను ఆసరా చేసుకుని బి.జె.పి. ప్రభుత్వమే బీహార్ రాష్ట్ర ప్రభుత్వాన్ని రద్దుచేయడం హాస్యాస్పదమనాలో, విషాదం అనాలో తెలియదు. ఈ రాజకీయ కౌటిల్యం ఎట్లాగున్నా ప్రభుత్వం రద్దు వల్ల దళితులకు రణబీర్ సేన నుంచి రక్షణ లభిస్తుందని నమ్మడానికి మాత్రం ఆధారాలు ఏమీలేవు.

**ఆంధ్రప్రభ దినపత్రిక**
**18 ఫిబ్రవరి 1999**



# సంఘ బహిష్కరణకు శిక్ష మాటేమిటి

విజయనగరం జిల్లా శృంగవరపుకోట మండలంలోని వసి అనే గ్రామం ఒక సంవత్సరకాలంగా అడపాదడపా వార్తలలో ఉంది. ఆ ఊరి దళితులపైన ఆ ఊరి సవర్ణ కులస్తులు సంఘ బహిష్కరణ విధించారు.

గత సంవత్సరం ఏప్రిల్ నెలలో మొదలయిన ఈ సంఘ బహిష్కరణ ఈనాటికీ కొనసాగుతున్నది. ఒక దశలో దళితులకు దుకాణందారులు సరుకులు అమ్మకూడదనీ, రజక, నాయీ బ్రాహ్మణకులాల వాళ్ళు తమ వృత్తిపరమైన సేవలు అందించ కూడదనీ కూడా ఆంక్షలు పెట్టారు. ప్రస్తుతం సంఘబహిష్కరణ అంత తీవ్రరూపంలో అమలు కావడం లేదుగానీ అన్నిటికంటే ముఖ్యమైన రంగంలో మాత్రం అమలు అవుతున్నది. దళితులను ఆ గ్రామ సవర్ణ రైతులు కూలి పనికి పిలవడం లేదు. వేరే గ్రామాలకు పోయి కూలి చేసుకునే అవకాశం పెద్దగా ఉండదు కాబట్టి (ప్రతీ గ్రామంలోనూ దినకూలి మీద ఆధారపడి బ్రతికే వాళ్ళుంటారు కదా) వసి గ్రామ దళితులు దాదాపు సంవత్సరంగా దినదినగండంగా బ్రతుకుతున్నారు. ఎక్కడయినా రోడ్డుపని లాంటిది దొరికితే ఆ రోజుకు తిండి దొరుకుతుంది. లేకపోతే నిన్నటి ఆదాయం కొంత మిగిలించో, ఇరుగుపొరుగు వారు అరువిస్తేనో తినాలి - లేకపోతే పస్తులుండాలి.

అదే జిల్లా పాచిపెంట మండలం విశ్వనాథపురం గ్రామం లోనూ ఆరునెలలకు పైగా దళితులు సంఘబహిష్కరణకు గురయి ఉన్నారు. ఆ ఊరి రైతులు వాళ్ళను పనులకు పిలవడం లేదు. ఊరిలో సరుకులు ఒకరోజు కొనుక్కోనిస్తే ఒకరోజు కొనుక్కోనివ్వరు. పొరుగున ఉన్న గిరిజన గ్రామం వారిని ఆదుకుని కొంత పనులు కల్పించబట్టి సరిపోయిందిగానీ లేకపోతే విశ్వనాథపురం దళితులు ఇంకెంత ఇబ్బందికి గురయ్యేవారో. అయినప్పటికీ వారికి ఒకరోజు పనిదొరికితే ఒకరోజు పస్తులుండే పరిస్థితే.

ఈ రెండు గ్రామాలలోనూ దళితులకూ సవర్ణులకూ మధ్య గొడవలున్నాయి. నిజానికి ఈ గొడవలు మొదలయినప్పుడు అవి సవర్ణులందరితోనూ గొడవలుగా మొదలుకాలేదు. ఏదో ఒక కులానికి సంబంధించిన కొందరు వ్యక్తుల్తో గొడవలుగా మొదలయ్యాయి. కానీ గొడవ మొదలయిన తరువాత దళితేతరులందరూ ఒక్కటయ్యారు. ఒక్కటయి కక్ష గట్టారు. ఈ కక్షలలో భాగం కావడం ఇష్టం లేని వారు సవర్ణులలో లేకపోలేదు. ఇది అనాగరికం అనుకునేవారు సహితం లేకపోలేదు. కానీ పరాయివాళ్ళ కోసం మనవాళ్ళతో గొడవ ఎందుకు పెట్టుకోవాలి అని అటువంటి వారు ఊరకుండిపోతారు.

ఆ గొడవలు ఎట్లాంటివి? అవేమైనా వ్యక్తిగత తగాదాలా? సారాప్యాకెట్ల దగ్గర కొట్లాటలా? వసిలో జరిగిందేమిటంటే దళితుల ఇళ్ళ సమీపంలోని గ్రామకంఠం భూమిలో ఒక రైతు బోర్ వేసుకుని ఇంజన్ పెట్టుకుని భూమి లోతులనుండి నీళ్ళు లాగి తన పొలాలకు పెట్టుకుంటున్నాడు. దానివల్ల దళితుల ఇళ్ల దగ్గరున్న మంచినీటి బావిలో నీళ్ళు ఇంకిపోయాయి. ఆ బోర్‌ను ఆపమని దళితులు ఆందోళన చేయడంతో గొడవ మొదలయింది. అది దళితులందరి సమస్య కాబట్టి వాళ్ళంతా సహజంగా ఒకటయ్యారు. అవతలివైపున్నది ఒక్క రైతే అయినప్పటికీ దళితుల 'అహంకారాన్ని' సహించలేక వాళ్ళందరూ కూడా ఒకటయ్యారు. ఇంక జరగవలసినవన్నీ జరిగాయి. దళితులకు సంఘ బహిష్కరణ విధించారు. వీళ్ళు గొడవ పెట్టుకున్నారు. కూలికి పిలవకపోవడమేకాక అమ్మవారి పండుగ రోజు డప్పు కొట్టడానికి సహితం ఆ ఊరి దళితులను కాక పొరుగూరి దళితులను పిలవడం వసి గ్రామ దళితులకు చాలా కోపం తెప్పించింది. గొడవ పెట్టుకున్నారు. సవర్ణులు వారిపైన కర్రలతో కత్తులతో దాడిచేసి తరిమి తరిమి కొట్టారు. దళితులు వాళ్ళపైన కేసు పెట్టి సంఘ బహిష్కరణ ఎత్తి వేయించడానికి అధికారులు కృషి చేయాలంటూ ఎంఆర్‌వో ఆఫీసు దగ్గర ధర్నా చేశారు. పోలీసులు వాళ్ళపైన లాఠీచార్జి చేయగా కోపగించి ఎంఆర్‌వో ఆఫీసులోకి దూరి ఆ అధికారిపైన చేయి చేసుకున్నారు. దళితులపైన పోలీసులు కేసులు పెట్టారు. అరెస్టు చేశారు. కానీ సంఘ బహిష్కరణ మాత్రం కొనసాగుతూనే ఉంది. ఎంఆర్‌వోను కొట్టడం చట్టవిరుద్ధం అయినట్టు దళితులను సంఘ బహిష్కరణకు గురిచేయడం కూడా చట్టవిరుద్ధమే. కానీ ఈ నేరానికి మాత్రం కేసు లేదు, అరెస్టులు లేవు.

విశ్వనాథపురంలో కూడా దళితులు గొడవపెట్టుకున్నది ఒక న్యాయమైన హక్కు గురించే. భూమి సమస్య గురించి ఆందోళన చేస్తే వారిపైన మూకుమ్మడిగా ఇతర కులాలవారు దాడిచేశారు. ఒక దళిత స్త్రీని తీవ్రంగా కొట్టారు. వీళ్ళు పోలీసులకు

ఫిర్యాదు చేసి ఎస్.సి, ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం కింద కేసు పెట్టించారు. పోలీసులు తప్పనిసరయి కేసయితే పెట్టారు గానీ ఎవరినీ అరెస్టు చేయలేదు. పైగా దాడి చేసినవారు మరింత రెచ్చిపోయి దళితులపైన సంఘబహిష్కరణ కట్టుదిట్టంగా అమలు చేస్తున్నారు.

ఇది ఈ రెండు గ్రామాల ప్రత్యేకత కాదు. ఉత్తరాంధ్రలో ముఖ్యంగా విజయనగరం జిల్లాలో దళితులు తమ హక్కులకోసం గట్టిగా నిలబడిన ప్రతిచోట ఇది జరుగుతూనే ఉంది. ఈ ప్రాంతంలో అంటరానితనం చాలా తీవ్రరూపాలలో ఉంది. హోటళ్ళలో వేరుగ్లాసులు పెట్టడం దగ్గర మొదలుపెట్టి అన్ని రూపాలలోనూ ఉంది. చాలా కాలం ఎవరూ ప్రశ్నించనిది ఈ మధ్యకాలంలో చదువుకున్న దళిత యువకులు, దళిత సంఘాలు ప్రశ్నిస్తున్నాయి. హోటళ్ళలో రెండు గ్లాసులు తీసేయాలని ఆందోళన చేస్తున్నారు. భూములున్న రైతులు, భూస్వాములు ఆక్రమించుకున్న ప్రభుత్వ బంజర్లను వాళ్ళ స్వాధీనం నుండి తొలగించి తమకే పట్టా ఇవ్వాలని ఆందోళన చేస్తున్నారు. దీనికి జవాబుగా వారిపైన భౌతిక దాడులు జరుగుతున్నాయి. హత్యలు జరుగుతున్నాయి. అంతేకాక ప్రతీ గ్రామంలోనూ దళితులపైన సంఘబహిష్కరణ అమలు చేస్తున్నారు. ఇదొక రకంగా భౌతిక దాడి కంటే హానికరమైనది. దెబ్బలు తగిలితే నయమైన తరువాత మామూలుగా బతకొచ్చు. సంఘ బహిష్కరణకు గురిచేస్తే కూలి దొరకదు, తిండి దొరకదు. ఈ బహిష్కరణ నెలల తరబడి, సంవత్సరాల తరబడి సాగుతుంది. దళితులు ఆర్థికంగా పూర్తిగా చితికిపోయి 'దారిలోకి'రావాలి. అప్పుడే ఇది ఆగుతుంది.

ఒక గ్రామం తరువాత మరొక గ్రామంలో అనేక సంవత్సరాలుగా ఇటువంటి దురంతాలు జరుగుతూనే ఉన్నాయి. జిల్లాలోని రాజకీయ నాయకులంతా ఒకటిరెండు పెత్తందారీ కులాలకు చెందినవారు కావడంతో ఈ అన్యాయాన్ని వ్యతిరేకించే నాయకులెవరూ లేకుండా పోయారు. హక్కుల కోసం ఆందోళన ప్రారంభించిన దళితులు చివరికి ఆకలి తప్పించుకోవడానికి హక్కులను వదులుకుని కాళ్ళబేరానికి రావలసి వస్తున్నది.

అధికార యంత్రాంగం దీని గురించి ఏమీ చేయజాలదా? ఎన్నిసార్లు ఎంతమంది ఫిర్యాదు చేసినా, దళితులు ఎంతగా ఆందోళన చేసినా ఏమీ ఎందుకు చేయడం లేదు? ఈ సంఘ బహిష్కరణలో రెండు రకాల నేరాలున్నాయి. దళితులయిన వారికి ఏమీ అమ్మొద్దు, ఏ సేవలూ చేయవద్దు అని నిషేధం పెట్టడం పిసిఆర్ చట్టంలోని సెక్షన్ 6 కింద నేరం. వారిని పనిలోకి పిలవొద్దు అని నిషేధం

పెట్టడం సెక్షన్ 4 (iii) కింద నేరం. వీటికి శిక్ష తక్కువేగానీ ఇవి నేరాలే. ఈ నేరాలు జరిగితే కేసులు పెట్టాలి. అరెస్టు చేయాలి. ఇవి కాగ్నిజబుల్ నేరాలు కాబట్టి ఎవరూ ఫిర్యాదు చేయకపోయినా పోలీసులు కేసు పెట్టొచ్చు. కానీ వింత ఏమిటంటే విజయనగరం జిల్లాలో ఈ నేరం జరిగిన ఏ ఒక్క ఊరిలోనూ ఈ సెక్షన్ల కింద కేసులు పెట్టడం లేదు. ఎన్నిసార్లు ఎంత మంది పోలీస్ అధికార్లకూ, మెజిస్టీరియల్ అధికారాలున్న రెవిన్యూ అధికార్లకూ ఈ సెక్షన్లు చూపించి వారి విధులు వారికి జ్ఞాపకం చేసినా కేసులు పెట్టడం లేదు.

పై రెండు సెక్షన్ల కింద సంఘబహిష్కరణకు బాధ్యులయిన వారిపైన కేసులు పెట్టడమే కాదు సెక్షన్ 10-ఎ కింద వారిపైన సమిష్టిగా జుర్మానా కూడా వసూలు చేయవచ్చు. బహిష్కరణకు పాల్పడిన దుకాణందారుల లైసెన్సులు సెక్షన్ 8 కింద రద్దు చేయవచ్చు.

ఈ సెక్షన్లేవీ ఆ జిల్లా అధికార యంత్రాంగం కళ్ళకు కనిపించడం లేదు. దళితులు తమ ఆందోళనలో భాగంగా పాల్పడిన ప్రతీ చట్టవిరుద్ధమైన చర్యకూ వారిపైన మాత్రం కేసులు పెడుతున్నారు. ముగ్గురు దళిత నాయకులపైన రౌడీషీట్లు కూడా పెట్టారు.

అయితే ఈ దురాచారం కేవలం పిసిఆర్ చట్టం కింద పెట్టే కేసులతో పోదు. వాటికి శిక్ష తక్కువ, బెయిల్ సులభం. సాక్ష్యం ఎవరినీ చెప్పనివ్వరు. అందువల్ల వేరే రూపాలలో ఒత్తిడిపెట్టే మార్గం ఆలోచించవలసి ఉంటుంది. అంటరానితనం రాజ్యాంగ విరుద్ధమనీ అనాగరికమనీ విస్తృతంగా ప్రచారం చేయడం అవసరం. దానిపైన చర్చ పెట్టడం అవసరం. ఇది కేవలం ప్రభుత్వం బాధ్యత కాదు, మనందరి బాధ్యత కూడా. దళితేతర కులాల వారిని ఆలోచింపజేయడానికి ఇది అవసరం.

అయితే దీనితోబాటు గ్రామ పెత్తందారీ వర్గాలను ఇబ్బంది పెట్టే ఒత్తిడి కూడా అవసరం. అంటరానితనం పాటించడం కొనసాగిస్తే వారి ప్రయోజనాలు దెబ్బ తింటాయన్న ఒత్తిడి అవసరం.

ఈ పెత్తందార్లు అనేక అభివృద్ధి పనులకోసం ప్రభుత్వం దగ్గరికి వస్తుంటారు. వీటిలో కొన్ని (ఉదాహరణకు గ్రామంలో మంచినీటి వసతి వంటివి) గ్రామ ప్రజల నిత్యజీవిత అవసరాలకు సంబంధించినవి. వాటిమీద ఆంక్షలు పెట్టడం సబబు కాదు. కానీ అన్ని ప్రయోజనాలూ అటువంటివి కావు. కొన్ని ప్రధానంగా కాంట్రాక్టుల కోసం ఉంటాయి. అటువంటి అభివృద్ధి పనుల కోసం గ్రామసర్పంచ్‌లూ రాజకీయ

నాయకులూ ప్రభుత్వం దగ్గరికి వచ్చినప్పుడు ఊరిలో అంటరానితనం పాటించడం మానేయకపోతే, దళితులకు సంఘ బహిష్కరణ విధించడం మానేయకపోతే పనులు మంజూరు చేయం అన్న ఆంక్ష పెట్టే విధానం ఉండాలి. అంటరానితనం రాజ్యాంగ విరుద్ధం కాబట్టి పిసిఆర్ చట్టం సెక్షన్ 16-బి కింద ప్రభుత్వం అటువంటి జీవో జారీ చేస్తే అది తప్పక చెల్లుబాటు అవుతుంది.

నిజానికి ఒక గ్రామంలో ఒక పక్క దళితులను వెలివేస్తుండగా, అంటరాని తనం నిత్యం పాటిస్తుండగా ప్రభుత్వం జన్మభూమి అనీ మరొకటనీ ఆ ఊరికి అభివృద్ధి పనులు మంజూరు చేస్తూ ఆ ఊరి నాయకులకు రాజకీయ పరపతి, కాంట్రాక్టుల ద్వారా ఆర్థిక ఆదాయం కల్పిస్తూ ఉండడం చాలా వికృతమైన దృశ్యం. జిల్లా కలెక్టర్ల వంటి అధికారులకు ఆ విధంగా కనిపించకపోవడం ఆశ్చర్యం కలిగించే విషయం.

రాష్ట్రాన్ని 21వ శతాబ్దంలోకి తీసుకుపోవడానికి అన్ని పార్టీలూ తొందరపడు తున్నాయి. కాబట్టి శతాబ్దాలనాటి ఈ అనాగరికమైన ఆచారాన్ని ఆ లోపల పూర్తిగా తొలగించడానికి ఇటువంటి ఆలోచనలు ఏవైనా చేస్తారా?

**ఆంధ్రప్రభ దినపత్రిక**
**4 మార్చి 1999**



# ఒక అబ్రహాం కథ

ఏప్రిల్ 4వ తేదీన ఆర్మూర్ నుండి నిజామాబాద్‌కు పోయే రోడ్డు పక్కన అబ్రహాం అనే దళిత యువకుడిని 'గుర్తు తెలియని వ్యక్తులు' కాల్చి చంపారు. 12 సంవత్సరాల వయసున్న తన మేనల్లుడిని వెనక కూర్చోబెట్టుకుని అతను తన స్వంత ఊరయిన కమ్మరపల్లి మండలం ఉప్పలూరు నుండి నిజామాబాద్‌కు పోతుండగా వారిని వెనక నుండి వెంబడించిన వ్యక్తులు దారిలో ఆపి అబ్రహాంను కాల్చి చంపారు.

అబ్రహాంను మేమే చంపాం అని ఇప్పటిదాకా ఎవరూ ప్రకటించలేదు. పోలీసులు ఎన్‌కౌంటర్ కథ అల్లలేదు. వేరే ఎవరూ అతన్ని ఇన్‌ఫార్మర్ అనలేదు. అయితే చంపింది పోలీసులే అని మాత్రం ఇప్పుడు అత్యధికులు నమ్ముతున్నారు.

అతను చనిపోయిన రోజు ఇంత స్పష్టమైన అభిప్రాయం లేదు. అబ్రహాంను చంపింది 'పోలీసులయినా అయి ఉండాలి, లేదా పీపుల్స్‌వార్ అయినా అయి ఉండాలి' అని మొట్టమొదట జనం అనుకున్నారు. న్యాయంగానయితే పోలీసులు చంపదగ్గ వ్యక్తులూ విప్లవకారులు చంపదగ్గ వ్యక్తులూ వేరు వేరు కోవలకు చెందిన వారయి ఉండాలి. ఎప్పుడో చాలా అరుదుగా తప్ప ఒక వ్యక్తిని గురించి 'వీళ్లయినా చంపి ఉండవచ్చును. వాళ్ళయినా చంపి ఉండవచ్చును' అనుకునే పరిస్థితి ఉండకూడదు. కానీ తెలంగాణలో ఈ పరిస్థితి అరుదేం కాదు. తెలంగాణకు సంబంధించిన అవాంఛనీయమైన వాస్తవాలలో ఇదొకటి.

కాబట్టి ఎవరో ఒకరు ప్రకటిస్తే చంపిందెవరో తెలుస్తుంది లెమ్మని జనం అనుకున్నారు. కానీ అటువంటిదేం జరగలేదు. అబ్రహాంను చంపింది 'జనశక్తి' వాళ్లని కొన్నాళ్ళ తర్వాత పోలీసులు

ప్రకటించారు. అబ్రహాం స్వగ్రామానికి సమీపంలోని పాలెం నివాసి అయిన సురేందర్ అనే మరొక దళిత యువకుడిని ఈ మధ్య పీపుల్స్‌వార్ చంపింది. అతను 'జనశక్తి'లో పనిచేసి బయటకు పోయాడు. దళితులను సంఘటితపరుస్తూ రాజకీయంగా చురుగ్గా పని చేస్తున్నాడు. అతనిని పీపుల్స్‌వార్ వాళ్లు చంపినందుకు ప్రతీకారంగా జనశక్తి వారే అబ్రహాంను చంపారని పోలీసులు మొదట వ్యాఖ్యానించారు. ఇటువంటి ఘటనలు జరిగే ఉన్నాయి కాబట్టి ఈ కథలో అసంభవమేమీ లేదు. ఒక 'జనశక్తి' నాయకుడి పేరిట అబ్రహాంను చంపింది తామేనన్న ప్రకటన కూడా పత్రికా కార్యాలయాలకు వచ్చింది. అయితే వెనువెంటనే అబ్రహాం హత్యతో తమకేమీ సంబంధం లేదనీ, అతనిని తాము చంపినట్టు పత్రికలలో వచ్చిన ప్రకటన వట్టి బూటకమనీ 'జనశక్తి' స్థానిక బాధ్యులు ప్రకటించారు. వాళ్లు ఆ పని మేము చేయలేదని చెప్పాలే తప్ప 'వాళ్లు చేయరు' అని ప్రజలు అనుకునే పరిస్థితి (ఒక్క జనశక్తి గురించే కాదు, అన్ని ఎం.ఎల్ పార్టీల గురించి) లేకపోవడానికి కారణమేమిటని ఈ పార్టీలు ఆలోచించనంత కాలం పోలీసులు ఇటువంటి కథలు ఎన్నయినా అల్లగలరు. అల్లి ప్రజల చేత నమ్మించగలరు కూడ.

ఆ తరువాత పోలీసులు లైన్ మార్చారు. అబ్రహాంను చంపింది ప్రజాపంథా (న్యూ డెమోక్రసీ) వాళ్లని ప్రచారం చేయసాగారు. దానికి కూడ ఒక కారణం చూపించారు. అబ్రహాం తన ఊరిలో రమేశ్ యాదవ్ అనే తెలుగుదేశం నాయకుడికి సన్నిహితంగా ఉండేవాడనీ, ఇద్దరికీ ఫైనాన్స్ వ్యవహారాలతో సంబంధాలున్నాయనీ, రమేశ్ యాదవ్ న్యూడెమోక్రసీకి కొంచెం దగ్గర కాగా అబ్రహాం పీపుల్స్‌వార్‌కు కొంచెం దగ్గర అనీ, కాబట్టి న్యూడెమోక్రసీ వారే అబ్రహాంను చంపారని ప్రచారం చేసారు. ఆ ఊరికీ ఆ మనుషులకూ సంబంధించి ఇది నిజమైనా కాకున్నా ఇటువంటి ఉదంతాలు తెలంగాణలో జరగకపోలేదు కాబట్టి న్యూడెమోక్రసీ వారే ఇది అబద్ధం అని ప్రకటించేవరకూ 'ఏమో, నిజమేనేమో', అనుకునే వాతావరణం ఉండింది. ఆ పార్టీ ఎక్కువగా హత్యలు చేయదు కాబట్టి ఈ కథ నిజం కాదని కూడా ఎవరూ అనుకోలేదు. ఆ పార్టీ హత్యలు తరుచుగా చేయని మాట నిజమేకాని ఇతర ఎం.ఎల్. పార్టీలకూ, సిపిఐ, సిపిఐ(ఎం)లకూ దగ్గరి వారయిన వ్యక్తులను ఆ పార్టీ చంపిన ఘటనలు ఉన్నాయి కాబట్టి వాళ్లే ఈ హత్య మేము చేయలేదని ప్రకటించేంతవరకు 'ఏమో, అయి ఉండవచ్చు'ననుకునే వాతావరణమే ఉండింది.

నిజానికి ఎం.ఎల్. పార్టీల మధ్యనున్న ఈ అవాంఛనీయమైన వాతావరణాన్ని వాడుకుని పోలీసులే అబ్రహాంను హతమార్చారని నమ్మడానికి పెద్దగా కష్టపడనక్కర లేదు. అతని హత్యోదంతం మీద పోలీసుల సంతకం స్పష్టంగా ఉంది. మోటార్‌సైకిల్

మీద జాతీయ రహదారి వెంబడి పట్టపగలు ఒక వ్యక్తిని తరిమి రోడ్డుపక్కనే కాల్చి చంపి వెళ్ళిపోవడం పోలీసులకు మాత్రమే సాధ్యమయ్యే పని. 'గుర్తు తెలియని వ్యక్తుల' రూపంలో పోలీసులొచ్చి హత్య చేసి వెళ్ళిపోయిన ఘటనలు నిజామాబాద్ జిల్లాలో ఇంకా కొన్ని జరిగి ఉన్నాయి. అబ్రహాం హత్య ఆ నమూనాలోనే ఉంది. పోలీసులు-అన్నల చర్చ అటుంచి అబ్రహాం హత్య చాలా బాధాకరమైన ఘటన. అతను ఒక దళిత కుటుంబంలో పుట్టి కంప్యూటర్ ఇంజనీరింగ్ చదువుకున్నాడు. ఆ రోజు గ్రూప్-1 పరీక్షలు రాయడానికి నిజామాబాద్ పోతున్నాడు. తన గ్రామంలో అనేక అభివృద్ధి పనులకు తోడ్పడ్డాడు. విరాళాలు సేకరించి స్కూలు, ఆస్పత్రుల నిర్మాణం కోసం కృషి చేసాడు. పోరాట చిహ్నంగా గ్రామంలో అల్లూరి సీతారామరాజు విగ్రహం పెట్టించాడు. గ్రామంలో కూలివాళ్ల డిమాండ్లకు బాసటగా నిలబడి వాటి సాధనకు తోడ్పడ్డాడు. అదే సమయంలో ఫైనాన్స్‌లో తలదూర్చి స్థానిక తెలుగుదేశం నాయకులతో కలిసి వ్యవహారం నడిపాడు. అందులో వాళ్లకేవో తేడాలొచ్చాయని కూడా అంటారు.

దళితులయినా ఇతర బడుగువర్గాల ప్రజానీకమయినా అభివృద్ధి సాధించాలంటే వారి నుండే అబ్రహాం వంటి వ్యక్తులు పుట్టి పైకి రావడం చాలా అవసరం. అటువంటి వ్యక్తులు రాజకీయ కార్యకర్తలు కావచ్చు, కాకపోవచ్చు. రాజకీయ కార్యకర్తలయినా పూర్తిగా తమ ప్రజల బాగుకే నిబద్ధులయి ఉండవచ్చు, ఉండకపోవచ్చు. అయినా కాకున్నా బడుగు ప్రజానీకానికి తలలో నాలుకగా ఉంటూ చదువూ చొరవా సామాజిక అభినివేశం కలిగి ఉన్న అబ్రహాంలు సామాజిక పురోగమనానికి అవసరం. వారు సాధించే ప్రగతి ఒక్కొకసారి కేవలం వారి స్వంత అభివృద్ధిగానే కనిపించినా దానిని కేవలం ఆ విధంగానే చూడడం తప్పవుతుంది. అందులో ఎంతో కొంత మేరకు బడుగు ప్రజల అభివృద్ధి ఇమిడి ఉంటుంది. వేరే ఏ రూపంలో కాకున్నా ఇతర దళితులకు వారిచ్చే ఆత్మవిశ్వాసం రూపంలోనయినా ఉంటుంది.

అయితే తెలంగాణ దుర్గతిలో ఒక ముఖ్య విషయమేమిటంటే అబ్రహాం వంటి వ్యక్తి కావటం ఇక్కడ ప్రమాదకరం. ఇతరులకు కాదు, తనకే ప్రమాదకరం. అటువంటి వ్యక్తులు ఎం.ఎల్. పార్టీల వైపు ఆకర్షితులు కావడం సహజం. కానీ ఆ పార్టీలలో పూర్తిగా చేరకపోవచ్చు. అంతటి ఏకీభావం వారిలో ఉండకపోవచ్చు. పూర్తి స్థాయిలో చేరితే వారికి కొంత కాలమయినా భద్రత ఉంటుంది. కానీ వారికి చేరువ మాత్రమే అయి బయట బతికితే (అబ్రహాం లాగా) ఏదో ఒక రోజు పోలీసులకు టార్గెట్ అయ్యే ప్రమాదం ఉంటుంది. లేదా ఒక ఎం.ఎల్. పార్టీకి చేరువయితే

ఇంకొక ఎం.ఎల్. పార్టీకి కంటగింపై ఏదో ఒక రోజు మూల్యం చెల్లించుకునే ప్రమాదం ఉంటుంది. లేదా ఎం.ఎల్ పార్టీలకు దగ్గర కాకుండా తెలుగుదేశానికో, కాంగ్రెస్‌కో దగ్గరయి సర్పంచ్‌గానో, ఎంపిటిసిగానో గెలిచినా, గెలవాలని ఆశపడినా ఎం.ఎల్. పార్టీలకు కంటగింపయ్యే ప్రమాదం ఉంటుంది. ఆ వ్యక్తి స్థాయి ఏమిటని చూడకుండా కాంగ్రెస్ ఏజెంటనో, తెలుగుదేశం ఏజెంటనో 'అన్నలు' భౌతికదాడికి గురిచేసే ప్రమాదం ఉంటుంది.

ఏ విధంగా చూసినా తెలంగాణలో అబ్రహాంలకు భద్రత లేదు. వాళ్లు 'అన్నల'లో చేరినా చేరకున్నా లేదు. కానీ అది అబ్రహాంల వ్యక్తిగత సమస్య కాదు. తెలంగాణ పీడిత ప్రజల సమస్య. తమ నుండి అబ్రహాంలు పుట్టి పైకి రాకుండా ఆ ప్రజలు బాగుపడగలరా? ఒకరు పోతే వెయ్యి మంది వస్తారని నినాదాలు ఇస్తుంటాం గానీ నిజంగా రారని మనకు తెలుసు. తెలంగాణకు సంబంధించిన అతి ముఖ్యమైన సమస్యలలో ఒకటయిన దీని గురించి ఆలోచించేవారెవరు? ఆలోచిస్తే పోలీసులకే కాదు, విప్లవ కమ్యూనిస్టు పార్టీలకు కూడా 'శత్రువు'లవుతామని జంకేవారే ఎక్కువ!

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**2 మే 1999**



హైందవ కులవ్యవస్థ ప్రయోగించిన అణచివేతను కొంతమేరకైనా సడలించే పాత్ర ఇస్లాం నిర్వహించిందని ఈనాటి 'సెక్యులర్' పాఠ్యపుస్తకాలు సహితం అనలేకపోతున్నాయి. ఆ అభిప్రాయం ఇప్పటికీ చరిత్ర పరిశోధకులు మాత్రమే చదువుకునే పుస్తకాలకు పరిమితం అయి ఉంది. ఈ ఒక్క విషయంలోనే కాదు, హిందూత్వవాదుల దృక్పథంతో పోలిస్తే సెక్యులర్‌గానే కనిపించే ప్రస్తుత విద్యావ్యవస్థ ప్రాపంచిక అవగాహన ఏ విషయంలోనూ బ్రాహ్మణీయాన్ని బాహాటంగా విమర్శించదు, వ్యతిరేకించదు. అంటరానితనం వంటి మరీ తీవ్రమైన దురాచారాలను విమర్శించేవరకే అది పరిమితం అయింది. 'లౌకికత' పరిమితులే ఈ విధంగా ఉంటే ఇంక సంఘ్ పరివార్ దృక్పథం పాఠ్యపుస్తకాలను లోబరుచుకుంటే ఏం జరుగుతుందో ఊహించడం కష్టం కాదు.

**(చరిత్ర పాఠాలపైన కాషాయం నీడ)**

**పి.డి.ఎస్.యు ప్రచురణ**

**డిసెంబర్, 1999**

# సాంఘిక పోరాట విస్మరణలో దళితులు

మరొక్క జూలై 17 వచ్చింది. ఈ రాష్ట్రంలోని రాజకీయజీవుల కళ్ళు తెరిపించిన రోజుగా ఆ తేదీకి ఉన్న ప్రాముఖ్యాన్ని అందరూ మరిచి పోయారు అన్నంత నిశ్శబ్దంగా గడిచిపోయింది.

తేదీని మరచిపోగలరేమోగానీ ఆ తేదీ తమ మీద వేసిన ముద్రను ఎవరూ మరచిపోలేరు. అది మన రాష్ట్రంలోని సకల రాజకీయ ఉద్యమాల నుడికారాన్ని మార్చి వేసిన సంగతి ఎవరూ మరచిపోలేరు.

కానీ ఎంత ఉవ్వెత్తున జూలై 17 మనల్ని రాజకీయంగా కుదిపేసిందో అంత సులువుగా మార్పులను తేలేకపోయింది. దానికెన్నో కారణాలున్నాయి గానీ 'మానవ వైఫల్యం' ప్రధానమని క్లుప్తంగా చెప్పుకుంటే సరిపోతుందేమో. ఆ వైఫల్యమే లేకుంటే ఆనాడు కారంచేడులో చనిపోయిన ఆరుగురి మరణం మరింత సార్థకం అయి ఉండేదేమో.

ఆ మాట అనుకుని పెద్దగా ప్రయోజనం లేదు. సంపూర్ణమైన సార్థకత, వైఫల్యం ఎరుగని కృషి మనుషులకూ మానవ వ్యవహారాలకూ సాధ్యం కావు. మనుషులు సృష్టించుకున్న దేవుళ్ళకు మాత్రమే సాధ్యమవుతాయి.

అందుకోసమే మనుషులు దేవుళ్ళను సృష్టించుకున్నారు. తమకు సాధ్యం కాని సంపూర్ణతనూ సమగ్రతనూ ఆపాదించి తమ సృష్టికి తామే భయపడి, తామే ఆరాధకులయి, తామే సేవకులయి బతకసాగారు. తమలోని వెలితికి, అపరిపూర్ణతకు అతీతమైన ఆ దేవుళ్లే చివరికి మనుషుల ఉనికికి ముఖ్యమయి పోయారంటే, ఆ దేవుళ్లను చేతిలో పెట్టుకున్న పూజారులు అన్ని సంస్కృతులలోనూ

మొదటి పెత్తందార్లు. దేవుళ్ళ సంగతేమోగానీ పూజార్లకు భయపడి బతికిన సుదీర్ఘమైన చరిత్ర మానవజాతికి అన్ని ప్రాంతాలలోనూ ఉంది.

ఈ పూజార్ల పెత్తనం కేవలం భౌతిక పెత్తనం కాదు. చాలా సందర్భాలలో భౌతిక పెత్తనం అందులోని అత్యల్పమైన అంశం మాత్రమే. అది మనుషుల మెదళ్ళమీద, వ్యక్తిత్వం మీద, 'నేను' అనే ప్రాథమిక అస్తిత్వ మూలం మీద నెలకొల్పిన పెత్తనం. అది 'నా దగ్గర ఎంత ఉందనే' విషయాన్ని కాక 'నేనెవరిని' అనే విషయాన్ని శాసించింది. మనిషిని ప్రకృతికి కాకుండా చేయడమే కాదు, మనిషిని తనకు తానే కాకుండా చేసింది.

పూజారితనానికుండే ఈ దుర్మార్గమైన లక్షణాన్ని సంపూర్ణంగా అభివృద్ధి చేసి, అత్యంత బలంగా వ్యవస్థితం చేసింది భారతదేశంలోని బ్రాహ్మణీయ వ్యవస్థ. అది మనుషుల మెదళ్ళనూ వ్యక్తిత్వాలనూ ఎంత పూర్తిగా లోబరుచుకుందంటే ఆ వాస్తవానికి రాజకీయంగా గుర్తింపు రావడానికి కారంచేడులో ఆరుగురు దళితులు ఘోరంగా చావవలసి వచ్చింది. అంతకు ముందు అదెవరికీ తెలియలేదని కాదు. కానీ అత్యధికులు ఒప్పుకోలేదు. అన్యాయంగా చనిపోయిన వాళ్లను, ఉద్యమాలలో చనిపోయినవాళ్లను చాలా సులభంగా 'అమరులు' అంటుంటారు గానీ ఇతరులకు ప్రాణంపోసే చావే 'అమరత్వానికి' అర్హతగల చావయినట్టయితే, మనందరి ఆలోచనలకు ప్రాణంపోసిన ఆ ఆరుగురే నిజమైన అమరులు.

కొత్తగా ప్రాణం పోసుకున్న ఈ ఆలోచనలు 1985 జూలై 17 తరువాత చాలా పాయలలోకి చాలా ఉత్సాహంగా ప్రవహించాయి. అన్ని రకాల రాజకీయ ఆలోచనలను తిరగరాసి అవి అభ్యుదయ కాంక్షకు ఎన్నడూ లేని బలం చేకూర్చబోతా యనుకున్న తరుణంలో 'మానవ వైఫల్యం' అడ్డమొచ్చింది. వచ్చిన ప్రయోజనం తక్కువేమీ కాదు గానీ ఊహించినంత రాలేదు. మనం దేవుళ్ళమూ కాలేము. రాజకీయ దేవుళ్ళమూ కాలేము. దేవుళ్లు కాలేని మనుషులు రాజకీయ దేవుళ్లు కాగలరని భావించడం ఆధునిక రాజకీయాల తార్కిక వైపరీత్యాలలో ఒకటి. దానివల్ల జరిగిన నష్టం చాలును కాబట్టి ఇంత మార్పే గొప్ప అనుకోవడం సబబుగా ఉంటుందేమో.

రాజకీయాలలో వచ్చిన ఈ మార్పు చెరగని ముద్రవేసింది కానీ సామాజిక పరిణామం ఇంకా చాలా వెనుకబడి ఉంది. ఈరోజు దళిత జనోద్ధరణ అనే విభూతి నుదుట రాసుకోనివారు ఎవరూ లేరు. కానీ జరుగుతున్న ఉద్ధరణకూ ఈ వేషధారణకూ పెద్దగా పొంతన లేదు.

పెద్ద పెద్ద మేధావులు పెద్ద పెద్ద ఉపన్యాసాలు ఇచ్చే విశ్వవిద్యాలయాలలోకి దళితుల, ఆదివాసుల ప్రవేశం 'బ్యాక్‌లాగ్' అని పిలువబడే అనంతమైన 'హర్డిల్స్' మీదుగా జరిగే కష్టసాధ్యమైన దూకుడు పందెం. ఆ 'హర్డిల్స్' ఒకచోట స్థిరంగానూ ఉండవు. వాటిని వెనక్కీ ముందుకూ ఈ పక్కకూ ఆ పక్కకూ జరుపుతూ ఉంటారు. ఏదో ఒకరోజు తీసి చంకలో పెట్టుకొని వెళ్ళిపోతారు. ఆశతో పందెంలోకి దిగిన అమాయకులకు పందెం ఎక్కడో తెలీదు.

కులం పేరు పెట్టి నీచంగా తిడితే కొడితే హింసిస్తే మొరపెట్టుకోవడానికొక గట్టి చట్టం ఉంది కదా అనుకుని పోలీస్‌స్టేషన్‌ను వెతుక్కుంటూ పోయిన వాళ్లకు తాము చేస్తున్నది తప్పుడు అభియోగమన్న సందేహానికి ముందు సంజాయిషీ చెప్పుకోవలసి ఉంటుందనీ, ఆ అవాంతరం గడిస్తేనే తమకు అన్యాయం చేసినవారి మీదికి 'చట్టం' చూపులు పోతాయనీ త్వరలోనే అర్థం అవుతుంది. (అన్ని చట్టాలూ ఏదో ఒక మేరకు దుర్వినియోగం అవుతూనే ఉంటాయి గానీ దళితులు, స్త్రీలు, ఆదివాసులకు హక్కులు కల్పించే చట్టాల గురించి మాట్లాడేటప్పుడు మాత్రమే అందరూ దుర్వినియోగమే ప్రధానమయినట్లు మాట్లాడతారు.)

ఇళ్లపట్టాలనీ ఇళ్లకాలనీలనీ ఉచిత హాస్టళ్ళనీ స్కాలర్‌షిప్పులనీ అత్యాచారాలకు గురయితే నష్టపరిహారమనీ ఆశపడి ముందుకురికిన దళితులకు ఏమీ దక్కదని కాదు గానీ అడుగడుగునా చిల్లరమల్లర అవాంతరాలూ అవమానమూ అనాసక్తీ ఎదుర్కోవాలి. అడుగడుగునా 'నువ్వు అడుక్కునేవాడివి సుమా' అనే అవమానాన్ని ఎదుర్కోవాలి. అన్నీ వీళ్లకే ఇచ్చేస్తున్నారు అనే అర్థరహితమైన నిరసనను కూడా ఎదుర్కోవాలి. అంతకు పదిరెట్ల నిరసన బ్రాహ్మణీయ ఆలోచనారీతులకు బందీలయిన మనసులలో ఉండనే ఉంది. ఇది దళితుల ఆత్మగౌరవంపైన నిత్యం పడే సమ్మెటపోటు. పుండు మీద కారమన్నట్లు, దీన్ని కారణంగా చూపించి మీరు ప్రత్యేక హక్కును కోరకుండా ఉండడం మీకే మంచిది అని దళితులకు ఉద్బోధ చేసే ప్రబుద్ధులూ లేకపోలేదు. రిజర్వేషన్‌ల గురించి చర్చ జరిగినప్పుడు ఈ డొంకతిరుగుడు వాదనతో రిజర్వేషన్లను వ్యతిరేకించే మేధావులు చాలామందిని చూసాం. చేసే ఉద్బోధ ఏదో నిష్కారణంగానూ, అన్యాయంగానూ పీడితుల హక్కుల పట్ల నిరసన పెంచుకున్న వారికి ఎందుకు చేయరో అర్థం కాదు.

మనుషులు సృష్టించిన దేవుళ్ళను తమచేతిలోకి తీసుకుని మనుషుల మెదళ్ళమీద, వ్యక్తిత్వాల మీద పెత్తనం నెలకొల్పిన పూజార్ల ఆధిపత్యాన్ని ఎక్కడా లేనంత సంపూర్ణంగా అభివృద్ధి చేసిన ఈ దేశంలో - ఆలోచనలనూ వ్యక్తిత్వాలనూ గెలుచుకునే తాత్విక సాంస్కృతిక పోరాటం అతి ముఖ్యమైన పోరాటమన్న సత్యాన్ని జూలై 17 మరింత సంపూర్ణంగా నేర్పించవలసి ఉండింది.

కానీ దళిత ఉద్యమం కమ్యూనిస్టులకు ఎంత నేర్పిందో ఏం నేర్పిందో గానీ, రాజ్యాధికారం అన్ని సమస్యల పరిష్కారానికి నాంది అన్న అభిప్రాయాన్ని కమ్యూనిస్టుల నుండి తాను స్వీకరించి నష్టపోయింది. దళిత ఉద్యమకారులు ఈ అభిప్రాయాన్ని అంబేద్కర్‌కు ఆపాదిస్తున్నారు కానీ, ఆయన దళితులు రాజ్యాధికారం చలాయించాలని చెప్పినప్పటికీ అదే ఆయన ఆలోచనలకు కేంద్రం కాదు. అంబేద్కర్, పెరియార్, పూలే - ముగ్గురూ రాజకీయ మార్పుల కంటే సాంఘిక మార్పుకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చారు. ఆ దిశగా ఆలోచనలను అభివృద్ధి చేసే బదులు రాజ్యాధికారం అన్న భావనకు పెద్దపీట వేసి దానికి అనుగుణమైన వ్యూహాల, ఎత్తుగడల వేటలో దళిత ఉద్యమం పడింది. దానివల్ల నిజంగా కొత్తవయిన పోరాట రూపాలను సహితం దళిత ఉద్యమం ఆవిష్కరించలేకపోయింది.

ప్రభుత్వం మీద డిమాండ్లు పెట్టడం అత్యంత సహజమైన ఆందోళనా మార్గంగా మనకు తోస్తుంది. ఇప్పటిదాకా అన్నిటికంటే బలమైన ఉద్యమ సంప్రదాయంగా ఉన్న కమ్యూనిస్టు సంప్రదాయం ప్రభావం దీనికి కారణం కావచ్చు. కానీ కులనిర్మూలన జరగాలంటే ప్రభుత్వం మీద డిమాండ్లు పెట్టడం కంటే సామాజిక వ్యవస్థలో, అలవాట్లలో, ఆలోచనా రీతులలో మార్పు కోసం కృషి చేయడం ఎక్కువ అవసరం. కారంచేడు జరిగిన తరువాత 15 ఏళ్లకు సహితం ఈ కృషికి అవసరమైన కార్యాచరణ రూపాలను దళిత ఉద్యమం ఆవిష్కరించలేకపోవడం ఆ ఉద్యమ వైఫల్యాలలో అతి ముఖ్యమైనది.

అధికారం మనుషులను అయస్కాంతంలా ఆకర్షిస్తుంది. అధికారం ఉన్నవాళ్ల చుట్టూ తిరుగుతుంటారు. అధికారం కోసం జరిగే పోరాటంవైపు ఆకర్షితులవుతారు. ఆ పోరాటాలు పురోగమించే క్రమంలో ఎక్కడికక్కడ స్థానికంగా నెలకొల్పే అధికారం చుట్టూ కూడా తిరుగుతుంటారు. అందువల్ల అధికారం కోసం అధికారానికి వ్యతిరేకంగా జరిగే పోరాటాలు చాలా సహజమైనవిగా కనిపిస్తాయి. వాటికి సంబంధించిన పద్ధతులు, వ్యూహాలు, ఎత్తుగడలు సులభంగా ఆవిష్కరించ బడతాయి. వేరే రకం రాజకీయ కృషి ఉండగలదన్న ఆలోచనే విచిత్రంగా అనిపిస్తుంది. మన దగ్గర కమ్యూనిస్టులూ దళిత ఉద్యమకారులూ ఇద్దరూ కూడా అధికారం కోసం అధికారానికి వ్యతిరేకంగా పోరాటం చేసే వ్యూహాన్నే ఎంచుకోవడం వలన రాజకీయం అంటే ఒకే ఒక రకంగా ఉంటుందన్న అభిప్రాయం స్థిరపడింది.

కానీ రాజ్యానికీ, దాని అధికారానికీ వ్యతిరేకంగా పోరాటాలు చేసి దళితులు సాధించుకున్న హక్కుల అమలులో వారు ఎదుర్కొంటున్న సమస్యలనూ ఆటంకాలనూ పరిశీలిస్తే, వాటికి మూలం రాజకీయ అధికారంలో కన్నా - సమాజం లోనూ, సమాజానికి మూలంగా ఉన్న బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థలోనూ సంస్కృతీ

ఆలోచనా రీతులలోనూ ఉందని అర్థం అవుతుంది. ఇవి చాలాకాలంగా వేళ్లూనుకుని ఉన్నాయి. రాజ్యాధికారం లేక రాజకీయ అధికారం ద్వారా వీటిని ఎదుర్కొనడానికి చేయగలిగింది కొంత ఉందేమోగానీ అది కొంతే. ఈ పోరాటం ప్రధానంగా సమాజంలో జరగవలసి ఉంది. దానికి తగిన పోరాటరూపాలు, ప్రచారరూపాలు ఇంకా తయారు చేసుకోవలసి ఉంది. సమాజంలో ఎస్.సి, ఎస్.టి, బి.సి ప్రజానీకం జనాభా ఎంత ఉందో లెక్కలు గట్టి వారి వోట్లన్నీ కలిసిన నాడు తమదే రాజ్యాధికారం అని ఎదురు చూసే దిశగా దళిత ఉద్యమాన్ని - ఒక రకంగా చెప్పాలంటే కమ్యూనిస్టు నమూనాలో - తీసుకొనిపోతున్న దళిత నాయకులు ఈ కృషిని పూర్తిగా విస్మరిస్తున్నారు. వారు అంబేద్కర్, పెరియార్, ఫూలేల రచనలను మరొకసారి లోతుగా అధ్యయనం చేస్తే మంచిదేమో.

**ఆంధ్రప్రభ దినపత్రిక**

**22 జూలై 1999**



దళితులకు హైందవంతో ఉండేది ఒక వికృతమైన సంబంధం. ఒక విషయం తాను నిరాకరించేదాని ద్వారా తనను తాను నిర్వచించుకోవడం అప్పుడప్పుడు జరుగుతుంటుంది. (చీకటి అంటే వెలుతురు లేని చోటు, లేక స్థితి అని నిర్వచించినట్టు.) హైందవం తాను వెలివేసిన దళితుల ద్వారా తనను తాను నిర్వచించుకుంటుంది. దాని ఉనికికి దళితులు అవసరం, వారి వెలివేత అవసరం. కానీ దళితులకు హైందవంతో ఏమవసరం ఉంది? అంటరానితనం ఏదో ఒక మేరకు పాటిస్తూనే ఉన్నా, పాటించడం తప్పని ఒప్పుకుంటున్నాం కాబట్టి మీరింక అన్నీ మరచిపోయి మిమ్మల్ని మీరు హిందువులుగా భావించి మాతో ఉండండి అని హిందువులు అంటే దళితులు ఎందుకు ఒప్పుకోవాలి? ఒప్పుకుంటే అది వారి దయ అని హిందువులు సంతోషించాలి గానీ ఒప్పుకోకుండ తమకు సూత్రప్రాయంగా దేవుని ముందు సమాన హోదా కల్పించే మతంలోకి పోతామంటే దానికి ఎవరినో సమాధానం, సంజాయిషీ అడగడంలో అర్థమేమయినా ఉందా? ఒక్కరోజు కూడా అంటరానితానికి వ్యతిరేకంగా ఒక ఉద్యమంగానీ పోరాటంగానీ చేయని హిందుత్వవాదులకు, దళితులు క్రైస్తవంలోకి ఎందుకు పోతున్నారో చెప్పమంటూ కేథలిక్‌ల పోప్‌ను ప్రశ్నించే అర్హత ఎక్కడిది?

**(పోప్‌ను ఏమడుగుతారు? ఏం చెప్తాడు)**

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**31 అక్టోబర్ 1999**

# దళితులపై దాడుల్లో ముద్దాయిలు ఎవరు?

చాలా చురుకుగా, చొరవగా పనులు చేస్తున్నట్టు కనిపించే చంద్రబాబు నాయుడు పాలనా విధానాల గురించి సరయిన అంచనాకు రావాలంటే ఈ హడావుడి మన కళ్ళను కప్పేయకుండా జాగ్రత్తపడడం అవసరం.

సమాచార రంగానికి సంబంధించిన అత్యాధునిక సాంకేతిక ప్రక్రియలకు తన పాలనలోనూ, విధానాలలోనూ ప్రముఖ స్థానం కల్పిస్తున్నందుకు ఖ్యాతి పొందుతున్న ఈ నాయకుడు, ఆధునికతను అపహాస్యం చేస్తూ తన స్వంత జిల్లాలో నిరాటంకంగా కొనసాగుతున్న అంటరానితనాన్ని అంతం చేయడానికి ఏ విధానాన్నీ రూపొందించకపోగా ఇప్పటిదాకా ఆయనగారి రాజకీయ జీవితంలో ఏ దశలోనూ దాని గురించి కృషి చేయలేదని గుర్తుంచుకోవడం అవసరం. పైగా ఆయన గారి రాజకీయ విజయాలకు ఆ జిల్లాలో పునాదిగా ఉన్న గ్రామీణ పెత్తందార్లు తమ గ్రామాలలో దళితులను వారి స్థానంలో ఉంచడంలో ప్రముఖ పాత్ర నిర్వహిస్తున్నా ఆయనగారి 'ఆధునికత' కు అది తప్పుగా కానీ, ఎబ్బెట్టుగా కానీ తోచలేదు.

కొంతకాలం కింద చంద్రబాబు ప్రభుత్వం దళితులపై దాడులు విపరీత స్థాయిలో జరుగుతుండడానికి గల కారణాలను అన్వేషించి పరిష్కారాలు సూచించమని జస్టిస్ పున్నయ్య కమిషన్‌ను నియమించింది. జస్టిస్ పున్నయ్యగారు నిర్మొహమాటంగా సూచనలియ్య దలచుకుంటే రాజకీయ పార్టీలు ఈ విషయంలో తమ ద్వంద్వ వైఖరిని విడనాడడం ప్రధాన పరిష్కార మార్గమని చెప్పవలసి ఉంటుంది. అన్ని రాజకీయ పార్టీలు తాము అంటరానితనానికి వ్యతిరేకమే అంటాయి. కుల వివక్ష పోవా

లంటాయి. కానీ దళితులపైన జరిగిన దాడుల గురించి నమోదైన కేసులలోని ముద్దాయిల రాజకీయ జాతకాలు చదివితే వారందరూ తెలుగుదేశం పార్టీకో, కాంగ్రెస్ పార్టీకో, బి.జె.పి.కో, మరొక పార్టీకో చెందినవారై ఉంటారు. ఆ మాటలూ, ఈ చేతలూ కలిసి సాగుతూనే ఉంటాయి.

భౌతిక దాడులు మాత్రమే కాదు. గ్రామాలలో అంటరానితనం లేదా ఇతర రూపాలలో కుల వివక్ష పాటించే సంస్కృతిని సామాజిక ఒత్తిడి ద్వారా నిలబెట్టడం లోనూ, దానిని ప్రతిఘటించే దళితులను సాంఘిక బహిష్కరణకు గురి చేసి దానిని అమలు చేయడంలోనూ ఈ పార్టీల స్థానిక ప్రముఖులు ప్రధానపాత్ర నిర్వ హిస్తుంటారు. వారిపైన ఈ పార్టీలు ఏ రోజూ ఏ రకమైన చర్యా తీసుకోవు. ఎన్నికలప్పుడు పెద్ద నాయకులు సహితం వారినే వెంటేసుకుని తిరుగుతుంటారు. స్థానిక ఎన్నికలప్పుడు వారికే టిక్కెట్లు ఇస్తుంటారు.

ఇవేవీ చంద్రబాబు నాయుడుకు తెలియకుండా పోలేదు. పైగా ఆయన స్వంత జిల్లా అయిన చిత్తూరు గ్రామీణ ప్రాంతాలలో ఈ అనాగరిక వాతావరణం మరింత ఎక్కువ. దానిని సవరించడానికి ఏ రోజూ ఏ ప్రయత్నమూ చేయకుండా 'దళితులపైన దాడులు ఆగేదెట్లా?' అని ఒక కమిషన్‌ను వేయడం పరిపాలనా దక్షత అనిపించుకోగలుగుతున్నదంటే మన చైతన్యం అంతటి అధోగతిని చేరుకుంది.

జస్టిస్ పున్నయ్య కమిషన్ నియామకం నిరర్థకమని చెప్పడం నా ఉద్దేశం కాదు. పున్నయ్యగారు చాలా ఓపికగా జిల్లాలలో పర్యటిస్తున్నారు. చాలా సమాచారం సేకరిస్తున్నారు. బాధితుల వెతలకు సానుభూతిగా స్పందిస్తున్నారు. వారినుండి ఉపయోగకరమైన సూచనలు రాగలవు. అయితే అంటరానితనం విషయంలో అన్ని పార్టీలూ పాటిస్తున్న హిపోక్రసీ కూడా వారి నివేదికలో ప్రస్తావనకు రావలసిన అవసరం ఉంది. దానికి వారు తెలుగుదేశం పార్టీతో సహా అన్ని పార్టీలనూ నిలదీయవలసిన అవసరం ఉంది. తెలుగుదేశం, కాంగ్రెస్, బి.జె.పి వంటి పార్టీలే కాదు సి.పి.ఐ. కూడా ఇందుకు మినహాయింపు కాదని ఈ మధ్య మెదక్ జిల్లా సాదుల్లానగర్ ఘటన సూచిస్తున్నది. బాణామతి పేరు మీద దళితుల చేత బలవంతంగా మలమూత్రాలు తాగించిన వారికి సి.పి.ఐ.తో సంబంధాలున్నాయనీ, నర్సాపూర్ మాజీ ఎం.ఎల్.ఏ. వారికి రక్షణ కల్పిస్తున్నాడనీ దళితులు చేసిన ఆరోపణకు ఆ పార్టీ నుంచి సంతృప్తికరమైన జవాబు లేదు.

హిపోక్రసీ ఇంకొక రూపంలో కూడా ఉంది. చంద్రబాబు నాయుడు స్వర్ణాంధ్ర ప్రదేశ్ పేరిట అనుసరిస్తున్న విధానాలు - ప్రపంచమంతా ఆయనను తెగమెచ్చు కోవడానికి కారణమైన విధానాలు - రాష్ట్ర స్థూల అభివృద్ధిరేటును ఆయన ప్రతి

పాదించిన మోతాదులో సగమైనా పెంచుతాయో లేదో గానీ అవి పేదల, దళితుల శక్తినీ, బలాన్నీ క్షీణింపజేస్తాయనడంలో సందేహం లేదు. 'అభివృద్ధి'ని వేగవంతం చేయడానికి ఇది అవసరమనీ, అభివృద్ధి బాగా వచ్చిన తరువాత చుక్కలు చుక్కలుగా అది కిందివారికి అందుతుందనీ చంద్రబాబు నాయుడు, అతని అభిమానులు అనొచ్చు. నిజానికి వారి సిద్ధాంతం ఇదే. దాని తప్పొప్పులు అట్లా ఉంచి విధానపరం గానే దళితులు, ఇతర బలహీన వర్గాలవారి శక్తి సంపదలను క్షీణింపజేస్తున్నారనేది నిర్వివాదం. ప్రభుత్వం దగ్గర పరిమితంగా ఉన్న వనరులను ఏ వనరులూ లేని వాళ్ళకోసం ఖర్చు పెట్టేకంటే వనరులున్న వారి కోసం వెచ్చించి, వారు సంపదను పెంచుకోవడానికి ప్రోత్సాహం కల్పించినప్పుడే అభివృద్ధి వేగంగా జరుగుతుందనీ, దాని ఫలాలు ఏదో ఒక రోజు ఏదో ఒక మేరకు ఏ వనరులూ లేనివారికి కూడా ఏదో ఒక రూపంలో అందుతాయనీ నమ్మడం ఈనాటి పాలక ఆర్థిక విధానాల సారం.

ఇది సామాజికంగా బలహీనులయిన వారికీ, బలవంతులయినవారికీ మధ్య ఎడాన్ని పెంచుతుంది. బలహీనుల అవకాశాలనూ, ఆత్మస్థైర్యాన్నీ, శక్తినీ దెబ్బతీస్తుంది. బలవంతుల బలాన్నీ స్వాతిశయాన్నీ పెంచుతుంది. అంటే 'దళితులపైన దాడులు' వంటి ఘటనలు జరిగే పరిస్థితిని మరింత పెంపొందిస్తుంది. అందుకు భిన్నంగా, దళితులకు సామాజికంగా, ఆర్థికంగా బలాన్నీ, శక్తినీ కల్పించే విధాన చర్యలు వారి పైన జరిగే దాడులకు ప్రతికూల వాతావరణాన్ని పెంచగలుగుతాయి. భౌతిక శక్తినీ పెంచుతాయి. అవి వారిపై దాడి చేసేవాళ్ళు, కించపరిచేవాళ్ళు ఒకటికి రెండుసార్లు ఆలోచించేటట్టు చేయగలుగుతాయి.

అమర్త్యసేన్ మన పాలకులకు హీరోయే కాబట్టి ఆయన పదే పదే చెప్పే విషయాన్ని గుర్తుచేయడం అవసరం. పేదలు, పీడితుల బలాన్నీ, శక్తినీ పెంచే చర్యలు తీసుకోవడం ప్రభుత్వ బాధ్యతలలో ప్రధానమైనదని ఆయన అంటాడు. ఆయన మార్కెట్ వ్యవస్థకు, సరళీకరణకు, గ్లోబలైజేషన్‌కు సూత్రప్రాయంగా వ్యతిరేకి కాడు. అంటే చంద్రబాబు నాయుడు ప్రచారం చేస్తున్న విధానాలకు సూత్రప్రాయంగా వ్యతిరేకి కాడు. కానీ సరయిన విధానాలు అనుసరించినట్లయితే పేదలు కూడా వాటివల్ల ప్రయోజనం పొందగలరని నమ్ముతారు. కాబట్టి వాటిని సూత్రప్రాయంగా సమర్థిస్తాడు. అయితే ప్రయోజనం పొందగలగాలంటే పేదల శక్తిసామర్థ్యాలను పెంపొందించే విధానపరమైన చర్యలు ప్రభుత్వం చేపట్టాలని అంటాడు. ఈ విషయం లెక్కలోకి తీసుకోకుండా నిర్విచక్షణగా మార్కెట్ సిద్ధాంతాన్నీ, గ్లోబలైజేషన్‌నూ అనుసరిస్తున్న మన ముఖ్యమంత్రి ఆ కారణంగా మరింత బలహీనులవుతున్న దళితులపైన దాడులు ఇంకింత ఎక్కువగా రేపు జరగగలవని గుర్తించలేడనుకోవాలా? లేకపోతే గుర్తిస్తున్నాడు కాబట్టి జస్టిస్ పున్నయ్య కమిషన్‌ను నియమించి పాపం

కడిగేసుకోవాలనుకుంటున్నాడా? ఈ హిపోక్రసీ గురించి మాట్లాడకుండా అతని పాలనా దక్షతను పెద్దమనుషులంతా పొగుడుతూ కూర్చోవడం భావ్యమా?

అంటరానితనం, కుల వివక్ష, దళితులపైన దాడులు తగ్గాలంటే చాలా కృషి అవసరం. అదంతా ప్రభుత్వం బాధ్యతే కాదు. నిజానికి ఎక్కువ భాగం మన బాధ్యతే. అయితే ప్రభుత్వాలు చేయవలసిన పనులు - చేయకుండా ఉండవలసిన పనులు - ఉన్నాయి. ఈ దురాచారాలను ప్రోత్సహించే వారికి అధికార రాజకీయాలలో చోటు కల్పించకుండా ఉండడం, చట్టంలో దళితులకు రక్షణ కల్పించే అంశాలేవయినా ఉంటే అవి సక్రమంగా అమలయ్యేటట్టు చూడడం వీటిలో ముఖ్యమైనవి. ఈ విషయంలో చిత్తశుద్ధి లేనప్పుడు దళితులపైన దాడులు పెరుగుతున్నాయంటూ కన్నీరు కార్చడం అనవసరం.

ఇందులో చివరి విషయం గురించి - దళితులకు రక్షణ కల్పించే చట్టాల అమలు గురించి - కొంచెం మాట్లాడుకుందాం. మామూలుగా పోలీసులకు ప్రత్యేక అధికారాలు కల్పించే చట్టమేదైనా ఉంటే దానిని ఉపయోగించడానికి పోలీసులు చాలా ఆరాటపడతారు. వాళ్ళ చేతిలో అధికారం ఉంటే దానిని ఉపయోగించని సందర్భాలు కొన్నే ఉంటాయి. ఎస్.టి, ఎస్.సి (అత్యాచారాల నిరోధక)చట్టం అటువంటి అరుదయిన ఉదాహరణలలో ఒకటి.

ఒక ప్రాంతంలో నివసించే వాళ్ళు ఈ చట్టం కింద నేరాలకు పాల్పడు తున్నారని గానీ, అటువంటి నేరాలను ప్రోత్సహిస్తున్నారని గానీ, నేరగాళ్ళకు ఆశ్రయమిస్తున్నారని గానీ, నేరగాళ్ళను పట్టుకోవడంలో తగినంత సహకారం ఇవ్వడంలేదని గానీ, సాక్ష్యాలను దాచి పెడుతున్నారని గానీ పరిశీలన మీదట రాష్ట్ర ప్రభుత్వం భావిస్తే వారందరి మీదా ఉమ్మడిగా జుల్మానా విధించవచ్చుననీ, వారి వారి స్తోమతను బట్టి దానిని ఒక్కొక్కరి నుంచి వసూలు చేసుకోవచ్చుననీ చట్టంలోని సెక్షన్ 16 అంటుంది. నిజానికి ఇదే అధికారం 1956 నాటి పౌరసత్వ హక్కుల పరిరక్షణ చట్టం (పి.సి.ఆర్.చట్టం)లోని సెక్షన్ 10 ఎ లో కూడా ఉంది. అదే అధికారం ఎస్.సి, ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టం కింద కూడా ఉంటుందని సెక్షన్ 16లో అన్నారు.

కానీ ఆ చట్టం కిందనయినా ఈ చట్టం కిందనయినా ఈ అధికారాన్ని వినియోగించింది ఎన్నడూ లేదు. ప్రభుత్వానికి రిపోర్టు పంపించేది పోలీసులే కాబట్టి ఇది పోలీసుల చేతిలో చాలా అధికారం పెడుతుంది. వేరే సందర్భంలోనయితే దానిని వారెంత ఉత్సాహంగా వినియోగించేవారో! నక్సలైట్లకు ఆశ్రయమిచ్చిన వారిపైన అటువంటి ఉమ్మడి జుల్మానా విధించవచ్చునని చెప్పే చట్టమేదైనా ఉండి

ఉంటే తెలంగాణలో పోలీసులు దానిని ఎంత ఉత్సాహంగా వినియోగించేవారో ఊహించడం కష్టం కాదు. కానీ దళితులపైన అతి క్రూరమైన దాడులు జరిగిన గ్రామాల్లో సైతం ఏ రోజూ ఈ అధికారాన్ని ప్రయోగించలేదు.

సెక్షన్ 17 కిందనయితే పోలీసులకే విస్తృతమైన అధికారం ఇవ్వబడింది. దళితుల పైన దాడి చేస్తానని బెదిరించిన- లేక చేయబోతాడని తాము అనుమానించిన - వ్యక్తిని లేక వ్యక్తులను నిరోధించడానికి, శాంతిని నెలకొల్పడానికి తగిన చర్య ఏదైనా డి.ఎస్.పి. ర్యాంకు పోలీస్ అధికారి తీసుకోవచ్చుననీ, తగినంత సమాచారం ఉన్నట్టయితే ఆ ప్రాంతాన్ని దళితులపైన అత్యాచారాలు జరిగే స్వభావం ఉన్న ప్రాంతంగా ప్రకటించవచ్చుననీ కూడా ఆ సెక్షన్ అంటుంది. ఇందుకోసం ఏయే చర్యలు తీసుకోవచ్చునో సూచించే 'స్కీం' లు రాష్ట్ర ప్రభుత్వం తయారు చేయ వచ్చునని సెక్షన్ 17 (3) అంటుంది. దళితులలో భద్రతా భావాన్ని నెలకొల్పడం ఈ చర్యల లక్ష్యం అని ఆ చట్టం చెపుతుంది.

చాలా విస్తృతమైన ఈ అధికారాలను ప్రభుత్వం గానీ, పోలీసులు గానీ ఎందుకు ఎన్నడూ ఉపయోగించలేదు? హైదరాబాద్ నగరంలో రౌడీ షీటర్లనూ, ఇతర 'అసాంఘిక శక్తులనూ' నగరం నుంచి వెలివేయవచ్చునని చెప్పే అధికారా లను నగర పోలీసులు చాలా అత్యుత్సాహంగా వాడతారే, దళితులకు ఆత్మస్థైర్యం పెంచే లక్ష్యంతో కల్పించిన ఈ అధికారాన్ని ఎందుకు ఉపయోగించరు? ఉపయోగించమని ప్రభుత్వం ఎందుకు వారిని శాసించదు?

దళితులకు మనోస్థైర్యాన్ని పెంచే ఈ అధికారాలను వినియోగించకపోగా పోలీసులూ, అధికార ప్రతిపక్ష పార్టీల నాయకులూ దళితుల మనోస్థైర్యాన్ని నీరుగార్చే 'కౌంటర్ కేసులు', 'రాజీ'ల విషయంలో చాలా ఉత్సాహం చూపిస్తుంటారు. న్యాయం కోసం నిలబడాలన్న పట్టుదల దళితులలో ఏ మాత్రం ఉన్నా దానిని నీరసింపజేసే కర్తవ్యాన్ని ప్రధానంగా తీసుకుంటారు. ఇది సవర్ణ దురహంకారానికి చాలా బలం చేకూరుస్తున్నది.

ప్రభుత్వ వైఖరిలోనూ, ప్రభుత్వ వైఖరిని అనుసరించి నడుచుకునే పోలీసుల వైఖరిలోనూ మార్పురానిదే కొత్తగా ఎవరెన్ని సూచనలిచ్చినా పెద్దగా ప్రయోజనం ఉండదు. జస్టిస్ పున్నయ్యగారికి ఈ పాటికి ఈ విషయం అర్థమయ్యే ఉండాలి. దానికి తగిన సూచనలు వారు ఇస్తారని ఆశిద్దాం.

**ఆంధ్రప్రభ దినపత్రిక**

**11 నవంబర్ 1999**



# పున్నయ్య కమిషన్‌కు సూచనలు

గౌ॥ జస్టిస్ పున్నయ్య కమిషన్‌కు
హైద్రాబాద్.

అయ్యా,

**విషయము : దళితుల పట్ల వివక్ష, అత్యాచారాలు - ప్రభుత్వ విధానాలు, చట్టాలు - తగు సూచనలు - గురించి**

రాష్ట్రంలో దళితులు వివిధ రంగాలలో అనుభవిస్తున్న వివక్షను పోగొట్టడానికి, దళితులపైన జరుగుతున్న భౌతికదాడులను అరికట్టడానికి ఉపయోగపడగల కొన్ని సూచనలు మీ ముందుంచుతున్నాము. మీరు ప్రభుత్వానికి సమర్పించబోయే నివేదికలో ఈ సూచనలకు చోటు కల్పించాలని కోరుతున్నాం. దాదాపు 15 సంవత్సరాలుగా హక్కుల ఉద్యమంలో పనిచేసిన అనుభవం మేము చేస్తున్న ఈ సూచనలకు ఆధారం. ఆ అనుభవంతో మేము చేస్తున్న ఈ కింది సూచనలను పరిశీలించి, మీరు ప్రభుత్వానికి ఇవ్వబోయే సలహాలలో భాగం చేస్తారని ఆశిస్తాము.

1. ప్రభుత్వ విధానాలు, చట్టాలకు సంబంధించిన సూచనలు చేసేముందు ఒక విషయం స్పష్టం చేయాలి. అణచివేతకు గురయ్యే ఏ ప్రజలకైనా న్యాయం చేయడానికి అత్యున్నతమైన పద్ధతి వారికి సామాజికంగా ఆర్థికంగా బలం చేకూర్చడం. అప్పుడు అణచివేతను కొంతమేరకైనా వారే ఎదుర్కోగలుగుతారు. అణచివేసే వర్గాలు కూడా కొంతమేరకైనా వెనక్కి తగ్గుతాయి.

రాష్ట్ర ప్రభుత్వం దళితులు అనుభవిస్తున్న వివక్షనూ అణచివేతనూ దౌర్జన్యాలనూ విశ్లేషించి పరిష్కార మార్గాలను సూచించమని మిమ్మల్ని కమిషన్‌గా నియమించడం ఒక మేరకు

హర్షణీయమే. కానీ ఒక ముఖ్య పరిష్కార మార్గాన్ని ఆ ప్రభుత్వమే కొద్దికొద్దిగా మూసేస్తున్నది. ఈ మార్గానికి 'సంక్షేమం' అని పేరు. అయితే అందులో అనేక అంశాలు ఇమిడి ఉన్నాయి.

దళితులకు ఉపాధి కల్పించే చర్యలు, వనరుల్ని వారి చేతిలో పెట్టగల భూ సంస్కరణలు, చదువుకునే అవకాశం కల్పించే సాంఘిక సంక్షేమ హాస్టళ్ళు, ఉచిత విద్య బోధించే ప్రభుత్వ పాఠశాలలు, చవక బియ్యం, బావులు తవ్వుకోలేని పేద దళిత రైతులకు చవక రుణాలు, చవక కరెంటు, అందుబాటులో నైపుణ్యంగల వైద్య సేవలు - ఇవన్నీ వారి బలాన్ని పెంచుతాయి. అణచివేతను ఎదుర్కొనే శక్తినీ ఆత్మస్థైర్యాన్నీ ఇస్తాయి. ఎదుటివారి అహంభావాన్నీ స్వాతిశయాన్నీ తగ్గిస్తాయి.

దళితులకు శక్తినిచ్చే ఈ విధానాలు, చర్యల విషయంలో ప్రభుత్వం ఒక పద్ధతి ప్రకారం వెనకడుగు వేస్తున్న విషయం తెలిసిందే. ఈ తిరోగమనాన్ని సవరించకుండా సమస్యకు పరిష్కారం వెతకాలనుకోవడం ఒంటిచేత్తో గుర్రపుస్వారీ చేయడం లాంటిది.

2. అయినప్పటికీ దాడులు, వివక్షలను ఎదుర్కొనడానికి చట్టపరమైన, విధాన పరమైన చర్యలను అన్వేషించడం వృధా అని మా అభిప్రాయం కాదు. కొన్ని నిర్దిష్టమైన చర్యలను దిగువ సూచిస్తాము.

అంటరానితనం ఏదో ఒక రూపంలో అమలయ్యే గ్రామాలలో ఆ దురాచారానికి తలవంచాలన్న బలమైన ఒత్తిడి ఉంటుంది. దళితులలో దానిని వ్యతిరేకించే సాహసవంతులెవరైనా ఉంటే వారిపైన కూడా ఉంటుంది.

ఈ ఒత్తిడిని పోగొట్టాలంటే దానిని నిలబెట్టే గ్రామ పెత్తందార్లపైన దృష్టి పెట్టాలి. వారి పాత్ర ఈ విషయంలో స్పష్టంగా కనిపించకపోవచ్చును కాబట్టి నేరస్మృతి ఇందుకు సరిపోదు. ఆర్థిక రాజకీయ చర్యలు అవసరం. అంటరానితనం పాటించడంలోనూ ఊరందరి చేతా పాటింపజేయడంలోనూ వారు ప్రధాన పాత్ర నిర్వహించినంత కాలం వ్యవస్థ నుండి పొందే రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలు వారికి దక్కవన్న భయం ఉండాలి.

ఉదాహరణకు 'అభివృద్ధి పనుల' సివిల్ కాంట్రాక్టులు ఈ గ్రామ పెత్తందార్ల ధనార్జనకు ఒక ముఖ్య వనరు. అంటరానితనం పాటించే గ్రామాలలో అటువంటి అభివృద్ధి పనులేవీ ప్రభుత్వం చేపట్టకూడదు. 'జన్మభూమి' కింద చేపట్టే పనులు కూడా అటువంటి గ్రామాలకు మంజూరు చేయకూడదు. అంటరానితనం పాటించడం మానేసేంతవరకు ఏ కాంట్రాక్టులూ మంజూరు కావన్న భయం పెత్తందార్లకు ఉండాలి.

మంచినీళ్ల ట్యాంకుల వంటి కొన్ని అత్యవసరమైన పనులకు ఈ విషయంలో మినహాయింపు ఇయ్యవచ్చు. అయితే అటువంటి మినహాయింపులు ఇచ్చినప్పుడు కూడా ఆ పనుల కాంట్రాక్టు ఆ ఊరి వాళ్లకు ఇవ్వకూడదు. అంతేకాదు - వేరే వ్యక్తులు కాంట్రాక్టు తీసుకుని ఆ ఊరివాళ్లకు దానిని సబ్‌కాంట్రాక్టు ఇచ్చే ప్రయత్నం చేస్తే ఆ కాంట్రాక్టును రద్దుచేసే అధికారం కూడా ప్రభుత్వం చేతిలో ఉండాలి.

ఆర్థిక ఒత్తిడి కాకుండా రాజకీయ ఒత్తిడి కూడా పెట్టడం అవసరం. ఎన్నికల అభ్యర్థిత్వం విషయంలో పంచాయతీరాజ్ చట్టం నుండి ప్రజాప్రాతినిధ్యం చట్టం వరకు అంటరానితనం కిందవచ్చే నేరాలలో పాల్గొనడమనేది ప్రస్తుతం అనర్హత కాదు. ఇతర నేరాల లాంటిదే అది కూడా. నేరం రుజువైతేనే అభ్యర్థి అనర్హుడవుతాడు. ఈ పరిస్థితి పోవాలి. పి.సి.ఆర్. చట్టం కిందగానీ, ఎస్.సి, ఎస్.టి (అత్యాచార నిరోధక) చట్టం కిందగానీ ఒక వ్యక్తి పైన పోలీసులు చార్జిషీటు పెట్టినట్టయితే ఆ వ్యక్తి పంచాయతీ నుండి పైస్థాయిదాకా ఎన్నికలలో పోటీ చేయడానికి అనర్హుడన్న నియమం పెట్టాలి. నేరానికి శిక్షపడితేనే అనర్హులవుతారన్న సాధారణ ఎన్నికల నియమానికి ఈ రూపంలో సవరణ చేయాలి.

అంటరానితనం ఏదైనా ఒక రూపంలో (ఉదాహరణకు హోటళ్ళలో రెండు గ్లాసుల వ్యవస్థ, వేరు వేరు మంచినీళ్ల బావులు, వేరు వేరు చెరువులు ఉండడం వగైరా) అమలవుతున్నట్టు తెలిసిన ఊరి గ్రామ పంచాయతీకి ప్రభుత్వం తగుమాత్రం నోటీసు ఇచ్చి ఆ లోపల దానిని సవరించకపోతే పంచాయతీని రద్దు చేయవచ్చునన్న నియమం పెట్టాలి. మొత్తం మీద - అంటరానితనాన్ని పాటించే గ్రామాలలో పెద్ద మనుషులుగా ఉంటూ, అంటరానితనాన్ని కాపాడే సామాజిక ఒత్తిడిని ఒక పక్క నిలబెడుతూ, అదే సమయంలో ఆ ఊరిలో ప్రజాప్రతినిధులుగా చలామణి కావడం, ఆ ఊరిలో ప్రభుత్వ కాంట్రాక్టులు చేసుకుని ప్రయోజనం పొందడం అసాధ్యం కావాలి. ఆ ఒత్తిడి గ్రామ పెత్తందార్ల పైన పెట్టకపోతే అంటరానితనం పాటించాలన్న ఒత్తిడి నుండి గ్రామాలకు విముక్తి ఉండదు.

3. అంటరానితనం మామూలు సందర్భాలలో పాటించినా పాటించకున్నా, దళితులు ఏదైనా విషయంలో తమ హక్కులకోసం నిలబడినా ఘర్షణపడినా వారిని కాళ్లబేరానికి తెప్పించడానికి సాంఘిక బహిష్కరణకు గురిచేసే గ్రామాలు ఉన్నాయి. వారిని పనులకు పిలువకపోవడం, ఊరిలోని అంగళ్లలో వారికి సరుకులు అమ్మక పోవడం, ఏ విషయంలోనూ వారితో ఎవ్వరూ ఏ సంబంధం పెట్టుకోకూడదని నియమం పెట్టడం జరుగుతున్నది. రాయలసీమ, ఉత్తరాంధ్ర జిల్లాలలో ఇది తరుచు

జరుగుతున్నది. ఈ సాంఘిక బహిష్కరణ కూడా చాలా బలమైన సామాజిక ఒత్తిడి ద్వారా అమలవుతుంది. అటువంటి చోట్ల కూడా పై నియమాలను వర్తింపజేయాలి.

4. గ్రామీణస్థాయి పెత్తందార్లపైనే దృష్టి పెట్టడం ఎందుకని అడగవచ్చును. వాళ్ళ పై నుండే వాళ్ళంతా మంచి వాళ్ళని కాదు. నిజానికి మన రాష్ట్రంలోని రాజకీయ పార్టీలన్నిటికీ అంటరానితనం విషయంలో ఒక నీచమైన ద్వంద్వ వైఖరి అలవాటయి పోయింది. పై స్థాయిలో అన్ని పార్టీలూ అంటరానితనానికీ కుల వివక్షకూ వ్యతిరేకమే. కానీ అన్ని పార్టీల పునాది అయిన కింది స్థాయి పెత్తందార్లు తమ ఊర్లలో, వాడలలో కులవివక్షనూ అణచివేతనూ అమలు చేయడంలో, చేయించడంలో ముఖ్యపాత్ర వహిస్తుంటారు. మళ్లీ వ్యవస్థ కల్పించే సకల ఆర్థిక రాజకీయ ప్రయోజనాలు పొందుతూ ప్రధాన రాజకీయ పార్టీల ప్రాబల్యానికి పునాదిరాళ్ళుగా పనిచేస్తుంటారు. ఈ ప్రయోజనాలు దెబ్బతింటే తప్ప ఈ రెండు నాల్కల రాజకీయార్థిక వ్యవస్థలో చలనం రాదు.

5. ఇప్పటికే ఈ రకమైన ఒత్తిడి పెట్టే అధికారాలు ఒక మేరకు చట్టంలో ఉన్నాయి గానీ, అవి అమలు కావడం లేదు. పిసిఆర్ చట్టం సెక్షన్ 10ఎ లోనూ ఎస్.సి, ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టం సెక్షన్ 16 లోనూ దళితులపైన అత్యాచారాలకు పాల్పడే లక్షణాన్ని కలిగిఉన్న గుంపులపైన ప్రభుత్వం ఉమ్మడిగా జుర్మానా విధించవచ్చునని ఉంది. అత్యాచారాలను నివారించడానికి ఒక వ్యక్తి పైనగానీ ఒక గుంపు పైనగానీ తగు నివారణ చర్య తీసుకునే అధికారం కలెక్టర్ నుండి ఎం.ఆర్.ఓ. దాకా ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్‌లందరికీ ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం సెక్షన్ 17 కింద ఉంది. ఎటువంటి నివారణ చర్యలు చేపట్టవచ్చునో సూచించే 'స్కీం'లు ప్రభుత్వం రూపొందించవచ్చునని కూడా సెక్షన్ 17(3) అంటుంది.

ఈ అధికారాలను ఎన్నడయినా ఎక్కడయినా వినియోగించి ఉంటే సవర్ణ హైందవ గుంపులపైన కొంతయినా ఒత్తిడి ఉండేది. కానీ ఎక్కడా వీటిని వినియో గించడం లేదు. సందర్భం వచ్చినప్పుడల్లా వీటిని వినియోగించాలని ప్రభుత్వానికి సూచించడం అవసరం.

సెక్షన్ 17(3) అవకాశం కల్పించే 'స్కీం'లు ఏవీ మన రాష్ట్ర ప్రభుత్వం ఇప్పటిదాకా రూపొందించలేదు. అత్యాచారాలలో కీలకపాత్ర నిర్వహిస్తున్న వ్యక్తులను, లేదా కీలకమైన సహకారం ఇచ్చే వ్యక్తులను దూరంగా వెలివేయడం (ఎక్స్‌టర్న్ చేయడం) ఇటువంటి (సెక్షన్ 17 అనుమతించే) ఒక నివారణ చర్య కాగలదు. ఆదివాసీ ప్రాంతాలకు సంబంధించి సెక్షన్ 10లో ఇప్పటికే అటువంటి అధికారం

ఉంది. (దానిని కూడా ఎక్కడా అమలు చేయలేదన్నది వేరే సంగతి.) 17(3) అవకాశం కల్పించే 'స్కీం'ల ద్వారా అదే అధికారాన్ని దళితవాడల పైన దాడులకు పురికొల్పే వారికి కూడా వర్తింప చేయవచ్చు. ఇటువంటి ప్రయత్నం రాష్ట్ర ప్రభుత్వం వెంటనే చేయాలని సూచించవలసిన అవసరం ఉంది.

ప్రజలకు మేలు చేసే అధికారాన్ని (బెనిఫిషెంట్ పవర్) చట్టం ప్రభుత్వాని కిచ్చేది వినియోగించేందుకు తప్ప పుస్తకాలలో దాచుకోవడానికి కాదని న్యాయశాస్త్ర కోవిదులయిన జస్టిస్ పున్నయ్యగారికి మేము చెప్పనవసరం లేదు. సుప్రీంకోర్టు అనేక తీర్పులలో ఈ విషయాన్ని స్పష్టం చేసింది.

6. కేసుల మాటకొస్తే, దళితులొక అత్యాచారం గురించి ఫిర్యాదు చేయగానే కేసు రిజిష్టర్ చేసి నిజాయితీగా నేరపరిశోధన చేసే పోలీసు అధికారులు కొద్దిమందే. దీనికి విరుగుడు ఎస్.సి, ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టంలోని సెక్షన్ 4లో ఉంది. ఈ చట్టం కింద నిర్వహించవలసిన విధిని ఉద్దేశపూర్వకంగా విస్మరించిన అధికారికి ఆరునెలల జైలు శిక్ష వేయవచ్చునని ఈ సెక్షన్ అంటుంది. మాకు తెలిసి ఈ సెక్షన్‌ను వినియోగించిన సందర్భం ఒక్కటి కూడా లేదు. అవకాశం ఉన్న ప్రతీ సందర్భంలోనూ వినియోగించమని ప్రభుత్వాన్ని ఆదేశించవలసిన అవసరం ఉంది.

అత్యాచారాలకేసులను 'రాజీ' చేయడానికి పోలీస్ అధికారులు ప్రయత్నించడం నేరమని ఈ సెక్షన్‌కు ఒక వివరణ చేర్చమని ప్రభుత్వానికి సూచించవలసిన అవసరం ఉంది. దళితుల ఫిర్యాదులపైన నిజాయితీగా నేర పరిశోధన చేపట్టకుండా సవర్ణులను కూడా పిలిచి వారి వద్ద ఒక 'కౌంటర్' ఫిర్యాదు తీసుకుని, లేదా వారే వచ్చి ఎంతటి అసంబద్ధమైన 'కౌంటర్' ఫిర్యాదు ఇచ్చినా దానిని కూడా నమోదు చేసుకుని ఇద్దరినీ రాజీకి రమ్మనడం మన పోలీస్ అధికారులకు అలవాటయి పోయింది. ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల నేరాలు రుజువు కాకుండా పోవడానికి ఇదొక ముఖ్యకారణం. ఈ రకమైన రాజీ ప్రయత్నాన్ని సెక్షన్ 4 కింద నేరంగా ప్రకటించడం అవసరం.

7. క్రైస్తవ మతం పుచ్చుకున్న దళితులకు ఎస్.సి, ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టం వర్తించదనీ, లేదా దళితులపైన దాడి చేసిన గుంపులో సవర్ణులతో బాటు కొందరు దళితులు కూడా ఉన్నట్టయితే ఆ దాడికి ఈ చట్టం వర్తించదనీ రకరకాల సందేహాలు తరుచు ముందుకొస్తున్నాయి. ఈ మధ్య కర్నూలు జిల్లా కలెక్టరు, రంగారెడ్డి జిల్లా ఎస్.పి, కర్నూలు స్పెషల్ కోర్టు జడ్జి ఈ రకమైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు.

ఇటువంటి సందేహాలు వచ్చినప్పుడల్లా సాంఘిక సంక్షేమ శాఖ అధికారులు వివరణ ఇవ్వడం, సమస్య అప్పటికి చల్లారడం జరుగుతున్నది. అయితే కర్నూలు స్పెషల్ (ఎస్.సి., ఎస్.టి. అత్యాచారాల కేసుల) కోర్టు జడ్జి లేవదీసిన సందేహం అట్లా తీరేది కాదు. దానికి ఉన్నత న్యాయస్థానాలయినా జవాబు చెప్పాలి, పార్లమెంటయినా చెప్పాలి. ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంలో అధికారంలో ఉన్న కూటమిలో భాగమే కాబట్టి పార్లమెంటు తగిన సవరణ చేపట్టడానికి కృషి చేయవలసిందిగా వారికి ఈ కమిషన్ సూచన ఇస్తుందని ఆశిస్తాము.

8. రిజర్వేషన్ల అమలు విషయంలో కూడా 'సరిగ్గా జరగడం లేదని' ఆందోళన వ్యక్తం చేసి ఊరుకోకుండా, కొన్ని గట్టి చర్యలు తీసుకోవడం అవసరం. విద్యా సంస్థలలో పెత్తందారీ కులాల పట్టు చాలా బలంగా ఉంది కాబట్టి 'బ్యాక్‌లాగ్' సమస్య అక్కడ మరీ ఎక్కువగా ఉంది.

ఒక ఎయిడెడ్ విద్యా సంస్థ రిజర్వేషన్లు సక్రమంగా అమలు చేయని పక్షంలో, వారికి నోటీస్ ఇచ్చి కొంత గడువు ఇచ్చి 'ఎయిడ్' రద్దు చేసేయాలి. ప్రభుత్వ విద్యాసంస్థ అయితే దానికి బాధ్యుడయిన అధికారిపైన శాఖాపరమైన చర్య తీసుకోవాలి. రిజర్వేషన్ల అమలుకు అడ్డం పడటాన్ని సర్వీస్ రూల్స్‌లో శిక్షార్హమైన చర్యగా పేర్కొనాలి.

అన్ని రంగాలలోనూ బ్యాక్‌లాగ్‌లు నింపడానికి పూర్తి ప్రాధాన్యత ఇచ్చి, యోగ్యతలో తగు మాత్రం సడలింపు ఇవ్వాలి.

**ముగింపు :**

పై సూచనలు ఎక్కువగా దళితుల పట్ల వివక్ష పాటించేవారిని, దాడులు చేసేవారిని నిర్బంధపద్ధతులలో నిరోధించే చర్యలే. వాటి ఆవశ్యకత చాలా ఉందిగానీ ఈ నిర్బంధ చర్యల కంటే ముఖ్యమైనవి మరి రెండున్నాయి. ఒకటి, కుల వివక్షకు వ్యతిరేకమైన సామాజిక సంస్కృతిని పెంపొందించే చర్యలు, కుల అహంకారాన్నీ కులతత్వాన్నీ అధిగమించినవారిని ప్రోత్సహించే చర్యలు. కులాంతర వివాహాలు చేసుకున్న వారికి కొంత పారితోషికం ఇవ్వడం వినా ప్రభుత్వం ఈ విషయంలో ఇప్పుడేమీ చేయడం లేదు. ఈ కృషి మొత్తం ప్రభుత్వమే చేయాలనిగానీ, ప్రధానంగా ప్రభుత్వమే చేయాలనిగానీ అనలేము. అయితే ప్రసార సాధనాలపైన, విద్యా వ్యవస్థపైన ప్రభుత్వానికుండే పట్టు దృష్ట్యా ప్రభుత్వానికి ఈ విషయంలో చెప్పుకోదగ్గ బాధ్యత ఉంది. కానీ ప్రభుత్వం చేస్తున్నది శూన్యం.

రెండవది మొదట్లోనే ప్రస్తావించాము. ఇవి దళితులకు బలం చేకూర్చే చర్యలు.

i) భూసంస్కరణల అమలు మన రాష్ట్రంలో చాలా అసంతృప్తికరంగా జరిగిన సంగతి తెలిసిందే. ఇప్పటికే మిగులు భూములుగా గుర్తించిన వాటిని వేగంగా సేకరించి పూర్తిగా పంచాలి. పంచిన భూములు రకరకాల రూపంలో తిరిగి భూస్వాముల చేతిలోకి పోయిన సందర్భాలనేకం ఉన్నాయి. దీనిని సత్వరం సవరించాలి.

అయితే ఇవన్నీ చేసినా చాలదు. ఒక కొత్త భూసంస్కరణల చట్టం తీసుకురావలసిన అవసరం ఉంది. వ్యవసాయ భూములతోపాటు ఆ కుటుంబానికి ఉండే వ్యవసాయేతర ఆదాయాన్నీ ఆస్తులను కూడా లెక్కలోకి తీసుకుని సీలింగ్‌ను సవరించి ఎటువంటి లొసుగులు లేని చట్టాన్ని రూపొందించి అమలు చేయాలి.

ప్రభుత్వ భూములు దళితులకు, ఇతర పేదలకు పంచే బదులు అమ్మేయాలన్న ఆలోచన, పెట్టుబడిదారీ కార్పొరేషన్లకు లీజుకియ్యాలన్న ఆలోచన కట్టిపెట్టి వాటిని దళితులు, పేదల ప్రయోజనానికి వినియోగించాలి.

ii) కనీస వేతనాలను నిర్ణయించడం మాత్రమే ప్రభుత్వం బాధ్యతగా ఉంది. వాటిని కూలివాళ్లే ఆందోళన చేసి అమలు చేయించుకోవలసి వస్తున్నది. అది వారికి సాధ్యంకాని చోట కనీస వేతనాలు పొందలేకపోతున్నారు. ప్రభుత్వం బాధ్యత తీసుకుని వాటిని అమలు చేయించాలి. కనీస వేతనాలు ఎప్పుడో ఒకసారి పెంచడం కాకుండా పెరిగే ధరలను బట్టి వాటిని సవరించే వి.డి.ఏ (Variable D.A.) సౌకర్యం కనీస వేతనాల షెడ్యూలులోనే చేర్చాలి.

iii) దళితులలో సంవత్సరంలో సగం రోజులు కూడా పని దొరకని వాళ్ళే ఎక్కువ. అందరికీ ప్రతిరోజూ పని కల్పించే దీర్ఘకాల లక్ష్యంతో ఉపాధి పథకాలూ అభివృద్ధి పథకాలూ రూపొందించాలి.

iv) వివక్షనూ దాడులనూ ఎదుర్కొనడానికి దళితులకు బలం కల్పించే విషయంలో ఆదాయం, వనరులు, ఉపాధి చర్యలకు ఎంత ప్రాముఖ్యం ఉందో విద్యకు కూడా అంత ఉంది. విద్య ప్రైవేటీకరణ, ప్రభుత్వ విద్యాసంస్థల నిరాదరణ దళితుల విద్యావకాశాలను చాలా దెబ్బ తీస్తున్నాయి. ఈ పరిస్థితిని పట్టుదలగా సవరించాలి. సాంఘిక సంక్షేమ హాస్టళ్ళను మూసేసి వాటి స్థానంలో (తక్కువ సంఖ్యలో) ఆశ్రమ పాఠశాలలు ప్రారంభించాలన్న ఆలోచన మన రాష్ట్ర ప్రభుత్వం ఒక దశలో ప్రకటించి విద్యాసంఘాల ఒత్తిడి వల్ల తాత్కాలికంగా వెనక్కి తీసుకుంది. ఆ ప్రతిపాదనను పునరుద్ధరించే ఆలోచన చేయకూడదు. ఆశ్రమ పాఠశాలలు ఎన్ని ప్రారంభించినా అభ్యంతరం లేదుగానీ సాంఘిక సంక్షేమ హాస్టళ్ళను మూసేయడానికి మాత్రం వీలు లేదు.

నిజానికి సంక్షేమ హాస్టళ్ళను సంస్కరించవలసిన అవసరం చాలా ఉంది. వాటిని శుభ్రంగా ఉంచాలి. కనీస పౌష్టిక విలువలున్న శుభ్రమైన తిండి పెట్టాలి.

v) దళితులకు అందకుండాపోతున్న మరొక వ్యవస్థ వైద్యం. అతిసారం వంటి వ్యాధులకు బలయ్యేవారిలో ఆదివాసుల తరువాత దళితులే ఎక్కువ. ప్రభుత్వ రంగంలోని ఆరోగ్య సేవలను మెరుగుపరచడం, అవినీతినీ రోగులను పీడించే సిబ్బంది కుసంస్కారాన్నీ పోగొట్టడం అవసరం. ప్రస్తుతం ప్రభుత్వరంగ వైద్య సేవలు పూర్తిగా నిర్లక్ష్యానికి గురయి ఉన్నాయి.

ఈ సూచనలను మీరు పరిశీలించి ప్రభుత్వానికిచ్చే సలహాలలో వీటికి స్థానం కల్పిస్తారని ఆశిస్తాము.

**మానవ హక్కుల వేదిక తరపున ఇచ్చిన వినతి పత్రం**

**11 నవంబర్ 1999**



హిందూత్వవాదులకేం కావాలి? మన సమాజాన్ని గురించి, దాని భవితవ్యాన్ని గురించి వాళ్ళు ఏ దృక్పథాన్ని చదువుల ద్వారా పిల్లలకు - తద్వారా రేపటి పెద్దలకు - నేర్పించదలచుకున్నారు? వాళ్ళు మనుధర్మాన్ని తిరిగి నెలకొల్పదలచుకున్నారని దళితవాదులు ఆరోపిస్తున్నారు. ఇందులో కొంత సత్యముందిగానీ దానిని సరిగ్గా అర్థం చేసుకోవాలి. హిందూత్వవాదుల అజెండాలో మనుధర్మం పునరుద్ధరణ ఒక అర్థంలో ప్రధానమయిన అంశమేగానీ అది దాని మధ్యయుగాల అర్థంలో కాదు. ఈ విషయాన్ని దళితవాదులు స్పష్టంగా గుర్తిస్తున్నట్టు కనిపించదు. ఉదాహరణకు రాజ్యాంగ సమీక్ష గురించి హిందూత్వ వాదులు చేస్తున్న ప్రయత్నాన్ని విమర్శించే సందర్భంలో, అంబేద్కర్ రాసిన రాజ్యాంగాన్ని ఒక బ్రాహ్మణుడిచేత తిరగరాయించాలని వారు ప్రయత్నం చేస్తున్నారన్న విమర్శ దళితవాదుల నుండి ప్రముఖంగా వచ్చింది. అదే మన విమర్శ అయినట్టయితే దానిని హిందూత్వ వాదులు సులభంగా ఎదుర్కోగలరు. వెంకటాచలయ్య స్థానంలో ఒక దళిత న్యాయశాస్త్రవేత్తను - భావాలలో తమకు అనుకూలమైన వ్యక్తిని - కూర్చోబెట్టి, దళితుడు రాసిన రాజ్యాంగాన్ని దళితునితోనే తిరగరాయిస్తున్నామని అనగలరు. హిందూత్వవాదుల వెంబడి దళిత బహుజన కులాలకు చెందిన వారు చాలామంది పోతున్నారని గుర్తించి కూడ (గ్రహం స్టెయిన్స్‌ను చంపింది ఆదివాసులేనని మరచిపోకూడదు) వారు మనుధర్మ పునరుద్ధరణ మధ్యయుగాల నమూనాలోనే చేయబోతున్నారన్నట్టు మాట్లాడడం దానిపై అవగాహనను ఏమాత్రం పెంచదు. అట్లాగని వాళ్ళు కులాన్ని వదిలిపెట్టి వర్గాన్ని ప్రాతిపదిక చేసుకున్నారనుకోవడమూ సబబు కాదు.

**(విద్యా, విజ్ఞానం : హిందూత్వవాదుల దాడిని ఎదుర్కొనడానికి మనం సిద్ధమేనా?)**

**ఎపిటిఎఫ్ సావనీర్**

**16 డిసెంబర్ 2000**

# మెదడువాపుకు పందులు కారణమా?

రాష్ట్రంలో మెదడువాపు ప్రబలింది కాబట్టి పందులను చంపండని ముఖ్యమంత్రి మూడు రోజుల క్రితం ప్రకటించాడు.

చిన్న పిల్లల ప్రాణాలు తీసే ఆ వ్యాధి పట్ల సమాజంలో తీవ్రమైన ఆందోళన ఉండడం చాలా సహజం. పైగా మురికి వాడలలో నివసించే పేదవర్గాల పిల్లలే ఈ వ్యాధికి బలి అవుతారు కాబట్టి వైద్యం కొనుక్కునే స్తోమత లేని ఆ పిల్లల గురించి ఆందోళన చెందడం మరీ సహజం.

కానీ ఒక సమస్య గురించి సమాజంలో ఆందోళన ఉందని చెప్పి అనాలోచితమైన పరిష్కారాలను బాధ్యతగలవారు ప్రచారం చేస్తే అసలు సమస్యకు తోడు కొత్త సమస్యలు పుట్టుకొచ్చే ప్రమాదం ఉంది.

పందులను చూసి భయపడే పరిస్థితి కల్పిస్తే, అది పందులు పెంచి బతికే ప్రజల మీద ద్వేషంగా మారే అవకాశం ఉంది. పందులు పెంచి బతికే ప్రజలు ఎరుకల, దొమ్మరి, యానాది మొదలైన కులాలవారు. ఈ ప్రజలను మామూలుగానే హైందవ సమాజం చాలా తక్కువ భావంతో చూస్తుంది. పిల్లలను చంపే పందులను పోషించి బతికేవాళ్లుగా వాళ్లను చిత్రిస్తే వారిపైన ద్వేషం సులభంగా పెరగగలదు. ఆ సంగతి తెలిసే అధికారులు ఈ ప్రచారం చేస్తున్నారు. ఒకసారి ఈ రకమైన అభిప్రాయం కలిగించేస్తే, ఇంక ఆ తరువాత నల్లులనో, దోమలనో చంపినట్టు పందుల హననం కొనసాగించినా సమాజంలో ఎవ్వరూ అడగరు. తమ జీవనాధారం పోతున్నదని బాధపడే ఎరుకల, దొమ్మరి తదితర బడుగు ప్రజలకు ఎంత మాత్రం సానుభూతి దొరకదు.

కానీ నిజానికి పందులకూ మెదడువాపు వ్యాధికీ ప్రత్యక్ష సంబంధమేమీ లేదు. పందులు పిల్లలను కరవడం వల్లనో లేక తాకడం వల్లనో లేక పందులు సంచరించే చోట గాలి పీల్చడం వల్లనో ఆ రోగం రాదు.

మెదడువాపు వ్యాధి ఒక సూక్ష్మ క్రిమివల్ల వస్తుంది. మలేరియా క్రిమిలాగా ఈ క్రిమి కూడా దోమల ద్వారా ప్రసారమవుతుంది. దోమలు మనల్ని కరిచినప్పుడు ఆ క్రిమి మన రక్తంలోకి ఎక్కుతుంది. వేరే ఏ రకంగానూ - పందులు పిల్లలను కొరికినా, పందులతోనే పిల్లలు రోజంతా ఆడుకున్నా - మెదడు వాపు క్రిమి మన ఒంట్లోకి ప్రవేశించదు.

అయితే మరి ఈ వ్యాధికీ పందులకూ సంబంధమేమిటంటే ఈ క్రిమిని వ్యాపింపజేసే దోమ జాతికి పందుల వంటి పెద్ద జంతువుల రక్తమంటే ఇష్టం. కాబట్టి ఈ జాతి దోమలు ఉన్న చోట పందులు ఉంటే అవి పందుల రక్తం కోసం వాటి చుట్టూ ముసురుతాయి. అక్కడ మనుషులుంటే వారిని కూడా కరుస్తాయి. ఒక్క పందులేకాదు ఏ పెద్ద జంతువులు మందలుగా ఉన్న చోటయినా ఈ జాతి దోమగానీ ఉంటే అది ఆ మంద చుట్టూ ముసరడం వల్ల ఇదే ఫలితం ఉంటుంది. అంత మాత్రం చేత ఆవుల మందలనూ, బర్రెల మందలనూ చంపేద్దామని ఏ అధికారీ ఇప్పటిదాకా అనలేదు. పందుల పెంపకం కూడ ఎరుకల, యానాది, దొమ్మరి కులాలు కాక హైందవ సమాజంలో గౌరవంగల కులాలు చేపట్టినట్టయితే ఆ జంతువుల మీద కూడా ద్వేషం రెచ్చగొట్టేవారు కాదేమో.

దోమలసలు ఉంటేనే అవి పందుల చుట్టూనయినా మనుషుల చుట్టూ నయినా ముసురుతాయి. అవి జంతువుల చర్మాల మీద గుడ్లు పెట్టవు, పొదగవు. దానికి మురుగునీటి మడుగులు కావాలి. మురుగునీటి మడుగులు, కాలవలు లేకుండా మన ఊళ్లను శుభ్రంగా ఉంచగలిగితే ఎన్ని పందుల మందలున్నా ఏం కాదు.

అందుకే పందుల పెంపకం సంవత్సరం పొడవునా జరిగినప్పటికీ మెదడువాపు వ్యాధి వానాకాలంలో మాత్రమే వస్తుంది. పందులే దానికి కారణమైతే సంవత్సరమంతా ఆ వ్యాధి రావాలి. కానీ మురుగునీరు మడుగులలో నిలవ ఉండే సీజన్‌లో మాత్రమే మెదడువాపు వ్యాధి వస్తుంటుంది. కాబట్టి చేయవలసింది పందులను చంపడం కాదు, మన ఊళ్లను శుభ్రంగా ఉంచడం.

ఇవేవీ అర్థంకాకపోయినా హైకోర్టు ఆదేశాల పట్లనయినా మన పాలకులకు గౌరవం ఉండాలి. 1987లోనే ఈ విషయం మన రాష్ట్ర హైకోర్టు ముందుకు వచ్చింది. హైకోర్టు మెదడువాపు వ్యాధిని అరికట్టడానికి పందుల సంచారాన్ని తగ్గించడం అవసరమనే భావించినప్పటికీ ఇక్కడ రెండు వైపులా సమస్యలున్నాయని అర్థం చేసుకొనింది. ఒకపక్క ఈ వ్యాధికి బలయ్యే పేద, బలహీన వర్గాల ప్రజల పిల్లలున్నారు. రెండవ పక్క పందులను పోషించి బతికే ఆదివాసీ లేక సంచార

కులాల ప్రజలున్నారు. ఇద్దరికీ న్యాయం జరిగేటట్టు చూడడం కోసం హైకోర్టు 9 సూత్రాల ప్రణాళికను ఆదేశించింది.

పందుల యజమాన్లను గుర్తించి వారి దగ్గరున్న పందులకు లైసెన్సులు ఇవ్వాలి. ఒక్కొక్కరి దగ్గర ఎన్ని పందులున్నాయన్న దానిని బట్టి వారికి ఊరి వెలుపల పునరావాసానికి రెవెన్యూ అధికార్లు భూమి కేటాయించాలి. ఎక్కడో ఒకచోట కేటాయించి బలవంతంగా అక్కడికి తరలించే బదులు, రెండు మూడు జాగాలు చూపించి వాటిలో ఏది వారికి సమ్మతమైతే అదే వారికి కేటాయించాలి. ఇందుకోసం అప్లికేషన్లు పెట్టుకొమ్మని అన్ని మునిసిపాలిటీలూ పంచాయితీలూ దండోరా వేసి ప్రచారం చేయాలి. తమ జీవాలకు లైసెన్సులు, తమ వ్యాపారానికి పునరావాసం తీసుకొమ్మని ప్రోత్సహించాలి.

1987లో (ఆం.ప్ర. ఆదిమజాతి సేవాసంఘం వర్సెస్ గుంటూరు మునిసిపల్ కౌన్సిల్ కేసులో) మన రాష్ట్ర హైకోర్టు చేసిన ఈ సూచనను ఏ మునిసిపాలిటీ గానీ పంచాయితీగానీ ఇప్పటిదాకా అమలు చేయడం మొదలుపెట్టలేదు. పందుల పెంపకందార్ల పునరావాసానికి ఎటువంటి చర్యలూ చేపట్టలేదు. ఎక్కడా భూమి కేటాయించలేదు. కాని వర్షాకాలంలో మెదడువాపు వ్యాధి ప్రబలినప్పుడల్లా పందులను చంపే కార్యక్రమం మాత్రం పెద్దెత్తున చేపడుతున్నారు. ఇప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రోత్సహించడం మొదలుపెట్టిన తరువాత ఇంక వాళ్లను వెనక్కి లాగేదెవరు?

పన్నెండేళ్ల క్రితం ఆ తీర్పు ఇచ్చినప్పుడు హైకోర్టు ప్రదర్శించిన విశాల దృక్పథం ఇప్పుడు కోర్టులలో సహితం కొరవడింది. పందులను మునిసిపాలిటీ వారు చంపడం మొదలు పెట్టినప్పుడల్లా పందుల కాపరులు కోర్టుకొచ్చి 'మాకు పునరావాసం కల్పించకుండా మా పందులను చంపుతున్నారు' అంటూ మొరపెట్టుకుంటున్నారు. అయినా వాళ్లకే అసలు ఊరు విడిచిపెట్టి బయటకు పోవడం ఇష్టం లేదనీ, వాళ్లెప్పుడూ పునరావాసం కోసం అర్జీలు పెట్టుకోలేదనీ ప్రభుత్వం దబాయిస్తుంది. గతంలో హైకోర్టు జారీ చేసిన 9 సూత్రాల ఆదేశంలో ప్రధానంగా బాధ్యత ప్రభుత్వం మీదనే పెట్టిందని ప్రభుత్వం గుర్తించదు. ఇప్పుడు కోర్టులు కూడా అట్లా అనుకోవడం లేదు. పందుల పెంపకం దార్లనే తప్పుపడుతున్నాయి. ఆ వృత్తి మీద బతికే కులాల పట్ల సమాజంలో సాధారణంగా ఉండే తక్కువ భావానికి న్యాయస్థానాలు సహితం అతీతం కాదు.

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**28 నవంబర్ 1999**



# ఐలయ్య 'మొత్తం' సమాజం గురించి ఎందుకు రాయాలి?

అధ్యాపకుడు, సామాజిక విశ్లేషకుడు అయిన కంచ ఐలయ్యకు ఉస్మానియా యూనివర్సిటీ రిజిస్ట్రార్ డాక్టర్ పన్నాలాల్ రాసిన హితవచనం చాలా మందికి సహజంగానే కోపం తెప్పించింది. ఐలయ్యగారి అభిప్రాయాలతో ఏకీభవించేవారే కాక విభేదించేవారు కూడా ఒక అధ్యాపకుని అభిప్రాయ స్వేచ్ఛలో యూనివర్సిటీ రిజిస్ట్రార్ జోక్యాన్ని నిరసించారు. నిరసన తెలుపుతూ సంతకాలు సేకరించి రిజిస్ట్రార్‌కు లేఖలు కూడా రాసారు. ఈ గొడవ చూసి ఆ పెద్దమనిషి మొదట కొంచెం ఆశ్చర్యపోయి ఉంటాడు. అతను ఇంజనీరింగ్ చదువుకున్నాడు. ఆపైన బిజినెస్ మేనేజ్‌మెంట్‌లో డాక్టరేట్ చేసాడు. అధ్యాపకుడిగా చాలాకాలం పని చేసాడు. ఇతరుల అభిప్రాయ స్వేచ్ఛకు ఆటంకం కలిగించే మనిషిగా ఆయన బహుశా తనను తాను భావించుకోడు. ఆయన నిజానికి ఐలయ్యగారిని రాయొద్దనలేదు. కులం సమస్య గురించి విశ్లేషణ చేయొద్దని కూడా అనలేదు. సమాజంలో ఉన్న సమస్యలను భిన్న కోణాలనుండి చూడడం ఎప్పుడూ ఉండేదేననీ, అటువంటి సమస్యలను పరిష్కరించడానికి రకరకాల చర్యలు చేపట్టవచ్చు ననీ, వాటిమీద వ్యాసాలు రాయడం, చర్చలు నిర్వహించడం సభ్య సమాజంలో ఆమోదనీయమైన పనులేననీ కూడా అన్నాడు. ఇవన్నీ ఐలయ్యగారికి రాసిన ఉత్తరంలోనే ఆయన అన్నాడు.

ఇవన్నీ అంటూనే దానికింద 'ప్రాథమికంగా అధ్యాపకులము కాబట్టి' మనం చేసే రచనలు సమాజంలో సామరస్యాన్నీ మానసిక ఏకతనూ పెంపొందించేవిగా ఉండాలని అన్నాడు. విభిన్న ప్రజా సమూహాల మధ్యనున్న అపోహలను పెంచేవి గానూ, విద్వేషాన్ని

రెచ్చగొట్టేవిగానూ ఉండకూడదన్నారు. ఈ హెచ్చరికను దృష్టిలో ఉంచుకుని సమాజాన్ని మొత్తం బాగుచేయడానికి అధ్యాపకునిగా మీ పాత్రను మరింత శక్తివంతంగా నిర్వర్తించమని అన్నాడు.

ఐలయ్యగారివి ఒక కోవకు చెందిన అభిప్రాయాలయినట్టే ఇవి కూడా మరొక కోవకు చెందిన అభిప్రాయాలని రిజిస్ట్రార్ పన్నాలాల్‌గారికి బహుశా తోచి ఉండదు. ఐలయ్యగారివి అభిప్రాయాలనీ, తనది దొడ్డ మనసు నుండి పుట్టిన హితవచనం మాత్రమేనని ఆయన అనుకొని ఉంటాడు, అనుకుంటూ ఉంటాడు. ఆయనే కాదు, చాలామంది అనుకుంటారు బహుశా.

సమాజాన్ని 'మొత్తం'గానే బాగు చేయాలనేది ఎందుకు సత్యం అయింది? సమాజంలో అసమానంగా ఉన్నవారి బాగును కాంక్షించడం, అదే సమాజం బాగుకు దారితీస్తుందని నమ్మడం - పెద్దల చేత హితవచనాలు చెప్పించుకోవలసిన పిల్లచేష్ట ఎందుకయింది? అధ్యాపక వృత్తికి తగని ఆకతాయితనం ఎందుకయింది? అధ్యాపకులు సమాజంలో భిన్నవర్గాల మధ్య మానసిక ఏకతను మాత్రమే ఎందుకు పెంచాలి? మానసిక ఏకత ఎందుకు లేకుండా పోయిందో చెప్పే విశ్లేషణ ఎందుకు చేయకూడదు? అవి సామరస్యాన్ని పెంచేవిగానే ఎందుకుండాలి, సామరస్యం ఎవరు లేకుండ చేసారో చెప్పేవి ఎందుకు కాకూడదు?

ఇక్కడెక్కడో 'అధ్యాపక ధర్మం' అనే భావన ఉన్నట్టుంది. మనుషులకు వారివారి సామాజిక స్థాయిలను బట్టి ధర్మాలు ఉంటాయనీ, ఈ భిన్నధర్మాలను ఆచరించడంలోనే సమాజ శ్రేయస్సు ఉందనీ నమ్మడం హిందువులయి పుట్టిన వారికి సులభంగా అబ్బే ఆలోచనారీతి. ఈ ఆలోచన సత్యాన్ని చంపి పూడ్చిపెట్టే ఆలోచన. డాక్టర్ పన్నాలాల్‌గారు హైందవ ఆలోచనా చట్రానికి వెలుపల ఒక్క క్షణం నిలబడి తన హితవచనాన్ని తానే పరీక్షగా చూస్తే అది ఎంత అన్యాయమైన ఉపదేశమో అర్థం చేసుకోగలుగుతారనుకుంటాను. ఒక విద్యాధికుడు మరొక విద్యాధికునితో 'నువ్వు సత్యాన్వేషణ చేయొద్దు, అది మన ధర్మం కాదు. సమాజంలో సామరస్యాన్ని పెంచడం మన ధర్మం. అందుకోసం కృషిచేయి' అంటున్నాడు. అంతకంటే ఆయన ఐలయ్య గారితో 'నీ అభిప్రాయాలు అసత్యం' అని అంటే అధ్యాపక వృత్తికి ఉచితంగా ఉండేది.

అధ్యాపక వృత్తికే కాదు, మనిషికి 'ధర్మం' అంటూ ఉంటే అది సత్యాన్వేషణే తప్ప వేరే ఏమీ కాదు. ఈ రకంగా ఆలోచించిన బ్రాహ్మణేతర తాత్త్విక సంప్రదాయా లకు కూడా ఈ దేశం నిలయమే. ఐలయ్యగారు తనను తాను ఆ సంప్రదాయానికి వారసునిగా భావిస్తాడు. ఆ వారసత్వాన్ని శతాబ్దాలుగా అత్యంత ప్రమాదకర మైనదిగా

చూసిన హైందవ ఆలోచనారీతి దానికి - హితవచనం పేరు మీదనైతేనేం - అడ్డుకట్ట వేయాలని చూడడంలో ఆశ్చర్యం ఏముంది?

**నీహార్ ఆన్‌లైన్.కామ్**

**జూన్ 2000**



ఈ మధ్య కాలంలో అభ్యుదయవాదుల విశ్లేషణలలో దర్శనమిచ్చే కారణం ఎన్నికలలో నిజంగానే ఫలితం ఇచ్చిన ఏకైక సందర్భం ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో దళిత - బహుజన రాజకీయాలు బిజెపి ఎదుగుదలను ఆపిన వైనం. 'సంఘ్ పరివార్ రాజకీయాలు మన రాజకీయాలు కావు' అన్న సందేశాన్ని దళిత, బహుజన ప్రజానీకంలోకి బలంగా పంపించగలగడం నిజంగానే ఫలితం ఇచ్చింది. వేరే ఏ ప్రయత్నమూ ఆ ఫలితాన్ని ఇచ్చేది కాదు. అదే జరగకపోతే ఉత్తరప్రదేశ్, బీహార్‌లు కూడా సంఘ్ పరివార్ జేబులో ఉన్నట్టయితే, దేశం పరిస్థితి ఈపాటికి ఎంత ఘోరంగా ఉండేదో?

దురదృష్టమేమిటంటే ప్రస్తుత తరంలో దళిత బహుజన రాజకీయాలు అవినీతిమయమయిన రాజకీయ వ్యవస్థలో అంతర్భాగంగా ఎదుగుతున్నాయి. రాజకీయ వాతావరణం మొత్తం కలుషితమయి ఉన్నప్పుడు కొత్తగా ఎదుగుతున్న రాజకీయ శక్తులు దానినే ప్రమాణంగా ఎంచుకోవడం కొంతమేరకు అర్థం చేసుకోగల విషయమే కావచ్చును గానీ అది నిస్సందేహంగా దురదృష్టకరం. 'మావాళ్లు కూడా నీ అంత నిర్లజ్జగా అవినీతికీ ఆశ్రిత పక్షపాతానికీ పాల్పడగలరు చూడండి' అని అగ్రకులాల అవినీతిని సవాలు చేసి సంతోషించే దళిత బహుజన మేధావులు ఉండడం మరీ దురదృష్టకరం.

ఈ కారణంగా ఉత్తరప్రదేశ్ - బీహార్‌లలో మొదలయిన దళిత - బహుజన ప్రతిఘటన అవినీతికీ అధికార దాహానికీ బలయి, అందులో ఒక వర్గం కాకపోతే ఒక వర్గం తన మనుగడ కోసం సంఘ్ పరివార్‌తో చేతులు కలుపుతున్నది. దీనితో తిరిగి పుంజుకునే అవకాశం కాషాయవాదులకు లభించింది.

అదెట్లాగున్నా, సంఘ్ పరివార్ రాజకీయాలను లౌకికవాదం అనే అమూర్తమైన విలువతో ప్రతిఘటించడం కన్నా, మైనారిటీలకు ప్రమాదకరం అనే నినాదంతో ఎదుర్కోవడం కన్నా, హైందవ సమాజంగా గుర్తించబడే సమాజంలోనే మెజారిటీ ప్రజలకది శత్రువని గుర్తించి ప్రతిఘటించినప్పుడే దానిని నిలువరించడం సాధ్యం అన్న ప్రాథమిక రాజకీయ సత్యాన్ని ఉత్తరప్రదేశ్ - బీహార్‌లు నేర్పాయి. అది దేశంలో అన్ని చోట్లా మాయావతి - ములాయం - లాలూ యాదవ్‌ల నమూనాతోనే ఉండవలసిన అవసరం లేదు. అయితే నమూనా ఏదయినా రేపటి రాజకీయాలలో ఈ ఎరుక ఒక ప్రధాన అంశం కావలసి ఉంది.

**(సంఘ్ పరివార్ పైన పోరు)**

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**8 డిసెంబర్ 2003**

# కులాల విషయంలో పత్రికలది కపట నాటకం

*ప్ర : పత్రికలలో కులాల పేర్లు రాయకూడదనే నియమాన్ని అడ్డం పెట్టుకుని ఒకే కులం పరిమితికి మించి ఆస్తులు సంపాదిస్తున్నా నోరు విప్పని పత్రికల కుట్రపై వ్యాఖ్యా నించండి.*

జ : ఆస్తులు బహుశా రెండు మూడు కులాలు పెంచుకొంటున్నా యేమో - ఒక కులమే కాకపోవచ్చు. అయితే కులం ఒక ప్రధాన సామాజిక వాస్తవమైన మన సమాజంలో వ్యక్తుల కులాలను గానీ, కులాల భోగభాగ్యాలను గానీ పేరుపెట్టి పత్రికలలో ప్రస్తావించలేక పోవడం ఒట్టి 'హిప్రొకసీ' తప్ప వేరే ఏమీ కాదు. నిజానికి చాలా కాలం మన పత్రికలలో 'అగ్రకులాలు' అన్నమాట ప్రయోగించే వారు కారు. ఈమధ్య అప్పుడప్పుడూ ప్రయోగిస్తున్నారు. కానీ ఏ అగ్రకులం అని చెప్పకూడదు. కులాన్ని అందరూ - ముఖ్యంగా కులం నుండి బలం పొందే పెత్తందారీ కులాల వాళ్లు - అన్నిటికీ నిత్యం వాడుకుంటూనే ఉంటారు. సాధారణ సంభాషణల్లో కులం ప్రస్తావన ప్రతీక్షణం వస్తూనే ఉంటుంది. అయినప్పటికి కులం పేరు పత్రికలలో కనిపించడాన్ని సహించకపోవడం, అది పెత్తందారీతనం కొనసాగింపు. సామాజిక స్పృహ ఉన్న చిన్న పత్రికలైనా దానిని ప్రతిఘటించాలి. ప్రస్తుతం ఉద్యమ సంస్థల పత్రికలు మాత్రమే ఆ పని చేస్తున్నాయి.

*ప్ర : 'రేస్', కులంపై ఇటీవల చర్చ సాగుతోంది. వీటి గురించి వివరిస్తారా?*

జ : 'రేస్' అనే మాటకు సరియైన తెలుగు అనువాదం లేదు. ఇంగ్లీషులో కూడా దాని అర్థం అనిశ్చితంగానే ఉంది.

యూదులను 'రేస్' అన్నారు. వారిని ఇతరుల నుండి వేరుచేసేది వర్ణం కాదు. ఒక ప్రత్యేకమైన మతం, మత ఆచారాలు, జీవన విధానాలు. నల్లవారిని 'రేస్' అన్నారు. వారిని తెల్లవారి నుండి వేరుచేసేది వర్ణం ఒక్కటే కాకపోయినప్పటికీ అది ముఖ్యమైనది. ప్రాచీన కాలంలో మధ్య ఆసియా నుండి నాలుగు దిక్కుల విస్తరించిన ఆర్యులను 'రేస్' అన్నారు. ఈ వర్గీకరణకు ప్రాతిపదిక వర్ణం కాదు. మత ఆచారం కాదు. భాష అని చరిత్రకారుల అభిప్రాయం. ఏమైతేనేం, నల్లజాతీయుల పట్ల అమలైన వివక్ష 'రేసిజం' అనే మాటకు సమానార్థకం అయ్యింది. ఐక్యరాజ్యసమితి ఆవిర్భావానికి గల కారణాలలో ఒకటి యూదుల పైన అమలైన అణిచివేత. అందువల్ల 'రేస్' ప్రాతిపదికపైన వివక్ష పాటించడానికి వీలులేదనేది ఐక్యరాజ్య సమితి సభ్యదేశాలకు పెట్టిన నియామాలలో ఒకటి. ఆ తర్వాత దక్షిణాఫ్రికాలో తీవ్రస్థాయిలో అమలవుతున్న వర్ణ వివక్షపైన కూడా ఐక్యరాజ్యసమితి కృషిచేసింది.

ఈ క్రమంలో 'రేసిజం'కు వ్యతిరేకంగా ఐక్యరాజ్యసమితి అనేక సూత్రీకరణలు చేసింది. నియమాలు ప్రకటించింది. అది అమానుషం అన్న అభిప్రాయానికి అధికార ముద్ర వేసింది. అందువల్లనేనేమో మన దగ్గర ఉన్న దళిత ఉద్యమకారులు కులాన్ని కూడా 'రేస్'ను పోలిన వివక్షగా గుర్తించమని ఐక్యరాజ్య సమితిని అడుగుతున్నారు. ఉన్న వ్యవస్థను వాడుకోవడంలో ఉన్న సౌకర్యాన్ని కాదనలేము. ప్రపంచ స్థాయిలో వర్ణ వివక్షకు వ్యతిరేకంగా గంభీర ప్రవచనాలు చేసే భారత పాలకులను ప్రపంచ వేదికపైనే కులాన్ని గురించి నిలదీయాలన్న ఆరాటాన్ని కాదనలేము. అయినప్పటికీ కుల వివక్షను 'రేసిజం'కు సంబంధించిన ఒక రూపంగా చూడాలని కోరే బదులు, విడిగానే దానిపైన ఐక్యరాజ్యసమితి ఒక నియమావళిని రూపొందించాలనీ, భారత పాలకులను కులాన్ని గురించి నిలదీయాలనీ కోరితే బాగుండేది. 'రేసిజం'కూ, కులవ్యవస్థకూ చెప్పుకోదగ్గ రెండు తేడాలున్నాయి. 'రేస్' దైవ సృష్టి అని తెల్లవారు తమ మనస్సులలో అనుకున్నారేమో గానీ, కులం లాగ అది దైవ సృష్టేనని సూత్రీకరించలేదు. 'రేస్' లాగా కాక కులం అన్ని సామాజిక జీవిత రంగాలలోనూ వివక్షను వ్యవస్థీకరించింది. మనిషికి ఉండే 'విలువ'లో అసమానతను కూడా వ్యవస్థీకరించింది. అందువల్ల కుల వ్యవస్థను అమానవీయమైనదని నిషేధించే ప్రకటనను విడిగానే ఐక్యరాజ్యసమితి రూపొందించాలని అడగడం ఉచితంగా ఉంటుంది.

ప్ర : *గ్లోబలైజేషన్, హిందూత్వ నినాదాలు ముందుకు వస్తున్న ప్రస్తుత తరుణంలో మానవ హక్కులను పునర్ నిర్వచించుకోవలసిన అవసరముందా?*

జ : ఒక రకంగా ఈ రెండు పరిణామాలూ హక్కుల ఉద్యమం ఆవిర్భావంలోనూ, ఎదుగుదలలోనూ ఉన్న లోపాన్ని ఎత్తిచూపాయనుకుంటాను. భారతదేశంలో హక్కుల ఉద్యమం పోలీసుహింసను కేంద్రం చేసుకుని పుట్టింది. ఇప్పటికీ అదే కేంద్రంగా పనిచేస్తున్నది. పోలీసుహింస ఒక ముఖ్యమైన హక్కుల సమస్య అనడంలో ఎటువంటి సందేహం లేదు. కానీ ప్రతి సమాజంలోని హక్కుల ఉద్యమానికి అదే కేంద్రం కానవసరం లేదు. జీవితాన్ని శాసించే కుల వ్యవస్థనుండి పుట్టిన వివక్షను కేంద్రం చేసుకుని ఎదిగే హక్కుల ఉద్యమమే మన సమాజానికి ఉచితమైనదేమో. పోలీసు హింసను కేంద్రం చేసుకుని ఆవిర్భవించిన హక్కుల ఉద్యమం కుల వివక్షనూ అంటరానితనాన్నీ కూడా హక్కుల సమస్యలుగా గుర్తించిందిగానీ వాటికి ఉచితమైన స్థానాన్ని ఇప్పటికింకా ఇవ్వలేదు. హిందూత్వవాదం సామాజిక జీవితంలోనూ, రాజకీయ జీవితంలోనూ బలపడడం ఈ లోపాన్ని కొట్టొచ్చినట్టు చూపించింది అనుకుంటాను. కులవ్యవస్థను మధ్యయుగాల నమూనాలలో పునరుద్ధరించే ఉద్దేశ్యంగానీ, అవకాశముగానీ వారికి ఉందనుకోను. కానీ కుల వ్యవస్థ భావజాలమైన నిచ్చెనమెట్ల ధర్మాన్ని, దానికి అనువైన సామాజిక సంస్కృతిని స్థిరీకరించడము వారి లక్ష్యం. అది విశాల ప్రజా వర్గాల హక్కుల పైన దాడి. హక్కుల ఉద్యమం మొదటినుండీ ఈ హక్కుల సమస్యను కేంద్రం చేసుకుని పనిచేసి ఉంటే ఈ పరిస్థితిని మరికొంత సమర్థంగా ఎదుర్కోగలిగేదేమో. తిండీ, బట్ట, నివాసం, ఉద్యోగం మొదలయిన జీవన హక్కుల విషయంలో కూడా తనకంటూ ఒక అవగాహన ఉండనక్కరలేదనే వైఖరే హక్కుల ఉద్యమం మొదటనుండి కలిగి ఉంది. గ్లోబలైజేషన్ వచ్చి విధాన పరంగానే పాలనలో ఈ హక్కులకు చోటు లేకుండా చేసింది. అదే హేతుబద్ధమయిన వైఖరి అనీ అంటున్నారు. ఈ 'హేతువు'ను హక్కుల కోణం నుండి విశ్లేషించి అందులోని అబద్ధాన్ని ఎండగట్టేపని హక్కుల ఉద్యమం చేయవలసి ఉంది. అందుకు మొదటినుండి ఇంకొంచెం సిద్ధంగా ఉండి ఉంటే బాగుండేది.

ఇవి రెండూ పూర్తిగా విడివిడి కర్తవ్యాలు కావు. హిందూత్వంలోని నిచ్చెనమెట్ల 'ధర్మ' భావన ప్రపంచీకరణకు బాగా అతికే భావజాలం. 'స్వధర్మం' ఎంత హేయంగా తోచినా, పరధర్మం ఎంత ఆకర్షణీయంగా తోచినా పరధర్మానికి ఆశ పడొద్దు, అది వినాశహేతువు అని శ్రీకృష్ణ పరమాత్మ అనలేదా? నీకు

తిండి లేదని సమాజాన్ని తిట్టవద్దు. నీ దగ్గర వనరులుంటేనే, నీకు సామర్థ్యం ఉంటేనే అవి నీకు దక్కుతాయనీ, లేకపోతే నీ తప్పేననీ గ్రహించు అని ప్రపంచీకరణవాదులు అనడం లేదా?

**మెజారిటీ (విశాఖ) పత్రికకిచ్చిన ఇంటర్వ్యూ**

**31 జూలై 2001**



దళితులకూ, ఆదివాసులకూ 'మీరూ హిందువులే'నన్న గుర్తింపు విశ్వహిందూపరిషత్ బలంగా కల్గించింది. హైందవ సమాజంలో ఆ ప్రజలకు ఉండే నీచమైన స్థానాన్ని ఏమాత్రం సంస్కరించకుండ, బజరంగ్‌దళ్ కార్యకలాపాలలో వారిని భాగస్వాములు చేయడం ద్వారా వారికి 'హిందువు' అన్న ఐడెంటిటీ కల్పించింది. ఆదివాసీ ప్రాంతాలలో వినాయకుడి విగ్రహాలు ఉచితంగా పంచి గణేశ్ భజనలు నేర్పించింది. హైందవ మిలిటెన్సీకి సంకేతంగా మారిన త్రిశూలాలు విరివిగా పంచింది. కొత్తగా చదువుకుని సమాజాన్ని గురించి ఆలోచించడం మొదలుపెట్టిన మొదటితరం దళితులకూ ఆదివాసులకూ 'నేనెవరిని?' అన్న ప్రశ్నకు విశ్వహిందూపరిషత్ జవాబు ఇచ్చింది. ఒక దళిత ఉద్యమ మయినా, వేరే ఏ ప్రజాతంత్ర ఉద్యమమైనా గుజరాత్‌లో అభివృద్ధి చెంది ఉంటే, అన్యాయానికి గురయి న్యాయాన్ని కోరుకుంటున్న వర్గంగా వారికి ఒక 'రెబల్' గుర్తింపును ఇయ్యగలిగి ఉండేవి. అవేవీ లేనిచోట విశ్వహిందూ పరిషత్ 'హిందువు' అన్న విశాలమైన గుర్తింపులో వారిని భాగం చేయగలిగింది. హైందవంలో వారి స్థానాన్ని సంస్కరించి వారిని కలుపుకునే బదులు, ద్వేషించడానికి ఒక ముస్లింను నిలబెట్టి ఆ ద్వేషం ప్రాతిపదికన కలుపుకునింది. నువ్వు హిందువు, భారతదేశం నీ దేశం, ఈ ముస్లిం దేశద్రోహి, పాకిస్తాన్ అభిమాని, పాకిస్తాన్ టెర్రరిస్టు దేశం, భారతదేశాన్ని టెర్రరిజంతోనూ సీమాంతర ఉగ్రవాదంతోనూ పీడిస్తున్న శత్రుదేశం, ఈ ముస్లింను ద్వేషించు, అంతమొందించు, నీ దేశాన్ని కాపాడుకో - ఇదీ సంఘ్‌పరివార్ సగటు గుజరాతీలకు - ఆదివాసులు, దళితులతో సహా - పదే పదే ఇస్తున్న సందేశం. మనుషులను ప్రేమ, వివేచనే కాదు, ద్వేషం కూడా ఐక్యం చేయగలదు. ప్రేమ కంటే, వివేచన కంటే ద్వేషమే సులభంగా ఐక్యం చేయగలదని నేనంటే నేను మానవ నైజాన్ని కించపరుస్తున్నానని నాపైన దాడి చేస్తారేమోగాని, ద్వేషం కూడా ఐక్యం చేయగలదని ఒప్పుకుంటారను కుంటాను. గుజరాత్ వీధులలో ముస్లింలను ఊచకోత కోయడానికి, వాళ్ళ ఇళ్ళు, దుకాణాలు అగ్నికి ఆహుతి చేయడానికి వేలాదిగా కదలివచ్చిన భిన్న స్థితిగతులు, భిన్న ప్రయోజనాలు, భిన్న అవసరాలు గల జనం దీనికి నిదర్శనం.

**(ఇంకెక్కడా మరొక గుజరాత్ కాకుండ చూడడం ప్రజాతంత్ర ఉద్యమాల కర్తవ్యం)**

**ప్రజాపంథా వారపత్రిక**

**01 జూన్ 2002**

# డర్బన్ సదస్సు - ఒక భిన్న కోణం

గత వారం సామాజికాంశంలో బి. చంద్రశేఖర్ రాసిన వ్యాసంలో ప్రస్తావించిన విషయాలపై స్పందించటం అవసరం. భిన్న స్వభావం గల విషయాలను కుప్ప వేసి ఆయన చేసిన విశ్లేషణ చాలా అసంతృప్తికరమైనది. కొన్ని విషయాలు అభ్యంతరకరమైనవి కూడా!

భారతదేశంలోని కులవ్యవస్థ గురించి విదేశీయులకు ఇదివరకు తెలియక పోలేదు. కానీ ఇప్పటిదాకా దానిని వారు సామాజిక శాస్త్రవేత్తలు, సాహిత్యకారులు, పర్యాటకులు చేసిన రచనలలో చూసారు. అంబేద్కర్ వంటి ఒకరిద్దరి ప్రయాస ఈ ప్రభావాన్ని అడ్డుకోలేకపోయింది. కులాన్ని ఒక సజీవ అనుభవం గానూ, ఒక వికృతమైన వ్యవస్థగానూ చూసే అవకాశం బాహ్య ప్రపంచానికి ఈ మధ్యనే లభించింది. భారతదేశంలోని దళితులలో కొందరు చదువుకుని సామాజిక శాస్త్రవేత్తలయి, రచయితలై తమ గొంతు వినిపించటం మొదలుపెట్టిన తరువాతే అది సాధ్య మయ్యింది. దళితులలో చదువుకున్న కొత్త తరమొకటి ముందుకొచ్చి తమ ఆలోచనలను, అనుభవాన్నీ తమ భాషలలోనే కాక ఇంగ్లీషులోనూ వ్యక్తం చేయగలగటం ఈ పరిణామానికి ఒక పార్శ్వం కాగా, ప్రపంచం ఈరోజు సాంకేతికంగా 'గ్లోబల్ విలేజ్' కావటం రెండవ పార్శ్వం.

గ్లోబలైజేషన్ అనే మాటను రెండు అర్థాలలో ప్రయోగించ టం జరుగుతున్నది. ఒక అర్థంలో ప్రపంచమంతా పెట్టుబడికి ఏ అవరోధాలు, అవధులు లేని మార్కెట్‌గా మారడాన్ని సూచిస్తోంది. ఇది అవాంఛనీయం. అభ్యంతరకరం. మరొక అర్థంలో ప్రపంచం

---

'ఈ ప్రవచనాల బండారమే బయటపడాలి' అనే పేరుతో గుంటూరు న్యాయవాది బి. చంద్రశేఖర్ 12.08.2001 నాడు వార్తలో రాసిన వ్యాసానికి ఇది ప్రతిస్పందన. ఆ తర్వాత వీటికి స్పందనగా మరో రెండు వ్యాసాలు వచ్చాయి. ఒకటి ఓల్గా, వసంత కన్నబిరాన్, కల్పన కన్నబిరాన్‌లు రాయగా, రెండోది ఆర్.మోహన్ (జి.యస్.రామ్మోహన్) 16.09.2001న రాశారు.

లోని అన్ని మూలలనూ కలిపే సమాచార విప్లవాన్ని సూచిస్తోంది. ఇప్పుడు ఏ మూల జరిగే విషయమూ దాగదు. ఈ సమాచార సాంకేతిక ప్రక్రియలు పెట్టుబడిదారీ గ్లోబలైజేషన్‌కు సాధనంగా ఉపయోగపడుతున్నంత మాత్రాన వాటికి వేరే ప్రాముఖ్యం లేదని గానీ, వేరే అర్థం లేదని గానీ, వేరే విలువ లేదని గానీ అనుకోకూడదు. మెక్సికోలో జరుగుతున్న చియాపాస్ ఉద్యమం సమాచార విప్లవాన్ని వాడుకుని మెక్సికో ప్రభుత్వం పైన ప్రపంచ వ్యాపితమైన ఒత్తిడి తేగలిగింది. మన దగ్గర దళిత ఉద్యమకారులు కొంత మేరకు అదే పని చేయగలిగారు. అయితే ఎవరి ప్రయత్నమూ లేకుండా కూడా, కేవలం సమాచార గ్లోబలైజేషన్ వల్ల భారతదేశంలోని దళితుల స్థితిగతులు ఎన్నడూ లేనంత ఎక్కువగా బయటి దేశాలలో తెలియవచ్చాయి. యూదులకూ, నల్లజాతీయులకూ జరిగిన అన్యాయానికి అంతగా స్పందించిన ప్రపంచం ఈ అన్యాయానికి ఎందుకు స్పందించదు అన్న ప్రశ్నను ప్రపంచం ఎదుట నిలబెట్టాయి. హ్యూమన్ రైట్స్ వాచ్ భారతదేశంలో దళితుల స్థితిగతుల గురించి 'ది బ్రోకెన్ పీపుల్' అనే నివేదిక ప్రచురించడాన్నీ, ఐక్యరాజ్యసమితి కులాన్ని తన ఎజెండాలో చేర్చాలన్న ప్రతిపాదనను స్వీకరించడాన్నీ పెట్టుబడిదారీ మార్కెట్ల విస్తరణకోసం జరుగుతున్న కుట్రగా కాక ఈ పరిణామాలలో భాగంగా చూడడం సబబుగా ఉంటుంది. హ్యూమన్ రైట్స్ వాచ్, ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ వంటి సంస్థలకు సంబంధించినంతవరకు వేరే కోణం కూడా ఉంది. ఈ సంస్థలు చాలా కాలం హక్కులను కేవలం రాజ్యహింసకు సంబంధించిన విషయాలుగా చూసాయి. లాకప్ హత్యలు, బూటకపు ఎన్‌కౌంటర్లు, అప్రజాస్వామిక చట్టాలు, మరణదండన, ప్రివెంటివ్ డిటెన్షన్ మొదలైన హక్కుల సమస్యలపైనే ఈ సంస్థలు విశేషంగా కృషిచేశాయి. ఆ కృషి మనబోటి దేశాలలో పనిచేస్తున్న హక్కుల ఉద్యమాలకు అండనిచ్చింది. అయితే హక్కులంటే ఇవేనా, సామాజిక అణచివేత మీకు కనిపించదా అన్న సవాలును వారు మొదటినుండీ ఎదుర్కొంటూ వచ్చారు. తమ సంస్థలలో దీర్ఘంగా చర్చించుకున్నారు. చివరికి సామాజిక అణచివేతను కూడా తమ ఎజెండాలో చేర్చుకున్నారు. ఆహ్వానించదగినది అయిన ఈ పరిణామానికి పెట్టుబడిదారీ గ్లోబలైజేషన్‌తో సంబంధమేముంది?

ఐక్యరాజ్యసమితి కూడా చాలాకాలం పౌర రాజకీయ హక్కుల మీదనే దృష్టి పెట్టి వివిధ ఒడంబడికల క్రోడీకరణ కోసం అఖిల ప్రభుత్వ సదస్సులు నిర్వహించింది. ఇది యాభై ఏళ్ళుగా జరుగుతున్నప్పటికీ తొలినాడు ఆ సదస్సులలో పాల్గొన్నది ప్రభుత్వాలు మాత్రమే కాబట్టి వాటికి పెద్దగా ప్రచారం రాలేదు. చట్టబాహ్యమైన హత్యాకాండ, పోలీసు అత్యాచారాలు, యుద్ధ నియమాలు, నేర విచారణ పద్ధతి,

జాతి వివక్ష, జెనోసైడ్ మొదలైన విషయాల మీద ఈ అఖిల ప్రభుత్వ సదస్సులలో ఐక్యరాజ్యసమితి తీర్మానాలు చేయించగలిగింది. ఈ తీర్మానాల వల్ల ఇబ్బందికి గురైన ప్రభుత్వాలన్నీ 'ఇది జాతి రాజ్యాలుగా మాకు ఉండే సార్వభౌమత్వం మీద దాడి' అని అల్లరి చేసినప్పటికీ ఎవరూ ఒప్పుకోలేదు. ఐక్యరాజ్య సమితి మీద అగ్రరాజ్యాల ప్రభావం చాలా కాలంగా ఉన్నప్పటికీ, దాని తీర్మానాల అమలుకు భరోసా లేనప్పటికీ, వాటిని విలువ లేనివిగా హక్కుల ఉద్యమం భావించలేదు. గడచిన కొన్ని సంవత్సరాలుగా ఐక్యరాజ్యసమితి సామాజిక ఆర్థిక వ్యవస్థల మీద కూడా దృష్టి సారించింది. స్త్రీల హక్కులు, పర్యావరణం, అభివృద్ధి అనే అంశాల మీద సదస్సులు నిర్వహించింది. గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకమైన అంశాలు కూడా ఆ తీర్మానాలలో చోటు చేసుకున్నాయి. రేపు కులవివక్ష కూడా ఐక్యరాజ్యసమితి ఎజెండా మీదకు రావచ్చు. కులవివక్షను 'జాతి సంబంధమైన వివక్ష'గా గుర్తించడం కాకుండా, విడిగానే కులవివక్ష మీద డర్బన్ సదస్సు తీర్మానిస్తే బాగుండేది. ఏది ఏమైనా భారత పాలకులను ప్రపంచదేశాల వేదికమీద నిలదీయడమైతే జరుగుతోంది. ఒకప్పటి ఐక్యరాజ్య సమితి సదస్సులకూ ఈ మధ్య జరుగుతున్న వాటికీ ఉన్న ఒక్క తేడా ఏమిటంటే, గతంలో ఈ సదస్సులలో ప్రభుత్వాలు మాత్రమే పాల్గొనగా, ఇప్పుడు ప్రజల ప్రతినిధులుగా ప్రభుత్వేతర సంస్థలను కూడా పాల్గొననిస్తున్నారు. అయితే ఈ అవకాశాన్ని భారీగా నిధులు అందుబాటులో ఉన్న సంస్థలు మాత్రమే వాడుకోగలగడం వల్ల ఈ సదస్సులలో ప్రజా సంఘాలను పాల్గొననివ్వడంలో గల లక్ష్యం దెబ్బతినడం లేదా అన్న సందేహం వస్తుంది. ఎన్జీఓలకు వేరే ఏదో నిగూఢమైన ఎజెండా ఉందని నమ్మకపోయినా వారికి ప్రజలతో ఉన్న సాన్నిహిత్యం ఎంత అన్న సంశయం ఉండడం సహేతుకమే.

సాన్నిహిత్యం ఒక్కటే కాదు. బాహ్య నిధులతో (విదేశీయమే కానక్కరలేదు) పనిచేయడం ఉద్యమాల లక్ష్యాలను నిధులిచ్చేవారి ప్రాధాన్యతల ప్రకారం రూపొందించడమేకాక, ఉద్యమాల లక్షణాలను కూడా దెబ్బతీస్తుంది. ఉద్యమాలు ఏ ప్రజలలో పనిచేస్తున్నాయో ఆ ప్రజలు సమకూర్చే వనరులతోనే పనిచేయడం అత్యుత్తమం లేదా కనీసం తమ కార్యకలాపాలను గౌరవించే వారిపైన ఆధారపడొచ్చు. ఎవరో ఇచ్చే నిధులతో పనిచేయడం ఉద్యమాల ఆరోగ్యానికి మంచిది కాదు. ఎన్జీఓల రంగప్రవేశం తరువాత ఉద్యమకారుల స్థానంలో ఉద్యమ ఉద్యోగులు, ఉద్యమ మేనేజర్లూ తయారవుతున్నారు. వారిలో చాలా మందికి ఉద్యమం ఒక వృత్తే తప్ప మనసు లగ్నమై పనిచేసే ఆదర్శం కాదు. ప్రజలతో పరిమితమైన సంబంధాలు పెట్టుకుని, తమ జీవన ప్రమాణాలు ఎంతమాత్రం దెబ్బతినకుండా ఒక ప్రాజెక్టు నుండి మరొక ప్రాజెక్టుకు మారుతూ బతికేవారు ఎన్జీఓలలో పెద్ద సంఖ్యలో ఉన్నారు.

ఐక్యరాజ్యసమితి నిర్వహించే సదస్సులలో ప్రజల ప్రతినిధులుగా వీరు పాల్గొనడం ఆ అవకాశానికే నష్టం చేయగలదు. దాని బదులు బయటి నిధులు లేకుండా పనిచేసే ప్రజాసంఘాలు తమకున్న పరిమితమైన నిధులను పోగుచేసి ఒకరిద్దరు ప్రతినిధులను పంపించగలిగితే బాగుంటుంది. అయితే ఈసారి డర్బన్‌కు ఆంధ్రప్రదేశ్ నుంచి పోతున్న బృందంలో ఎన్జీఓలకంటే దళిత ఉద్యమంలో చాలాకాలం కృషి చేసినవారు, బాధిత దళితులు ఎక్కువమంది ఉన్నారు. కాబట్టి మన రాష్ట్ర ప్రాతినిధ్యం అర్థవంతంగానే ఉండగలదు.

చివరగా హక్కుల ఉద్యమాన్ని గురించి చంద్రశేఖర్ చేసిన వ్యాఖ్యలకు జవాబు చెప్పాలి. హక్కుల ఉద్యమానికి దేశీయ స్ఫూర్తి లేదని, పాశ్చాత్య సిద్ధాంతకారుల సిద్ధాంతాలే దానికి పునాదిగా ఉన్నాయని, కుల వివక్ష గురించి మాట్లాడేటప్పుడు కూడా 'మన బసవడి ఉద్యమం లాంటి వాటిని గుర్తు చేసుకోం' అని ఆయన అంటున్నారు. హక్కుల ఉద్యమానికి మానవీయ స్ఫూర్తి ఉండాలిగానీ, దేశీయ స్ఫూర్తి ఎందుకు ఉండాలి (మానవీయత అంతా ఈ దేశంలోనే ఉందనుకుంటే తప్పు)? కుల వివక్ష గురించి మాట్లాడేటప్పుడు బసవడి ఉద్యమం లాంటి వాటిని కాకపోతే ఫ్రెంచి విప్లవాన్ని గుర్తు చేసుకుంటున్నామా? అర్థం లేని అభాండాలు వెయ్యడం ఎందుకు? కనీసం ఒక దశాబ్దం కాలంగా హక్కుల స్ఫూర్తికి మూడు మూలాలు ఉన్నాయని గుర్తిస్తున్నాం. ఒకటి పాశ్చాత్య ప్రజాతంత్ర విప్లవంలో వ్యక్తమైన హక్కులు, రెండు ఆ ప్రజాతంత్ర అవగాహనలో పరిమితులను ఎత్తి చూపుతూ పాశ్చాత్యదేశాల్లోనే మొదలైన కార్మిక, మహిళా, నల్లజాతి, పర్యావరణ ఉద్యమాలు, వలసదేశాల తిరుగుబాట్లు. మూడు, మన దేశంలో బుద్ధుడి కాలం నుండి ఉన్న బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు, ఇప్పుడు సాగుతున్న ప్రజా ఉద్యమాలు. ఇందులో మొదటి రెండింటి నుండి మనం పొందినది, పొందేది ఏమీ లేదని గానీ, అందులోని విషయాలన్నీ మన దేశంలో అంతకుముందే ఉన్నాయని గానీ అనదల్చుకుంటే సోదాహరణంగా వాదిస్తే చర్చించుకోవచ్చు. రెండురాళ్లు ఎత్తి మీద పడేసి ఏరుకుని చావండి అనడం విమర్శ కాదు, చర్చించే పద్ధతీ కాదు.

**వార్త దినపత్రిక**
**19 ఆగస్టు 2001**



# ఈ ఆధునిక అగ్రహారాలను చూడండి

సైన్సు, టెక్నాలజీలలో నైపుణ్యం ఉన్నవారి అహంకారం స్వల్పం కాదు. వాళ్లను సామాజిక ప్రాముఖ్యం గల నిర్ణయాలు చేయమని అడిగితే అందులో తమకు తెలియని విషయమేమైనా ఉందేమోనన్న అనుమానాన్ని సైతం దగ్గరకు రానివ్వరు. అందువల్లనే సామాజిక ప్రాముఖ్యం గల ఏ నిర్ణయాన్నీ సైంటిస్టులకు వదిలిపెట్టకూడదు.

వైజ్ఞానిక సంస్థలలో రిజర్వేషన్ల అమలుకు పట్టిన గతి చూస్తే ఈ విషయం అర్థమవుతుంది. రిజర్వేషన్ల గురించి రాజ్యాంగం ఏమంటుందో వాళ్లకు అనవసరం. రిజర్వేషన్లకు సంబంధించిన 'అన్ని కోణాలనూ పరిశీలించి చట్టాన్ని ప్రకటించడం కోసం' ఏర్పాటు చేసిన 9 మంది జడ్జీల రాజ్యాంగ ధర్మాసనం 'మండల్ కమిషన్ కేసులో' ఏమన్నదో వారికి అనవసరం. వాళ్లకున్న సంకుచితమైన వైజ్ఞానిక పరిధిలో వారు ఏర్పరచుకున్న అభిప్రాయాలే సర్వం అని వారు భావిస్తారు. అవే సత్యమని భావిస్తారు. ఇది ఎక్కడైనా సైంటిస్టులతో ఉండే సమస్యే కావచ్చును. కానీ భారతదేశంలో సైంటిస్టులు అత్యధికంగా బ్రాహ్మణులు కావడం వల్ల ఆ వర్గానికి ఉండే దృష్టిలోపం చాలా ప్రగాఢమయినది.

అత్యధిక భాగం వైజ్ఞానిక, సాంకేతిక సంస్థలలో అసలు రిజర్వేషన్లే అమలు కావు. మండల్ కమిషన్ సిఫారసు పైన ఆధారపడ్డ కేంద్ర ప్రభుత్వ ఆదేశం రాజ్యాంగ బద్ధమేనని 9 మంది జడ్జీల రాజ్యాంగ ధర్మాసనం ప్రకటించి ఎనిమిదేళ్లు గడిచినా ఏ ఒక్క కేంద్ర ప్రభుత్వ రంగ వైజ్ఞానిక సంస్థలోనూ బి.సిలకు రిజర్వేషన్లు ఇవ్వటం లేదు. ఏమీ ఎందుకూ అని వారిని అడగడానికి కూడా వీలులేదు. 'ప్రతిభ'కు తప్ప వేరే దేనికీ వైజ్ఞానిక సంస్థలలో చోటు లేదని వారి గట్టి అభిప్రాయం.

ఈ రకమైన వాదనలో 'ప్రతిభ' అనే మాటకు ఉండే అర్థాల గురించి, అర్థచ్ఛాయల గురించి సామాజిక శాస్త్రవేత్తలే కాదు, సుప్రీంకోర్టు జడ్జీలు సహితం చేసిన నిశితమైన వ్యాఖ్యలు వారికి అక్కరలేదు. మన దేశంలో ఐఐటిలు సాంకేతిక విద్యా సంస్థలలో మేటి. అవి ప్రస్తుతం ఆరు ఉన్నాయి. దళితులకూ ఆదివాసులకూ సీట్లలో రిజర్వేషన్ కల్పించాలని వారికెవరో చెప్పినట్టున్నారు. వారు ఇవ్వడానికి పూనుకున్నారు.

ఏ విధంగానంటే దళితులకు ఇచ్చే 15% రిజర్వేషన్‌లోనే దళితులందరూ సీట్లు పొందాలి. ఒకవేళ అభ్యర్థులందరిలోకి ఒక దళిత అభ్యర్థికే ఎక్కువ మార్కులు వచ్చినా సరే, ఆ దళిత అభ్యర్థి దళితులకు ఇచ్చే 15% సీట్లనుండే తన సీటు పొందాలి. ఆదివాసీ అభ్యర్థులయినా అంతే. అత్యంత 'ప్రతిభావంతులయిన' ఆదివాసులు సహితం ఆదివాసులకిచ్చే 7.5% సీట్లలోనే సీటు పొందాలి.

రిజర్వేషన్లు ఇమ్మంటే అంటరానితనం పాటిస్తున్నారేమిటని వారిని అడగవద్దు. చాలా గొప్ప పని చేస్తున్నామనుకుంటున్నారు వారు. అహంకారంతో వాళ్ల కళ్లు ఎంత పూర్తిగా మూసుకుపోయాయంటే వాళ్లు దళిత విద్యార్థులనే కాదు, వారి అప్లికేషన్ ఫారంలను కూడా అంటరానివిగా భావిస్తున్నారు. ఒకే అప్లికేషన్ ఫారంలో దళితులూ సవర్ణులూ అప్లై చేయడానికి వీలు లేదు. ఎవరి ఫారంలు వారివి. ఆ ఫారంను దళితులు తెల్లరంగు కవర్‌లో పెట్టి పోస్టు చేయాలి. సవర్ణుల కవరు గోధుమ రంగులో ఉంటుంది. ఆ విధంగా వేరు వేరు అప్లికేషన్ ఫారంలు తెప్పించుకొని వేరు వేరు మెరిట్ లిస్టులు తయారుచేస్తారు. దళిత అభ్యర్థులు వారి లిస్టు నుండి, వారి కోటా మేరకు మాత్రమే సీట్లు పొందాలి. ఆదివాసులయినా అంతే.

ఎక్కడో మారుమూల గ్రామాలలో దళిత విద్యార్థులకు వేరే క్లాస్‌రూంలు పెట్టారనీ, వేరే బెంచీల మీద కూర్చోమంటున్నారనీ అప్పుడప్పుడు పత్రికలలో చదివి ఇంకా ఇంతటి అనాగరికత ఉందా అని ఆశ్చర్యపోతుంటాం. ఆగ్రహం చెందుతుంటాం. కానీ అత్యంత ప్రతిభావంతులయిన సైంటిస్టులు పరిపాలించే అత్యంత నాగరికమైన ఐఐటిలు దళిత అభ్యర్థుల అప్లికేషన్లు వేరే వాళ్ల అప్లికేషన్లతో కలవకుండా వేరుగా ఉంచుతున్నాయనీ, ఒకరి 'మెరిట్ లిస్టు' వేరేవారి 'మెరిట్ లిస్టు'తో కలవకుండా వేరుగా ఉంచుతున్నాయనీ ఎంతమందికి తెలుసు? రిజర్వేషన్లు కల్పించే పద్ధతి ఇది కాదని ఏ కొంచెం ఇంగితం ఉన్నవారికైనా తెలిసే ఉండాలి. కానీ ఐఐటి మేధావులకు మాత్రం తెలియదు.

నిజానికిది తెలియకపోవడం కూడా కాదు. రిజర్వేషన్లు ఇవ్వడం ద్వారా వైజ్ఞానిక సంస్థలలో ప్రవేశార్హత లేనివారికి ఆ అవకాశం అందిస్తున్నామని ఈ సంస్థల పాలక

వర్గాలు భావిస్తాయి. ఈ అర్హత వారు నమ్మే 'మెరిట్' కూడా కాదు. అగ్రకులమే ఆ అర్హత. అది కాని కులాలకు రిజర్వేషన్లు కల్పించి, ఆ మేరకు మాత్రమే వారిని రానిస్తారు. ఆ విధంగా వారిని రానివ్వడం తమ గొప్పతనానికీ ఔదార్యానికీ నిదర్శనమని వారు భావిస్తారు కాబట్టి ఇది ఎంత దుర్మార్గమైన వైఖరో వారికి అర్థం కాదు.

మరి దళితులూ ఆదివాసులూ ఐఐటిలో సవర్ణ హిందువులతో పోటీపడి సీట్లు పొందడానికి వీలే లేదా? ఉంది-తాము దళితులమన్న సంగతి, ఆదివాసుల మన్న సంగతి తొక్కిపెట్టి పోటీలో పాల్గొనాలి. ఆ పోటీలో తట్టుకోలేకపోయిన పక్షంలో రిజర్వేషన్ ద్వారా సీటు పొందే అవకాశాన్ని విడిచిపెట్టుకుని పోటీకి సిద్ధం కావాలి. అప్పుడు కులం పేరు చెప్పడానికి ఖాళీలేని 'జనరల్' అప్లికేషన్ ఫారం నింపి గోధుమ రంగు కవర్‌లో పెట్టి పంపించాలి. అప్పుడు అందరితోపాటు పోటీ పడవచ్చు. కానీ ఓడిపోతే మాత్రం రిజర్వేషన్ అడగడానికి వీలులేదు.

'ఇది నిజంగానే జరుగుతున్నదా?' అని చాలామంది ఆశ్చర్యపోవచ్చును. కానీ ఈ ఐఐటిలు మండల్ కమిషన్ వచ్చి ఎనిమిదేళ్లు గడిచినా కూడ బి.సిలకు రిజర్వేషన్‌లు ఇవ్వడం లేదని గుర్తు చేసుకుంటే ఇందులో అంతగా ఆశ్చర్యపోవల సిందేమీ లేదు. బి.సి రిజర్వేషన్ల దాకా ఎందుకు - విద్యార్థుల ఎంపికలో పైన చెప్పినట్టు ఒక వక్రమైన పద్ధతిలోనైనా ఎస్.సి, ఎస్.టిలకు రిజర్వేషన్ కల్పిస్తుండ వచ్చును గానీ అధ్యాపకులలో ఎస్.సి, ఎస్.టిలు దాదాపు మృగ్యమనే చెప్పుకోవాలి. దళితులు, బి.సిల దాకా ఎందుకు, బ్రాహ్మణేతర అగ్రకులాలు సహితం ఐఐటి లలోనూ, ఇతర కేంద్ర ప్రభుత్వ ఉన్నత విద్యా సంస్థలలోనూ ఎక్కువ కనిపించరు.

మద్రాసులో ఐఐటిని 'అయ్యంగార్, అయ్యర్ (ఇన్‌స్టిట్యూట్ ఆఫ్) టెక్నాలజీ' అని ద్రవిడ ఉద్యమకారులు పిలుస్తారంటే ఆ పేరు ఊరికే రాలేదు మరి! దేశంలో అగ్రహారాలు ఇంకా ఎక్కడైనా మిగిలి ఉన్నాయంటే అది ఉన్నత (సాంకేతిక) విద్యా రంగంలోనే అనేది ఆధునికతను అపహాస్యం చేసే విషయం కావచ్చును గానీ అది సత్యమే.

నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక
**16 అక్టోబర్ 2001**



పున్నయ్య కమిషన్ :

# కొంత సత్యం కొరవ భ్రమలు

జస్టిస్ పున్నయ్య కమిషన్ నివేదికపైన, ఆ నివేదికలోని సూచనలపైన దుమ్మెత్తి పోసిన వారున్నారు. పున్నయ్యగారికీ, వారిని కమిషన్ ఏక సభ్యునిగా నియమించిన రాష్ట్ర ప్రభుత్వానికీ దురుద్దేశ్యాలు ఆపాదించిన వారూ ఉన్నారు.

అది అనవసరం. వేరే దేనికీ కాకపోయినా అందరూ ఆలోచించడం మరచి పోయిన కొన్ని ప్రాథమిక, సామాజిక, రాజకీయ సత్యాలను జ్ఞాపకం చేయడానికి జస్టిస్ పున్నయ్య కమిషన్ కృషి పనికొచ్చింది. అన్ని కమిషన్లలాగ హైదరాబాద్‌లోని ఒక ప్రభుత్వ కార్యాలయంలో కూర్చొని 'అందరూ వచ్చి మీ సూచనలో సలహాలో ఇక్కడే అందజేయండి' అని ప్రకటించి ఊరుకోకుండా పున్నయ్యగారు జిల్లా జిల్లా తిరిగి బహిరంగ సమావేశాలు నిర్వహించి పారదర్శకంగా విషయ సేకరణ చేయడం వల్ల అంటరానితనం, దాని పర్యవసానమయిన సమస్యలు కొన్ని వారాలపాటు దినపత్రిక మొదటి పేజీ వార్తలయ్యాయి.

అది చిన్న విషయం కాదు.

'ఎస్.సి., ఎస్.టి.లపైన అత్యాచారాలను నివారించడానికి' ఉద్దేశించిన కమిషన్ ఎస్.సి.ల సమస్యలకిచ్చిన ప్రాముఖ్యంలో దశాంశం కూడా ఎస్.టి.ల సమస్యల కివ్వలేదని విమర్శించే హక్కు ఆదివాసులకు ఉంటుందిగానీ వేరే ఎవ్వరికీ పున్నయ్యగారి పరిశ్రమ విస్తృతిమీద సహేతుకమైన విమర్శ పెట్టే అవకాశం ఉందనుకోను.

అయినప్పటికీ వారు సూచించిన పరిష్కారాలలో మెచ్చుకోదగ్గవి కొన్ని ఉన్నా విమర్శించవలసినవే ఎక్కువ ఉన్నాయని చెప్పక తప్పదు. ఒక్కొక్క సూచననూ పట్టుకుని 'ఇది ఇట్లాకాక ఇంకొకరకంగా ఉండవలసింది' అనడం పెద్ద కష్టం కాదుగానీ స్థూలంగా పున్నయ్యగారు పరిష్కారాల పట్ల అనుసరించిన వైఖరినే విమర్శించవలసిన అవసరం ఉంది.

వారి సూచనలు మరీ మెతకగా ఉన్నాయనడం కేవలం వారికంటె మనం 'రాడికల్' అని రుజువు చేసుకోవాలనే ఉబలాటం వల్ల కాదు. దానికి హేతుబద్ధమైన కారణం ఉంది.

## ఇంత మెత్తటి చర్యలు సరిపోతాయా?

అన్ని సమస్యలకూ కఠినమైన పరిష్కారాలే సరయినవనడం సహేతుకం కాదు. అయితే అన్నిటినీ మెత్తగానే పరిష్కరించాలనడమూ సహేతుకం కాదు. అది సమస్యకు ఉండే సామాజిక స్వభావాన్ని బట్టి ఉంటుంది. లేమి నుండి, అణచివేత నుండి, తెలియనితనం నుండి, బలహీనత నుండి పుట్టిన తప్పులను మెత్తగా, అవసరమైతే సానుభూతితో పరిష్కరించవచ్చు. కండకావరం నుండి పుట్టిన తప్పులను అట్లా పరిష్కరించలేం. దానిపైన అనాగరికమైన హింస ప్రయోగించమనీ, నిర్విచక్షణగా అణచివేయమనీ అనడం లేదు గానీ 'గుర్తెరిగి దెబ్బతీయడం' అవసరం.

దళితులు సవర్ణుల నుండి, ఆదివాసులు ఆదివాసీయేతరుల నుండి ఎదుర్కొనే అణచివేత ఈ కోవకు చెందినది. పున్నయ్యగారికి ఈ విషయం తెలియనిది అని అనుకోలేము గానీ వారు సూచించిన పరిష్కారాలు మాత్రం తెలియనివారివ్వ గలిగినవే. నచ్చజెప్పాలి, సంజాయించాలి, బహుమతుల వంటి ప్రోత్సాహకాలు ఇవ్వాలనీ, చట్టాల అమలును పర్యవేక్షించడానికి పలు పర్యవేక్షక అధికారులను ఒక దొంతరగా నియమించాలనీ పున్నయ్యగారు ప్రధానంగా సూచిస్తున్నారు.

బాల కార్మిక వ్యవస్థను నిర్మూలించడానికి పేద తల్లిదండ్రులను అనునయించే పద్ధతిలో వ్యవహరించాలంటే అర్థం ఉందిగానీ సవర్ణుల చేత కుల అహంకారం మాన్పించడానికి కూడా అదే మంచి పద్ధతి అంటే ఒప్పుకోవడం కష్టం. అంటే నచ్చజెప్పవలసిందీ ప్రచారం చేయవలసిందీ ఏమీ లేదని కాదు. దాని ప్రయోజనం దానికి ఉంటుంది. కానీ అదే ప్రధాన పరిష్కారం కాజాలదు. సామాజిక మోతుబరులూ రాజకీయ పెత్తందార్లూ, ఎవరైతే అంటరానితనాన్ని పదిలంగా నిలబెడుతున్నారో, వారి పెత్తనాన్నీ మోతుబరితనాన్నీ దెబ్బతీసే మార్గాలు వెతకాలి. అంటే పొట్టమీద - కాకపోతే బొజ్జమీద - కొట్టాలి. అనాగరికమైన సాంప్రదాయాలను

కొనసాగించేవారు ఆర్థిక రాజకీయ రంగాలలో నాగరికత ఫలాలను అనుభవించడం అసాధ్యం చేయాలి. ఈ సూత్రాన్ని ప్రాతిపదిక చేసుకుని ఒక్కొక్క రంగంలోనూ ప్రభుత్వము, పౌర సమాజము (ఇది ప్రభుత్వం బాధ్యత మాత్రమే కాదు కాబట్టి) ఏమేం చేస్తే బాగుంటుందో ప్రభుత్వానికి సూచించవలసిందిగా మానవ హక్కుల వేదిక జస్టిస్ పున్నయ్య గారిని కోరుతూ విజ్ఞాపన పత్రం ఇవ్వడం జరిగింది. పున్నయ్యగారి నివేదికలో ఈ స్ఫూర్తి లోపించడం దురదృష్టకరం.

## చట్టంలో సవరణలు

వారి సూచనలలో ఉపయోగకరమైనవి అసలే లేవని కాదు, కొన్ని ఉన్నాయి. వాటిని ముందు ప్రస్తావించి, విమర్శకు తరువాత వద్దాం. ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టంలో కొన్ని సవరణలు చేయాలని వారు సూచించారు. దళితులపైన దళితేతరులు చేసిన అత్యాచారాలన్నీ ప్రస్తుతం ఉన్న ఎస్.సి., ఎస్.టి చట్టం పరిధిలోకి రావు. అదనంగా, 'బాధితులు దళితులు అన్న కారణంగా' నేరస్తులు ఆ నేరానికి పాల్పడ్డారనీ, లేదా 'బాధితులను కించపరచడం కోసం' ఆ నేరానికి పాల్పడ్డారనీ రుజువు కావాలి. ఘటన నుండే ఈ ఉద్దేశ్యాన్ని నిర్ధారించడానికి వీలులేదు. అదనంగా ఉద్దేశ్యం రుజువు కావాలి. అది రుజువు కాలేదని చెప్పి సవర్ణులపైన కేసు కొట్టేసిన సందర్భాలు చాలా ఉన్నాయి.

కులం మన సమాజంలో చాలా బలమైన వ్యవస్థ. కులతత్వం మన చైతన్యం లోనూ అంతే బలమైన అంశం. అందువల్ల సవర్ణులు దళితులపైన అత్యాచారాలకు పాల్పడితే కులతత్వంతోనే చేసి ఉంటారనీ, బాధితులను కించపరచడం కోసమే చేసి ఉంటారనీ, కాదని రుజువు చేసుకునే బాధ్యత ముద్దాయిపైనే ఉంటుందనీ చట్టం భావించడం సబబుగా ఉంటుంది. జస్టిస్ రామస్వామి సుప్రీంకోర్టు జడ్జిగా 1992లో ఇచ్చిన ఒక తీర్పులో ప్రస్తావనావశంగా ఈ మాటే అన్నారు. అయితే ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం అందుకు భిన్నంగా ఉంది. అంతకుముందు చేసిన పౌరహక్కుల పరిరక్షణ చట్టం, 1955 (పిసిఆర్ చట్టం)లో, 'ఈ చట్టంలో నేరంగా ప్రకటించబడిన చర్యకు ఎవరైనా పాల్పడినట్టయితే, అది అంటరానితనం కారణంగానే జరిగిందని తద్విరుద్ధంగా రుజువయ్యేంత వరకు కోర్టు భావిస్తుంది' అని సెక్షన్ 12లో అన్నారు. 1989లో చేసిన ఎస్.సి., ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టంలో ఇది తీసేసి, నేరమేకాక ఉద్దేశ్యం కూడ విడిగా రుజువు కావాలని పెట్టారు.

పౌరహక్కుల పరిరక్షణ చట్టం, 1955లోని సెక్షన్ 12 వంటిది ఎస్.సి., ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టంలో కూడా చేర్చాలని జస్టిస్ పున్నయ్యగారు ఒక్క మాటలో అని ఉంటే సరిపోయేది. ఆయన 'అంత దూరం' పోలేదుగానీ, దళితులను

బహిరంగ స్థలంలో అవమానపరచడం, దళిత స్త్రీపైన లైంగిక హింసకు పాల్పడడం అనే నేరాల నిర్వచనంలో, 'వారిని కించపరిచే ఉద్దేశ్యంతో చేసినట్టయితే' అన్న మాటలను తొలగించాలని సూచించారు. అంతవరకు బాగానేవుంది గానీ, ఆ సవరణలు పార్లమెంటు చేసేదాకా రాష్ట్రం ఆగకుండ తానే చేపట్టాలని అని ఉంటే బాగుండేది. పార్లమెంటు చేసిన ఏ నేర చట్టాన్నయినా రాష్ట్రం సవరించి రాష్ట్రపతి ఆమోదం పొందినట్టయితే, ఈ రాష్ట్రం మేరకు ఆ సవరణ అమలవుతుంది. పున్నయ్యగారు ఈ మాట అనకపోయేసరికి మన రాష్ట్ర ప్రభుత్వం చాలా సంతోషంగా ఆ సవరణకు సంబంధించిన సూచనను 'ఆమోదించి' తన మాటగా కేంద్ర ప్రభుత్వానికి సిఫారసు చేసింది. దానివల్ల దళితులకు దక్కిందేమీ లేదుగానీ రాష్ట్రప్రభుత్వం పరువు దక్కింది.

ఇంకొక ఉపయోగకరమైన సూచన కూడ పున్నయ్యగారు చేశారు. ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం కింద కేంద్రం రూల్స్ చేసింది. రూల్ 7 ప్రకారం, ఆ చట్టం కింద నేర పరిశోధన డిఎస్పి ర్యాంకు అధికారే చేయాలి తప్ప అంతకంటె చిన్న అధికారి చేయకూడదు. పైస్థాయి అధికారి అయితే స్థానిక అగ్రకుల పెత్తందార్ల ఒత్తిడికి లొంగకుండ నిర్భయంగా నేరపరిశోధన జరుపుతాడన్నది వారి ఉద్దేశ్యం కావచ్చు. ఈ ఉద్దేశ్యం ఎంత వాస్తవికమైనదనే విషయాన్ని అటుంచి, ఆ రూల్ పెట్టింది బాధితుల మేలు కోరే తప్ప ముద్దాయి రక్షణ కోసం కాదనేది స్పష్టమే.

అయితే ఏ సంక్షేమ నియమాన్నైనా బలవంతులకు అనుకూలంగా వ్యాఖ్యానించగల మన కోర్టులు రూల్ 7ను అగ్రకుల ముద్దాయిలకు ఒక కవచంగా మలిచాయి. కేసులో నేర పరిశోధన ఎస్.ఐ. గానీ, సి.ఐ. గానీ చేసినట్టయితే ఆ చార్జిషీట్ చెల్లదని హైకోర్టు కేసును కొట్టేసిన ఉదంతాలు, కింది కోర్టు శిక్ష విధిస్తే హైకోర్టు (ఇతరత్రా సాక్ష్యాలు బలంగా ఉన్నా) కేవలం ఈ కారణంగా ముద్దాయికి విముక్తి కల్పించిన ఉదంతాలు అనేకం ఉన్నాయి. మన హైకోర్టు ఈ విషయంలో ముందు స్థానంలో నిలిచింది. (అయితే ఈ మధ్యనే ఈ వైఖరి సరయినదా అన్న సందేహం రెండు రోజుల వ్యవధిలో ఇద్దరు న్యాయమూర్తులకు విడివిడిగా వచ్చి, రూల్ 7ను ముద్దాయికి అనుకూలంగా వ్యాఖ్యానించడం సబబా అన్న సందేహాన్ని పెద్ద బెంచికి నివేదించారు.)

రూల్ 7ను మొత్తంగానే తొలగించాలని పున్నయ్యగారు ఇప్పుడు సూచించారు. ఎస్.ఐ. కంటె డి.ఎస్.పిలు తప్పనిసరిగా నిష్పక్షపాతంగా వ్యవహరిస్తారని నమ్మడానికి ఆధారాలేమీ లేవు కాబట్టి, ఆ నియమం ఉండి దళితులకు చేసిన మేలుకంటె

దానికి కోర్టులు చేసిన వక్ర వ్యాఖ్యల వల్ల జరిగిన నష్టం ఎక్కువ కాబట్టి దానిని మొత్తంగా తొలగించాలని పున్నయ్యగారు సూచించడం మంచిదే. అయితే ఈ సవరణను రాష్ట్ర ప్రభుత్వం చేసేసి (రాష్ట్రపతి ఆమోదం పొంది) ఈ రాష్ట్రం మేరకైనా అమలు చేయాలని వారు నిర్దిష్టంగా అనకపోవడం వల్ల ఈ మార్పు కూడ మన రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి సిఫారసు చేసేసి చేతులు దులిపేసుకుంది.

## సామాజిక చర్యలు : మరీ ఇన్ని భ్రమలుంటే ఎట్లా?

చట్ట సవరణల సంగతి ఇట్లాగుంటే, సామాజిక చర్యలుగా పున్నయ్యగారు సూచించినవి చాలా అసంతృప్తికరంగా ఉన్నాయని చెప్పాలి. కొన్నయితే హాస్యాస్పదంగా ఉన్నాయని సగౌరవంగా అనకతప్పదు.

పోలీసులూ, ఇతర ప్రభుత్వ అధికారులూ గ్రామాలకు పోయి మీటింగ్‌లు పెట్టి హితబోధ చేస్తే కులం సమస్య - లేదా కనీసం అంటరానితనం - రూపుమాసి పోతుందన్న పున్నయ్యగారి విశ్వాసాన్ని హాస్యాస్పదం అనక తప్పదు. నాలుగు నెలల కాలంలో అంటరానితనాన్ని రాష్ట్ర వ్యాప్తంగా రూపుమాపే అద్భుతమైన స్కీంగా ఆయన సూచించిన దానిని మీకు చెప్తే మీరు నవ్వుతారు. ఒక్కొక్క పోలీస్ సబ్ ఇన్‌స్పెక్టరు ప్రతీ శుక్రవారము తన పరిధిలోని రెండు గ్రామాలకు పోయి గ్రామంలోని ప్రజా ప్రతినిధులను, పరపతి గల వర్గాలనూ కూర్చోబెట్టి పిసిఆర్ చట్టం పూర్వాపరాలు, స్వరూప స్వభావాలు వివరించి చెప్పి, దానిని అమలు చేయడానికి వారందరి సహకారమూ కావాలని కోరినట్టయితే నెలలో ఎనిమిది గ్రామాలలో ఆ అధికారి అంటరానితనాన్ని రూపుమాపగలడు. ఎస్.ఐ.తో బాటు సి.ఐ. కూడ రంగంలోకి దిగి తాను వేరే రెండు గ్రామాలలో అదే పని చేసినట్టయితే ఇద్దరూ కలిసి ఒక నెల రోజులలో 16 గ్రామాలలో అంటరానితనాన్ని రూపుమాపగలరు. ఒక్కొక్క పోలీసుస్టేషన్ పరిధిలో సగటున 64 గ్రామాలున్నాయి కాబట్టి అన్ని పోలీసుస్టేషన్ పరిధులలోనూ ఇదే జరిగితే నాలుగు నెలలలో రాష్ట్ర వ్యాప్తంగా అంటరానితనం అంతరించిపోతుంది. ఇదీ ఆయన సూచన.

పదహారు నాలుగులు అరవై నాలుగు అన్నదొక్కటే ఇందులో నిర్వివాదం.

మరొకచోట పోలీసులే కాక ఎమ్మార్వో, ఎమ్డీవో తదితర అధికారులు కూడ ఈ పనిలో నిమగ్నం కావాలన్నారు. ప్రతీ నెలా 30వ తేదీని 'పౌరహక్కుల దినం'గా పాటించాలనీ, ఆరోజు ఈ అధికారులు గ్రామాలకు పోయి సర్పంచ్, ఉపసర్పంచ్ తదితర ప్రజా ప్రతినిధులు, టీచర్లు మొదలయిన వారి సహాయంతో గ్రామంలోని గుడిలోనికి దళితులను ప్రవేశపెట్టడం, బావులు, చెరువులకు దళితులను

తీసుకుపోయి నీళ్లు తీసుకోనివ్వడం, రెండు గ్లాసులు పెట్టిన చాయ్ దుకాణాలలో వాటిని తొలగించడం అనే మూడు పనులు చేయాలనీ అన్నారు. ప్రతీ మండలంలోనూ నెలకొక గ్రామంలో ఈ కార్యక్రమాన్ని అమలు చేసినట్టయితే ఒక నెలలో 1125 గ్రామాలలోనూ, ఒక సంవత్సరంలో 13,500 గ్రామాలలోనూ, రెండు సంవత్సరాల మూడు నెలలలో రాష్ట్రంలోని 30,000 గ్రామాలన్నింటిలోనూ అంటరానితనం సమసిపోతుందన్నారు.

హాస్యాస్పదమైన ఈ కూడికలూ, గుణకారాలను పక్కనబెడితే ఈ ప్రతిపాదనలలో రెండు అభిప్రాయాలు అంతర్లీనంగా ఉన్నాయి. ఒకటి, హితోపదేశం (అందులోనూ ఒక రోజు మాత్రమే) చేస్తే అంటరానితనం పోతుంది. రెండు, ఆ బాధ్యత పురమాయించబడ్డ అధికారగణానికి అంటరానితనం తొలగిపోవాలన్న సంకల్పం ఉంది.

## పెత్తందార్ల ప్రయోజనాలను దెబ్బతీయాలి

హితోపదేశం ఒక రోజు కాకపోతే వంద రోజులు చేస్తామనుకోండి. ఎమ్మార్వోలూ, ఎమ్డీవోలూ, ఎస్.ఐ.లే కాక నిజంగా ఆ హితవచనాల మీద నమ్మకమున్న వారే చేస్తారనుకోండి. దానితో కుల వివక్ష పోతుందా? హితవచనాల వల్ల ఏ ప్రయోజనమూ ఉండదనడం లేదు. నైతిక స్పృహ అనేదొకటి ఉండడం మనిషికుండే విలక్షణమైన గుణాలలో ఒకటి. దానిని మేల్కొలిపే ప్రయత్నమెప్పుడూ పూర్తిగా వృథా కాదు. అయితే కుల వివక్షను, అందులోనూ దళితుల పట్ల సవర్ణులలో ఉండే వైఖరులను పోగొట్టడానికి హితవచనాలు సరిపోవని గడచిన యాభై ఏళ్ల చరిత్ర చెప్తుంది. స్థానిక పెత్తందారీ కులాల ప్రయోజనాలను దెబ్బతీసే మార్గమేదైనా అన్వేషించాలి.

ఒక గ్రామంలో లేక పట్టణంలో అందరికంటె ఆర్థికంగా రాజకీయంగా ఎక్కువ బలమున్నవాళ్లే అందరికంటె ఎక్కువగా కుల వివక్ష పాటిస్తారని సూత్రీకరించజాలము. కానీ కుల వివక్ష, కులపరమైన అణచివేత - ఆర్థిక రాజకీయ పెత్తనంతో సన్నిహితంగా ముడిపడి ఉన్నాయని స్థూలంగా చెప్పవచ్చు. అది ఒక్కొక్కచోట, ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క రూపం తీసుకోవచ్చు.

అందువల్ల అంటరానితనం, దళితులపైన దాడులు అధికంగాఉండేచోట మొత్తంగానే ఆర్థిక రాజకీయ పెత్తనాన్ని అనుభవించడానికీ, దానివల్ల ప్రయోజనం పొందడానికీ ఉండే అవకాశాలను దెబ్బతీయడం అవసరం. ఒక ప్రాంతాన్ని ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టంలోని సెక్షన్ 17 కింద 'అత్యాచారాలు తరుచుగా జరిగే ప్రాంతం'గా ప్రకటించినట్టయితే ఆ ప్రకటన అమలులో ఉన్నంత కాలం ఆ

ప్రాంతంలో నివసించే దళితేతరులెవ్వరికీ సివిల్ కాంట్రాక్టులు ఇవ్వకూడదు. ప్రభుత్వ కొనుగోళ్ళేవీ వారి దగ్గర చేయకూడదు. ఇది చాలా బలంగా పని చేస్తుందనడానికి సందేహమక్కరలేదు. ఈ సూచన మానవహక్కుల వేదిక జస్టిస్ పున్నయ్యగారికి చేసింది గానీ వారి సాత్విక దృష్టికిది రుచించినట్టు లేదు.

రాజకీయంగా కూడ దెబ్బతీయవచ్చును. స్థానిక సంస్థలలో రిజర్వేషన్లు ప్రస్తుతం రొటేషన్ పద్ధతిలో నిర్ణయిస్తున్న సంగతి తెలిసిందే. ఒకసారి దళితులకు రిజర్వ్ అయిన సీటు శాశ్వతంగా దళితులకే ఉండదు. రొటేషన్ పద్ధతి వల్ల దళితేతరులకు ఆ సీటు పొందే అవకాశం ఒకసారి కాకపోతే ఒకసారి వస్తుంది. పెత్తందారీ కులాలవాళ్ళు స్థానిక సంస్థలలో రిజర్వేషన్లు స్థిరంగా ఉండిపోకూడదని కొట్లాడి ఈ 'హక్కు' సాధించుకున్నారు. ఇప్పుడు పైన పేర్కొన్నట్టు సెక్షన్ 17 కింద 'ప్రకటిత ప్రాంతం'గా ఉన్నదానిలో అన్ని స్థానిక సంస్థలలోని అన్ని పోస్టులూ దళితులకే - ఆ ప్రకటన అమలులో ఉన్నంత కాలం - రిజర్వ్ అయి ఉండేటట్టు నియమాలను సవరించాలి. అప్పుడు ఆ ప్రకటనను తొలగించుకుని 'రొటేషన్ హక్కు' పొందడానికి స్థానిక పెత్తందారీ కులాలవారు తమ నడవడికను చక్కదిద్దుకుంటారు.

ఇది 'ఉమ్మడి శిక్ష' కాదా అంటారేమో. అంటే, అగ్ర కులాలకు చెందిన సద్వర్తనులకు కూడ ఈ శిక్ష వర్తిస్తుంది కదా అంటారేమో. వర్తిస్తుంది కానీ ఒక్కొక్కసారి అటువంటి ఒత్తిడి పెట్టకతప్పదు. ఉమ్మడి జుర్మానాలు చట్టంలో ఎప్పటినుండో ఉన్నాయి. పిసిఆర్ చట్టంలోనూ ఉన్నాయి. సూత్రప్రాయంగా ఈ ప్రతిపాదన అంతకంటె భిన్నమైనది కాదు.

ఇంక ప్రభుత్వ అధికారుల సంగతి. మన దేశంలోని ప్రభుత్వ సిబ్బందిలో నూటికి తొంభై మందికి అంటరానితనంగానీ ఏ అన్యాయంగానీ తొలగిపోవాలన్న కోరిక లేశమంత కూడ లేదు. వాళ్లు లెక్చర్లిచ్చి ప్రజలను మార్చేదెప్పుడు? అంటరానితనాన్నీ, కులవివక్షనూ అరికట్టడానికి ఉద్దేశించిన చట్టాల కింద వారి విధుల్ని వారు సక్రమంగా నిర్వర్తిస్తే చాలు. ఈ అవసరాన్ని జస్టిస్ పున్నయ్యగారు బాగానే నొక్కి చెప్పారుగానీ ఆ అవసరం తీర్చే సంకల్పం వారిలో ఎంత ఉందన్న ప్రశ్న వేసుకోలేదు. వేసుకోకపోగా, వారినే ప్రధాన సాధనం చేసుకుని ప్రజలలో మేల్కొలుపు తీసుకురావచ్చునని అహేతుకంగా భావించారు.

ఎస్.సి., ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం కింద ఒక అధికారి నిర్వర్తించ వలసిన బాధ్యతలను తెలిసీ నిర్వర్తించకపోయినట్టయితే అదికూడ నేరమేననీ, దానికి ఒక సంవత్సరం జైలుశిక్ష అనీ ఆ చట్టంలోని సెక్షన్ 4 అంటుంది. వేరే ఏ చట్టంలోనూ

ఇటువంటి అంశం లేదు. అయినప్పటికీ కేసు నమోదు చేయని ఎస్.ఐ.లు, నేర పరిశోధన నిజాయితీగా చేయని డి.ఎస్.పి.లు, 'అత్యాచారాల' కేసులన్నీ బూటకపు కేసులేనని ప్రకటనలిచ్చే ఎస్.పి.లు, బాధితులకు నష్టపరిహారం ఇవ్వడానికి ముప్పై 'కొర్రీలు' పెట్టి ఆఫీసు చుట్టూ తిప్పుకునే కలెక్టర్లు, ఆ చట్టాన్ని వీలయినంతగా నీరుగార్చే జడ్జిలు - ఈ జాబితా చాలా పెద్దదే. వీళ్లలో ఎవరిమీదా సెక్షన్ 4 పనిచేయలేదు. పనిచేయడం కష్టం కూడా - కేసు ఎవరు పెట్టాలి, ఎవరు పరిశోధించాలి, ఎవరు సాక్ష్యాలు చెప్పాలి, ఎవరు ప్రాసిక్యూట్ చేయాలి, ప్రాసిక్యూషన్‌కు అనుమతి ఎవరు ఇవ్వాలి?

సెక్షన్ 4 బలమైనదే గానీ మరీ బలమైనది. ఆ వజ్రాయుధాన్ని అట్లాగే ఉండనిచ్చి అంతకంటె చిన్నదైనా సులభంగా పనిచేసే సాధనాన్ని రూపొందించుకోవడం మంచిది. దళితులకూ ఆదివాసులకూ హక్కులు కల్పించే చట్టాలను అమలు చేసే బాధ్యతలో నిర్లక్ష్యంగా వ్యవహరించడం, ఆ బాధ్యతకు హానిచేయడం విధి నిర్వహణలో 'మిస్ కాండక్ట్' కిందికి వస్తాయని ప్రభుత్వ ఉద్యోగుల సర్వీస్ నియమాలలో రాసినట్టయితే వారిలో భయమూ కొంచెం ఎక్కువే ఉంటుంది, ఒకసారి కాకపోతే ఒకసారి వారి నిర్లక్ష్యానికి ఉచితమైన శిక్షా పడుతుంది. క్రిమినల్ కోర్టులో శిక్ష పడుతుందన్న భయం తెల్లబట్టల ఉద్యోగ వర్గానికి ఉండదుగానీ విధి నిర్వహణలో మిస్‌కాండక్ట్ కింద ఇంక్రిమెంట్లు, ప్రమోషన్లు పోతాయన్న భయం మాత్రం ఎక్కువే ఉంటుంది.

ఇటువంటి భయాలేవీ పెట్టకుండ పర్యవేక్షక కమిటీలు, కమిటీల మీద కమిటీలు ఎన్ని ప్రతిపాదించినా - పున్నయ్యగారు చాలా ప్రతిపాదించారు - ప్రయోజనమేమీ ఉండదు. తమ మనసులలో నమ్మకం లేనివారు, విషయం పట్ల సీరియస్‌నెస్ లేనివారు, ఒకరినొకరు పర్యవేక్షించుకొని ఏం సాధిస్తారు?

## ఉద్యమాల ఆవశ్యకత

దళిత, ఆదివాసీ ప్రజల సొంత చొరవనూ, సంఘటిత ఉద్యమాలనూ ప్రోత్సహించడం - లేదా అడ్డం పడకుండా ఉండడం - ప్రభుత్వం ఈ సమస్య పరిష్కారానికి చేయగల ఒక ముఖ్యమైన ఉపకారం. ఆ ఒక్క ఉపకారం ప్రభుత్వం చేస్తే దళితులూ ఆదివాసీలూ తమ హక్కులు తామే కాపాడుకుంటారని నా అభిమతం కాదు. కుల నిర్మూలన ఉద్యమాల ఒత్తిడి ఫలితంగా పుట్టిన చట్టాలనూ వ్యవస్థలనూ అమలు చేయడం, వాటిచేత పని చేయించడం ప్రభుత్వానికి ఉండే ముఖ్య కర్తవ్యం. సామాజిక జీవితంలో కుల పెత్తన సంస్కృతినీ ఆచారాలనూ దెబ్బతీయడం కూడ ప్రభుత్వం కర్తవ్యాలలో ఒకటి. జస్టిస్ పున్నయ్యగారు ఈ రెండు కర్తవ్యాలను దృష్టిలో

పెట్టుకునే పైన ఉదహరించిన సూచనలు చేశారు. ఆ సూచనలలోని లోపాలను వివరంగానే ఎత్తి చూపాము. అయితే ప్రభుత్వం నిర్వర్తించగల ఈ కర్తవ్యాలే కాక బాధితులు ఉద్యమాల ద్వారా పెట్టగల ఒత్తిడి కూడ కుల వివక్షను అంతం చేయడానికి చాలా అవసరం. దీనికి అడ్డం రాకుండ ఉండడం ప్రభుత్వం చేయగల పనులలో ఒకటి.

ఈ విషయంలో ప్రస్తుతం ఉన్న పరిస్థితి చాలా అసంతృప్తికరమైనది. ఆ సంగతి జస్టిస్ పున్నయ్యగారికి చాలా మంది దళిత, ఆదివాసీ ఉద్యమకారులు వివరంగానే చెప్పి ఉంటారు. అయినప్పటికీ ఈ కోణాన్ని వారి నివేదికలో ప్రస్తావించలేదు. దళిత, ఆదివాసీ హక్కుల కోసం కృషిచేసే సంస్థలను ప్రభుత్వ కార్యక్రమాలలో భాగస్వాముల్ని చేయాలని పున్నయ్యగారు అన్నారు గానీ స్వతంత్రంగా ఆ సంస్థలు చేపట్టే ఉద్యమాల ఆవశ్యకతను, అవి ఒకవేళ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగినా వాటిని ప్రభుత్వం గౌరవించవలసిన ఆవశ్యకతను ఆయన తన నివేదికలో ప్రస్తావించకపోవడం ఒక తీవ్రమైన లోపంగానే భావించాలి.

చుండూరు నుండి జీలుగుమిల్లిదాకా మన అనుభవం ఏమిటంటే - దళిత, ఆదివాసీ ఉద్యమాలకు వీలయితే తీవ్రవాదం అని పేరు పెట్టి అణచివేయడం, లేకపోతే అమలుచేసే ఉద్దేశ్యంలేని హామీలిచ్చి చల్లార్చడం, వారు లేవదీసిన సమస్యల పరిష్కారాన్ని సాగదీసి రెచ్చగొట్టి, రెచ్చిపోయిన తరువాత పోలీసులను పెట్టి తన్నించడం - ఈ పాలనా సంస్కృతిని గుర్తించి, ఒక పేరు పెట్టి, దానిని వదులుకొమ్మని ప్రభుత్వానికి నిక్కచ్చిగా చెప్పలేకపోవడం పున్నయ్య కమిషన్ నివేదికలోని ఒక ముఖ్య లోపం.

ఉద్యమించే హక్కు దళితులకూ ఆదివాసులకూ రాజకీయంగా, సామాజికంగా బలాన్ని ఇస్తుంది. వారికి ఆర్థికంగా బలం కల్గించే చర్యలు కూడా అవసరం. అందులో రెండింటిని పున్నయ్యగారు ప్రస్తావించారు. ఒకటి భూమి సమస్య, రెండవది కనీస వేతనాల సమస్య. దళితుల, ఆదివాసుల భూములను సవర్ణ రైతులు ఆక్రమించుకుని ఉన్నట్టయితే వారిని తొలగించి హక్కుదారులకు అప్పగించాలనీ, భూస్వాములూ ధనిక రైతుల అనుభవంలో ఉన్న ప్రభుత్వ భూముల నుండి వారిని తొలగించి దళితులకూ ఆదివాసులకూ ఆ భూములు పంచాలనీ అన్నారు. ఇందులో మొదటిది విజయనగరం నుండి చిత్తూరు దాకా రాష్ట్రం నలుమూలలా ఉన్న సమస్య. ఈ విషయంలో పున్నయ్య కమిషన్ సూచనను రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించి జీవో నెంబర్ 92లో దానికి చోటు కల్పించింది. దళితులకు కాగితం మీద పంచిన భూములను దళితేతరుల ఆక్రమణ నుండి విడిపించడానికి వివిధ జిల్లాలలో ఆందోళన చేస్తున్న ఉద్యమకారులు దీనిని ఉపయోగించుకోవచ్చు.

అయితే మొత్తంగానే రాష్ట్ర ప్రభుత్వం దూకుడుగా ప్రోత్సహిస్తున్న ప్రపంచీకరణ విధానాలు దళితులు, ఆదివాసులు, ఇతర పేదలను ఆర్థికంగానూ సామాజికంగానూ బలహీనపరుస్తున్న విషయం తన పరిధిలోకి రాదని జస్టిస్ పున్నయ్యగారు భావించారో లేక ప్రభుత్వాన్ని విమర్శించడానికి మొహమాటపడ్డారో తెలీదుగానీ చాలా ముఖ్యమైన ఈ విషయం ఆయన నివేదికలో చోటుచేసుకోలేదు.

రెండవదే కారణం అయి ఉండాలి. ఎందుకంటే నివేదిక ముగింపులో ఆయన సంక్షేమ చట్టాలను అమలు చేయవలసిన అధికారుల వైఫల్యాలు, లోపాల వల్ల 'ప్రభుత్వానికి చెడ్డపేరు రావడం దురదృష్టకరం' అన్నారు. 'ప్రభుత్వం' అనే దాని వైఫల్యాలు, లోపాలు తక్కువేమీ కావు కాబట్టి ఇది దురదృష్టకరం కాదుగానీ, ఇతరత్రా తన కర్తవ్యాన్ని అభినందనీయంగా నిర్వహించిన జస్టిస్ పున్నయ్యగారికి ప్రభుత్వం పట్ల 'సాఫ్ట్ కార్నర్' ఉండడం నిజంగా దురదృష్టకరమే.

**మానవ హక్కుల వేదిక బులెటిన్ - 5లో వచ్చిన వ్యాసం**

**ఏప్రిల్ 2002**



పితృస్వామ్యం అనే పెత్తందారీ సంబంధంలో స్త్రీ లైంగికతపైన నియంత్రణ ఒక ముఖ్య విషయం అనేది స్త్రీవాదం బలంగా నిరూపించిన విషయాలలో ఒకటి. అన్ని నాగరికతలలోనూ మగవాడు సార్వత్రికంగా అనుభవించే ఈ పెత్తనానికి గల కారణాల గురించి చాలా విశ్లేషణ జరిగింది. ఆస్తి తనకు పుట్టిన పిల్లలకే దక్కాలన్న కోరిక దగ్గరినుండి, మానసిక అభద్రతదాకా అనేక కారణాలు చర్చకు వచ్చాయి. అయితే హైందవ సమాజానికి వచ్చేసరికి సార్వత్రికమైన ఈ కారణాలకు వర్ణసాంకర్య భయాన్ని కూడా చేర్చాలి. చాతుర్వర్ణం పదిలంగా ఉండడం సంప్రదాయక హైందవ సమాజంలో అన్ని ఆలోచనలకూ తొలి ప్రమాణం. ఆ ఆలోచన రాజనీతి గురించి చేయొచ్చు, కళా సంస్కృతుల గురించి చేయొచ్చు, సుఖసంతోషాల గురించి చేయొచ్చు. దేనికయినా గీటురాయి వర్ణ వ్యవస్థ పదిలంగా ఉండాలన్న ఆరాటం. ఇది ఏక సమయంలో కింది కులాలమీద, స్త్రీలపైన సార్వత్రిక నిర్బంధంగా పనిచేసింది. పాశ్చాత్య దేశాలలో రేస్, జెండర్‌ల మధ్యగల సంబంధానికీ, భారతదేశంలో కులం, జెండర్‌ల మధ్య గల సంబంధానికీ పోలిక తేవడం తరచుగా జరుగుతుంది. అసలే పోలికలేదని కాదు గానీ ఒక బలమైన తేడా ఉంది. కులం, జెండర్‌ల విషయంలో అధికారిక సంస్కృతిని నిర్దేశించే తాత్త్వికమూలం బ్రాహ్మణీయ వర్ణధర్మం. అటువంటి మూలం పాశ్చాత్య సమాజంలో లేదు. భారతీయ సమాజానికి సంబంధించినంతవరకు వర్ణధర్మాన్ని ప్రస్తావించకుండ పురుషస్వామ్యం గురించి మాట్లాడలేము. లైంగిక అణచివేత గురించి మాట్లాడకుండా వర్ణ ఆధిక్యత గురించి మాట్లాడలేము.

**(నిచ్చెన మెట్ల వర్ణ ధర్మం ప్రస్తావన ఎందుకుండదు?)**

**మార్చి 2005**



# విజ్ఞత బోధనాంశం మాత్రమేనా?

యూనివర్సిటీలలో చదువుతున్నవాళ్ళూ, చదువు చెప్పేవాళ్లూ పుష్కలంగా ఉంటారు. చదువుకున్న వాళ్లకు విషయ పరిజ్ఞానమూ విజ్ఞతా రెండూ ఉంటాయని మామూలుగా భావిస్తాం. కానీ తరుచుగా మన యూనివర్సిటీలలో కనపించేది ఏమిటంటే పండితులు అనిపించు కున్నవారికి కూడా ఒక పరిమితమైన పరిధిలో విషయ పరిజ్ఞానం ఉన్నా, విజ్ఞత అసలే ఉండదు. విచారణ జరగకుండా ఎవరినీ శిక్షించడానికి వీలు లేదనేది విషయ పరిజ్ఞానం ఉన్నా, విజ్ఞత ఉన్నా సులభంగానే అర్థం కావలసిన విషయం. ఆధునిక రాజ్యాంగాలలో అదొక అనుల్లంఘ నీయమైన సూత్రం కాగా, చాలా ప్రాచీన కాలంనుండి అది మానవ నాగరికత ఎరిగిన విలువ. అవి రెండూ తెలియని హైదరాబాద్ విశ్వ విద్యాలయం పాలనాధికారులు పదిమంది విద్యార్థులను జనవరి 10వ తేదీన క్యాంపస్‌లో జరిగిన అల్లరి పర్యవసానంగా విశ్వవిద్యాలయం నుండి తొలగించారు. ఆ పదిమందీ రీసెర్చ్ స్కాలర్లు. ఈ దశలో ఒక యూనివర్సిటీ వాళ్ళను రస్టికేట్ చేస్తే వేరే ఏ యూనివర్సిటీ లోనూ వాళ్ళకు తమ పరిశోధన కొనసాగించే అవకాశం ఉండదు. అంటే వారు జీవితాంతం పి.హెచ్.డి పట్టా లేకుండానే ఉండిపోవాలి. విద్యారంగంలో వారికది చాలా తీవ్రమైన శిక్ష.

ఇంత పెద్ద శిక్ష ఏ విచారణా లేకుండా విధించగల హైదరాబాద్ విశ్వ విద్యాలయం పాలకవర్గాన్ని ఏమనాలి? పైగా విచారణ ఎందుకు జరపలేదని ప్రశ్నిస్తే, వెంటనే చర్య తీసుకోకపోతే క్యాంపస్‌లో తీవ్ర వ్యతిరేకత వచ్చి ఉండేదని అంటున్నారు. రేపు ఈ ప్రొఫెసర్లలో ఒకరి మీద డిపార్ట్‌మెంట్ పైసలు తిన్నాడన్న ఆరోపణ పెట్టి 'వెంటనే' చర్య తీసుకోకపోతే సమాజంలో 'తీవ్ర

వ్యతిరేకత రాగలదు' అని చెప్పి ఏ విచారణా జరపకుండా బర్తరఫ్ చేస్తే ఊరుకుంటారా? సహజ న్యాయసూత్రాలకు విఘాతం కలిగిందని సుప్రీంకోర్టు దాకా పోయి రచ్చ చేయరా? చేస్తారు. వాళ్ళకు విషయ పరిజ్ఞానం లేదన్నది నిజం కాదు. దేనిని ఎవరికి వర్తింపచేయాలన్న విషయంలో వారికి కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. 'అపాత్రదానం' కూడదన్న బ్రాహ్మణీయ విలువను వారు ప్రాథమిక హక్కులకూ సహజ న్యాయసూత్రాలకూ కూడా వర్తింపజేస్తారు. ఇంక విజ్ఞత విషయానికొద్దాం. ఈ చర్చ కేవలం విచారణ జరపకుండా శిక్ష వేయవచ్చునా అన్న సహజ న్యాయ సూత్రం దగ్గర ఆగిపోదు. ఆ 10 మంది చేసిన తప్పుకు - అది తప్పనే ఒప్పుకుందాం - అంత కఠినమైన శిక్ష వేయతగునా అన్న ప్రశ్న కూడా ఇప్పుడు వేసుకుందాం. సామాజిక విషయాలలో పైకి కనిపించేదే పూర్తి సత్యం కాదనీ, పైకి కనిపించని పార్శ్వాలూ ఉంటాయనీ, మనుషులకు విషయాల గురించి ఉండే అభిప్రాయాలు కొంతవరకు ఆ విషయాల స్వభావాన్నీ కొంతవరకు ఆ చూసేవారి దృక్కోణాన్నీ ప్రతిఫలిస్తాయని, ఈ దృక్కోణాల వెనుక బలమైన సామాజిక శక్తులూ ప్రయోజనాలూ పని చేస్తాయనీ గుర్తించడం సామాజిక పరిశోధనకు పునాదిప్రాయమైన విషయం. పైకి సత్యాలుగా కనిపించే విషయాలనూ, నిష్కపటంగా ధ్వనించే అభిప్రాయాలనూ సందేహించడం నేర్చుకున్నప్పుడే సామాజిక శాస్త్రం ప్రారంభ మయ్యింది. హైదరాబాద్ విశ్వవిద్యాలయంతో సహా అన్ని పరిశోధనా కేంద్రాలలోని సామాజిక శాస్త్రవేత్తలూ ఈ సందేహంతోనే - కనీసం పరిశోధనలు చేసేటప్పుడు - ప్రపంచాన్ని చూస్తారు. అయితే ఇది బయటి ప్రపంచానికే తప్ప తమ క్యాంపస్‌కు వర్తించదని వారనుకుంటున్నారేమోనని ఇప్పుడు సందేహించాల్సి వస్తున్నది. ఎక్కడో జరిగే అల్లర్లను కేవలం హింసగా కాక ఒక సామాజిక విషయంగా చూసి, చూడడం విద్యార్థులకు నేర్పి, పరిశోధనా గ్రంథాలు రాయగల సామాజిక శాస్త్రవేత్తలు కొలువుతీరి ఉన్న విశ్వవిద్యాలయం తన విద్యార్థులు చేసిన హింసను క్షమించరాని నేరంగా భావించి విచారణ కూడ అక్కరలేకుండ రస్టికేట్ చేసేయడాన్ని ఇంకొక రకంగా అర్థం చేసుకోలేము.

ఇదంతా యూనివర్సిటీ అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ అరాచక చర్యలను సమర్థించడానికి ప్రయోగిస్తున్న కుతర్కం అని భావించేవారు ఉంటారు. అల్లర్లకూ హింసకూ ఉండే మూలాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం సంఘ వ్యతిరేక స్వభావం గల కుతర్కమేనన్న అనుమానం చాలామందిలో ఉంది. దీనిని ముఖాముఖి ఎదుర్కొన వలసిన అవసరం ఉంది. ఇది ప్రాథమికంగా అన్యాయమైన అభియోగమే అయినప్పటికీ ఇందులో అప్పుడప్పుడు కొంచెం సత్యం ఉంది కాబట్టే, ఆ సత్యాన్ని

చూడడానికి ప్రజాతంత్రవాదులు సిద్ధంగా లేరు కాబట్టే, ఆ అభియోగంతో ముఖాముఖి తలపడలేక పోతున్నారు. పీడనకు గురయ్యేవారు చేసే తప్పిదాలను దాని మూలాల కారణంగా ఎప్పుడు సమర్థించవచ్చును, సమర్థించకపోయినా ఎప్పుడు సానుభూతితో చూడవచ్చును, ఎప్పుడు నిర్మొహమాటంగా వ్యతిరేకించాలి అన్న విచక్షణను ప్రజాతంత్ర ప్రాపంచిక దృక్పథం నేర్చుకోలేదు. నేర్చుకోవడానికి సిద్ధంగానూ లేదు. పీడనకు గురయ్యే సామాజిక వర్గాల వారు కూడా ఆ మూలం పేరు చెప్పి తమ తప్పులను గానీ బాధ్యతారహితమైన ప్రవర్తనను గానీ సమర్థించుకోవడం ఎప్పుడు సబబు, ఎప్పుడు అనైతికం అన్న విచక్షణను అన్ని సందర్భాలలోనూ పాటించడం లేదు. ఇది ఒక్క దళితవర్గాలలోనే కాదు, అన్ని పీడిత ప్రజా ఉద్యమాలలోనూ తరచుగా తలెత్తుతున్న వైఖరి. ఈ బలహీనత గురించి మాట్లాడుకోలేకపోవడం, దానికొక పేరు పెట్టలేకపోవడం ఒక పక్కనున్న సమస్యకాగా దానినే మొత్తం చేసి చూపించడం రెండవ పక్కనుండి వస్తున్న ఒత్తిడి. ఆ ఒత్తిడికి ఎట్టి పరిస్థితిలోనూ లొంగడానికి వీలులేదు. హైదరాబాద్ విశ్వవిద్యాలయంలోని సమస్య విద్యార్థుల మెస్ నిర్వహణ దగ్గర మొదలయింది. చీఫ్ వార్డెన్‌గా వచ్చిన 'ఒక చంద్రబాబునాయుడు' (ఒక కమ్మ కులస్తుడు) మెస్ కొనుగోళ్ళను కాంట్రాక్టర్‌కు ఇవ్వాలని ప్రతిపాదించాడు. దానిని విద్యార్థులు, ముఖ్యంగా దళిత విద్యార్థులు వ్యతిరేకించారు. దానివలన ఇప్పటికే వేగంగా పెరుగుతున్న మెస్ బిల్ మరింత పెరుగుతుందని వారి ఆందోళన. వారి ఆందోళన అది కాదనీ, ఇప్పటిదాకా మెస్ నిర్వహణ చూసుకుంటున్న దళిత విద్యార్థులు కొనుగోళ్ల పేరిట కొంచెం మిగుల్చుకుంటున్నారనీ, ఆ అవకాశం పోతుందని వారు ఆందోళన చెందుతున్నారనీ ఒక జవాబు. అయితే 'మిగుల్చుకోవడం' ఎవరు నిర్వహణ చేపట్టినా జరిగేదేననీ, అంతేకాక ఆ మాత్రం అవకాశం ఉండబట్టే పెరుగుతున్న మెస్ బిల్లులకు దళిత విద్యార్థులు తట్టుకోగలుగుతున్నారనీ దీనికి సమాధానం. నిజానికి రాబోయే కాంట్రాక్టర్ 'మిగుల్చు'కోడా? అయితే దానిని అవినీతి అనరు, 'మార్జిన్' పెంచుకునే బిజినెస్ నైపుణ్యం అంటారు. దళిత విద్యార్థుల మీద ఈ విషయంలో వేస్తున్న అభియోగం నిజమైతే మనం దాని గురించి ఎందుకు మాట్లాడుకోకూడదు? ఒకవేళ ఆ బలహీనత పట్ల - అది నిజమయితే - సానుభూతి చూపించగలిగినా, ఎందుకు మాట్లాడుకోకూడదు? ఆ బలహీనతకు లొంగడం వల్ల అధిక మెస్ బిల్లుల సమస్య ఒక రాజకీయ సమస్య కాకుండా పోవడం, ఒక ఉద్యమ అంశం కాకుండా పోవడం విచారకరమనైనా ఎందుకు అనకూడదు?

ఇక్కడిదాకా 'మీ వాళ్ళలోనూ లోపాలున్నాయి' అనడానికి ప్రత్యర్థులకు కొంత అవకాశం ఉందిగానీ వార్డెన్ రత్నంతో చీఫ్ వార్డెన్ వ్యవహరించిన వైనం కుల

అహంకారానికి పరాకాష్ట. దళితుడయిన రత్నం మెస్ కొనుగోళ్ళ ప్రైవేటీకరణ ప్రతిపాదనను వ్యతిరేకించారు. అంటే చీఫ్ వార్డెన్ విధానాన్ని వ్యతిరేకించారు. అందులో ఆయనకేదో స్వార్థముందన్న అభియోగం సహితం లేదు. అయితే ఈ వ్యతిరేకత నేపథ్యంలో చీఫ్ వార్డెన్ అతని అధికారాలు కత్తిరించి, మెస్‌లో పారిశుధ్యం వంటివి ఆయనను చూసుకొమ్మని చెప్పి ఆర్థిక వ్యవహారాలు ఒక బ్రాహ్మణుడికి అప్పగించాడు. అంటే పాకీపని నువ్వు చేయి, కరణీకం మావాడు చేస్తాడు అన్నాడు. ఏ యూనివర్సిటీ లోనూ ఎప్పుడూ జరగని ఈ 'పని విభజన' ఎవరికైనా అసహ్యామే కాక ఆశ్చర్యం కూడా కలిగించ వచ్చు. 'ఉన్నత విద్యాసంస్థల' అంతర్గత సంస్కృతితో చాలామందికి పరిచయం లేదు కాబట్టే అటువంటి సంభ్రమం కలుగుతుంది. రత్నంకు జరిగిన ఈ అవమానానికి దళిత విద్యార్థులు స్పందించటం సహజం. తాము క్యాంపస్‌లో అడుగు పెట్టిన నాటినుండి విభిన్న రూపాలలో అనుభవించిన అవమానాన్ని అందులో చూసుకోవడం సహజం. ఈ అవమానాలు తక్కువని ఎవరైనా అనుకుంటే పొరపాటు. తెలుగు మీడియంలో ప్రభుత్వ కాలేజీలో డిగ్రీ చదువుకుని ఒక్కసారిగా హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో పి.జి. కోర్సులో అడుగు పెట్టిన దళితేతర విద్యార్థులు సైతం తొలి రోజులలో తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకోవడానికి కష్టపడాలి. తమ కుటుంబాలలో మొదటితరం విద్యావంతులయిన దళిత విద్యార్థులకు అది మరీ కష్టం. పైగా రిజర్వేషన్‌ల పుణ్యాన అర్హత లేని చోటికి చేరిన అసమర్థులు అనే హేళన వారికి నిత్యం ఎదురవుతూ ఉంటుంది. సైన్స్ శాఖలలో - తమ గురించి తాము గొప్ప 'ప్రతిభావంతులమ'నుకునేవారు విర్రవీగే డిపార్ట్‌మెంట్లలో - ఇది మరీ ఎక్కువ. మొన్న రస్టికేట్ అయిన విద్యార్థులు అధికభాగం సైన్స్ డిపార్ట్‌మెంట్లకు చెందినవారే.

మొత్తానికి అన్ని కారణాలూ కలిసి దళిత విద్యార్థులకు కోపం వచ్చింది. మెస్ కొనుగోళ్ళ పాలసీ విషయమై చీఫ్ వార్డెన్‌తో మాట్లాడడానికి వెళ్లిన వాళ్లు అదుపు తప్పి అడ్డమొచ్చిన వాళ్ళను కొట్టారు. వారి చేతుల్లో దెబ్బలు తిన్న లెక్చరర్ రాజశేఖర్ కూడా దళితుడే కావడం, రాష్ట్ర ఎస్.సి, ఎస్.టి ఉద్యోగుల సంఘం క్యాంపస్ శాఖ వారిపైన క్రమశిక్షణ చర్య తీసుకోవాలని పట్టుబట్టడం, దళిత విద్యార్థులకు వేరే సందర్భంలో వచ్చి ఉండగల సానుభూతిని తగ్గించింది. క్యాంపస్‌లో పెత్తందారీ కులాలకు ఈ పరిస్థితి చాలా బలాన్ని ఇచ్చింది. హింసకు పాల్పడిన అంబేద్కర్ విద్యార్థి సంఘం సభ్యులకు తగిన బుద్ధి చెప్పాలనీ, క్యాంపస్ నుండి వారిని బహిష్కరించడం తప్ప వేరే మార్గం లేదనీ గొడవ చేసారు. అంబేద్కర్ విద్యార్థి సంఘం సభ్యులు గతంలో కూడా ఎవరితోనైనా ఘర్షణకు దిగినప్పుడు చాలాసార్లు కొట్టడం

జరిగిందనీ, ఆ కోపమంతా ఇప్పుడు బయల్పడిందనీ సానుభూతిపరులు సహితం అనసాగారు. రాజకీయ హింసపై పెద్దగా అభ్యంతరం లేనివారు సహితం వారి దౌర్జన్యకరమైన గత చరిత్ర ఇప్పుడు సానుభూతి లేకుండా చేసిందని అన్నారు.

దళిత విద్యార్థులు బలప్రయోగాన్ని ఒక అలవాటుగా మలుచుకున్నది నిజమే అయితే దాని వెనకనున్న నిరసనను అర్థం చేసుకోగలం. అయినప్పటికీ ఆ అలవాటును విమర్శించగలగాలి. ఒక తప్పును అర్థం చేసుకునేటప్పుడు కార్యకారణ సంబంధాలను మాత్రమే చూస్తాం. దానిని రాజకీయంగా విశ్లేషించేటప్పుడు దీర్ఘకాల పర్యవసానాలనూ సామాజిక పరిణామానికి అది చేయగల చేటునూ కూడా చూస్తాం. చూడడానికి సిద్ధంగా లేకపోవడం తాత్కాలికంగా ఎంత గొప్ప వైఖరిగా అనిపించినా దీర్ఘకాలంలో పీడిత ప్రజలకే నష్టం చేస్తుంది.

తాము ఒక రస్టికేషన్ ఆర్డర్‌తో తెర దించివేయాలనుకున్న ఘటనకు ఇన్ని కోణాలు ఉన్నాయని ప్రముఖ మేధావులయిన హైదరాబాద్ విశ్వవిద్యాలయం పాలకవర్గం చూడలేకపోవచ్చు. లేదా చూడగలరు కాబట్టే తొందరగా తెర దించేద్దామనుకున్నారో!

ఏదైనా, ఇంత సంక్లిష్టమైన సమస్యకు రస్టికేషన్ ఏ రకంగానూ న్యాయమైన జవాబు కాదు. విచారణ సహితం జరపని రస్టికేషన్ అసలే కాదు. ఏమైనా నిజాయితీ ఉన్నట్లయితే ఆ విశ్వవిద్యాలయం పెద్దలు తమ క్యాంపస్‌ను సంస్కరించుకోవాలి. దళిత విద్యార్థులకు శత్రు దేశంలో సంచరిస్తున్నామన్న అనుభూతి కలగని స్నేహ వాతావరణం కల్పించాలి. ఇటు ఉద్యమకారులూ పీడిత ప్రజల శ్రేయోభిలాషులూ పీడన నుండి పుట్టిన నిరసన తీసుకునే అన్ని రూపాలనూ అర్థం చేసుకునే దగ్గర ఆగిపోకుండా, పీడనను అంతం చేసే దిశగా ప్రజలు నడవడానికి అవసరమైన విమర్శలను, సలహాలనూ నిర్మొహమాటంగా అందియ్యడానికి సిద్ధపడాలి. ముందుగా పదిమంది దళిత విద్యార్థుల రస్టికేషన్‌ను ఎత్తి వేయించడానికి అందరూ కలిసి పని చేయాలి.

**ఆంధ్రజ్యోతి దినపత్రిక**

**23 ఫిబ్రవరి 2002**



# తోలాపిలో కుల నిర్మూలన

మొన్న ఒక మూడు రోజులు హైద్రాబాద్‌లో ప్రభుత్వ ప్రతినిధులకూ పీపుల్స్ వార్ ప్రతినిధులకూ మధ్య జరిగిన 'విధి విధానాల' చర్చలలో ప్రభుత్వం తరఫున పాల్గొన్న ఇద్దరిలో ఒకరైన తమ్మినేని సీతారాం గురించి శ్రీకాకుళం బయట పెద్దగా తెలీదు.

శ్రీకాకుళంకు పది కిలోమీటర్ల దూరాన ఆముదాలవలస అనే ఊరుంది. ఆ ఊరి నుండి పార్వతీపురం పోయే రహదారి మీద తమ్మినేని సీతారాం కొత్తగా కట్టుకున్న భవంతిని చూస్తే అతని గురించి కొంచెం తెలుస్తుంది.

అటువంటి భవంతులు హైదరాబాద్‌లోని బంజారాహిల్స్‌లో సైతం రెండు మూడు కంటె ఎక్కువ ఉండవు. ఇక్కడ ఎబ్బెట్టుగా కనిపించనిది ఆముదాలవలసలో ఎబ్బెట్టుగా కనిపించగలదని కొత్తగా కోట్లు గడించిన బాపతు మనుషులకు తోచదు. కానీ పీపుల్స్‌వార్‌తో చర్చలకు తెరపడిందని తెలియగానే 'ఆముదాల వలసలో తమ్మినేని బంగళాను నక్సలైట్లు పేల్చేసారంట' అన్న వదంతి శ్రీకాకుళంలో శరవేగంగా వ్యాపించడాన్ని బట్టి చూస్తే ప్రజలకది బాగా ఎబ్బెట్టుగా కనిపించిందని అర్థం అవుతుంది.

తమ్మినేని సీతారాంది పొందూరు మండలం. అదే మండలంలో అతని స్వగ్రామానికి సమీపంలోని తోలాపి అనే ఊరిలో అతని బంధువర్గం జూలై 15న దళితులపైన జరిపిన అమానుషమైన దాడిని చూస్తే మరికొన్ని విషయాలు అర్థం అవుతాయి.

తోలాపిలో కాళింగులు దాదాపు 2000 మంది ఉన్నారని అంచనా. కాళింగులు 'సామాజికంగా, విద్యాపరంగా' వెనుకబడి ఉన్న కారణంగా బి.సి కులాల జాబితాలో ఉన్నారు. అయితే ఆ జిల్లాలో

బ్రాహ్మణేతర కులాలలో ప్రధాన పెత్తందారీ కులం కాళింగులే. భూమి యాజమాన్యం లోనూ, వర్తక వ్యాపారాలలోనూ, రాజకీయాలలోనూ వారిదే పైచేయి. గుంపును పోగుచేసి గూండాయిజం కూడా బాగానే చేయగలరు.

కులవివక్ష, అంటరానితనం పోగొడతామంటూ చంద్రబాబు, ఆయన కేబినెట్ మంత్రులూ ఆ మధ్య కొంత అల్లరి చేసిన సంగతి జ్ఞాపకం ఉంది కదూ? చంద్రబాబు ఈ కార్యక్రమాన్ని తన స్వంత ఊరి పరిసర గ్రామాలలో చేపట్టకుండ జాగ్రత్త పడినట్టే అతని మంత్రులు కూడ వారి వారి స్వంత ప్రాంతాలలో జాగ్రత్త పడినట్టున్నారు.

కాబట్టి తమ్మినేని సీతారాంగారు తన పక్క ఊరయిన తోలాపిలో అంటరాని తనం పోగొట్టే ప్రయత్నమేం చేపట్టలేదు. ఆ ఊరి టీ షాపులలో రెండు గ్లాసుల 'వ్యవస్థ' ఉంది. చాకలి, మంగలి కులస్తులు దళితులకు తమ సేవలు విక్రయించని అవ్యవస్థా ఉంది. ఆ మధ్య జన్మభూమి కార్యక్రమం ఆ ఊరిలో జరిగినప్పుడు సిపిఐ(ఎం)వారి కులవివక్ష వ్యతిరేక సంఘం సహాయంతో తోలాపి దళితులు తాము అనుభవిస్తున్న అవమానకరమైన స్థితి గురించి అధికారులను నిలదీసారు. విడిగా అర్జీలు సమర్పిస్తే ఏమయ్యేదోగానీ, జన్మభూమి కార్యక్రమంలో భాగంగా నిలదీసే సరికి అధికార్లు కొంచెం చలించారు.

ఆ విధంగా మొదలయిన ఆందోళన చర్చలకు దారి తీసింది. చాకలి, మంగలి కులస్తులంతా వారానికి ఒక రోజు దళితుల పనులు చేసేటట్టు ఒప్పందం జరిగింది. ఆ ఒక్క రోజును మంగళవారంగా ఎంచుకోవడం వెనుక వెక్కిరింత ఉండి ఉండవచ్చును. ఎందుకంటే మంగలి కులస్తుల కులాచారం ప్రకారం మంగళవారంనాడు క్షవరం చేయరు.

నిజానికి తోలాపిలో చాకలి, మంగలి కులాల ఇళ్లు దళితుల ఇళ్ళను ఆనుకునే ఉన్నాయి. కాళింగులు కోపం చేసుకుంటారన్న భయం వల్ల తప్ప దళితుల పనులు చేయకూడదని తమకేమీ లేదని వారంటున్నారు. కేవలం 200 మంది ఉన్న దళితులు 2000 మంది ఉన్న బలమైన సవర్ణ కులంతో తలపడడం సాహసమే. అయినా సాహసం చేసి సాధించారని అందరూ అనుకున్నారు.

జూలై 16 (మంగళవారం) నుండి ఒప్పందం అమలు కావలసి ఉండింది. 15వ తేదీ పొద్దున్న కొన్ని వందల మంది కాళింగులు తోలాపి దళితవాడ మీద దాడి చేసారు. కులవివక్షతో సంబంధం లేని ఒక భూవివాదాన్ని ఆసరా చేసుకుని దాడి చేసారు. దళితులలో కీళ్లు భద్రంగా ఉన్నవారు పారిపోగా మిగిలిన వాళ్లు బాగా

దెబ్బలు తిన్నారు. ఆ ఊరిలో ఉన్న 40 దళిత కుటుంబాల ఇళ్ళూ ధ్వంసం అయ్యాయి. ఇంటి కప్పులు పీకి పెంకులు ధ్వంసం చేసారు. ఇళ్ళలోని వంట సామగ్రిని చితకపొడిచి ఎందుకూ పనికిరాకుండా చేశారు. ఒకరిద్దరి దగ్గరున్న టీవీలను తూట్లు పొడిచారు. ఒక ఆవును కూడా చంపారు. బహుశా దళితుని గోవు పవిత్ర జంతువు కాదేమో. తిండి గింజలు, ఇతర వస్తువులు లూటీ చేసారు. దహనం చేసారు. జూలై 15 పొద్దున్న 8 గంటలనుండి మధ్యాహ్నం 12 గంటలదాకా కాళింగుల స్వైర విహారం జరిగింది.

తన కులం వారు, తన ప్రాంతం వారు, తన బంధువులు చేసిన ఈ దారుణాన్ని తమ్మినేని సీతారాం ఖండించలేదని నేను మీకు చెప్పనవసరం లేదు. ఆ ఊరికి పోయి వారిని కోప్పడి బుద్ధిచెప్పలేదని అసలే చెప్పనవసరం లేదు. అయితే దుండగులను వెనక ఉండి ప్రోత్సహించిన పెద్దమనుషులు మాత్రం తమ్మినేని సీతారాం పేరు చెప్పి పోలీసులను ఆమడ దూరం ఉంచగలిగారని చెప్పాలి.

నెలాఖరు దాకా కూడా తోలాపి దళితులలోని యువకులెవ్వరూ గ్రామానికి తిరిగి రాలేదు. మామూలుగా ఒక నేరం జరిగినప్పుడు నేరస్తుడు పరారీలో ఉంటాడు. బాధితులు ధైర్యంగా ఇంట్లో ఉండి అందరి సానుభూతీ పొందుతారు. కానీ కారంచేడు నుండి ఇప్పటిదాకా దళితులపైన దాడి జరిగిన ప్రతీ సంఘటనలోనూ బాధితులు పరారీలో ఉండడం, నేరస్తులు కాలర్ ఎగరేసుకుని ఊరిలో తిరగడం చూస్తున్నాం. తోలాపి అందుకు మినహాయింపు కాదు.

పొందూరు తమ్మినేని సీతారాం స్వంత మండలమే కాదు, స్పీకర్ ప్రతిభా భారతి స్వంత మండలం కూడ. ఆమె స్వస్థలం తోలాపికి దగ్గరే. అయితే 'మీ మీద జరిగిన దాడి గురించి ప్రతిభా భారతి గారికి చెప్పలేదా' అని తోలాపి దళితులను అడిగితే, 'చెప్తే ఇంక ఆరు నెలలు ఆమె జిల్లాకే రాదు. చెప్పకపోతే వేరే పనులమీదయినా వచ్చి పోతుందేమోనని చెప్పలేదు' అని వారి జవాబు!

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**4 ఆగస్టు 2002**



# బందిపోటు దొంగలు - హక్కులు

బందిపోటు దొంగలకు కూడ హక్కులు ఉంటాయా? వాళ్ళ హక్కుల గురించి మాట్లాడేహక్కు ఇతరులకు ఉంటుందా? ప్రశ్నను ఈ రకంగా వేసుకుంటే జవాబును ఒక కోణం నుంచి అన్వేషిస్తాము. బందిపోటు అంటే భారత శిక్షాస్మృతి డెకాయిటీ అనే నేరంగా నిర్వచించిన దానికి పాల్పడిన వ్యక్తి. ఆ నిర్వచనంలో సామాజిక అంశం లేదు. ఆ వ్యక్తికి కూడా హక్కులుంటాయా అనే ప్రశ్నకు జవాబు సార్వజనీనమైన హక్కుల పరిభాషలో చెప్పుకోవచ్చు.

కానీ నిజానికి బందిపోటు అనేది సామాజిక అంశం లేని విషయం కాదు. బహుశా ఎక్కడా కాదేమో. మన రాష్ట్రంలో మాత్రం అసలు కాదు. ఒక్కొక్క జిల్లాలో, ఒక్కొక్క ప్రాంతంలో బందిపోటు అనగానే కళ్లముందు మెదిలే రూపానికి ఒక కులం ఉంటుంది. కొన్ని చోట్ల ఆ రూపానిది వడ్డెర కులం, కొన్ని చోట్ల బోయ కులం, కొన్నిచోట్ల తెలగపాముల కులం, కొన్ని చోట్ల మరాఠీ మాట్లాడే పార్థీ కులం...

అప్పుడు బందిపోటు దొంగలకు కూడ హక్కులుంటాయా? అనే ప్రశ్నకు అర్థం వేరే ఉంటుంది. మొదటి అర్థం పూర్తిగా పక్కకు పోదు, దాని సరసన ఇంకొక అర్థం కూడ వచ్చి చేరుతుంది.

ఇంకొక అర్థం కాదు, ఇంక రెండు అర్థాలు. ఒకటి, ఏ వనరుల మీదా హక్కులు లేకుండ చేసి కూలి చేసుకునో బస్సులు దోచుకునో బతకండి అని సమాజం ఒక మూలకు నెట్టేసిన వారిలో కొందరు రెండవ ప్రత్యామ్నాయాన్ని ఎంచుకుంటే, వారు 'బందిపోట్లు' కాబట్టి వాళ్లకు హక్కులుండవనడం ఏ రకమైన న్యాయం అనే జవాబుకు దారి తీస్తుంది.

బ్రిటిష్ హయాంలో కొన్ని కులాలను, తెగలను మొత్తంగానే నేర స్వభావం గల జాతులుగా ప్రకటించే చట్టం ఉండింది. నేర స్వభావం జన్యు లక్షణమని ఎంతటి మూర్ఖులూ అనరు కాబట్టి మొత్తంగానే ఒక కులాన్ని లేక తెగను నేరస్తులుగా ప్రకటించాలని పాలకులకు - ఎంతటి పరాయి పాలకులయినా కానియ్యండి - తోచిందంటే ఆ ప్రజలను ఆ స్థితికి నెట్టిన చారిత్రక క్రమం ఒకటి ఉండి ఉండాలి. యానాదులు, ఎరుకల గురించి వెన్నెలకంటి రాఘవయ్య వంటివారు ఒకనాడు చేసిన పరిశోధన తరువాత, దానికి కొనసాగింపుగానయినా ఎవరైనా ఏమైనా చేసారో లేదో తెలీదు. ఇప్పటికి చేయకపోతే ఇక మీదట చేసే అవకాశమూ ఎక్కువ లేదు. ఎందుకంటే దొంగతనాలు - అందులోనూ చాలా క్రూరమైన డెకాయిటీలు - చేసేవారి పట్ల 'సెంటిమెంటల్'గా ఆలోచించే ఓపిక ఇప్పుడెవరికీ లేదు. కాని ఎక్కువ పరిశోధన అవసరం లేకుండానే ఈ ప్రజల గురించి కొన్ని విషయాలు చెప్పవచ్చు. వీరికి భూమితో సహా ఏ సహజవనరులపైనా యాజమాన్య హక్కు ఎంత మాత్రం ఉండదు. చాతుర్వర్ణంలో అంటరాని వారు కాకపోయినప్పటికీ దళితుల కంటే వీరినే దూరంగా ఉంచుతారు. వీరి ఆచారాలూ అలవాట్లూ చుట్టుపక్కల ఉన్న సమాజం కంటే భిన్నంగా ఉంటాయి. ఒక్కోసారి వేరే భాష కూడ మాట్లాడతారు. ఎవ్వరూ తినని లేక ఎన్నడో తినడం మానేసిన జంతువులను వేటాడి తింటారు.

ఈ ప్రజలలో మెజారిటీ ఎన్నడూ దొంగలయి ఉండే అవకాశం లేదు గానీ, 'మనం దొంగతనాలు చేస్తే పోలీసులు, లాయర్లు బాగుపడతారు తప్ప దొంగతనాలు చేసి బాగుపడ్డ వాడెవడూ లేడని' గ్రహించే కొద్దీ దొంగతనాలు చేసేవారి సంఖ్య తగ్గిపోతున్నది.

కానీ ఈ కులాలు లేక తెగలలో అందరినీ దొంగలుగా భావించి వేధించే 'నేర పరిశోధన' పద్ధతి పోలీసులు వదులుకోకపోవడం వల్ల సాధారణ జీవితం వీరికి సులభం కాదు. కూలీ చేసుకుంటే చేసుకోవచ్చును గానీ చిన్నా చితకా వ్యాపారాలు చేసుకుంటామంటే నమ్మి సరుకులు అప్పు పెట్టేవాడెవడు? ఆరు నెలలకొకసారి రెండో నాలుగో వారాలు పోలీస్‌స్టేషన్‌లో గడిపి వచ్చే వాళ్లకు అడ్డామీద కూలీల బతుకు తప్ప ఉద్యోగాలు ఎక్కడ దొరుకుతాయి?

ఈ కులాలు, తెగల కోసం ప్రభుత్వం సంక్షేమ చట్టాలు, వ్యవస్థలు రూపొందించకపోలేదు. ఎటొచ్చీ అవి ఈ ప్రజల దగ్గరకు రాలేదు. ప్రకాశం, నెల్లూరు, (కొంతవరకు చిత్తూరు) జిల్లాలలోని మెట్ట ప్రాంతాలలో బతికే యానాదులనే ఉదాహరణగా తీసుకోవచ్చును. చట్టం వీరిని షెడ్యూల్డు తెగగా గుర్తించింది. వీరికి ఉద్యోగాలలోనూ, విద్యాలయాలలోనూ రిజర్వేషన్లు కల్పించింది. ప్రత్యేక

విద్యాలయాలు, హాస్టళ్ళు, శిక్షణా కేంద్రాలు నెలకొల్పింది. సాంఘిక సంక్షేమ శాఖను అడిగితే ఇవన్నీ ఏకరవు పెడతారు.

కానీ వాళ్ల గ్రామాలకు పోయి చూస్తే వీటి ఛాయలు సహితం కనిపించవు. యానాదుల దగ్గరికి సాంఘిక సంక్షేమ శాఖ ఎన్నడూ పోదు. పోలీసులు మాత్రమే పోతారు. వాళ్లకు ఇళ్ల స్థలాలున్నాయో లేదో కనుక్కోవడానికి రెవెన్యూ సిబ్బంది ఎన్నడూ పోరు. వాళ్ల ఇళ్లను సోదా చేయడానికి పోలీసులు పోతారు.

డ్యూటీ చేయడంలో ఏ ప్రభుత్వ శాఖకూ లేని ఉత్సాహం పోలీసు శాఖకు మాత్రం ఎక్కడినుండి వచ్చిందా అని సందేహించవద్దు. పోలీసులు చేస్తున్నది డ్యూటీ కాదు. ఒక ఊరి దగ్గర నివసించే యానాదులను పట్టుకుని ఫలాన బస్సు దోపిడీలో నువ్వు దోచుకుని తెచ్చిన సొమ్ము మీ ఊరిలో ఏ రైతుకు అమ్మావో చెప్పు లేదా ఏ రైతు దగ్గర పెట్టావో చెప్పు - అని రోజుల తరబడి నిర్బంధించి వేధిస్తే ఏదో ఒక పేరు చెప్తారు. ఏ పేరు చెప్పాలో కూడ పోలీసులే చెప్తారు. ఆ తరువాత ఆ రైతు దగ్గర పోలీసులు ఆ మొత్తం వసూలు చేసుకుని పేరు చెప్పిన యానాది కులస్తుడి మీద కేసు పెట్టి రిమాండ్ చేయించి స్వామికార్యం, స్వకార్యం సంతృప్తిగా పూర్తి చేసుకుంటుంటారు.

వసూలు చేసుకోవడానికి ఏ రైతూ దొరకకపోయినా, యానాదులే రెండు మూడు వారాల నిర్బంధం గడచిన తరువాత రెండు వేలో మూడు వేలో తీసుకొచ్చి తమ స్వేచ్ఛను కొనుక్కోరా? కొనుక్కుంటారు. ఇటువంటి అవకాశాలున్నచోట ఒక్క పోలీసులేమి, ఏ ప్రభుత్వ శాఖ అయినా ఉత్సాహంగా డ్యూటీ చేస్తుంది.

కానీ ఈ ప్రజలను మొత్తంగానే నేరస్తులుగా చేసే సంస్కృతి పోలీసు వ్యవస్థలో మాత్రమే లేదు. అది సమాజంలో ఏదో ఒక మేరకు ఉండబట్టే పోలీసు వ్యవస్థలో అంతగా స్థిరపడగలిగింది.

దీనిని వాళ్ళు చాలా రకాలుగా అవకాశంగా తీసుకోవచ్చును. 'బందిపోటు' కులానికి చెందిన వ్యక్తి గ్రామ రాజకీయాలలోనో ఆర్థిక జీవితంలోనో మీకు ఎదురు తిరిగాడనుకోండి. అవకాశం చూసి అతని మీద ఒక బస్సు దోపిడీ కేసు పెట్టి నోరు మూయించవచ్చు.

నెల్లూరు జిల్లా వరికుంటపాడు మండలంలో కానిచెరువు అనే ఊరుంది. ఈ మండలంలోని 13 గ్రామాలలోని దాదాపు 300 యానాది కుటుంబాలు గడచిన అయిదారేళ్లుగా పోలీసులనుండి ఈ రకమైన వేధింపులు తీవ్రస్థాయిలో ఎదుర్కుం టున్నారు. అరెస్టు చేస్తే 30 నుండి 50 రోజులకు తక్కువ ఉంచుకోరు. ఊరూరా

తిప్పి చావగొట్టి 'బస్సు కేసులు' ఒప్పిస్తారు. మగవాళ్లను పట్టియ్యమని వారి కుటుంబాల స్త్రీలను పట్టుకుపోయినట్టయితే వారి అగచాట్లు చెప్పతరం కాదు.

రెండు మూడేళ్ల కింద వరమ్మ అనే స్త్రీని నాలుగయిదు పోలీస్ స్టేషన్‌లలో నిర్బంధించి మూకుమ్మడిగా అత్యాచారం చేసిన ఘటన అప్పట్లో చాలా సంచలనం సృష్టించింది. విషయం బయటికొచ్చిన తరువాత జిల్లా కలెక్టరు ఆదరాబాదరాగా ఏదో విచారణ ప్రకటించాడుగానీ ఏమీ జరగలేదు.

ఈ గ్రామాలు ఉదయగిరి తాలూకాలోని సీతారాంపురం అడవుల అంచున ఉన్నాయి. ఇవి నల్లమల అడవులకు కొనసాగింపు. అయితే వర్షాభావ ప్రాంతం కావడం వల్ల అడవి దట్టంగా ఉండదు. చిన్న చిన్న కొండచరియల మీద చిట్టడవుల రూపంలో విస్తరించి ఉంది.

ఆ అడవులలో కుందేళ్లతో మొదలుపెట్టి అన్ని రకాల చిన్న జంతువులనూ వేటాడడం, కట్టెకొట్టి ఊర్లలో అమ్ముకోవడం, బొగ్గు చేయడం, భూములున్న వాళ్ల పొలాలలో కూలీ చేయడం, ఇండ్లల్లో పాచి పని చేయడం, 'అదృష్టం' బాగున్నవాళ్లు హైదరాబాద్ దాకా పోయి బేల్దారిపని చేయడం - ఇదీ వారి జీవనాధారం.

ఆ ఊర్లలో స్కూళ్లు ఎక్కువ కనిపించవు. స్కూలు పిల్లల కోసం గిరిజన సంక్షేమ హాస్టళ్లు కనిపించవు. ప్రత్యేక వృత్తులలో శిక్షణ ఇచ్చే సంస్థలు లేవు. రిజర్వేషన్లు పొంది పెద్ద చదువులు చదువుకున్నవారు లేరు.

ప్రభుత్వం నుండి ఈ ఊర్ల యానాదులకు వచ్చింది ఒక్కటే - ఇళ్ల కాలనీలు. అయితే కానిచెరువు గ్రామంలో అందులోనూ మోసం జరిగింది. ప్రభుత్వం 11 ఇళ్లు మంజూరు చేయగా ఏడు మాత్రం యానాదులు కట్టుకున్నారు. మిగిలిన నాలుగిళ్లు గిరిజనేతర బి.సి కులాల వాళ్లు ఇళ్లు కట్టుకోకుండ కట్టినట్టు రాయించి డబ్బులు తిన్నారు.

ఆ ఊరికి చెందిన యానాది కులస్తుడు సవరం తిరుపాల్ ఈ 'స్కాం'ను బయటికి తీసాడు. గొడవ చేసాడు. కలెక్టర్‌కు అర్జీ పెట్టి, వివిధ సంఘాల వాళ్లకు చెప్పి, పత్రికలలో రాయించి అల్లరి చేసాడు. దీని ఫలితంగా ప్రభుత్వం ఆ ఊరి గిరిజనేతరులు ఆరుగురిపైన క్రిమినల్ కేసుపెట్టి అరెస్టు చేసింది. ఒకరిద్దరు ఉద్యోగులపై చర్య తీసుకుంటున్నట్టు కూడ వినికిడి.

ఈ దుస్సాహసం ఫలితాన్ని తిరుపాల్ ఇప్పుడు అనుభవిస్తున్నారు. ఆరు నెలల కిందనే వరికుంటపాడు ఎస్.ఐ - తిరుపాల్ ఇంటికొచ్చి అతని భార్య వెంకటమ్మతో 'నీ మొగుడి దగ్గర రెండు కేజీల బంగారం, నాలుగు లక్షల రొక్కం వసూలు చేస్తాను'

అని బెదిరించాడు. మొన్నటి అయిదవ తేదీ రాత్రి ఉదయగిరి సి.ఐ గారి 'ఐడీ పార్టీ' పోలీసులు తిరుపాల్‌ను ఇంటి నుండి బలవంతంగా తీసుకుపోయారు. వరికుంటపాడు, ఉదయగిరి స్టేషన్ల మధ్య తిప్పుతూ 'బస్సు కేసులు' ఒప్పించడానికీ, వసూళ్లకోసం ఎవరైనా రైతుల పేర్లు చెప్పించడానికీ చావగొడుతున్నట్టు వినికిడి.

'బందిపోట్ల'కు హక్కులు లేవందామా?

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**15 సెప్టెంబర్ 2002**



# ఆధిపత్య సంక్షేమ సంఘం

కడప జిల్లాలో ఒక 'ఒ.సి. సంక్షేమ సంఘం' ఏర్పడి మండల స్థాయిలో కమిటీలు ఏర్పాటు చేసుకుని దళితులను దబాయించి వర్ధిల్లుతున్న విషయం ఆ జిల్లా వెలుపల చాలామందికి తెలీదు.

నిజానికి ఆ 'సంఘం' రాష్ట్ర స్థాయిలోనే ఉందట. దాని అధ్యక్షుడు మహబూబ్ నగర్‌లో ఉంటాడంట. అయితే కడపలో 'అభివృద్ధి' చెందినంతగా అది వేరే ఎక్కడా చెందలేదు. అగ్రకులాలు తమపైన దాడి చేసారనీ అన్యాయం చేసారనీ దళితులు ఎప్పుడు ఫిర్యాదు చేసినా, ఈ 'ఒ.సి. సంక్షేమ సంఘం' రంగంలోకి దిగి అదంతా అబద్ధమని దబాయించి పోలీసులు కేసు పెట్టకుండ చూసుకుంటుంది. ఆ మేలు చేసి పెడుతున్నందుకు జిల్లాలోని అగ్ర కులాలు వేల రూపాయల చందాలు సేకరించి ఇస్తున్నారంట.

ఏ తప్పుడు పనికైనా ఒక 'మిష' కావాలి. వీరి మిష ఏమిటి? ఎస్.సి., ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టాన్ని దళితులు దుర్వినియోగం చేస్తున్నారనీ, దానికి అమాయకులైన చాలామంది బలి అవుతున్నారనీ, ఆ దుర్వినియోగాన్ని అడ్డుకోవడం కోసం అగ్రకులాలవాళ్లు ఐక్యం కాక తప్పదనీ ఈ సంఘం వాదిస్తున్నది. ఇది అబద్ధమని గ్రహించడానికి ఆ సంఘం అధ్యక్షుడైన శశిధర్ అనే పూజారితో పావుగంట మాట్లాడితే చాలు. 'కులం ప్రాతిపదికన ఇస్తున్న రిజర్వేషన్లు తీసేసి, పేదరికం ప్రాతిపదికన అన్ని కులాల వారికీ ఇవ్వాలి. ఎస్.సి., ఎస్.టి రైతులకు ప్రభుత్వం తన ఖర్చుతో బోర్లు వేయించడం, భూమిలేని వారికి భూములు పంచడం, ఇతర

సహాయ సహకారాలు అందించడం మానుకోవాలి. ఎస్.సి., ఎస్.టి (అత్యాచారాల నిరోధక) చట్టాన్ని పూర్తిగా రద్దు చేయాలి' - ఇవీ వారి డిమాండులు. ఈ డిమాండ్ల వెనుక ఉన్న ప్రచారమేమిటంటే దళితులకు రిజర్వేషన్లు ఇయ్యడం వల్ల 'ప్రతిభావంతు'లయిన అగ్రకులాలవారు అన్యాయంగా నష్టపోతున్నారు. ఎస్.సి, ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టం ప్రతిరోజు దుర్వినియోగానికి గురవుతున్నది. సబ్సిడీలు, ఇళ్ల కాలనీలు, చవక బియ్యం ఇవ్వడం వల్ల ఎస్.సిలు చొరవ కోల్పోయి తాము బాగుపడక పోగా మొత్తంగా రాజకీయ వ్యవస్థను దిగజారుస్తున్నారు.

ఈ అభిప్రాయాలను అగ్రకులాలకు చెందిన నిరుద్యోగ యువకులలోనూ, కరువు పీడిత రైతాంగంలోనూ ప్రచారం చేసి దళితుల పైన వారిలో ద్వేషం రెచ్చగొట్టే కార్యక్రమం ఈ 'సంఘం' పెట్టుకుంది.

అసలే అది కడప జిల్లా. మామూలు పరిస్థితులలోనే దళితులు నోరెత్తడానికి భయపడే జిల్లా. అటువంటి చోట అగ్రకులాల సంఘాలు పెట్టి 'దళితులకే అంతా ఇచ్చేస్తున్నారు' అంటూ రెచ్చగొట్టే కార్యక్రమం పెట్టుకుంటే దళితులు ఇంక పూర్తిగా నోరు నొక్కుకుని బతికే పరిస్థితి వస్తుంది.

పోలీసుల పైన ఒత్తిడి పెట్టడానికి కూడా ఈ 'సంఘం' అగ్రకులాలకు బాగా అక్కరకు వస్తున్నది. దళితుల పైన దాడి జరిగిందన్న ఫిర్యాదు మీద పోలీసులు కేసులు పెట్టేదే తక్కువ, అరెస్టు చేసేది ఇంకా తక్కువ. ఇప్పుడు కడప జిల్లాలో పరిస్థితి ఏమిటంటే ఫిర్యాదు కంటె ముందే 'ఒ.సి. హక్కుల సంఘం' పోలీస్ స్టేషన్‌కు పోయి 'అంతా అబద్ధం' అంటూ ధర్నాలు, ప్రదర్శనలు మొదలుపెడుతుంది. పని చేయదలుచుకోని పోలీసు యంత్రాంగానికి అంతకన్న ఏమి కావాలి?

చాలా నష్టకరమైన ఈ పరిణామాన్ని ఎదుర్కొనడానికి ఆ జిల్లాలో దళిత ఉద్యమం గానీ, ప్రజాతంత్ర ఉద్యమం గానీ సిద్ధంగా లేదు. కనీసం వారు చేస్తున్న విష ప్రచారానికి ఎదురు ప్రచారం చేసే ఒక గొంతు కూడ లేదు.

మామూలుగా కరువు గురించి, ప్రాజెక్టుల గురించి, ఇతర సమస్యల గురించి ఆందోళన చేసే ప్రజాతంత్ర వర్గాలు కూడా 'తప్పుడు కేసులు పెడుతున్న మాట నిజమే కదా' అని తమ నోళ్లకు తామే తాళాలు వేసుకుంటున్నారు. తప్పుడు కేసులు పెడుతున్నారన్న అభియోగం, కేసులే పెట్టకుండ అడ్డం పడే దాదాగిరీకి సాకుగా మారిన తరువాత కూడా అందులో ఉన్న సత్యాన్ని చర్చించుకునే స్థితిలో ప్రజాతంత్ర శక్తులు ఉండడం బాధాకరం.

తప్పుడు కేసులు పెట్టకూడదు. దళితుల మంచి కోసమే పెట్టకూడదు. ఎందుకంటే బడుగు వర్గాలు సాధించుకున్న ఏ హక్కు భూమిక అయినా నైతికం. దాని నైతికత దెబ్బతింటే ఆ భూమికే పోతుంది. అయితే ఎస్.సి, ఎస్.టి. (అత్యాచారాల నిరోధక) చట్టానికి సంబంధించినంతవరకు వాస్తవం ఏమిటంటే ఆ చట్టం సరిగ్గా అమలుకాక పోవడమే ప్రధాన సమస్య. పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేస్తే పట్టించుకోరు. కేసు పెట్టరు. కేసు పెట్టినా దోషులను అరెస్టు చేసే బదులు వారి నుండి కూడా ఒక ఫిర్యాదు స్వీకరించి 'కౌంటర్ కేసు' తయారు చేస్తారు. రాజీకమ్మని ఒత్తిడి పెడతారు. అడుగడుగునా బాధితులు ఆందోళన చేయనిదే ఆ చట్టం ఒక్క అంగుళం కూడ అమలు కాదు. దుర్వినియోగం జరిగినప్పుడు కూడ, దళితులే తప్పుడు కేసులు పెట్టిన ఘటనల కంటే రాజకీయ నాయకులు తమ కక్షలు తీర్చుకొనడానికి తమకు అనుకూలంగా ఉండే దళితులను పావులుగా వాడుకుని వైరి వర్గంపైన కేసులు పెట్టించిన ఘటనలే ఎక్కువ.

అయినా సంక్షేమ చట్టాల దుర్వినియోగం అరికట్టాలని మాత్రమే 'ఒ.సి. సంక్షేమ సంఘం' డిమాండ్ చేయడం లేదు. వాటిని మొత్తంగానే రద్దు చేయాలని డిమాండ్ చేస్తున్నది. వాటివల్ల దేశానికి ఏదో నష్టం జరిగిపోయిందని ప్రచారం చేస్తూ బడుగు వర్గాల పైన ద్వేషం రెచ్చగొడుతున్నది. ఇప్పటికే కడప జిల్లాలో మండల స్థాయి నిర్మాణాన్ని సాధించింది. దేశ పాలనా విధానాలవల్ల ప్రస్తుతం నెలకొన్న వాతావరణంలో ఈ 'సంఘం' ఆ జిల్లాను దాటి బయటకు వ్యాపించడం అసాధ్యమేమీ కాదు.

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**
**31 మార్చి 2003**



# జడలు విప్పిన కులతత్వం

తొలినాడు ఆ ఊరి పేరు పైపల్లి. అనంతపురం నుండి వచ్చినా కర్నూలు నుండి వచ్చినా ఆ ఊరు ఎత్తు మీద ఉంటుంది. ఇంగ్లీషు వాడు పైపల్లి అనలేక పీపల్లి అన్నాడు. వాడి ఇంగ్లీషు స్పెల్లింగ్ తెలుగులోకి ప్యాపిలిగా తర్జుమా అయింది. ఏ భాషకూ చెందని ఆ పేరు ఇప్పుడు ఆ ఊరి పేరయింది.

'ఇంకా మన ఊర్లలో అంటరానితనం ఉందా?' అని అప్పుడప్పుడు అమాయకంగా ఆశ్చర్యం ప్రకటించడం అలవరచు కున్న వాళ్లకు మరొక్కసారి ఆ అవకాశం వినాయకచవితి తరువాతి దినం ప్యాపిలి కల్పించింది. కులతత్వం అంటరానివారి వినాయ కుడిని సహితం పగలగొట్టి దైవ హత్యా పాతకానికి పాల్పడగలదని తెలుసుకునే అవకాశం కూడ ప్యాపిలి కల్పించింది.

పది సంవత్సరాల క్రితం, అంటే 1993లో ఇదే విధంగా జరిగిందట. ఆ ఊరి మాదిగలు వినాయకుడి విగ్రహానికి పూజ జరిపి ఊరిలో నుండి తీసుకుపోయి చెరువులో నిమజ్జనం చేయాలని చూడగా, వాళ్లు వాడ దాటగానే సవర్ణులు వారిని ఆపి వినాయకుడి విగ్రహాన్ని పగల గొట్టారంట. ఆ తరువాత ఎందుకొచ్చిన గొడవలే అని దళితులు ఆ ప్రయత్నమే మానుకున్నారు.

మరి 2003లో మళ్లీ ఎందుకు మొదలు పెట్టారంటే 'అప్పటికీ ఇప్పటికీ రోజులు మారినాయి కదా, నాగరికత పెరిగింది కదా - అనుకున్నాము' అని ప్యాపిలి మండలం ఎం.ఆర్.పి.ఎస్. నాయకుడు బాల రంగన్న అంటాడు. పెరగలేదనగలమా? ప్యాపిలి మీదుగా పోయే 7వ నంబరు జాతీయ రహదారి పదేళ్ళ నాటికంటే ఇప్పుడు చాలా నున్నగా విశాలంగా ఉంది. దాని మీద పదేళ్ల నాడు

లేని కొత్తరకం కారులూ, జీపులూ కనీసం అరడజను రకాలు ఇప్పుడు తిరుగుతూ కనిపిస్తాయి. ఇంకొంచెం గౌరవనీయమైన అర్థంలోనూ నాగరికత పెరిగింది. పదేళ్ల నాటితో పోలిస్తే దళితులలో ఇప్పుడు చదువుకున్న వారి సంఖ్య పెరిగింది. కొంతమంది ఉద్యోగస్తులు సహితం ఉన్నారు.

అయినప్పటికీ బాల రంగన్న ఆశించిన అర్థంలో నాగరికత పెరగలేదు. సరిగ్గా పదేళ్ళ నాడు జరిగినట్టే, మాదిగల వినాయకుడు ట్రాక్టర్ ఎక్కి మాదిగవాడను దాటి సవర్ణుల ఊరిలోకి ప్రవేశించగానే వాళ్లు వ్యతిరేకతను ఎదుర్కొన్నారు. ఈ మధ్యకాలంలో అన్ని చోట్లా చేస్తున్నట్లే వాళ్లూ స్త్రీలనే ముందు నిలబెట్టారు. అన్ని చోట్లా అంటున్నట్టే 'ఈ రోజు ఊరేగింపు తీస్తామంటారు. రేపు మా పిల్లను చేసుకుంటామంటారు' అన్నారు.

ఈ పదేండ్ల కాలంలో ఎం.ఆర్.పి.ఎస్. పుట్టి వృద్ధి చెందకపోతే దళితులు భయపడి పారిపోయి ఉండేవారేమో. ఇప్పుడూ భయపడ్డారు, వెనక్కి తగ్గారు, వినాయకుడిని ఆయన తొండం ప్రతాపానికి వదిలేసారు. కానీ పారిపోలేదు. జాతీయ రహదారి మీదికి వచ్చి రెండు గంటలు రాస్తారోకో చేసారు. పోలీసులొచ్చి నచ్చచెప్పే దాకా లేవలేదు.

అందుకే 'ఇద్దరూ మూర్ఖులే'నని ప్యాపిలి సి.ఐ అంటాడు. 'వాళ్ళ కెట్లాగూ బుద్ధి లేదు. వీళ్లయినా మొండివాళ్ళతో గొడవ ఎందుకులే అని ఊరుకోరాదా?' అంటాడు. హక్కును అనుభవించకుండ అడ్డంపడే వాడూ మూర్ఖుడే, హక్కును అనుభవించాలని పట్టుబట్టేవాడూ మూర్ఖుడే అయితే హక్కుకు అర్థం ఏమిటనే ప్రశ్నకు ఆయన దగ్గర జవాబు లేదు.

రాస్తారోకో చేసి ఊరుకుంటే గొడవ అక్కడితో సమసిపోయేదే గానీ ఆ సందర్భంగా కొంతమంది ఇచ్చిన ఉపన్యాసాలే సవర్ణులను మరింతగా రెచ్చగొట్టి, తరువాత రోజు (సెప్టెంబర్ 2న) జరిగిన దమనకాండకూ దౌర్జన్యానికీ దారి తీసాయని (మేము దళితులపైన జరిగిన దాడిని సమర్థించడం లేదు అని స్పష్టం చేస్తూనే) స్థానిక విలేఖరులు అంటారు. ఏమని రెచ్చగొట్టారంట? బూతు తిట్లేమయినా తిట్టారా? కించపరిచే మాటలేమైనా అన్నారా?

'మేము తెల్లబట్టలు వేసుకుంటున్నాం. మీరూ తెల్లబట్టలు వేసుకుంటారు. మా కాళ్లకు చెప్పులున్నాయి. మీ కాళ్లకూ చెప్పులున్నాయి. మేమూ బడికి పోతున్నాం. మీరూ బడికి పోతున్నారు. ఇంకా మీరు మా కంటే ఏ విధంగా ఎక్కువ?' అన్నారంట. 'అట్ల రెచ్చగొట్టకపోతే ఆనాటి కోపం ఆ నాటితో సమసిపోయేది' అని విలేఖరి

మహాశయుడు అంటాడు. (పాపం బాలరంగన్న - నాగరికత ఈ పాటికి వచ్చేసి ఉంటుందనుకున్నాడు.)

దళితులపైన దాడులు జరిగిన సందర్భాలలో దినపత్రికలు మొత్తం మీద న్యాయం వైపు నిలబడుతున్నాయని చెప్పుకోవచ్చును గానీ అది స్థానిక విలేఖరుల పుణ్యం మాత్రం కాదు. వాళ్లెప్పుడూ దాడి చేసిన సవర్ణుల పక్షమేననేది కారంచేడు నుండి ప్యాపిలి దాకా దాదాపు ఇరవై సంవత్సరాలుగా చూస్తున్న సత్యం.

ప్యాపిలి ఘటనకు కులతత్వం తప్ప వేరే కారణమేదీ లేదు. అక్కడ రాజకీయ గ్రూపులు లేవు. అందరూ 'కె.ఇ.' వర్గమే. ఎన్నికలప్పుడు కొన్ని ఓట్లు ఇటూ అటూ పోతుండవచ్చును గానీ వేరే వర్గమేదీ లేదు. ఆర్థిక వైరుధ్యాలూ లేవు. 'దళితులు సవర్ణుల పొలాలలో పని చేస్తారు కాబట్టి, అప్పుల కోసం వారి దగ్గరకే పోతారు కాబట్టి...' అంటూ కుల ఆధిపత్యానికి ఆర్థిక కోణాన్ని వెతికే పాత తరహా మార్క్సిస్టులు మన దగ్గర ఇంకా లేకపోలేదు. వారు ప్యాపిలికి వస్తే నిరాశ చెందుతారు. ప్యాపిలి మాదిగలలో నూటికి పది మంది కూడ ఆ ఊరిలో కూలి పనికి పోరు. దూర ప్రాంతాలకు పోయి రాళ్లు కొట్టుకుని బతుకుతారు. అయిదారుగురు ఎస్.సి కార్పొరేషన్ రుణాలతో ఊరిలోనే చెప్పుల అంగళ్ళు, కిరాణా షాపులు పెట్టుకుని స్వతంత్రంగా బతుకుతున్నారు. ఈ నాలుగయిదు అంగళ్లను సవర్ణులు మొన్నటి సెప్టెంబర్ 2 నాడు ధ్వంసం చేసారు. అవి వారికి ఆర్థికంగా అడ్డమొచ్చాయని ధ్వంసం చేయలేదు. ఓర్వలేని కులతత్వంతో చేసారు.

'అగ్రకులాలు' అనకుండా నేను 'సవర్ణులు' అని ఎందుకంటున్నానా అని ఆశ్చర్యపోవచ్చు. భ్రష్టు పట్టిన మాట బదులు మర్యాదపూర్వకమైన మాట ప్రయోగిస్తున్నానేమోననుకోవచ్చు. అది నిజం కాదు. ప్యాపిలిలో దళితులపైన దాడికి పాల్పడిన కులాలలో రెడ్లే కాక బోయ, తెనుగు, ఈడిగ కులాలూ ఉన్నాయి. అందరికంటే ఎక్కువ ఆవేశపడింది తెనుగు కులస్తులు. నీళ్లు లేని రాయలసీమలో చేపలు పట్టుకుని బతికే కులవృత్తిగల వీరు ఏ అర్థంలోనూ అగ్రకులం కాదు. కానీ వర్ణ ధర్మ సిద్ధాంతం వారికి సవర్ణులనే అభిజాత్యాన్ని ఇచ్చింది. మాదిగలు తమ ఇళ్ల మధ్య వినాయకుడిని ఊరేగించేటట్టయితే ఇంక తమ సవర్ణానికీ వారి అవర్ణానికీ తేడా ఏమిటని ఆగ్రహించారు. ఈ దుష్ట ఆగ్రహం ఎక్కడిదాకా పోయిందంటే, 2వ తేదీన పోలీసులు పక్కన ఉండి దళితుల ఊరేగింపును జరిపిస్తారేమోనన్న అనుమానంతో ఎస్.పితో సహా పోలీసులందరినీ చాలా 'మిలిటెంట్'గా తరిమికొట్టారు. కాల్పులు జరిపి గానీ పోలీసులు తిరిగి ఊరిలోనికి రాలేకపోయారు.

ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీల ఐక్యత అనేది దళిత ఉద్యమకారులు తరచుగా ఇస్తున్న నినాదం. దళితులు, దళిత ఉద్యమకారులు సమర్థించినంత బలంగా బి.సిలు గానీ, బి.సి నాయకులు గానీ (ఒకరిద్దరు మేధావులను మినహాయిస్తే) దీనినెప్పుడూ సమర్థించలేదు. ఈ నినాదాన్ని జనాభా లెక్కల రాజకీయం స్థాయికి ('జనాభాలో 85 శాతం మనమే కాబట్టి రాజ్యాధికారం మన చేతికి రావాలి') కుదించివేస్తే ఇది ఆకర్షణీయంగా కనిపిస్తుంది గానీ వేరే ఏ రకంగా చూసినా కార్మిక ఐక్యతకంటే కూడా ఇది అవాస్తవికమయిన నినాదం. మార్పుకు రాజ్యాధికారం కావాలి, రాజ్యాధికారానికి సంఖ్యా బలం కావాలి, దానికి ఈ రకమైన జనాభా లెక్కలు కావాలి అనుకుంటే ఈ నినాదం దళిత బహుజన దృక్పథానికి అనివార్యంగా కనిపించవచ్చును గానీ, మార్పును వేరే విధంగా భావించగలిగితే ఈ సమస్య ఉండకపోవచ్చు. లేదా, దళితులను తమ సోదరీ సోదరులుగా బి.సిలు స్వీకరించాలంటే అగ్రకులాలను తిడితే సరిపోదనీ, దానికి ప్రత్యేకమైన రాజకీయ కార్యాచరణ కావాలనీ గుర్తించడం అవసరం. ఆ కార్యాచరణ దళిత ఉద్యమంలో గానీ దళిత బహుజన ఉద్యమంలో గానీ ఎవరి దగ్గరా లేదు. ప్యాపిలికి కృష్ణ మాదిగ పోయి తన వారికి ఊరట కలిగించాడు. కానీ ఏ బి.సి నాయకుడూ దాడి చేసిన బి.సిలకు నచ్చజెప్పే ప్రయత్నం చేయలేదు. బి.సి. నాయకులెవరయినా ప్యాపిలికి రేపు పోయినా మాదిగలను కలిసి వారి పట్ల తమ సానుభూతినీ సంఘీభావాన్నీ ప్రకటిస్తారే తప్ప బి.సి.లకు వారి తప్పు ఎత్తి చూపించి వారిని 'ఎస్.సి., ఎస్.టి., బి.సి మైనారిటీల ఐక్యత' అనే రాజకీయ కార్యాచరణ వైపు తీసుకొచ్చే ప్రయత్నం చేయరు.

పోతే, ప్యాపిలి కథకొక కొసమెరుపు ఉంది. ఆ ప్రాంతం 'కె.ఇ.' కుటుంబం జాగీరని అన్నాను కదా. అక్కడ వారిని సంప్రదించకుండా చిన్న రోడ్డు కాంట్రాక్టు తీసుకోవడానికి కూడా ఎవరూ సాహసించరు. ఆ సంగతి తెలిసి కాబోలు సెప్టెంబర్ 2వ తేదీన (వినాయక నిమజ్జన ప్రయత్నం జరిగిన మర్నాడు) దళితుల వినాయక విగ్రహ నిమజ్జనం కార్యక్రమాన్ని సఫలం చేయడం కోసం జిల్లా కలెక్టరు, ఎస్.పి కలిసి రాష్ట్ర కేబినెట్‌లో మంత్రిగా ఉన్న కె.ఇ. ప్రభాకర్‌ను ప్యాపిలికి వెంటపెట్టుకు పోయారు. తామంతా పక్కన ఉంటామనీ దళితులు ధైర్యంగా నిమజ్జన ఊరేగింపు చేసుకోవచ్చుననీ భరోసా ఇచ్చారు. నిజానికి కె.ఇ. ప్రభాకర్ తన ఆదేశంగా ఒక ప్రకటన చేసినా అది జరిగిపోయేది. అయితే ఈ సెకండ్‌హ్యాండ్ హక్కు తమకు అక్కర లేదనుకున్నారేమో, దళితులు ఈ కార్యక్రమానికి ఇష్టపడలేదు. వారి తరఫున పోలీసులు, అధికార్ల బృందం, కె.ఇ.ప్రభాకర్ ఊరేగింపు తీసి నిమజ్జనం తంతు ముగించారు. దళితుల తరఫున ఈ కార్యక్రమం చేపట్టిన ఆ పెద్దమనుషులు

తొలినాడు దళితులు ఎంచుకున్న మార్గంలోనే - అంటే ఊరిలో నుండే - ఊరేగింపు తీసి ఉంటే కనీసం ప్రతీకాత్మక న్యాయమైనా జరిగి ఉండేది. కాని మంత్రిగారు, కలెక్టర్‌గారు, ఎస్.పిగారు ఆ పని చేయలేదు. 'నొప్పించక తా నొవ్వక తప్పించు'కునే మార్గం ఎంచుకుని ఊరి బయటినుండి ఊరేగింపు తీసారు. తొలినాడు దళితులు ఆ పనే చేసి ఉంటే 'ఊరు' వద్దనేదా!

బాల రంగన్నా, నాగరికత అంత దూరం నడిచింది చూడు.

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**22 సెప్టెంబర్ 2003**



# దేవాలయ భూములు దళితులకే దక్కాలి

మనది భక్తిరసం మెండుగా పారే రాష్ట్రం. కాబట్టి ఇక్కడ గుళ్ళెక్కువ ఉన్నాయి. ఆ గుళ్ళ (వాటి పూజారుల) పోషణార్థం దానమిచ్చిన భూములు కూడా ఎక్కువే ఉన్నాయి. దాదాపు మూడున్నర లక్షల ఎకరాల 'దేవాదాయ' భూములు రాష్ట్రంలో ఉన్నాయని అంచనా.

దేవాదాయ భూమి అంటే దేవునికి ఆదాయం ఇచ్చేదని అర్థం. గుళ్ళలో జరిగే వివిధ కార్యకలాపాలకు, గుడి పూజారి మనుగడకు ఒక ఆదాయ మార్గం అవసరమని భావించిన పూర్వకాలపు రాజులు దానం ఇచ్చిన భూములు ఇవన్నీ. ఇటువంటి పుణ్యకార్యానికి పోరంబోకు భూములు, బంజర్లు ఎవరూ ఇవ్వరు కాబట్టి ఈ దేవాదాయ భూములు ఎక్కువగా సారవంతమైనవని వేరే చెప్పనవసరం లేదు.

అయితే ఈ దేవాదాయ భూముల నిర్వహణ మొదటినుండి అసమర్థంగానే ఉంటూ వచ్చింది. దానిని కౌలుకు తీసుకున్నవారు స్వంతానికి వాడుకోవడం, అమ్ముకోవడం, బిడ్డ పెండ్లికి పసుపు కుంకుమగా ఇచ్చేసుకోవడం జరిగింది. గుళ్లకు ఆ భూముల వల్ల వచ్చిన ఆదాయం చాలా తక్కువ.

పూర్వకాలపు పాలకులిచ్చిన ఈనాంలూ, జమిందారీలూ, జాగీరులూ అన్నీ రద్దయిపోగా ఈ దేవుడి మాన్యాలు మాత్రం ఎందుకు కొనసాగాలి అన్న విమర్శ స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి ఉండింది. ధైర్యం చేసి అనలేకపోయారు గానీ, భక్తులిచ్చే విరాళాలతో నడవలేని గుడిని భూములిచ్చి నిలబెట్టవలసిన అవసరం

ఏముంది? ఆ మాత్రం ప్రజాదరణ లేని దేవుడికి గుడి ఎందుకు అనే అభిప్రాయం ఉండింది.

ఈ మాటలు వాడకపోయినా దేవాదాయ భూములు పేదలకు పంచాలి అన్న నినాదం కమ్యూనిస్టు పార్టీలు చాలా కాలంగా ఇస్తుండేవి. మరి గుడి ఎట్లా నడవాలి  అని భక్తులు ఆవేశపడితే, ప్రభుత్వాన్నే నిధులిచ్చి నడపమనండి అని జవాబు చెప్పేవారు. దేవుడి మాన్యాలు సెక్యులర్ ప్రయోజనాల కోసం ముట్టుకోరానంత పవిత్రమైనవేం కావనీ, మాన్యాలు రద్దుచేసి డబ్బులిస్తే అది రాజ్యాంగ విరుద్ధమేం కాదని సుప్రీంకోర్టు 1950లోనే ఒక తీర్పులో అనింది.

అయినప్పటికీ దేవుడి 'సెంటిమెంట్' అంటే భయపడి ఈ పనిచేయడానికి ఏ ప్రభుత్వమూ సాహసించలేదు. తానే దేవుడి అవతారం అని భావించిన ఎన్.టి.రామారావు ముఖ్యమంత్రి అయిన తరువాతే దేవాదాయ ధర్మాదాయ చట్టాన్ని ఈ మేరకు సవరించే ప్రయత్నం జరిగింది. చల్లా కొండయ్య అనే రిటైర్డ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని (వీరు కూడ కమ్మవారే కావడం విశేషం) ఏకసభ్య కమిషన్‌గా నియమించి, మొత్తంగానే దేవాదాయ ధర్మాదాయ చట్టాన్ని సంస్కరించడానికి సూచనలిమ్మని ఎన్టీఆర్ కోరారు. చల్లాకొండయ్యగారి సూచనలు బ్రాహ్మణులకు చాలా కోపం తెప్పించినప్పటికీ అవి దేవాలయాల నిర్వహణను చక్కదిద్దడానికి ఉపయోగపడిన మాట వాస్తవం.

వారి సూచనలననుసరించి 1987లో రాష్ట్ర అసెంబ్లీ దేవాదాయ చట్టాన్ని సమగ్రంగా సవరించింది. సవరించిన చట్టంలోని సెక్షన్ 82, దేవుని మాన్యం భూములలోని అన్ని కౌలుదారి హక్కులను రద్దుచేసింది. అంటే ఎప్పుడో వాటిని కౌలుకు తీసుకుని వంశపారంపర్యంగా అనుభవిస్తున్న వారందరి హక్కులూ రద్దయిపోయాయి. అయితే వారిలోని పేదవారి హక్కులను మాత్రం సెక్షన్ 82(2) కాపాడింది. స్వంత భూమి, దేవుని మాన్యంలోని కౌలు భూమి కలుపుకుని రెండున్నర ఎకరాల మాగాణి లేక 5 ఎకరాల మెట్ట మించి లేనివారిని ఈ చట్టం 'భూమిలేని కౌలుదార్లు' అంటుంది. అటువంటి కౌలుదార్లకు వారు కౌలుకు చేస్తున్న దేవుడి మాన్యం భూమిని 75 శాతం మార్కెట్ ధరకు ప్రభుత్వం నుండి కొనుక్కునే హక్కు సెక్షన్ 82(2) కల్పించింది. తక్కిన దేవాదాయ భూమిలోని అన్ని హక్కులూ రద్దయిపోయి అవి ప్రభుత్వపరం అయ్యాయి.

ప్రగతిశీలమైన ఈ చట్ట సవరణను బడా కౌలుదార్లు హైకోర్టులో సవాలు చేసారు. దేవాలయాలకు అన్యాయం జరిగిపోతుందనీ, గుళ్లు పాడయిపోతాయనీ గొడవపెట్టారు. దేవాలయాలను మూతవేసే ఉద్దేశ్యం తనకేమీ లేదనీ, వాటి

మాన్యాలు రద్దుచేసినా వాటి నిర్వహణకు అవసరం అయిన నిధుల ఏర్పాటు జరుగుతుందనీ ప్రభుత్వం హామీ ఇచ్చినప్పటికీ హైకోర్టు సంతృప్తి చెందలేదు. భూసంస్కరణలను నీరుకార్చే తీర్పులనేకం ఇచ్చిన కోర్టు సెక్షన్ 82 విషయంలోను అదే పని చేసింది. ఆ సెక్షన్ రాజ్యాంగ విరుద్ధం అని కొట్టేసింది. 1990లో రాష్ట్ర హైకోర్టు ఇచ్చిన ఈ తీర్పుపై మన రాష్ట్ర ప్రభుత్వం సుప్రీంకోర్టులో అప్పుడే అప్పీలు వేసింది. వేసి నిద్రపోయింది. అది 2003లో విచారణకు వచ్చింది. (ఎంత పాత కేసయినా ఏదో ఒకరోజు విచారణకు రాకతప్పదు కాబట్టి.) సుప్రీంకోర్టు రాష్ట్ర హైకోర్టు తీర్పును తిరగదోడి దేవాదాయ చట్టంలోని సెక్షన్ 82 రాజ్యాంగ బద్ధమేనని ప్రకటించింది.

దీని ఫలితంగా ఇప్పుడు దాదాపు మూడున్నర లక్షల ఎకరాల దేవుడి మాన్యం భూములలోని అన్ని హక్కులూ రద్దయిపోయి అవన్నీ ప్రభుత్వ పరం అయ్యాయి. అందులో భూమిలేని పేదలు కౌలుకు చేస్తున్న భూమిని వారికే ప్రభుత్వం మార్కెట్ ధరలో 75 శాతానికి సెక్షన్ 82(2) ప్రకారం అమ్మవలసి ఉంటుంది. ఇది దాదాపు ఒక లక్ష ఎకరాలు ఉంటుందని అంచనా. తక్కిన రెండున్నర లక్షల ఎకరాల భూమి ఇప్పుడు ప్రభుత్వం అజమాయిషిలో ఉంది.

ఆ భూమి పేదలకు, అందులోనూ ప్రధానంగా ఎస్.సి., ఎస్.టిలకు దక్కేటట్లు చూడవలసిన కర్తవ్యం ప్రజా ఉద్యమాలపైన ఉంది. సెక్షన్ 82ను చట్టంలో పెట్టినప్పుడు ప్రభుత్వం ఉద్దేశ్యం ఏముందోగానీ అది రాజ్యాంగబద్ధమేనని సుప్రీంకోర్టు ప్రకటించేసరికి రాష్ట్రంలో చంద్రబాబు ప్రభుత్వం ఉంది. ఈ ప్రభుత్వం వెంటనే ఆ భూమినంతా వేలంపాటలో అత్యధిక మొత్తానికి మళ్ళీ కౌలుకు ఇచ్చే ప్రయత్నాన్ని మొదలుపెట్టింది. అయితే ఈసారి కౌలుదార్లు శాశ్వతంగా కొనసాగకుండా పరిమిత కాలానికే కౌలుకిస్తామంటున్నారు. ఇది కొనసాగితే మళ్ళీ దేవుడి మాన్యాలన్నీ ధనవంతుల పరం అవుతాయి. చంద్రబాబు వ్యవసాయ విధాన నీతిని అనుసరించి రాబోయే రోజులలో ఆ భూములలో రొయ్యల చెరువులు, ఎగుమతి బ్రాండ్ పూదోటలూ వెలుస్తాయి. ఈ వేలంపాటలను ఇప్పటికే ఎక్కడికక్కడ కమ్యూనిస్టు పార్టీలు, ప్రజా సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు అడ్డుకుంటున్నాయి. అయితే అన్ని సంఘాలూ ఒకే తాటిమీదకొచ్చి ఎదుర్కొనడం అవసరం.

ఈ భూమినంతా ఇతరత్రా భూమిలేని పేదలకు, అందులో ప్రధానంగా, ఎస్.సి., ఎస్.టి.లకు ఇవ్వాలన్న నినాదంతో ఐక్య ఉద్యమం నడవాలి. ఉచితంగా ఇమ్మంటే ఇచ్చే రోజులు కావు కాబట్టి మార్కెట్ ధరలో ఏ 75 శాతానికో లేక 50 శాతానికో ఇవ్వాలని, వెంటనే చెల్లించలేని వారికి ఎస్.సి కార్పొరేషన్ అప్పు ఇవ్వాలని, అసలే చెల్లించలేని వారిని గుర్తించి ఎస్.సి కార్పొరేషన్ ఆ భూములు కొని వారికివ్వాలనీ డిమాండ్ చేయాలి. ఆచరణలో ఎన్నో సమస్యలుండవచ్చును.

ఉదాహరణకు పెద్ద కౌలుదార్ల పేరుమీద ఉన్న దేవుని మాన్యం భూములను ఏనాడో వారి దగ్గర ఇతరత్రా భూమిలేని వారు కొనుక్కుని చేసుకుంటూ ఉండవచ్చు. లేదా కుటుంబం పెద్దదయి పంపకాలు చేసుకున్న కారణంగా అనుభవదారులయిన వారు చిన్నరైతులైపోయి ఉండవచ్చు. చట్టం నిర్వచనంలో 'భూమిలేని' వారయిపోయి ఉండవచ్చును కూడ! వీళ్ళ హక్కులను గుర్తించాలని కోరుతున్న పార్టీలున్నాయి. వీరిలో యోగ్యులు అయోగ్యులు అన్న విచక్షణ పాటించాలని భావించే వారూ ఉన్నారు.

ఇటువంటి సమస్యలెన్ని ఉన్నా సూత్రప్రాయంగా దేవుడి మాన్యాలు పేదలకు, అందులో ప్రధానంగా ఎస్.సి., ఎస్.టిలకు దక్కాలన్న నినాదంతో బలమైన ఉద్యమం నిర్మించడం అవసరం. పుణ్యకాలం గడిచిపోయే లోపల చేయడం అవసరం.

**కుల నిర్మూలన మాస పత్రిక**

**జనవరి - మార్చి 2004**



దక్షిణ భారతదేశంలో అబ్రాహ్మణ సామాజిక రాజకీయ చైతన్యం, ఉద్యమం దాదాపు ఒక శతాబ్ద కాలపు చరిత్ర కలిగినవి. ఒక్క ఆంధ్రప్రదేశ్‌ను మినహాయిస్తే తక్కిన మూడు రాష్ట్రాలలోనూ శక్తివంతమైన అబ్రాహ్మణ ఉద్యమాలు నడిచాయి. (మన రాష్ట్రంలో ఆ చోటును కమ్యూనిస్టు ఉద్యమం నింపింది) కానీ ఉత్తర భారతదేశంలో దానికంత లోతయిన చరిత్ర లేదు. జయప్రకాశ్ నారాయణ్ తట్టి లేపిన రెండవ తరం లోహియావాదుల రాకే ఉత్తర భారతదేశంలో విస్తృత అబ్రాహ్మణ రాజకీయ ఉద్యమానికి నాంది అయింది. లల్లూ ప్రసాద్ యాదవ్, ములాయం సింగ్ యాదవ్, రాం విలాస్ పాశ్వాన్, అంబేద్కర్ వాదులయిన కాన్షీరాం, మాయావతి ఈ చైతన్యానికి వైతాళికులుగా ముందుకొచ్చారు.

వీరందరిలోకీ తెలివితేటలలోనూ చురుకయిన ఆలోచనా సామర్థ్యంలోనూ పాశ్వాన్ ఎక్కువ ఆకర్షణీయంగా కనిపించాడు. దళిత-బహుజన ఉద్యమానికి సంఖ్యాబలాన్ని కల్పించడంలో వీరందరి పాత్ర ఉన్నప్పటికీ ఆలోచనాత్మకమైన రాజకీయ సామాజిక కృషి పైన దృష్టి సారించిన వారు పాశ్వాన్‌పైన ఎక్కువ ఆశలు పెట్టుకున్నారు.

అయితే ఈ నాయకులంతా కూడా పదవిలో తప్ప ప్రతిపక్షంలో ప్రజాసేవ చేయలేకపోవడం అనే జబ్బు వాత పడ్డారు. దానికి దాదాపు ఏమైనా చేయడానికి సిద్ధపడ్డారు. ములాయం, లల్లూ ప్రసాద్‌లు కనీసం మనువాదులతో పదవికోసం చేతులు కలపడానికి సిద్ధపడలేదు. (ములాయం గురించి ఈ మధ్యకాలంలో సందేహాలు వస్తున్నప్పటికీ) కానీ కాన్షీరాం, మాయావతి, పాశ్వాన్‌లు దానికి సైతం తెగించారు. ఆ చతురతను చూసి ముచ్చట పడిన దళిత-బహుజన మేధావులు లేకపోలేదు గానీ దానివల్ల జరిగిన, జరుగుతున్న నష్టం అంతా ఇంతా కాదు.

**(గోడమీది ప్రజాస్వామ్యం)**

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**13 మార్చి 2005**

# అగ్రకుల దురహంకారాన్ని హైకోర్టు మన్నించడం లజ్జాకరం

చుండూరు కేసు విచారిస్తున్న జడ్జి డా॥ ప్రభాకర్‌రావుగారిని ముద్దాయిల కోరిక మేరకు ఒంగోలుకు బదిలీ చేసిన సంగతి అందరికీ ఈపాటికి తెలిసే ఉంటుంది.

ఆ బదిలీ ఎంతటి లజ్జాకరమైన పరిస్థితులలో జరిగిందో ప్రజలకు తెలియ జెప్పడం అవసరం అని మేము భావిస్తున్నాము. బదిలీ చేసింది హైకోర్టే అయినప్పటికీ మేము ఆ మాట అంటున్నాము.

ప్రభాకర్‌రావుగారు కులం రీత్యా దళితుడు. దళిత కులస్తుడైన న్యాయమూర్తి కేసు విచారిస్తే తమకు న్యాయం జరగదని అగ్ర కులస్తులైన చుండూరు కేసు ముద్దాయిలు భావించారు. దాదాపు అదే మాట ఆయనతోనూ అన్నారు. హైకోర్టుకూ చెప్పారు. బదిలీ అయి వెళ్ళిపోవడం తన మనశ్శాంతికి క్షేమకరం అని ఆయనకే అనిపించేటట్టు చేశారు. ఆయనను బదిలీ చేయకపోతే తమ తరపున కేసు నిర్వహించ డానికి లాయర్లే దొరకరని బెదిరించారు. కేసు చేస్తున్న లాయర్లంతా పక్కకు తప్పు కుంటారని ముద్దాయిలు బెదిరించడమే కాదు, వారి లాయర్లూ బెదిరించారు. తమ ప్రమేయం లేకుండా ఏకపక్షంగా కేసును నడుపుకుంటారో లేక జడ్జిని బదిలీ చేస్తారో నిర్ణయించుకోండని సవాలు విసిరారు.

ఇదంతా చేసి తమ కోరిక సాధించుకున్నారు. జడ్జిని హైకోర్టు బదిలీ చేసేసింది. అందుకే ఈ బదిలీని 'లజ్జాకరం' అంటున్నాం. చేసింది హైకోర్టే కావచ్చు. అయినప్పటికీ అంటున్నాం.

చుండూరు మారణకాండ గురించి మేము ప్రజలకు కొత్తగా జ్ఞాపకం చేయవలసిన పని లేదు. 1991 ఆగస్టు 6వ తేదీన చుండూరు, పరిసర గ్రామాలకు చెందిన అగ్రకులస్తుల గుంపు ఆ ఊరి దళితవాడపైన పట్టపగలు దాడి చేసి ప్రజలను తరిమారు, కొట్టారు, నరికారు, చంపారు.

14 సంవత్సరాలైనా కేసు విచారణ పూర్తికాకపోవడానికి హత్య చేసిన దుండగులే ప్రధాన కారణం. హతులు దళితులు కారనీ... క్రైస్తవులనీ, అందువల్ల ఎస్.సి., ఎస్.టి చట్టం వర్తించదని ఒకసారి కోర్టుకెక్కారు. ఆ కేసు ఓడిపోయిన తరువాత ఎస్.సి., ఎస్.టి ప్రత్యేక కోర్టు చుండూరులోనే కూర్చుంటుందన్న ప్రభుత్వ నిర్ణయాన్ని సవాలు చేస్తూ ఒకసారి కాదు, రెండుసార్లు కోర్టుకెక్కారు. ఎక్కువ మంది సాక్షులు, ముద్దాయిలు చుండూరుకు, దాని పరిసర గ్రామాలకు చెందినవారు కాబట్టి కేసు విచారణ చుండూరులో జరపడం చట్టరీత్యా తప్పు కాదు. సాధారణ న్యాయదృష్టి లోను తప్పు కాదు. అయినప్పటికీ దానిపై వ్యాజ్యం నడిపారు.

ఆ వ్యాజ్యం ఓడిపోయిన తరువాత చుండూరు కేసు నిర్వహించడానికి రాష్ట్ర ప్రభుత్వం స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌ను నియమించడాన్ని సవాలుచేస్తూ వాళ్ళే కోర్టు కెక్కారు.

ఎస్.సి., ఎస్.టి. అత్యాచారాల నిరోధక చట్టంలోనే బాధితులను సంప్రదించి వారికి విశ్వాసం ఉన్న న్యాయవాదిని స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమించే అవకాశం ఉన్నప్పటికీ దళితులు కోరిన వ్యక్తిని ఎట్లా నియమిస్తారు అంటూ కోర్టుకెక్కారు. సింగిల్ జడ్జి వారి కేసును కొట్టేయగా డివిజన్ బెంచికి అప్పీలు కూడా చేసుకున్నారు.

అది కూడా వీగిపోయిన తరువాతే చుండూరు మారణకాండపైన విచారణ మొదలయింది. ప్రత్యక్ష సాక్షుల విచారణ దాదాపు పూర్తయిపోయిన దశలో ప్రత్యేక కోర్టు న్యాయమూర్తిని బదిలీ చేయడం జరిగింది. ఇది ఏ ప్రత్యేక కారణంవల్లా జరిగిన బదిలీ కాదు. ఆనవాయితీగా న్యాయవ్యవస్థలో జరిగే బదిలీలలో భాగంగా గుంటూరులో చాలామంది బదిలీ అయ్యారు. ప్రత్యేక కోర్టు న్యాయమూర్తి కూడా బదిలీ అయి డా॥ ప్రభాకర్‌రావుగారు నియమితులయ్యారు.

క్రిమినల్ కేసును ఆద్యంతం ఒకే న్యాయమూర్తి విచారించాలన్న నియమమేదీ లేదు. కాబట్టి కొత్త న్యాయమూర్తి నియామకానికి ముద్దాయిలు అభ్యంతరం చెప్పే అవకాశం లేదు. అయినప్పటికీ చుండూరు ముద్దాయిలు వెంటనే హైకోర్టుకు నిరసన

తెలుపుతూ ఉత్తరం రాశారు. పాత న్యాయమూర్తినే కొనసాగించమని కోరారు. ఆయనేమైనా వారికి అనుకూలంగా వ్యవహరించాడా అంటే అదేం లేదు. ఆయన తన వృత్తి ధర్మం ప్రకారం చేశాడు. మరి అటువంటప్పుడు బదిలీని నిలిపివేసి పాత న్యాయమూర్తినే కొనసాగించాలని ముద్దాయిలు ఎందుకు కోరారన్న ప్రశ్నకు ముద్దాయిల నుండి జవాబు లేదు.

వాళ్ళు జవాబు చెప్పకున్నా కారణం ఊహించడం కష్టం కాదు. కొత్త జడ్జి దళితుడని తెలిసి పాత జడ్జినే కొనసాగించాలని వారు హైకోర్టును కోరారు. కొత్త జడ్జి వ్యవహారశైలిని వారప్పటికి చూడలేదు. ఆయన న్యాయబుద్ధి కలవాడో కాదో నిర్ణయించడానికి వారి వద్ద అప్పటికి ఏ ఆధారాలు లేవు. అయినప్పటికీ పాత జడ్జినే కొనసాగించమని హైకోర్టును వారు కోరారంటే, కొత్తాయన కులంరీత్యా దళితుడు కావడమొక్కటే దానికి కారణం కాగలదు.

అప్పుడే హైకోర్టు వారి అభ్యర్థన పట్ల తగిన రీతిలో స్పందించవలసి ఉండింది. దళితులపైన దాడి చేసిన కేసులో అగ్రకులస్తులను విచారించడానికి దళిత కులస్థుడైన వ్యక్తి ఎంతటి న్యాయకోవిదుడైనా, నిష్ణాతుడైనా అనర్హుడనే కదా వారు చెప్పదలచు కున్నది? అది కోర్టు ధిక్కారం కాదా? న్యాయవ్యవస్థ అన్యాయమైన తీర్పు ఇచ్చిందని విమర్శించిన వారిని సైతం కోర్టు ధిక్కారానికి శిక్షిస్తారే, ఏ తీర్పు ఇంకా ఇవ్వకముందే ఈ న్యాయమూర్తి దళితుడు కాబట్టి మాకు న్యాయం జరగదని భావిస్తున్నామని ప్రకటించే వారిని ఉపేక్షించడం భావ్యమా?

అప్పుడు హైకోర్టు వారిని అభిశంసించలేదు గానీ వారి కోరికను మన్నించనూ లేదు. ఊరకుండిపోయింది. కొత్త జడ్జి డా॥ ప్రభాకర్‌రావుగారి ఆధ్వర్యంలో చుండూరు కేసు విచారణ కొనసాగింది. 22 మంది సాక్షులను విచారించారు. వీరిలో ఎక్కువ భాగం పంచనామా మధ్యవర్తులు, పోలీసులు, డాక్టర్లు మొదలైన 'అధికారిక' సాక్షులు. వీరి సాక్ష్యానికి ప్రత్యక్ష సాక్షుల వాంగ్మూలానికి ఉండే ప్రాముఖ్యం ఉండదు. అయినప్పటికీ ఈ సాక్ష్యాలు నమోదు చేయడంలో న్యాయమూర్తి పక్షపాత బుద్ధితో వ్యవహరిస్తున్నారని ముద్దాయిలు ఆరోపించసాగారు. స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్, న్యాయమూర్తి కుమ్మక్కయి ప్రాసిక్యూషన్ కథనానికి అనుకూలించే పద్ధతిలో సాక్ష్యం నమోదు చేస్తున్నారనీ, అందుకోసం సాక్షులపైన ఒత్తిడిపెట్టి వారిచేత అనుకూలంగా చెప్పిస్తున్నారనీ నిందేశారు. ఈ నిందా పత్రాన్ని ఆగస్టు నెలలో న్యాయమూర్తి చేతికే ఇచ్చి "ఈ కేసు మీరు విచారించిన యెడల ఏ విధంగాను న్యాయమైన తీర్పు వస్తుందని నమ్మకం లేదు. కనుక అన్యథా భావించక, మీ అధికారం మాపై చూపక

వేరే జడ్జిగారి ద్వారా విచారణ జరిపించగలందులకు తగు చర్యలు తీసుకొనవల సిందిగా ప్రార్థించుచున్నాము'' అని కోరారు.

ఈ వాక్యాలలోని వెక్కిరింత ధ్వని సాధారణంగా కోర్టులో ముద్దాయిల నోట వినిపించేది కాదు. న్యాయమూర్తి దళితుడనే చులకన భావమే లేకపోతే ఇది సాధ్యమయ్యేది కాదు.

ఈ నిందా పత్రాన్ని ముద్దాయిలు న్యాయమూర్తికి ఇవ్వడమేకాక హైకోర్టుకు కూడా పంపారు. చుండూరు కేసును ఆ కోర్టు నుంచి పొరుగు జిల్లాకు బదిలీ చేయమని హైకోర్టులో కేసు వేశారు. న్యాయమూర్తినే బదిలీ చేయమన్న అర్జీ కూడా పెట్టుకున్నారు. కేసును బదిలీ చేయడం హైకోర్టు న్యాయపరమైన అధికారం పరిధిలోని విషయం కాబట్టి కేసు వేశారు. జడ్జిని బదిలీ చేయడం హైకోర్టు పాలనాధికారం పరిధిలోని విషయం కాబట్టి అర్జీ పెట్టుకున్నారు. రెండూ ఒకేసారి చేశారు. రెండింటికి ఆధారం ఆగస్టు నెలలో న్యాయమూర్తికి సమర్పించిన నిందా పత్రమే. దాని ముగింపు వాక్యాలను పైన ఉటంకించాము. అందులోని 15వ పేరాను కూడా ఉటంకించాలి.

“మీరు ఎస్.సి. కులమునకు చెందినవారని తెలియుచున్నది. ఔనో/కాదో మాకు తెలియదు. కానీ, జరిగిన పై విషయములు మరియు ఇతర విషయముల దృష్ట్యా, మమ్ములను ఇబ్బంది పెట్టుట గురించి సాక్ష్యములు సరిగా నమోదు చేయకపోవడాన్ని బట్టి, జరుగుతున్న అన్యాయాన్ని బట్టి నిజమేనేమో అనిపిస్తుంది. అందువలన కూడా మాకు ఈ కేసులో న్యాయము జరగదని విశ్వసించుచున్నాము. కులప్రాతిపదికగా ఏర్పడిన న్యాయస్థానము కనుక అనుమానించుచున్నాము.''

అంటే న్యాయమూర్తి కులాన్నిబట్టి ఆయన నిష్పాక్షికతను శంకించవచ్చు. న్యాయమూర్తి దళిత కులస్తుడైతే ఎస్.సి., ఎస్.టి. చట్టం కింద విచారణ ఎదుర్కొంటున్న అగ్రకుల ముద్దాయిలు తమకు న్యాయం జరగదని అనుమానించ వచ్చు. ఎస్.సి., ఎస్.టి స్పెషల్ కోర్టు 'కుల ప్రాతిపదికన' ఏర్పడిన న్యాయస్థానం కాబట్టి ఆ కోర్టులో విచారణ జరిపే న్యాయమూర్తి ఎస్.సి.గానీ, ఎస్.టి.గానీ అయితే ముద్దాయిలకు న్యాయం జరగదన్న విశ్వాస రాహిత్యాన్ని ప్రకటించి జడ్జి బదిలీగాని, కేసు బదిలీగాని కోరవచ్చు.

ఇదీ చుండూరు ముద్దాయిల వాదన. దీనిని వారు తమలో తాము చెప్పుకుని ఊరుకోలేదు. కాగితం మీద పెట్టి హైకోర్టుకే ఇచ్చి కేసును గానీ, జడ్జిని గానీ బదిలీ చేయమని అడిగారు.

న్యాయవ్యవస్థను అవమానపరిచినందుకు కోర్టు ధిక్కారం కేసు, దళితుడు అగ్రకులాల నేరాన్ని విచారించడానికి అనర్హుడని అన్నందుకు పిసిఆర్ చట్టం కింద కేసు వారిపైన నమోదు చేయవలసింది పోయి హైకోర్టు వారి అభ్యర్థన మేరకు జడ్జిని బదిలీ చేసింది. కేసు బదిలీ కోసం ముద్దాయిలు వేసిన వ్యాజ్యం ఇంకా విచారణలో ఉండగానే జడ్జినే బదిలీ చేసింది. ముద్దాయిల నిందా పత్రానికి డా॥ ప్రభాకర్‌రావు సంతృప్తికరంగా జవాబు చెప్పకపోలేదు. జవాబు చెప్పడమే కాక, ముద్దాయిలు కోర్టులో అనుచితంగా ప్రవర్తిస్తున్న వైనాన్ని కూడా హైకోర్టుకు వివరించాడు. దాంతోపాటు ఈ తలనొప్పి తనకొద్దని తానే బదిలీ కూడా కోరాడు. ఆయన అభ్యర్థనకు అగ్రకుల ముద్దాయిలు పెట్టిన వేధింపులే కారణం అని హైకోర్టు గుర్తించి ముద్దాయిల పైన తగుచర్య తీసుకోవలసిందిపోయి వారి కోరికే తీర్చింది.

ఇది హైకోర్టుకు తగునా అని మేము అడుగుతున్నాం. దళితులను హతమార్చిన అగ్రకులస్తులు తమ కులాలకు చెందినవారే తమను విచారించాలని డిమాండ్ చేయడాన్ని ఆమోదించినట్టు కాదా? రేపు దళిత బాధితులు జడ్జి దళితేతరుడు కాబట్టి మాకు న్యాయం జరగదని అనుమానిస్తున్నాం అంటే జడ్జిని మళ్ళీ బదిలీ చేస్తారా?

1991 ఆగస్టు 6న ముద్దాయిలు ఏ అహంకారాన్ని ప్రదర్శించారో అదే అహంకారాన్ని 2005 ఆగస్టు నెలలో జడ్జి మీద తయారుచేసిన నిందాపత్రంలో మళ్ళీ ప్రదర్శించారు. మొదటి దానికి విచారణ ఇప్పటికీ పూర్తికాలేదు. రెండవది వారు కోరిన ఫలితాన్నే ఇచ్చింది. అందరికీ సమన్యాయం జరుగుతుందన్న విశ్వాసాన్ని న్యాయవ్యవస్థ ప్రజలలో నిలబెట్టదలచుకుందా లేదా?

**మానవ హక్కుల వేదిక కరపత్రంగా వచ్చింది**

**27 అక్టోబర్ 2005**



# అంబేద్కర్ దృష్టిలో ప్రజాస్వామ్యం

ప్రభుత్వ సర్వీసుల్లో తగిన ప్రాతినిధ్యం లేని వెనుకబడిన వర్గాలకు రిజర్వేషన్లు కల్పించాలనేది రాజ్యాంగంలోని ఆర్టికల్ 16 క్లాజు 4లో మనకు కనిపిస్తుంది. చాలామంది దీనిని సామాజిక వెనుకబాటుతనం వల్ల ఉద్యోగాలు పొందలేకపోయినవారికి రిజర్వేషన్లు కల్పించాలన్న అర్థంలో తీసుకుంటున్నారు. కాని అంబేద్కర్ ఉద్దేశించింది మాత్రం - పాలనా యంత్రాంగాన్ని ప్రజాస్వామీకరించాలని, అందరికీ ప్రభుత్వ ఉద్యోగాల్లో తగిన ప్రాతినిధ్యం ఉండాలని, అది ఒక హక్కు అని. దేశ పరిపాలన ప్రజాస్వామికంగా జరగాలి, సాంఘిక న్యాయానికి తగినట్టుగా జరగాలి, బడుగు వర్గాల ముఖ్యంగా దళితుల యొక్క యోగక్షేమాలు దృష్టిలో పెట్టుకుని జరగాలి అని అంబేద్కర్ భావించారు. పరిపాలనా రంగంలో అంతా బ్రాహ్మణులు, అగ్రవర్ణాలవారే ఉంటే రాజ్యాంగంలో ఎన్ని రాసుకున్నా, చట్టాలు ఎన్ని చేసుకున్నా అవి అమలుకావు - దళితులకు న్యాయం జరగదని ఆయన అన్నారు. పాలనను ప్రజాస్వామీకరించాలని, అధికార యంత్రాంగంలో దళిత వర్గాలకు చోటు కల్పించాలని పేర్కొన్నారు.

ఇవాళ కోర్టుల్లోనూ, బయట జరిగే చర్చల్లోనూ పాలనా యంత్రాంగాన్ని ప్రజాస్వామీకరించాలన్న అంశం మర్చిపోయి ఈ సమస్యను ఎక్కువ భాగం ఉద్యోగాలలో రిజర్వేషన్లుగా చూస్తున్నారు. అందుకే పదే పదే రిజర్వేషన్లకు, ముఖ్యంగా ఒబిసి రిజర్వేషన్లకు సుప్రీంకోర్టు అడ్డం పడుతున్నది. అసలు సుప్రీంకోర్టు నిర్మాణమే అప్రజాస్వామికంగా ఉంది. సుప్రీంకోర్టులో ఎప్పుడూ ఒక రకమైన రాజకీయ ఆచారంగా గత 20 సంవత్సరాలుగా ఒక

దళితుడ్ని, ఒక ఆదివాసిని, ఒకరో ఇద్దరో స్త్రీలను జడ్జిలుగా నియమిస్తున్నారు. సుప్రీంకోర్టులోగానీ హైకోర్టులోగానీ దళితులకూ ఆదివాసులకూ స్త్రీలకూ మైనారిటీలకూ తప్పనిసరిగా తగిన ప్రాతినిధ్యం ఉండాలనే చట్టం గానీ రాజ్యాంగ పరమైనటువంటి ఆదేశం గానీ లేదు. సుప్రీంకోర్టుతో సహా అన్ని కోర్టుల్లో అగ్రవర్ణాలకు చెందిన పురుషులే జడ్జీలుగా ఉంటున్నారు. ఇది ఆ వ్యవస్థ స్వభావాన్ని చాలా తీవ్రంగా ప్రభావితం చేస్తున్నది. ఈ రోజు న్యాయవ్యవస్థలో కూడా రిజర్వేషన్లు ఇవ్వాలని అడుగుతున్నారు. దీన్ని కేవలం ఉద్యోగ హక్కు అనే కోణం నుంచి చూస్తే పూర్తిగా అర్థం కాదు. ఉద్యోగ హక్కు తప్పనిసరిగా ఉండాలి. అది మాత్రమే కాకుండా పాలనా యంత్రాంగం, న్యాయవ్యవస్థ ప్రజాస్వామికంగా వ్యవహరించాలంటే వాటి మౌలిక స్వభావం కూడా మారాలి. అవి అగ్రవర్ణాల, పురుషుల వ్యవస్థలుగా ఉన్నంత కాలం ప్రజాస్వామికంగా ఉండలేవు. అంబేద్కర్ ఆలోచనలలో గల ప్రముఖమైన ఈ కోణాన్ని మర్చిపోయి ఉద్యోగ హక్కును ఉద్యోగ రిజర్వేషన్లు అనే పాక్షిక కోణంలోనే చూడడం జరుగుతున్నది. దీనిని సవరించుకోవడం చాలా అవసరం.

ప్రజాస్వామ్యభావన పాశ్చాత్య దేశాలలో చాలా చర్చ జరిగినటువంటి భావన. పరిపాలనా యంత్రాంగాన్ని అంటే ప్రభుత్వాన్ని ప్రజలు ఓట్లు వేసి ఎన్నుకోవాలి. ఆ ప్రభుత్వం చట్టబద్ధంగా పరిపాలించాలి. ఆ చట్టాలు ప్రజల ప్రాథమిక హక్కులకు లోబడి ఉండాలి. ఈ మూడు లక్షణాలు ప్రజాస్వామ్యాన్ని నిర్వచిస్తాయని వారి భావన. వీటికి అంబేద్కర్ మరోటి చేర్చారు. ఆయన సమాజంలో అధికారాన్ని తన చేతుల్లో పెట్టుకునే గవర్నింగ్ క్లాస్ అనేది ఉండకూడదన్నారు. గవర్నింగ్ క్లాస్ అంటే తెలుగులో పాలకవర్గం అని అనువదించుకోవచ్చు. కానీ మార్క్సిజం ప్రభావం వల్ల పాలకవర్గం అంటే దానికి ఒక అర్థం వచ్చింది. రాజకీయ ఆర్థిక వ్యవస్థలలో పైన ఉన్న వర్గాన్ని పాలకవర్గం అని అంటున్నాము. అంబేద్కర్ ఆ అర్థంలో గవర్నింగ్ క్లాస్ అనేది వాడలేదు. పాలనలో ఏ సామాజిక వర్గం అధికారాన్ని చలాయిస్తుందో దాన్నే గవర్నింగ్ క్లాస్ అన్నారు. వంశపారంపర్యంగా ఒక సామాజిక వర్గమే పరిపాలనలోనూ, అధికార యంత్రాంగంలోనూ ఉంటోందని చెబుతూ దానినే అంబేద్కర్ గవర్నింగ్ క్లాస్ అని అన్నారు. వారు ఎన్నికల ద్వారా చట్టప్రకారమే ఎన్నికయ్యి పరిపాలన చేస్తున్నా, ఆ చట్టాలు ప్రాథమిక హక్కులకు లోబడి ఉన్నా సరే ఆ వ్యవస్థ ప్రజాస్వామ్యం కాదన్నారు. అది ఒక వర్గం యొక్క పాలనే అని పేర్కొన్నారు. ఆ రోజుల్లో బ్రాహ్మణులను ఉద్దేశించి ఈ మాట వాడారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు బ్రాహ్మణులు బ్రిటిషువాళ్లతో అధికారాన్ని పంచుకుని స్వప్రయోజనాలకు ఉపయోగించుకున్నారు. ఆ తర్వాత

వారు చట్టప్రకారమే ఎన్నికవుతూ అధికారాన్ని పొందుతున్నప్పటికీ వారి పాలన ప్రజాస్వామ్యం కాదని, ఈ గవర్నింగ్ క్లాస్ పోవాలని, సమాజంలో అన్ని వర్గాల నుంచి ప్రజలు పాలనలో భాగం కావాలని అంబేద్కర్ పేర్కొన్నారు. కానీ ఈనాటికీ ఈ గవర్నింగ్ క్లాస్ పోలేదు. ఇవాళ ఒక్క బ్రాహ్మణులే కాక ఇతర అగ్రకులాలవారు, అనుత్పాదక ఆర్థిక రంగాలలో ఉన్నవారు, సివిల్ కాంట్రాక్టర్లు, షేర్ బ్రోకర్లు, రియల్ ఎస్టేట్ డీలర్లు, కమీషన్ ఏజెంట్లు - ఇటువంటి వారి వర్గం ఒకటి సమాజంలో ఉంది. ఈ వర్గమే పదేపదే ఎన్నికవుతూ ఉంది. ఇది ఒక గవర్నింగ్ క్లాస్‌గా భారతదేశంలో స్థిరపడి పోయింది. దీనిని తొలగించనంత కాలం ప్రజాస్వామ్య మన్నదానికి అర్థం లేదని అంబేద్కర్ భావించారు. మనకు ఎన్నికలు ఉన్నాయి. చట్టబద్ధ పరిపాలన నడుస్తున్నది. ఆ చట్టాలు ప్రాథమిక హక్కులకు లోబడి ఉన్నాయి. అయినా ఈ గవర్నింగ్ క్లాస్ పదేపదే అధికారంలో ఉంటుండడం ప్రజాస్వామ్యం యొక్క అసంపూర్ణతను సూచిస్తున్నదన్న కోణం నుండి దీనిని చూడడం అవసరం.

## అది హిందువులకే అవసరం

అంబేద్కర్ కులవ్యవస్థను, మనుధర్మాన్ని విడనాడండి అని చెప్పింది దళితుల కోసం కాదు, హిందువుల కోసమే. ఇక్కడ ఆయన దళితులకు ఇచ్చిన సందేశం మీరు హైందవ మతంలో అంతర్భాగంగా ఉండి ఆ భావజాలంపై పోరాటం చెయ్యడం అనవసరం అని. దళితులు హిందువులు కారని, వారు తమని తాము హిందూ మతంలో భాగంగా చూసుకోనవసరం లేదని చెప్పారు. హిందూ సమాజం కాళ్ళచెప్పుల కింద ఉన్నటువంటి దళితులు బయటికి రావాలని పిలుపునిచ్చారు. చివరకు ఆయన బౌద్ధం స్వీకరించారు. హైందవ సమాజాన్ని సంస్కరించాలి, బాగుచెయ్యాలి, విప్లవీకరించుకోవాలి అని ఆయన చెప్పింది హిందువుల కోసమే అని గ్రహించాలి. మీరు నాగరీకులుగా ఉండదలచుకుంటే, మీరు ఆత్మగౌరవంతో బ్రతకదలచుకుంటే, మిమ్మల్ని మీరు నాగరీకులుగా చెప్పుకోదలుచుకుంటే - మీ సమాజాన్ని ప్రజాస్వామీకరించుకోవడం మీకే అవసరం అని హిందువులకు చెప్పారు. దళితులు వేరే మతం తీసుకున్నా కూడా హైందవ కులవ్యవస్థ చెప్పుల కింద ఉండడం జరుగుతున్నది కాబట్టి, వాళ్ళ కోసం కూడ అవసరమే అని ఆయన మాట్లాడారు. ఆ ప్రయత్నంలో భాగంగానే ఆయన హిందూకోడ్ బిల్లులో మార్పులు తెచ్చే ప్రయత్నం చేశారు. కానీ అది సాగలేదు.

సమాజంలో కులవ్యవస్థ ఉన్నంతకాలం ప్రజాస్వామ్యం సాధ్యం కాదని అన్నారాయన. ఎందుకంటే ప్రజాస్వామ్యానికి మూలమైన ఆలోచన ఏమిటంటే ప్రజల మధ్య పరస్పర సంభాషణ, సంవాదం. తద్వారా వారు ఒక అభిప్రాయానికి వస్తారు.

ఆ అభిప్రాయం ప్రకారం పార్టీలను, ప్రభుత్వాన్ని ఎన్నుకుంటారు. ఆ సంవాదానికి కులం అడ్డుగోడగా నిలుస్తుందన్నారు. కులం కారణంగా విడిపోయి ఒకరితోనొకరు సంభాషించుకోలేక, చర్చించుకోలేక, భావ స్పందనలను కూడా పంచుకోలేని పరిస్థితి ఉన్నప్పుడు ప్రజాభిప్రాయం అనేది ఉండదు. వివిధ కులాల అభిప్రాయాలే ఉంటాయి. ప్రజాభిప్రాయం అనేది లేకపోతే ప్రజాస్వామ్యానికి అర్థమే లేదని అంబేద్కర్ అన్నారు. ఇవాళ చాలామంది అనేక కారణాలవల్ల - దళిత నాయకులు సైతం - ఎత్తుగడల రీత్యా అధికారం లోకి రావడానికి హిందూత్వవాదులతో మమేకం కావచ్చు అనే ఆలోచనలు చేస్తున్నారు. ఇది చాలా నష్టదాయకమైనది, అన్యాయమైనది.

దీనికి ఒక ఉదాహరణ మాయావతి. అంబేద్కర్ కనుక బ్రతికి ఉంటే ఒక్క క్షణం కూడా మాయావతి రాజకీయాలను సమర్థించరు. హిందూత్వం అనేది మౌలికంగా అమానుషమైనది. దాంతో ఐక్యసంఘటనలు కట్టి పనిచెయ్యడం, ఎత్తుగడల రీత్యా హిందూత్వాన్ని వాడుకోవడం అనేవి ఆయన ఆలోచనా రీతికే వ్యతిరేకమైనవి, భిన్నమైనవి అనేది మనం గుర్తించాల్సిన అవసరం ఉంది.

**మన భూమి (విశాఖ) వారపత్రికకిచ్చిన ఇంటర్వ్యూ**

**ఏప్రిల్ 2007**



# పాపం, బాబాసాహెబ్!

మాయావతి రాజకీయాలు ఇప్పుడు ఎంత ముద్దొస్తున్నాయో! ఉత్తర భారతదేశంలో అయితే మీడియా 'విప్లవం' అన్న మాటకు తగ్గడం లేదు. ఏం చాతుర్యం, ఏం నేర్పు అని ఒకటే మురిసి పోతున్నారు.

మాయావతి రాజకీయాలలో చాతుర్యానికేం లోటు లేదు. ఎటొచ్చీ సామాజికంగా దాని భావం ఏమిటి అన్నది ప్రశ్న. 'దళిత రాజ్యాధికారం' అన్న భావనను దళితుల పార్టీ ఏదో ఒక రకంగా, ఎవరో ఒకరితో చేతులు కలిపి, ప్రస్తుత రాజ్యాంగయంత్రంలో అధికారం చేపట్టడం అనే అర్థానికి ఆమె మొదట కుదించింది. ఇప్పుడు దళిత కులంలో పుట్టిన వ్యక్తి ఏదో ఒకటి చేసి ముఖ్యమంత్రిగా ఉండడమే దళిత రాజ్యాధికారం అని ఆమె రాజకీయాలు వ్యాఖ్యానిస్తున్నాయి.

కేవలం దళితుల ఓట్లతో అధికారానికి రావడం సాధ్యం కాదు కాబట్టి దళితులు ఇతర సామాజిక వర్గాలతో పొత్తు కోసం ప్రయత్నించడం తప్పనిసరి. సిద్ధాంతం ఏమంటుందంటే బి.సిలు, మైనారిటీలను కలుపుకోవాలని. (ఉత్తర ప్రదేశ్‌లో ఆదివాసీ జనాభా చాలా తక్కువ.) దీనికి ములాయంసింగ్ వైఖరి, లేదా ప్రధాన బి.సి కులాలైన యాదవ తదితరుల సామాజిక స్వభావం ఆటంకమైనట్టయితే ఇతర బి.సి కులాలను, ఇతర బి.సి రాజకీయ శక్తులను ఏవిధంగా కలుపుకోవాలో ఆలోచించాలని చెప్తుంది. కాన్షీరాం, మాయావతిల నేతృత్వంలోని బహుజన సమాజ్‌పార్టీ ఈ ప్రయత్నం ఏ రోజూ చేయలేదు. 'తిలక్, తరాజు, తల్వార్'లకు వ్యతిరేకంగా ఎస్.సి, బి.సి, మైనారిటీల ఐక్యతను రూపొందించే బదులు బి.సిలకు వ్యతిరేకంగా 'తిలక్, తరాజు, తల్వార్'లతో ఐక్యతను ఆశ్రయించారు.

మనువాదానికీ బ్రాహ్మణీకానికి ప్రధాన ప్రతినిధి అయిన భారతీయ జనతా పార్టీతో మొదట రాజకీయ ఐక్య సంఘటన కట్టారు. ఆ విధంగా 'బెహన్‌జీ' కొంతకాలం ముఖ్యమంత్రి పదవి వెలగబెట్టారు. ఆ తరువాత అందరూ గొప్ప చాతుర్యంగా వర్ణిస్తున్న ఎత్తుగడను రూపొందించారు. మిశ్రాలు, పాండేలు, త్రివేదీలు తమ పార్టీకి బయట ఎందుకుండాలి, వారి పార్టీతో పొత్తు పెట్టుకుని అస్థిర ప్రభుత్వం ఎందుకు నడపాలి అని ఆలోచించారు. ఇది కాన్షీరాం 'ఎత్తుగడే'నంటున్నారు. అతనిదే అయినా అతని శిష్యురాలిదే అయినా దీని పర్యవసానం ఏమిటంటే బ్రాహ్మణులలో ఒక సెక్షన్ బహుజన సమాజ్ పార్టీలో పెద్ద సంఖ్యలో వచ్చి చేరారు. వాళ్ళు రావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. బ్రాహ్మణులు అధికారానికి అలవాటు పడ్డవారు. మొదటి నుండి వారి రాజకీయ వేదికలుగా ఉన్న కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీలు ఉత్తరప్రదేశ్‌లో ఇంక ఇప్పట్లో అధికారానికి వచ్చేటట్టు లేవు కాబట్టి అధికారానికి రాగల పార్టీని తమది చేసుకోవాలన్న ఆలోచన వారికి రావడం సహజం. అది చమార్‌ల పార్టీ అయితేనేం, ముసాహార్‌ల పార్టీ అయితేనేం - అధికారానికి అలవాటుపడ్డ ప్రాణం దేనికయినా రెడీయే. వారి కోరికలో బహుజన ఎత్తుగడకు గొప్ప అవకాశం చూసిన దళితనాయకులను అనాలి గానీ వాళ్లను అనేది ఏముంది?

రాజకీయాలలోనూ, సామాజిక ప్రక్రియలలోనూ చిహ్నాలకు, గుర్తులకు చాలా ప్రాముఖ్యం ఉంటుంది. నీలం రంగు ఏనుగు బొమ్మను దళిత శక్తికి ప్రతీకను చేసింది బహుజన సమాజ్ పార్టీయే. మాయావతి ఈ ఎన్నికలలో దానిని నిస్సంకోచంగా బ్రాహ్మణీకరించడం విషాదకరమైన అనేక విషయాలలో ఒకటి.

హాథీ నహీ గణేశ్ హై
బ్రహ్మ విష్ణు మహేశ్ హై

అంటూ ఆమె బహుజనుల ఏనుగు బ్రాహ్మణుల విఘ్నేశ్వరుడే అనింది. ఇంకా స్పష్టంగా

పండిట్ శంఖ్ బజాయేగా
హాథీ ఆగే బఢ్తే జాయేగా

బ్రాహ్మణులు శంఖం ఊదుతుండగా ఏనుగు ముందుకు పోతుంది అంటూ నడిపించేది ఎవరు...నడిచేది ఎవరు...మార్గదర్శనం ఎవరిది...'ప్రయాణం ఎటువైపు' అనే సందేహానికి ప్రతీకాత్మకంగా జవాబు కూడా చెప్పింది.

తనది ఇప్పుడు సర్వజన సమాజ్ పార్టీ అని కూడా బహుజన సమాజ్ పార్టీ నాయకురాలు అనింది. కాంగ్రెస్ పార్టీవారి నుంచి ఆ మాట ఎన్నడో విన్నాం. 'సర్వేజనా

సుఖినోభవంతు' అనే మాట బ్రాహ్మణుల నోట అంతకు ముందునుండే విన్నాం, దాని భావమూ కన్నాం. ఇప్పుడు మాయావతి కొత్తగా ఏం కనిపెట్టిందనుకోవాలి? ప్రజారాజకీయాలలో ఉండే వారికి - అది కమ్యూనిస్టు రాజకీయం కానివ్వండి, దళిత రాజకీయం కానివ్వండి - చారిత్రక జ్ఞానం, తాత్విక స్పష్టత ఉండవలసిన అవసరం గురించి తరుచుగా చర్చ జరుగుతుంటుంది. ఆ అవసరాన్ని ఉత్తరప్రదేశ్ ఎన్నికలు మరోసారి స్పష్టం చేసాయనుకోవాలి.

కాంగ్రెస్ పార్టీలో దళితులు నాయకులుగా ఉన్నా, వారిని అగ్రకులాలు నడిపాయనీ, మాయావతి పార్టీలో అగ్రకుల నాయకులు దళితుల వెంట నడవబోతారనీ ఒక వ్యాఖ్యానం వింటున్నాం. మిశ్రాలు, పాండేలు, త్రివేదీలు అంత తెలివితక్కువ వాళ్లనుకుంటున్నామా? వాళ్లు దళితుల వెంట - అందులోనూ చమార్‌ల వెంట - నడవడానికి ఇంత ఎత్తుగడ వేయలేదు. వేరే దేని నుండి కాకపోయినా ఉత్తర భారతదేశంలో ప్రధానంగా బ్రాహ్మణుల చేతిలో ఉన్న మీడియా సంబరం నుండయినా ఈ విషయం గ్రహించగలిగి ఉండాలి.

మాయావతి ఒకవేళ సిద్ధాంతం ప్రకారం బి.సి కులాలతోనూ మైనారిటీలతోనూ రాజకీయ ఐక్య సంఘటన కట్టి ఇదే విజయం సాధించి ఉంటే మీడియా స్పందన, రాజకీయ విశ్లేషకుల స్పందన ఎంత భిన్నంగా ఉండేవో! ఉపద్రవం వచ్చి మీద పడిందన్నట్టు వ్యాఖ్యానించే వారనడంలో సందేహం లేదు. 2009లో కేంద్రంలో ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా మాయావతి పార్టీ (దానినిక మీదట బహుజన సమాజ్ పార్టీ అనలేము) నిర్ణాయక పాత్ర నిర్వహిస్తుందనీ, 'బెహన్‌జీ' దేశ ప్రధానమంత్రి అయ్యే అవకాశం లేకపోలేదనీ ఢిల్లీలో విశ్లేషకులు ఉత్సాహంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఆమె ఎస్.సి, బి.సి, మైనారిటీల ప్రాతిపదికన గెలిచి ఉన్నా అదే అవకాశం ఉండేదిగానీ అప్పుడింత ఉత్సాహం ఉండేది కాదు. మిశ్రాలతో, పాండేలతో, త్రివేదీలతో స్నేహం చేయనేర్చిన దళిత మహిళ దేశ ప్రధాని అయితే గౌరవానికి గౌరవం, ప్రయోజనానికి ప్రయోజనం సిద్ధించవూ!

ఈ స్థితి రావడానికి బాధ్యత పూర్తిగా మాయావతిదీ, ఆమె గురువుదీ కాకపోవచ్చు. ములాయంసింగ్‌దే ఎక్కువ బాధ్యత కావచ్చును కూడా. ఎస్.సి., బి.సి, మైనారిటీల ఐక్యత అనేదే ఇద్దరి సిద్ధాంతమూ. అయితే దేశంలో అన్ని ప్రాంతాలలాగ ఉత్తరప్రదేశ్‌లో కూడా అగ్రకులాలు భూముల్ని బి.సి.లకు అమ్మేసి గ్రామాలు విడిచిపెట్టి పోతుండడం వల్ల, బి.సి. కులాలలోనే ముందునుండి భూములున్నవారి సంఖ్య గణనీయంగా ఉండడం వల్ల, సిద్ధాంతం ఏం చెప్పినా దళితులకూ బిసిలకూ

మధ్య వైరుధ్యం చెప్పుకోదగ్గ మోతాదులో ఉంది. ఎస్.సి., బి.సి ఐక్యత అనేది చాతుర్వర్ణాన్ని ప్రాతిపదికగా పెట్టుకుని చూసినప్పుడు చాలా సహజమైన విషయంగా కనిపిస్తుందిగానీ సామాజిక ఆర్థిక వ్యవస్థలో కులం స్థానాన్ని, పాత్రను నిర్దిష్టంగా లెక్కలోకి తీసుకుని చూసినప్పుడు అది కష్టతరమైన విషయం. దానికోసం ప్రయత్నం ప్రధానంగా బి.సి కులాల ప్రతినిధుల నుండే రావలసి ఉంటుంది. ములాయంసింగ్ ఆ ప్రయత్నం చేపట్టిన దాఖలాలేవీ లేవు. బహుజన రాజకీయాలకు ఉత్తరప్రదేశ్‌లో పట్టిన దుర్గతికి ములాయం సింగ్ బాధ్యత చాలా ఉంది.

చచ్చి ఏ లోకాన ఉన్నారోగాని ఫూలె, అంబేద్కర్, పెరియార్‌లు తమ ఆలోచనలకు తమ వారసులు పట్టించిన గతికి చాలా బాధపడుతుండాలి పాపం!

**నిగాహ్ ప్రజాతంత్ర వారపత్రిక**

**13 మే 2007**



# తెలుగు పత్రికారంగానికి ఆత్మపరిశీలన అవసరం

మంద కృష్ణ అనుచరులు భౌతికదాడికి దిగకుండా ఇందిరా పార్కు దగ్గర టెంట్ వేసుకుని కూర్చొని తెలుగు దినపత్రికల నిష్పాక్షికత గురించి చర్చించుకుందాం రండి అని పత్రికల యాజమాన్యాలకూ, పాఠకులకూ పిలుపు ఇచ్చి ఉంటే ఏం జరిగి ఉండేది? అతనికే ఎక్కువ సానుభూతి లభించి ఉండేదనడంలో సందేహం లేదు.

దళిత ఉద్యమాలయినా ఇతర ప్రజాఉద్యమాలయినా నూటికి తొంభై అయిదు శాతం స్వచ్ఛంగా లేని మాట వాస్తవమే. అవి అధికార రాజకీయాలలో పావులయిన మాట కూడా వాస్తవమే. ఉద్యమాలే కాదు, ప్రజల సమస్యలు, ఆకాంక్షలు, అణచివేత, అవమానాలు అన్నీ అధికార రాజకీయాలలో పావులయ్యాయి. ఈ సత్యాన్ని నిష్పాక్షికంగా పత్రికలు వ్యక్తం చేస్తే ఒక మంచి కర్తవ్యాన్ని నిర్వర్తించినట్లు ఉండేది. కానీ పత్రికలు కూడ అధికార రాజకీయాలలో పావులయ్యాయి.

ఈ ఫిర్యాదును ఎక్కడ చర్చించుకోవాలి? ప్రజా జీవితానికి సంబంధించిన ఏ ఫిర్యాదునయినా చర్చించడానికి మీడియా ఒక ముఖ్య మాధ్యమం. కానీ మీడియా గురించి ఫిర్యాదులు ఎక్కడ చర్చించాలి? ఒక విషయాన్ని గురించిన వార్తను తెలుగు దినపత్రికలలో చదివి, అసలేం జరిగిందో అర్థం కాక, అదే విషయాన్ని గురించి ఏదైనా ఇంగ్లీష్ పత్రికలోగానీ, ఉర్దూవస్తే ఉర్దూ పత్రికలోగానీ రెండు లైన్లు రాసారేమోనని వెతుక్కుని చదివి 'ఇదా ఇంతకూ జరిగింది!' అనుకున్న రోజులెన్ని లేవు?

పత్రికా స్వేచ్ఛ ఎంత ముఖ్యమైన విలువో, పత్రికలలో నిష్పాక్షికత కూడా అంతే ముఖ్యమైనది. నిష్పాక్షికత అంటే ఏ దృక్పథమూ లేకపోవడం అని కాదు. ప్రతీ మనిషికీ ఉన్నట్టే ప్రతీ పత్రికకూ ఒక ప్రాపంచిక దృక్పథం ఉండవచ్చు. వార్తలకు ప్రాముఖ్యం ఇవ్వడంలోనూ, వ్యాఖ్యానించడంలోనూ ఆ దృక్పథం చేసే ఎంపిక ఉంటుంది. దాని ప్రభావం ఉంటుంది. వేరే దృక్పథానికి ఆ ఎంపిక పక్షపాతంతో కూడినదిగా కనిపించవచ్చు. ఇది కొంతవరకు అనివార్యమే అయినప్పటికీ ఇక్కడ కూడా నిష్పాక్షికతకు నిర్వచనమూ ప్రమాణాలూ నిర్దేశించవచ్చు. కానీ తెలుగు జర్నలిజంలో మనం చూస్తున్న పక్షపాతం సైద్ధాంతిక లేక తాత్విక పక్షపాతం మాత్రమే కాదు. ఒక రాజకీయ పక్షం లేక ఒక వర్గం ప్రయోజనాలను ప్రమాణంగా పెట్టుకుని వార్తలను ఎంపిక చేయడం, వ్యాఖ్యానించడం, తొక్కి పెట్టడం, అప్పుడప్పుడు లేనివి కల్పించడం అనే పక్షపాతాన్ని చూస్తున్నాం. పత్రికా స్వేచ్ఛపైన ఎం.ఆర్.పి.ఎస్. చేసిన దాడి ఎంత నష్టకరమైందో ఇదీ అంతే నష్టకరమైనది కాదా? పత్రికా స్వేచ్ఛకే నష్టకరమైనది కాదా?

మంద కృష్ణ అనుయాయులు చేసిన దాడిని చాలామంది దళిత ఉద్యమ కారులు, మేధావులు ఖండించారు. కొందరికి ఇందులో వేరే ప్రయోజనాలు ఉండ వచ్చును గానీ ఎక్కువ భాగం ఈ ఖండనలో నిజాయితీ ఉంది. అంతేకాక ఒక ఆత్మ పరిశీలన ధ్వని కూడా ఉంది. కారంచేడు మారణకాండ తరువాత అత్యున్నత చైతన్యంతో ముందుకొచ్చిన దళిత ఉద్యమం ఇవాళ రాజకీయ ప్రయోజనాలకూ అవకాశవాదానికీ బందీ అయిందన్న ఆవేదనా ఉంది. కానీ పత్రికారంగం నుండి వస్తున్న స్పందనలో అటువంటి ఆత్మవిమర్శ కించిత్తు కూడా కనిపించడం లేదు. పత్రికారంగం ఆ రకమైన దాడి చేయగలిగేంత చులకన ఎట్లా అయింది? నిత్యం పత్రికల వార్తల ద్వారా లభించే ప్రచారంపైన ఆధారపడే ఉద్యమకారులు ఇంతటి దాడికి ఎట్లా తెగించారని ఆశ్చర్యపోతున్నారే తప్ప ఆ స్థితి ఎక్కడినుండి వచ్చిందన్న ప్రశ్న వేసుకోవడం లేదు.

తెలుగు పత్రికారంగానికి ఉన్నతమైన చైతన్యం ఎప్పుడయినా ఉండిందో లేదో తెలియదు. కాంగ్రెస్ మార్కు జాతీయవాదం, సామాజిక విషయాలలో యథాస్థితి వాదం దాని లక్షణాలుగా ఉండేవి తొలినాడు. తెలుగుదేశం పార్టీ పుట్టి కాంగ్రెస్ పార్టీకి ప్రత్యామ్నాయంగా ఎదిగిన క్రమంలో రాజకీయ పక్షాల, వర్గాల ప్రయోజనాలను ప్రమాణంగా పెట్టుకున్న పక్షపాత వైఖరి ప్రబలింది. కానీ అది వెంటనే పూర్తి స్థాయి చేరుకోలేదు. 2004 ఎన్నికల తరువాత దానికి చేరువ అయింది. గడచిన కొన్ని

నెలల కాలంలో ఆ ప్రస్థానం పూర్తి అయింది. తెలుగు దినపత్రికలు చేసే వ్యాఖ్యలను రాజకీయ వ్యాఖ్యలుగా కాక పత్రికా రంగం తన వృత్తి ధర్మంలో భాగంగా చేసే వ్యాఖ్యలుగా సాధారణ పాఠకులు సహితం స్వీకరించగల స్థితి ఉండి ఉంటే, మరొక రకంగా అర్థం చేసుకుని అసహనం ప్రదర్శించినందుకు మందకృష్ణను, ఇతర ఎస్.సి, బి.సి నాయకులనూ నిందించవచ్చు. కానీ ఆ స్థితి ఉందా? పత్రికలు నిర్మొహమాటంగా రాజకీయ పాత్ర నిర్వర్తిస్తూ, దాడి జరిగినప్పుడు పత్రికా స్వేచ్ఛ అనే విలువ వెనుక దాక్కోవడం అసమంజసం అన్న వ్యాఖ్య పట్ల పత్రికారంగం చేసుకుంటున్న ఆత్మపరిశీలన ఏదీ?

భౌతిక దాడి చేయడం తప్పనడంలో సందేహం అక్కరలేదు. ఇది మొహమాటం కోసం అంటున్న మాట కాదు. హింసను ఖండించకపోవడం అనాగరికం అనుకుంటారన్న భయంతో అంటున్న మాటా కాదు. పత్రికలలో అప్రియమైన వార్త రాస్తే దాడి చేస్తారేమోనని భయపడే స్థితి ఉండడం సమాజానికి మంచిది కాదు. బడుగు వర్గాలకసలే మంచిది కాదు. వర్గీకరణ డిమాండుకు అనుకూలంగా వార్తలుగానీ, వ్యాఖ్యలుగానీ రాస్తే వర్గీకరణను వ్యతిరేకించే వారు దాడి చేస్తారన్న భయం పత్రికలలో ఉంటే తన ఉద్యమానికి చాలా నష్టం అని మంద కృష్ణకు తెలీదా? దళితులపైన అగ్రకులాలు చేసే దాడులను విమర్శించే ధోరణిలో వ్యాఖ్యలు చేస్తే అగ్రకులాలు దాడి చేస్తారేమోనన్న భయం పత్రికలలో ఉంటే దళిత ఉద్యమానికి చాలా నష్టం అని తెలీదా? తాను ఇప్పుడు పంపిన సంకేతాన్ని బడుగు వర్గాల వ్యతిరేకులు అందుకుంటే సమాజ పురోగతికి ఎంత నష్టం జరుగుతుందో గ్రహించలేడా? చట్టబద్ధ పాలన, పత్రికా స్వేచ్ఛ వంటివి కలవారి చేతిలో సాధనాలు అని ఆవేశంగా అంటుంటారు గానీ అవి నిజానికి కలవారి కంటే లేనివారికే ఎక్కువ అవసరం. అవేవీ లేకున్నా కలవారి రాజ్యం సజావుగా సాగుతూనే ఉంటుంది. లేనివారే నష్టపోతారు. ఈ సత్యాన్ని గ్రహించలేని వ్యక్తికి ప్రజా ఉద్యమకారుడిగా గుర్తింపు పొందే యోగ్యత లేదు.

అయితే ప్రజలకు మేలు చేయగల పాత్రను పత్రికారంగం సమర్థంగా నిర్వర్తించాలంటే తనకు కవచంగా వాడుకునే విలువలను తన ఆచరణలోనూ ప్రదర్శించాలి. నిష్పాక్షికత లేని పత్రికా స్వేచ్ఛకు ఉండగల గౌరవం ఎంత? రాజకీయ పాత్ర నిర్వర్తిస్తూ అమూల్యమైన సమాచార విలువకు ప్రతినిధులుగా చూడమని డిమాండ్ చేస్తే దానికి ఉండగల విశ్వసనీయత ఎంత? ఎం.ఆర్.పి.ఎస్. వాళ్లు భౌతిక దాడికి దిగకుండా ఈ చర్చ లేవదీస్తే బాగుండేది. 'అనవలసిందంతా అనేసి మమ్మల్ని మాత్రం చర్చకు రమ్మంటారా?' అని మంద కృష్ణ అనడమేకాక, అతని వ్యవహార

శైలి పట్ల పెద్దగా ఆమోదం లేనివారు సహితం తెలుగు పత్రికారంగం తీరుతెన్నుల పట్ల ఏర్పడిన విసుగు కారణంగా అతనిని సమర్థిస్తున్నారు. ఇది తప్పు. బడుగు వర్గాల నేతలుగా గుర్తింపు పొందిన వారిపైన చేసిన ఆ వ్యాఖ్య నిజమా అవాస్తవమా అనేదిక్కడ ప్రశ్న కాదు. దానిని వార్తా వ్యాఖ్యగా స్వీకరించాలా లేక రాజకీయ ప్రయోజనాల నుండి పుట్టిన వ్యాఖ్యగా స్వీకరించాలా అన్నది ప్రశ్న. అసలు తెలుగు పత్రికలు సమాచారాన్ని అందించే పాత్ర నిర్వర్తిస్తున్నాయా లేక రాజకీయ పాత్ర నిర్వర్తిస్తున్నాయా అన్నది ప్రశ్న. ఇది ఒక పత్రికకు మాత్రమే సంబంధించిన ప్రశ్న కాదు. మొత్తంగా వర్తమాన తెలుగు పత్రికారంగానికి సంబంధించిన ప్రశ్న.

ఇది ఒక కార్యాలయం అద్దాలు పగలగొడితేనూ, కుర్చీలు విరగ్గొడితేనూ జవాబు దొరికే ప్రశ్న కాదు. లక్షల సంఖ్యలో ఉన్న తెలుగు దినపత్రికల పాఠకుల సమక్షంలో సంవాదం జరగాలి. అది అవే దినపత్రికల ద్వారా జరగడం అసాధ్యమైతే వేరే మార్గం వెతుక్కోవాలి. మంద కృష్ణకూ, ఆర్.కృష్ణయ్యకూ ఏ కారణంగానైనా దీనిపట్ల ఆసక్తి లేకపోతే ఇతర తెలుగు ప్రజానీకమైనా ఈ చర్చ జరుపుకోవాలి. ప్రజాస్వామ్యంలోని అన్ని రంగాలలాగా స్వేచ్ఛాయుతమైన పత్రికారంగాన్ని సైతం దాడుల నుండే కాదు రాజకీయ పక్షపాతం నుండి, ఎంపిక చేసుకున్న వర్గాల ప్రయోజనాల ప్రభావం నుండి కూడా కాపాడుకోవడం అవసరం.

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**జూన్ 2008**



# ఉద్యమంగా మారలేకపోయిన నందిగామ ఉదంతం

తెలుగు నేల ఉద్యమాలకు నెలవు అని గర్వంగా నమ్మిన రోజులుండేవి. ఇప్పుడు ఆ దశ నుండి చాలా దూరం వచ్చా మనడానికి ఉసేనప్ప హత్య బాధాకరమైన ఉదాహరణ. ఒకనాడు అటువంటి ఘోరం రాష్ట్రవ్యాప్త నిరసనకు దారితీసి ఉండేది. కంచికచర్ల, కారంచేడు, చుండూరు, నీరుకొండల సరసన నందిగామ చేరి ఉండేది. కానీ ఇవాళ నందిగామ అంటే ఏ నందిగామ, కృష్ణా జిల్లా నందిగామా వరంగల్ జిల్లా నందిగామా అని అడిగే పరిస్థితి ఉంది.

ఆ ఊరూ అయి ఉండవచ్చు. ఈ ఊరూ అయి ఉండవచ్చు. కానీ ఇది వేరే ఊరు. మహబూబ్‌నగర్ జిల్లా మద్దూరు మండలంలో నందిగామ అనే చిన్న ఊరుంది. ఊరిలోని 200 చిల్లర ఇళ్లలో దాదాపు సగం రెడ్లవి. కడప జిల్లాలో తప్ప వేరే ఎక్కడా అటువంటి ఊర్లు ఎక్కువగా కనిపించవు. సహజంగానే ఆ ఊరి సర్పంచ్‌గా ఎప్పుడూ ఒక రెడ్డే ఎన్నికయ్యేవాడు. ఊరిలో అన్నీ వారి చేతి మీదుగానే జరిగేవి.

ఎందుకయిందోగానీ గత పంచాయతీ ఎన్నికలలో నందిగామ సర్పంచ్ పదవి ఎస్.సి.లకు రిజర్వ్ అయ్యింది. అగ్రకులాలు పెద్దసంఖ్యలో ఉన్న గ్రామంలో సర్పంచ్ పదవి ఎస్.సి.లకు రిజర్వ్ అయితే ఏదో జన్మహక్కు పోయినట్లు కోర్టుకెక్కి ఆ అన్యాయాన్ని సవాలు చేయడం మన రాష్ట్రంలో పరిపాటి. నందిగామ రెడ్లకు ఆ ఆలోచన రాలేదో, కోర్టుకు పోయినా స్టే దొరకలేదో గాని ఆ ఊరిలో సర్పంచ్ రిజర్వేషన్ ఆగలేదు.

ప్రత్యామ్నాయంగా వారు నోరులేని దళిత మహిళను తమ అభ్యర్థిగా - అంటే కాంగ్రెస్ అభ్యర్థిగా నిలబెట్టారు. ఆమె పేరు కిష్టమ్మ. మహిళలకు రిజర్వ్‌కాని సీటు మహిళలకు ఇవ్వడం అరుదేమోగానీ, నోరులేనితనం 'ప్రధాన క్వాలిఫికేషన్' కావడం వల్ల ఆ అసాధారణ భాగ్యం కిష్టమ్మకు దక్కింది. ఆమె చేత వేలిముద్రలు వేయించుకుంటూ ఊరిని నిరాటంకంగా ఏలుదామని పటేండ్లు అనుకున్నారు.

వారి ఊహ తలకిందులయింది పాపం. దానికి కారణం కిష్టమ్మ ఇల్లరికం తెచ్చుకున్న అల్లుడు ఉసేనప్ప. ఉసేనప్ప పెద్దగా చదువుకోలేదుగానీ తెలివైనవాడు, సాహసి, ఆత్మగౌరవం గలవాడు. సర్పంచ్‌గా ఎన్నికైన అత్తగారు కిష్టమ్మకు అండగా ఉండి రెడ్ల పాచిక పారకుండ చూసాడు. వెనక ఉండి అతనే గ్రామ పాలన నడిపించాడంటే అతిశయోక్తి కాదు. తన స్వార్థం చూసుకోలేదు, సంపాదించుకోలేదు. దళితులకు రిజర్వేషన్ ఇవ్వడంలో గల లక్ష్యాన్ని నిలబెట్టాడంతే. అతని అత్తమీద పోటీ చేసి ఓడిపోయిన తెలుగుదేశం అభ్యర్థి తిరుమలి భీమన్న ఇచ్చిన కితాబుకంటే అతని వ్యక్తిత్వానికి వేరే కితాబు అక్కరలేదు. ఉసేనప్ప దౌర్జన్యాన్ని వ్యతిరేకించేవాడే తప్ప తన స్వంతలాభంగానీ రాజకీయ ప్రయోజనంగానీ చూసుకున్న మనిషి కాదు అన్నది భీమన్న ఉవాచ. రెడ్లతో 'నువ్వెంతో నేనంతే' - నేను కాదు మేమంతే - అన్నట్టు వ్యవహరించాడనడానికి ఉదాహరణలు చాలానే ఉన్నాయి.

అంజలమ్మ అనే దళిత స్త్రీ తనకు కూలి డబ్బులు బాకీ ఉన్న శ్రీనివాసరెడ్డి అనే రైతును ఒకటికి రెండుసార్లు ఆ డబ్బు చెల్లించమని అడిగింది. మొదట ఇస్తాను లెమ్మన్నాడు. తరువాత కోపగించుకున్నాడు. అతని తమ్ముడు రవీందర్‌రెడ్డి ఆమెను దూషించాడు. విపరీతంగా కొట్టాడు. ఉసేనప్ప రంగంలోకి దిగి ఆమెకు వారిచేత వైద్యం ఖర్చులేకాక అయిదు వేల రూపాయల నష్టపరిహారం కూడా ఇప్పించాడు. ఈలోగా ఆమె కుటుంబ సభ్యులు రెడ్లిద్దరిపైనా క్రిమినల్ కేసుపెట్టారు. పోనీకదా అని రాజీపడి పైసలిస్తే కేసుపెడతారా అని వారు ఆగ్రహించారు. ఉసేనప్ప తొణకకుండ కేసు వెనక్కి తీసుకోవాలంటే ఇంకొంచెం నష్టపరిహారం ఇయ్యవలసి ఉంటుందని చెప్పి అంజలమ్మకు ఇంకొక 15 వేలు ఇప్పించాడు.

అభివృద్ధి పనుల కాంట్రాక్టులు కబ్జా చేయడం సర్పంచ్‌గిరీని వెలగబెట్టడంలో గల ప్రధాన లక్ష్యం అనేది అందరికీ తెలిసిందే. నందిగామకు మండల కేంద్రం దిశగా రోడ్డు మంజూరు కాగా, సర్పంచ్‌గా కిష్టమ్మను నిలబెట్టి గెలిపించింది మేమే కాబట్టి కాంట్రాక్టు మాదేనన్నారు రెడ్లు. ఉసేనప్ప వారి ప్రయత్నాన్ని సాగనివ్వకుండా తానే ఆ పని చేపట్టాడు.

ఈ సంవత్సరం జూన్ నెలలో ఆ గ్రామంలో ఒక యాదవుల ఇంట్లో పెళ్లయింది. రెడ్డి యువకులు బాగా తాగి పందిట్లో డాన్సు చేయడం మొదలుపెట్టారు. చాలామందికి విసుగొచ్చిందిగానీ వారినేం అనలేకపోయారు. ఉసేనప్ప తెలివిగా బ్యాండు మేళం వారిని పంపించేసాడు. పాట ఆగిపోయేసరికి ఉత్సాహం చచ్చిన రెడ్డి యువకులకు ఉసేనప్పపైన చాలా కోపం వచ్చింది. అతన్ని వాళ్లు తిట్టగా వారినతను తిరిగి అవే బూతులు తిట్టాడు. అప్పుడే అతనిపైన దాడి చేసే పరిస్థితి ఉండింది. అది గమనించిన ఒక యాదవుల పెద్ద ఉసేనప్పను నేర్పుగా తప్పించి ఇల్లు చేర్చాడు.

ఇంతలో జూలై 3 నాడు వాళ్లు ఉసేనప్పను చంపనే చంపారు. ఆ రోజు ఉసేనప్ప రెడ్డి కులానికి చెందిన వారి పని మీదనే మండలానికి వెళ్లాడు. సాయంత్రం వారితోబాటు తిరిగి వచ్చి మాదిగపల్లెలోని తన ఇంటికి పోయాడు. ట్రాన్స్‌ఫార్మర్ ఉన్నచోటనే ఆ ఊరి బెల్టు షాపూ ఉంది. పొద్దున్న అతనితోపాటు మండలానికి వెళ్లిన రైతులు బెల్టు షాపులోకి ఉసేనప్పను రమ్మన్నారు. వారితోబాటు తాగి బయటికొస్తుండగా అతనక్కడ ఉన్నాడని తెలిసి మాటువేసిన నలుగురు రెడ్లు దాడి చేసారు. అతనితోబాటున్నవారు వారించినా ఆగలేదు. ఉసేనప్ప కళ్లల్లో కారంగొట్టి కడుపు, మెడ తల్వార్‌తో చీరారు. ఉసేనప్ప అక్కడికక్కడే చనిపోయాడు. కిష్టమ్మ ప్రత్యర్థి అయిన ఓడిపోయిన తెలుగుదేశం సర్పంచ్ అభ్యర్థి భీమన్న ఆలోచించదగ్గ మాట అన్నాడు. అతను ఉసేనప్పతో "వాళ్లు అధికారం మీ అత్తద్వారా అనుభవిద్దామని ఆమెను నిలబెట్టారు. నువ్వు వాళ్ళ అండతో మీ అత్తను గెలిపించుకుని వారి ఎత్తుగడను తిప్పికొట్టి నువ్వే అధికారం చలాయిద్దామని చూస్తున్నావు. దాని బదులు దళితులంతా ఒకటయి ఏకగ్రీవంగా ఒకరిని ఎన్నుకుందాం" అని చెప్పాడట. అయితే ఉసేనప్ప వినలేదు అన్నాడు. నిజమే, ఉసేనప్ప వినలేదు. అయితే ఉసేనప్ప ఎందుకినాలి? పీడితులను ఒక తాటిన నిలబెట్టి నడిపించే బదులు బలవంతుల ఎత్తుగడలకు సహకరించి వారి ద్వారానే అధికారం అనుభవిద్దామన్న ఆలోచన ఇప్పుడెంతమంది దళిత నాయకులు చేయడంలేదు? ఉత్తరప్రదేశ్‌లో మాయావతి నుండి మన దగ్గర చిరంజీవికి నిన్నమొన్న జైకొట్టిన దళిత నాయకులదాకా ఇదే సమకాలీన అంబేద్కరిజం అనుకోవడం లేదా? దీనికి ఉసేనప్ప భౌతికంగా మూల్యం చెల్లించాడు. ఈ నాయకులు రాజకీయంగా చెల్లించబోతారా?

ఉసేనప్ప కథ ఇంకొంచెం చెప్పుకోవాలి. అతనిని హత్య చేసిన వారు నేరుగా కొడంగల్ ఎంఎల్ఏ గుర్నాథరెడ్డి దగ్గరికి వెళ్లారు. అతని దగ్గర రెండు రోజులు ఆశ్రయం తీసుకుని అతని సలహా మేరకు పోలీసులకు సరండర్ అయ్యారు. నిజానికి

రెండు నెలల కింద జడ్చర్ల ఉపఎన్నిక సందర్భంగా కాంగ్రెస్ పార్టీ ప్రచారానికి పోయిన కిష్టమ్మ, అల్లుడ్ని తీసుకుని పోయి ఎంఎల్‌ఏని కలిసింది. ఉసేనప్పను బయటే ఉండమని ఎంఎల్‌ఏ అన్నప్పటికీ అతను కూడా లోపలికి వెళ్లాడు. తమ ఊరి రెడ్లు ఉసేనప్పను చంపుతామంటున్నారనీ రక్షించాలనీ కిష్టమ్మ కోరింది. ‘‘ఇవ్వాళ వాళ్లను తిట్టాడు. రేపు నన్ను తిట్టడా? చంపుతారు. బతకాలనుకుంటే కొన్నాళ్లు పోయి ఏ ముంబాయిలోనో ఉండమను’’ అన్నాడట గుర్నాథరెడ్డి.

గుర్నాథరెడ్డి ప్రోత్సాహంతోనే ఉసేనప్ప హత్య జరిగిందనీ అతనిని కూడా ముద్దాయిలలో చేర్చాలనీ స్థానిక దళిత సంస్థలు డిమాండ్ చేస్తున్నాయి. నందిగామ నుండి కొడంగల్ దాకా పాదయాత్రగా పోయి కొడంగల్‌లో ఈ డిమాండ్‌తో బహిరంగ సభ పెట్టాలన్న వారి ప్రయత్నాన్ని పోలీసులు సాగనివ్వలేదు. పాదయాత్ర చేయనిచ్చారు గానీ కొడంగల్‌లో మాత్రం ఎటువంటి సభా జరగడానికి వీలు లేదని నిషేధాజ్ఞలు విధించి ఆపారు. రెండు దశాబ్దాలుగా కొడంగల్ ప్రాంతంలో ఏకచ్ఛత్రాధిపత్యం నెరుపుతున్న గుర్నాథరెడ్డిపైన ఆరోపణలకు కొదువలేదు. కల్తీకల్లుకు అతనే సంరక్షకుడనీ అందుకు అతనికి నెలకు అయిదు లక్షల నజరానా ముడుతుందనీ చాలాకాలంగా వింటున్నాం. పాలకులు చెప్పుకునే అభివృద్ధిగానీ నక్సలైట్ తరహా తిరుగుబాటుగానీ ఏదీ తాకని ఈ ప్రాంతం సామాజికంగా నూరేళ్ళు వెనకబడి ఉంది. గ్రామాలలో రెండు గ్లాసుల వ్యవస్థతో మొదలుపెట్టి అన్ని రకాల దౌర్జన్యాలకూ నెలవుగా ఉండి, వీటన్నిటికీ గుర్నాథరెడ్డే రక్షకుడనేది సామాన్య ప్రజల నమ్మకం. ఇప్పుడు మొదటిసారి అతనికి వ్యతిరేకంగా ఒక ఆందోళన ముందుకొచ్చింది గానీ దానిని బలంగా కొనసాగించే రాజకీయ ఉద్యమంగానీ సామాజిక సమీకరణగానీ లేవు. అతనిని అరెస్టు చేయాలన్న డిమాండ్ పెట్టిన సాహసులే భయం భయంగా బతికే పరిస్థితి నెలకొంది. ఈ భయం నుండి విముక్తి కలిగించే కార్యాచరణ కోసం వారు వెతుకుతున్నారు. దానికి కావలసిన ఆసరా బయటినుండి దొరుకుతుందా?

**నిగాహ్, ప్రజాతంత్ర వారపత్రిక**

**31 ఆగస్టు 2008**



# ఉద్యమ సాహిత్యాభిమానులకి విజ్ఞప్తి

పౌరహక్కుల, మానవ హక్కుల ఉద్యమానికి సైద్ధాంతి కంగానూ, ఆచరణా త్మకంగానూ రాబోయే తరాలు సైతం గుర్తుంచుకొనేంత కృషి బాలగోపాల్ చేశారు. ఆయన ఆలోచనలని చర్చించడానికి, స్ఫూర్తిని కొనసాగించడానికి, మానవ సమాజ మార్పులో ఆయన జ్ఞాపకం సమిష్ఠి జ్ఞాపకంగా ఎదగాలనే ఆకాంక్షతో **ప ర్ స్పె క్టి వ్స్** సంస్థ కాకతీయ విశ్వవిద్యాలయాన్ని 'బాలగోపాల్ స్మారకోపన్యాసం'ని ప్రతి ఏటా అక్టోబర్ 8న నిర్వహించాల్సిందిగా కోరింది. నిజాయితీగా ప్రజల పక్షాన నిలబడ్డ మేధావులచే, ఉద్యమ నాయకులచే ఈ ఉపన్యాసాలుంటాయి. ఈ కార్యక్రమ నిర్వహణకు కావలసిన వనరులను వి.యస్.ప్రసాద్‌గారి సహకారంతో **ప ర్ స్పె క్టి వ్స్** విశ్వవిద్యాలయానికి సమకూర్చింది. ఇందుకు సానుకూలంగా స్పందించిన కాకతీయ యూనివర్సిటీకి మా అభినందనలు. ఈ కార్యక్రమం ప్రతి ఏటా విజయవంతం అయ్యేందుకు సహకరించాల్సిందిగా సమాజంలోని ప్రజాస్వామిక శక్తులందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం.

**ప ర్ స్పె క్టి వ్స్** ని నిర్వహించే అయిదు మందిలో బాలగోపాల్ ఒకరు. ఆయన మార్క్సిస్టు - లెనినిస్టు ఉద్యమాలపైనా, పౌరహక్కుల ఉద్యమాలపైనా, దళిత - ఆదివాసీ ఉద్యమాలపైనా ఇంకా అనేక విషయాలపైనా వివిధ పత్రికలలో రాసిన వ్యాసాలను వీలైనంత త్వరగా తెచ్చే ప్రయత్నం చేస్తున్నాం. ఈ కృషిలో **ప ర్ స్పె క్టి వ్స్, మానవ హక్కుల వేదిక, మట్టి ముద్రణలు, హెచ్.బి.టి**...ఇంకా కొంతమంది పాలుపంచుకుంటున్నారు.

**ప ర్ స్పె క్టి వ్స్** ప్రచురించే బాలగోపాల్ సంకలనాలన్నింటి వెనుకా ఎంతోమంది సహకారముంది....మరీ ప్రత్యేకంగా వేమన వసంత, మన్నం బ్రహ్మయ్యలకు మా కృతజ్ఞతలు ఎంత చెప్పినా తక్కువే. బాలగోపాల్ రచనల సర్వస్వాన్ని అందరూ చదివి చర్చించి ఈ ప్రచురణలకు సార్థకత చేకూర్చాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

(జి. హరగోపాల్)

#  ప ర్ స్పె క్టి వ్స్ ఎందుకోసం

**మా**నవజాతి భవిష్యత్తును గురించి ఇవ్వాళ చాలా చర్చ జరుగుతూ ఉంది. ఏ రకమయిన అసమానతగానీ, అణచివేతగానీ లేని సమాజం కావాలని అభ్యుదయవాదులందరూ కోరుకుంటారు. కానీ ఆ సమాజ స్వరూప స్వభావాలను గురించి ఏకాభిప్రాయం మట్టుకు అభ్యుదయవాదులలో సర్వత్రా లేదు. మార్క్స్ రచనలతో ఒక ప్రామాణికమయిన రూపం తీసుకున్న చర్చ ఈనాటికీ ముగియలేదు. అణచివేతలోనూ అసమానతలోనూ కొత్త కోణాలను చరిత్ర ముందుకు తెచ్చేకొద్దీ చర్చ మరింత వాడిగా సాగుతూ ఉంది. మరింత జటిలం అవుతూ ఉంది. కొత్త కోణాలలో కొన్ని నిజానికి చాలా పాతవే కావడంతో వాటిని ఇన్నాళ్ళూ ఎందుకు చూడలేకపోయామన్న విమర్శ చర్చకు కొంత వేడిని కూడా చేరుస్తూ ఉంది.

ఆ చర్చలో అనేక రకాల దృక్పథాలు గల వ్యక్తులు పాల్గొంటున్నారు. అనేక ఉద్యమాలు పాల్గొంటున్నాయి. అసమానతకూ, అణచివేతకూ కొత్త కోణాలను ఆవిష్కరించేవారు, ఇప్పటికే ఉన్న విప్లవ సిద్ధాంతాలు వాటిని ఆకళింపు చేసుకోలేవనే వారు, అసలు కొత్త కోణాల ఆవిష్కరణే నిరుపయోగ మయిన ప్రయాస అనుకునేవారు, ఇప్పటికి ఉన్న సిద్ధాంతాలే సామాజిక జీవితంలోని అన్ని పార్శ్వాలనూ అవగాహన చేసుకోగలవనుకునే వారు, అసలు 'సిద్ధాంతం', 'నిర్మాణం' అనేవే మానవజాతి వికాసానికి అవరోధం అనుకునే వారు, అభ్యుదయం కోసం ఇప్పటిదాకా జరిగిన ప్రయత్నమంతా వృథా అనుకునేవారు, దాని మంచి చెడుల నుండి గుణపాఠాలు తీసుకోగల మనుకునేవారు, రాజకీయ ఆచరణలో నిమగ్నం అయినవారు, ఆచరణతో నిమిత్తం లేనివారు...ఇంకా అనేకులు ఇవాళ మానవ భవితవ్యాన్ని గురించిన ఈ చర్చలో పాల్గొంటున్నారు.

ఈ చర్చకు సంబంధించి 'ప ర్ స్పె క్టి వ్స్'కు ఒక దృక్పథం ఉంది. మానవ సమాజం గురించీ దాని భవిష్యత్తు గురించీ బుద్ధుడి నుండి ఈనాటిదాకా అనేకులు ఊహలు చేశారు. సిద్ధాంతాలు చేశారు. ఎవ్వరూ కాదనలేని ఆదర్శాలు మన ముందుంచారు. ఆ ఆదర్శాలను సాధించే మార్గాలను ప్రతిపాదించారు. ఈ అన్వేషణకు శాస్త్రీయ ప్రాతిపదిక కల్పించి

నేలమీద నిలబెట్టింది మార్క్సిజం. మార్క్స్ రచనలు చేయడం మొదలు పెట్టిన తరువాత చర్చ యావత్తూ ఆయన ప్రతిపాదించిన అధ్యయన చట్రం చుట్టూ పరిభ్రమిస్తూ ఉంది. అంగీకరించేవాళ్ళూ, సవరించేవాళ్ళూ, తిరస్కరించే వాళ్ళూ అందరూ దానినే ప్రమాణంగా స్వీకరించారు. ఇవ్వాళ తూర్పు యూరప్, సోవియట్ రష్యా, చైనా దేశాలలో వస్తూన్న మార్పుల ఫలితంగా చెలరేగుతున్న చర్చ స్వభావం కూడా ఇందుకు భిన్నంగా లేదు. ఇకమీదట ఉండబోతుందని మేము అనుకోవడం లేదు.

ఇప్పటికీ సిద్ధాంతం ఆచరణలకి సంబంధించిన సమస్యలని మార్క్సిజం అధిగమించిందని చెప్పలేం. పాత సమస్యలు పరిష్కరించుకునే క్రమంలో కొత్త సవాళ్ళు మార్క్సిజం ముంగిట కొస్తున్నాయి. కొత్త నిర్వచనాలు, కొత్త ప్రతిపాదనలు, ప్రత్యామ్నాయాలు రూపొందుతున్నాయి. సామాజిక పరివర్తన కోసం జరుగుతున్న మొత్తం చర్చలో భాగమే మార్క్సిజం గురించిన చర్చ కూడా. ఈ చర్చలో అన్ని కోణాలకూ అన్ని పోకడలకూ వేదిక కల్పించాలని 'పర్‌స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆర్థిక పరిమితుల వల్ల అన్ని పుస్తకాలు ప్రచురించ వీలుకాకున్నా, ఆ దిశగా చర్చను ప్రతిపాదించే పుస్తకాలను ప్రచురించాలనుకుంటున్నాం.

అణచివేతనూ, అసమానతనూ వ్యతిరేకించేది ఏదయినా ప్రజాస్వామిక దృక్పథమే. మౌలికంగా అభ్యుదయ దృక్పథమే. ఆపైన ఎన్ని తేడాలున్నా వినదగినదే, చర్చించదగినదే, అధ్యయనం చేయదగినదే. ***'నూరు పూలు వికసించనీ, వేయి ఆలోచనలు సంఘర్షించనీ'*** అని మావో ఒక చారిత్రక సందర్భంలో ఇచ్చిన పిలుపుకు ఈ నిర్దిష్టమయిన అర్థంలో సార్వత్రిక ప్రాతిపదిక ఉందని 'పర్‌స్పెక్టివ్స్' భావిస్తూ ఉంది. ఆ అవగాహనతో ప్రచురణలు చేపడుతోంది. ప్రజాస్వామిక స్వభావం కలిగిన సమర్థవంత మయిన రచనలను ఎక్కువగా తెలుగులో, వీలున్నప్పుడు ఇంగ్లీషు, హిందీలో కూడా ప్రచురించడం ద్వారా కొనసాగుతున్న 'గ్రేట్ డిబేట్'కు దోహదం చేయాలని మా సంకల్పం.

మే
1999

**పర్‌స్పెక్టివ్స్**
సామాజిక శాస్త్రం / సాహిత్యం
హైదరాబాదు

# 1988 నుంచి 2011




# పర్‌స్పెక్టివ్స్ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 0 | 1. Probings in the Political Economy of Agrarian classes and Conflicts - | May 1988 | by K. Balagopal<br>Ed. G. Haragopal |
| 0 | 2. సహచరులు - | జూలై 1989 | వరవరరావు |
| 0 | 3. పతంజలి భాష్యం - | జూలై 1989 | కె.ఎన్.వై. పతంజలి |
| 0 | 4. సృజన సంపాదకీయాలు | జనవరి 1990 | వరవరరావు/సాహితీ మిత్రులు |
| 0 | 5. అభివృద్ధి వెలుగునీడలు | మే 1990 | ఆర్.ఎస్.రావు |
| 0 | 6. కఠోర షడ్జమాలు - | తొలి ముద్రణ 1990<br>మలి ముద్రణ 1996 | వసంత కన్నబిరాన్ |
| 0 | 7. మతవర్గ తత్వం - | ఫిబ్రవరి 1991 | ఎడిటర్స్ : హరి, జి. హరగోపాల్ |
| 0 | 8. ఇలా మిగిలేం - | తొలి ముద్రణ 1991<br>మలి ముద్రణ 1993 | చలసాని ప్రసాదరావు |
| 0 | 9. పరాధీన భారతం | తొలి ముద్రణ 1992<br>మలి ముద్రణ 1993 | ఎ.బి.కె. ప్రసాద్ |
| 0 | 10. డంకెల్ దుశ్శాసనం | జూన్ 1993 | నూర్ భాషా |
| 0 | 11. దినదినగండం | సెప్టెంబర్ 1993 | అనువాదం :<br>కోదండ రామిరెడ్డి |
| 0 | 12. మన చలం - | మే 1994 | ఎడిటర్ : కృష్ణాబాయి |
| 0 | 13. Towards Understanding Semi Feudal Semi Colonial Society | Jan 1995 | by R.S. Rao<br>Ed. D. Narasimha Reddy |
| 0 | 14. ఏడోసారా కథ | జూలై 1995 | బుర్ర రాములు |
| 0 | 15. శాక్కో - వాంజెట్టి | నవంబర్ 1995 | బి. చంద్రశేఖర్ |
| 0 | 16. బంగారమ్మ కథ | జనవరి 1996 | అనువాదం - కృష్ణాబాయి |
| 0 | 17. కార్టూన్ కబుర్లు - | సెప్టెంబరు 1996 | మోహన్ |
| | 18. నాకో పిస్తోల్ కావాలి - | అక్టోబర్ 1996 | అనువాదం :<br>చలసాని ప్రసాదరావు |
| | 19. సాహిత్యంలో వస్తు శిల్పాలు | మార్చ్ 1997 | త్రిపురనేని మధుసూదనరావు |
| 0 | 20. కల్లోల కథా చిత్రాలు | డిసెంబర్ 1997 | కె. బాలగోపాల్<br>ఎడిటర్ : చలసాని ప్రసాద్ |
| 0 | 21. ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంస్కరణలు/ ప్రపంచబ్యాంక్ ఎజెండా | మార్చ్ 1998 | ఎడిటర్ : డి. నరసింహారెడ్డి |
| 0 | 22. మూడు దశాబ్దాల నక్సల్బరీ గమ్యం-గమనం | తొలి ముద్రణ ఆగస్ట్ 98<br>మలి ముద్రణ అక్టోబర్ 98 | ఎడిటర్స్ :<br>ఎస్. సుధాకర్,<br>ఎం. కోదండరామిరెడ్డి |

| | | | |
|---|---|---|---|
| 0 | 23. పరాధీన భారతంలో దారితప్పిన రూపాయి | డిసెంబర్ 98 | ఎ.బి.కె. ప్రసాద్ |
| 0 | 24. శారద నవలలు (ఏది సత్యం, మంచీ-చెడు, అపస్వరాలు) | ఆగస్ట్ 99 | శారద (ఎస్. నటరాజన్) |
| 0 | 25. సింగరేణి | నవంబర్ 2000 | ఎం.డి. మునీర్ , ఎం.డి. అన్వర్ |
| 0 | 26. ఖాదర్ లేడు | మే 2001 | మహమ్మద్ ఖదీర్ బాబు |
| 0 | 27. ప్రమాదంలో ప్రజారోగ్యం | ఫిబ్రవరి 2002 | డా॥ ఎస్. తిరుపతయ్య<br>డా॥ పి. జగదీశ్వర్ |
| 0 | 28. ఎన్జీవోల కథ | జనవరి 2003 | బి. చంద్రశేఖర్ |
| | 29. జాగ్తే రహో | జూన్ 2003 | చలసాని ప్రసాదరావు<br>ఎడిటర్ : డి. వెంకట్రామయ్య |
| 0 | 30. ఉదయగీతిక (రెండవ కూర్పు తొలిముద్రణ) | డిసెంబర్ 2003 | రచన - యాంగ్ మో<br>అనువాదం : ఎన్. వేణుగోపాల్ |
| 0 | 31. వరల్డ్ సోషల్ ఫోరం ఆర్థిక రాజకీయాలు | జనవరి 2004 | **RUPE (MUMBAI)**<br>అనువాదం : బి. చంద్రశేఖర్ |
| 0 | 32. ఎర్రమందారాలు (రెండవ కూర్పు తొలి ముద్రణ) | మే 2005 | రచన-లోకువాంగ్-పిన్<br>యాంగ్ యీ-యెన్<br>అనువాదం : డా॥ టి.నళిని |
| 0 | 33. నూరేళ్ళ తెలుగు నవల (1878-1977) | ఆగస్ట్ 2007 | సహవాసి<br>సంపాదకులు- డి. వెంకట్రామయ్య |
| | 34. అల్లంరాజయ్య సాహిత్యం -1 మూడు నవలలు- | జనవరి 2008 | అల్లం రాజయ్య<br>సంపాదకులు-వరవరరావు |
| 0 | 35. విభిన్న | ఆగస్టు 2008 | హరిపురుషోత్తమరావు |
| | 36. పతంజలి భాష్యం | మార్చ్ 2009 | కె.ఎన్.వై.పతంజలి |
| | 37. మృగన | ఏప్రిల్ 2009 | విమల |
| | 38. రాజ్యం - సంక్షేమం | అక్టోబర్ 2010 | కె. బాలగోపాల్ |
| | 39. అల్లం రాజయ్య సాహిత్యం-2 సృష్టికర్తలు (కథలు) | ఏప్రిల్ 2011 | అల్లం రాజయ్య<br>సంపాదకులు-వరవరరావు |
| | 40. సంభాషణ | జులై 2011 | కె. శ్రీనివాస్ |
| | 41. దళిత | అక్టోబరు 2011 | కె. బాలగోపాల్ |

0 ప్రతులు లేవు

**P e r s p e c t i v e s**
***Social Sciences / Literature***
**Publishing *for* Change**

essays on
dalit
identity & oppression
by k.balagopal



కారంచేడు, చుండూరు వంటి దాడులు కులవ్యవస్థలో ఉండే భౌతిక దౌర్జన్యాన్నీ హింసనూ కళ్ళకు కట్టినట్టు చూపించాయి. ఆ హింస వెనుక దాగి ఉన్న అమానుషమయిన విషవ్యవస్థ పైన చర్చను ఆహ్వానించాయి.

మండల్ కమీషన్ ప్రతిపాదనలను అమలు చేస్తానని కేంద్ర ప్రభుత్వం ప్రకటించినప్పుడు కులవ్యవస్థలోని భౌతిక హింసేకాక తాత్వికహింస కూడ బయటకు వచ్చింది. దళితులకు సంపూర్ణమయిన మనుషులుగా గుర్తింపు ఇవ్వని బ్రాహ్మణీయ సంస్కృతి కొత్త నినాదాలతో, ఆధునిక పరిభాషతో ముందుకొచ్చింది. భౌతిక దాడులనూ హింసనూ అరికడితే చాలదనీ... సామాజిక నిర్మాణం, సంస్కృతి, భావజాలం తదితర రంగాలన్నిటిలోనూ కులనిర్మూలన కోసం కృషి జరగకపోతే ఆ హింసకు పునాది అయిన వ్యవస్థ నాశనం కాదనీ 'మండల్' సంఘర్షణ స్పష్టంగా చూపించింది.

కె.బాలగోపాల్




**Perspectives**
Social Sciences/Literature
Publishing *for* Change
ISBN-978-81-905756-8-3

Rs. 120/-